ద్వాదశిభాషం - 49 శోధశిభాం - 134

శ్రీ గురుభ్యోనమః

శ్రీ బృహద్వాసిష్ఠ అచలబోధ సిద్ధాంతులగు

శ్రీ మద్రామడుగు శివరామదీక్షితులవారిచే

రచియింపబడిన

బృహద్వాసిష్ఠము

అను

# శ్రీ శివరామ దీక్షితీయము

(అచలబోధ సిద్ధాంతము)

ప్రథమ భాగము.

## చలాచల వాక్యములు

సాందీప వాక్యములు

శ్రీ పగడాల వేంకటేశ్వరస్వామివారిచే

సరిచూడబడి

భక్తమండలి ద్రవ్యసహాయము వలన

శ్రీ మదచలర్షి దయానంద పొన్నాల రాజయోగి గారిచే

ప్రకటింపబడియె.



 **1990** (వెల రు. **5-00**)

ద్వాదశిభావం - 49 శోధశిభ్యాం - 134

శ్రీ గురుభ్యోనమః

శ్రీ మద్బృహద్వాసిష్ఠ అచలబోధ సిద్ధాంతులగు

శ్రీ మ ద్రామడుగు శివరామదీక్షితులవారిచే

రచియింపబడిన

# బృ హ ద్వా సి ష్ఠ ము

అను

# శ్రీ శివరామ దీక్షితీయము

(అచలబోధ సిద్ధాంతము)

ప్రథమ భాగము.

## చలాచల వాక్యములు

సాందీప వాక్యములు

శ్రీ పగడాల వేంకటేశ్వరస్వామివారిచే

సరిచూడబడి

భక్తమండలి ద్రవ్యసహాయము వలన

శ్రీ మదచలర్షి దయానంద పొన్నాల రాజయోగి గారిచే

ప్రకటింపబడియె.



 1990 (వెల రు. 5-00)

# అవతారిక

శ్రీ మద్బృహద్వాసిష్ఠ అచలబోధసిద్ధాంత ప్రతిష్ఠాపనా చార్యులు నైజాం దక్కను హైద్రాబాదులోచేరిన రాజాపేట సస్థానములోని నారాయణఒపురవాస్తవ్యులును నగు శ్రీమద్రామడుగు శివరామ దీక్షిత ప్రభు వర్యులచే వ్రాయబడిన ఈ శ్రీ శివరామదీక్షితీయమను బృహద్వాసిష్ట అచలబోధ సిద్ధాంతమునందు చలాచల వాక్యములు ముముక్షువులకు సులభోపాయముగా బోధపడుటకై ఏతత్ప్రీరసాంప్రదాయకులగు శ్రీమత్ పీలుఖానా లక్ష్మణ ప్రభుస్వాములవారి ప్రియశిష్యుండగు పగడాల వెంకటేశ్వర స్వామివారిచే ఉన్నది ఉన్నట్టుగా సవరణ చూడబడి వారి ప్రియ శిష్యుండగు మందిప్పల హనుమంతరావుగారి ప్రేరేపణచే శ్రీ మదచలర్షి దయానంద పొన్నాల రాజయోగీంద్రులచే ప్రకటింపబడియె.

షరా :— ఈగ్రంథము రిజిష్టరు చేయబడినది గనుక యితరులు అచ్చు వేయించకూడదు.

ఇట్లు

అచలర్షి దయానంద పొన్నాల రాజయోగిగారు

శ్రీ సద్గురుభ్యోనమః

## పరిపూర్ణబోధస్తోత్రం

శ్లో॥ యస్యాంత ర్నాదిమధ్యం । నహికరచరణం । నామగోత్రంనసూ
త్రం । నోజాతిర్నైవవర్ణో । నభవతుపురుషో నానపుంసో
నచస్త్రీ । నాకారంనైవికారం । నహిజనన మరణం నాస్తిపుణ్యాం
నపాపం।నోతత్వంతత్వమేకం।సహజసమరసం।సద్గురుం తంనమామి॥

శ్లో॥ ఆత్మానాత్మవినాశహేతు మనిశం । సర్వాతిరిక్తం శుభం
పూర్ణాత్పూర్ణ మనామయం సుఖతరం । సర్వాపదధ్వంసకం
సర్వజ్ఞాన వినాశకం గురుపదం । సర్వాత్మకం నిర్మలం
సర్వభ్రాంతివివర్జితం గుణహరం । సంపూర్ణబోధంనమః॥

శ్లో॥ నజ్ఞాతంపరవస్తునిత్య మచలం । సత్యంస్థితంశాశ్వతం
నిత్యానిత్యవివేకభేదరహితం । నిర్నామనిర్లేపకం
సర్వప్రత్యయహీనకంచసతతం । సర్వత్రసంస్థంపరం
వందేహం పరిపూర్ణబోధ మనిశం । సందేహనాశంప్రభుం॥

శ్లో॥ నాహంమనుష్యో । నచదేవయక్షో
నబ్రహ్మక్షత్రియ । నవైశ్యశూద్రో
నబ్రహ్మచారీ । నగృహీవనస్థో
భిక్షుర్నచాహం । నిజబోధరూపం॥



శ్రీ సద్గురుభ్యో నమః

# శ్రీశివరామ దీక్షితీయమను బృహద్వాసిష్ఠము

(అచలబోధసిద్ధాంతము.)

# చలాచల వాక్యములు

శ్లో॥ వందే గురుపదద్వంద్వం వాఙ్మనోతీతగోచరం శ్వేతరక్త ప్రభాభిన్నం శివశక్త్యాత్మకంపరం॥ శ్రీసాందీప కృష్ణపరబ్రహ్మణే నమః॥ శ్రీవేమనసద్గురవే నమః॥ శ్రీధరస్వామి, శివరామదీక్షిత, అప్పబ్రహ్మ, పరశురామ, సీతారామ, భాగవతకృష్ణ, ఫీల్ఖాన లక్ష్మణ, సాధువేంకటేశ్వర, స్వగురు పరమగురు, పరమేష్టిగురు, సద్గురు, అతీతగురు, అచలగురు, పరిపూర్ణగురు, పరబ్రహ్మణేనమః॥

---

## ౧ కేవలాత్మ - అచలనామములు

1. కేవలాత్మ 2 అచలం 3 పరిపూర్ణం 4 పరాపరం 5 ప్రభువు 6 సభూమ 7 కుంఠితముగాని వైకుంఠము 8 అస్తి 9 కల్పనారహితమైన కైలాసము 10 వేదాంతము 11 అతీతం 12 వికారరహితో యీశ్వరః 13 శ్రోత్రరహితం 14 త్రిపుటిరహితం 15 కూటస్థరహితం 16 సచ్చిదానంద రహితం 17 వాచాతీతం 18 మనోతీతం 19 భావాతీతం 20 నిజం 21 బట్టబయలు 22 తానుతాను 23 ఉపాధి రహితం 24 ద్వయదోష

రహితం 25 తానులేని తాను యేలాగో ఆలాగే పుట్టని చావనిది 26 తడి లేని తీర్థం 27 పొడిలేని ప్రసాదం 28 అరగని ఆధారం 29 యతో వాచో నివర్తంతే అప్రాప్యమనసాసహ 30 అవాఙ్మానసగోచరం 31 యెన్నిచేసినా తాను పుచ్చుకోదు 32 తనకు పుట్టుకలేదు చావులేదు 33 ఊరులేదు 34 పేరులేదు 35 దృక్కుదృశ్యరహితం 36 శిఖికర్పూరవత్ 37 నామరూప రహితం 38 నిర్ణయరహితం 39 ద్వైతాద్వైతరహితం 40 విశిష్టాద్వైత రహితం 41 ద్వంద్వాతీతం 42 ప్రకాశవిమర్శరహితం 43 ఒకటిలేనిది ఒకటినిజం 44 నేను యేమీ లేదు 45 నీవు యేమీలేదు 46 యోవైభూమా 47 లేని అంతా అంతాతానే తానే అంతా 48 విలక్షణం 49 నిశ్శబ్దం 50 నిరాలంబం:

51 లోకాతీతం 52 శుద్ధం 53 అఖండైశ్వర్యరహితం 54 గురు శిష్యరహితం 55 గురుస్వరూపం 56 బోధాస్ఫురణా భావేయదాస్థితి తదే వహి 57 అనుకోనిది 58 అభేదము 59 వేడ్కలేనిది 60 చదువుకోనిది 61 మరచిపోనిది 62 నిర్మలాత్మ 63 అదియెటువంటిదో అటువంటిదే నిరామయం 64 నిర్గుణం 65 నిరవధి 66 నిరంధ్రం 67 నిత్యం 68 నిరా కారం 69 నిరంజనం 70 నిర్వికారం 71 నిరాభాసం 72 నిరుపద్రవం 73 నిష్కళంకం 74 నిరపేక్షకత్వం 75 నిష్ప్రపంచం 76 నిర్ద్వంద్వం 77 నిరుపమం 78 నిర్హేతుకం 79 నివృత్తిత్వం 80 వృత్తిశూన్యం 81 అవాచ్యం 82 అప్రమేయం 83 ఆదిమధ్యాంత శూన్యం 84 అవికారం 85 విద్యావిద్యరహితం 86 అనంతం 87 అగోచరం 88 అఖండం 89 అప్రతర్క్యం 90 అచేతనం 91 అసామరస్యం 92 సర్వ సంపూర్ణత్వం 93 సర్వనియామకత్వాతీతం 94 సర్వద్వంద్వరహితం 95 సర్వపరిణామకత్వాతీతం 96 సభూమకత్వం 97 సంపూర్ణత్వం 98 సర్వా తీతం 99 జ్ఞానకర్మరహితం 100 మాయాతీతం.

ఇతి శ్రీశివరామదీక్షిత ప్రభావే, వేదాంతవిచారణే, కేవలాత్మ. అచలనామావళి (పేర్లు.) ౧॥ ప్రకరణం సంపూర్ణం.

---

## ౨ మాయ - చలనామములు

1 మాయ 2 ఎరుక 3 సచ్చిదానందం 4 ఆత్మ 5 అనాత్మ 6 ఈశ్వరుడు 7 జీవుడు 8 నాదము, బిందువు, కళ 9 అహంకారం 10 తెలివి 11 జ్ఞానం 12 మనస్సు 13 చలనం 14 బుద్ధి 15 చిత్తం 16 ప్రకృతి 17 పురుషుడు 18 చైతన్యం 19 చిత్తు 20 భావము 21 అభావం 22 త్రిపుటి 23 జ్యోతి 24 త్రిగుణం 25 కూటస్థుడు 26 చిదగ్ని 27 సకలచింతలుగలది 28 జ్ఞప్తి 29 క్షరం 30 అక్షరం 31 క్షేత్రం 32 క్షేత్రజ్ఞుడు 33 అవిద్య 34 విద్య 35 బ్రహ్మ 36 విష్ణువు 37 యింద్రజాలం 38 మహేంద్రజాలం 39 కల్పితకల్పవల్లి 40 ఆభాసత్తు 41 అసత్తు 42 ఊహం 43 అనుకునేది 44 తెలిసింది 45 ఆశ 46 భ్రమ 47 భ్రాంతి 48 సత్తు 49 మహిమ 50 దృక్కు.

51 దృశ్యం 52 జాగ్రత 53 స్వప్నం 54 సుషుప్తి 55 మహేశ్వరుడు 56 స్వరూపం 57 దాసత్వం 58 బ్రహ్మత్వం 59 ప్రకాశం 60 నేను 61 శరీరం 62 నారాయణుడు 63 జీవం 64 పరబ్రహ్మ 65 పరలింగం 66 అన్నమయకోశం 67 ప్రాణమయకోశం 68 మనోమయకోశం 69 విజ్ఞానమయకోశం 70 ఆనందమయకోశం 71 నీవారశూకం 72 కనుపాప 73 కారణం 74 దృష్టి 75 హంస 76 బ్రహ్మరంధ్రం 77 సూదిరంధ్రం 78 బీజం 79 ఇంద్రియం 80 ఖండం 81 అఖండం 82 చిలుక 83 ముక్తికాంత 84 గారడి 85 మోడి 86 త్రినేత్రం 87 మూడుకన్నులుగలవాడు 88 నిర్ణయం 89 గుర్తెరిగేది 90 కంటిలో నలుసు 91 వ్యాప

కముగలది 92 వినేది 93 విననిది 94 అడిగేది 95 అడగనిది 96చెప్పేది 97 చెప్పనిది 98 కాంతి 99 విగ్రహం 100 బొమ్మ;

101 ప్రతిమ 102 విశ్వం 103 జగత్తు 104 ప్రపంచం 105 సర్వం 106 ద్వయం 107 అద్వయం 108 వికారం 109 ప్రజ్ఞానం బ్రహ్మ 110 అహంబ్రహ్మాస్మి 111 తత్త్వమసి 112 అయమాత్మా బ్రహ్మ 113 ఓమిత్యేకాక్షరం బ్రహ్మ 114 బ్రహ్మైవాహమస్మి 115 సచ్చిదానంద బ్రహ్మ 116 పంచసంస్కారం 117 దేవతాభ్రాంతి 118 సాక్షి 119 సర్వసాక్షి 120 నివర్తకం 121 వర్తకం 122 భావం 123 అభావం 124 స్వభావం 125 కబ్బిళం 126 ఇరవైఅయిదోది 127 పరమాత్మ 128 అంతరాత్మ 129 మూలమాయ 130 అక్షరబ్రహ్మం 131 అవ్యాకృతం 132 పరాశక్తి 133 ఆదిశక్తి 134 జ్ఞానశక్తి 135 ఇచ్ఛాశక్తి 136 క్రియాశక్తి 137 క్రియ 138 సంకల్పం 139 వికల్పం 140 వాసనాత్రయం 141 ఉపాధి 142 స్వరూపాంతరం 143 మహత్తు 144 ఆసుకొయ్య 145 తెగిన గాలిపడిగె 146 మొగడులేని ముత్తైదువతనం 147 కాలేబొగ్గు 148 తోసేకట్టె వంటిది 149 ఈషణాత్రయం 150 బ్రహ్మరాక్షసి;

151 రాక్షసి 152 పిశాచము 153 దేవత 154 దేవుడు 155 ద్వైతం 156 అద్వైతం 157 విశిష్టాద్వైతం 158 లింగత్రయం 159 త్రిగుణాత్మకం 160 ఆగంతుకం 161 అవాంతరపిశాచం 162 గుర్తెరిగే సాక్షి 163 లోకం 164 సకలమహిమలుగలది 165 మరిమాయలాడి 166 క్షణేక్షణేలేనిది 167 గాలివంటిది 168 అగ్నిహోత్రంవంటిది 169 తిరుగోలవంటిది 170 పంచవర్ణములుగలది 171 చక్కెరబొమ్మ 172 శిలాప్రతిమ 173 ఇడ 174 పింగళ 175 సుషుమ్న 176 తారకం 177 అణోరణీయ్యం 178 వింతఅనుకునేది 179 భేదము 180 అష్టదళము 181 సహస్రారం 182 కమలములు 183 అకారం 184 ఉకారం 185 మకారం

186 ఓంకారం 187 రాలినఆకువంటిది 188 చంచలం 189 అబద్ధములో నిబద్ధిగా తోచేది ప్రపంచం 190 గాఢనిద్ర 191 దీర్ఘనిద్ర 192 మూలం లేనిది 193 ఉత్తది 194 ఆదరువులేనిది 195 అవాంతరం 196 లేనిప్రపంచం యెట్లాతోచును 197 యింద్రజాలమువంటిది 198 స్వప్నవత్ 199 రజ్జుసర్ప భ్రాంతివంటిది 200 మరుమరీచికవతు;

201 వంధ్యాపుత్రవతు 202 ఖపుష్పవతు 203 శశవిషాణవతు 204 వంధ్యవతు 205 శూన్యవతు 206 మాయావతు 207 ఆకాశమందు గంధర్వనగరమున్నట్టు 208 ఆకాశం నల్లగావున్నట్టు 209 పాషాణాగ్నివతు 210 వారికాష్టవతు 211 శిరచ్ఛేదవతు 212 నెలక్రిందట చనిపోయిన పురుషుడు తిరిగివచ్చి మాట్లాడినా డన్నమాట సత్యమైతే జగత్తు సత్యమన వచ్చును 213 ఆవుయొక్క చంటివల్లనుండి పితికినపాలు మళ్ళాపోస్తే చంటిలోపలికి పోయినవని అన్నమాట సత్యమైతే జగత్తు సత్యమని అన వచ్చును 214 మంటలుమండుచున్న అగ్నిగుండమందు తామరదుంప పుట్టి అనేక తీగెలు సాగి పత్రములు పుష్పములతోటి వృద్ధిపొందినదన్న మాట సత్యమైతే జగత్తు నత్యమన వచ్చును 215 శరీరంలేనివారియొక్క లేనిమనస్సు శుద్ధఅజ్ఞానులకు తెలుస్తూవున్నదన్నమాట సత్యమైతే జగత్తు సత్యమనవచ్చును 216 గోపురప్రతిమ ఉన్నట్టు ఉన్నది 217 మేడిపండువతు 218 సూక్ష్మవతు 219 గోపురప్రతిమగోపురాన్ని మోసుకున్నట్టు 220 కుక్కుట క్షీరవతు 221 ఔదుంబరపుష్పవతు 222 జంతు జల పుష్పవతు 223 యజ్ఞాంగ పుష్పవతు 224 హేమవతు 225 ఏటిఆవల గుమ్మడికాయలంతేసి మిరియాలు పండినవి అన్నట్టు 226 ఉదరరోగవతు.

ఇతి శ్రీ శివరామదీక్షితప్రభావే వేదాంతవిచారణే మాయా, చల నామావళి (పేర్లు) ౨॥ ప్రకరణం సంపూర్ణము.

---

శ్రీ సద్గురుభ్యోనమః

పరిపూర్ణ లక్షణం శ్రేయాంసి బహువిఘ్నాని

# ౧ అచల వాక్యములు

లేదంటే అంతటావున్నది; ఉన్నదంటె కానరానిది; ఆకాశంవంటిది.

1 పుట్టని చావనిది 2 మొదలు కొనలేనిది 3 ఒక్కటైనా మహత్తు లేనిది 4 సార్వకాలం ఒక్కతీరుగా వున్నది 5 బదులులేనిది 6 స్వజాతీయ్య విజాతీయ్యస్వగత భేదాలు లేనిది 7 శరీరంలేనిది 8 చలించనిది 9 యేజోలి యెరుగనిది 10 జ్ఞానకర్మాలులేనిది 11 నామరూపాలులేనిది 12 సకలదేశాలయందు సార్వకాలాలయందు సమస్తమైన వస్తువులయందు వున్నది. 13 ఉత్పత్తిస్థితిలయాలు లేనిది 14 తనకుతానే స్వతఃసిద్ధమై వున్నది జ్ఞానా జ్ఞానాన్యధాజ్ఞాన విపరీత జ్ఞానములుగానిది. పంచభూతాహంకారమయమైన జడాజడాత్మక ప్రపంచాన్ని యెరుగనిది 15 శరీరాకారం గానిది 16 మూలంలేని యీగుర్తెరిగే శరీరం రాకమునుపు ఉన్నప్పుడు యేమీలేదు అని అన్నప్పుడు చచ్చినా ఒక్కతీరుగా వున్నది 17 శూన్యం గానిది 18 ఒక్కటైనా క్రియలేనిది 19 అసాధ్యమైనది 20 సంశయంలేనిది 21 దృఢంలేనిది 22 క్రియాశూన్యమైనది 23 భోంచెయ్యనిది 24 ఒక్కటైనాభ్రాంతిలేనిది 25 మూలంలేని యీగుర్తెరిగే శరీరంతోటి యేమాత్రం సంబంధములేనిది 26 నీళ్ళల్లో పరుపుబండవున్నట్టు వున్నది 27 శరీరం ఉన్నా శరీరాన్ని ముట్టనిది 28 అచలమనే ప్రసిద్ధిచేతఉన్నది 29 శాశ్వతమయింది 30 లోపటబైట అనేమర్యాదలేక సమస్తమైన వస్తువులయందు చలించక దేనిని స్పృశించక వున్నది 31 ఒక్కదానిని అయినా ముట్టుకోనిది 32 సంభాషణ చెయ్యనిది 33 ఒక్కటైనా వికారంలేనిది 34 మూలంలేని గుర్తెరిగే శరీరం తనలోవున్నప్పటికి తానుదానికి అధిష్ఠానం కానిది 35 సూర్యుడు చంద్రుడు అవనివహ్ని శరీరం అద్రి అవనీజము

అంగనా పురుషుడు ఉన్నారో లేరో అని అనుమానంలేనట్టు ఉన్నదో లేదో అనే అనుమానం లేకుండా ఉన్నది 36 అవ్వి అన్నీ అనిత్యాలు సవికారాలు యిది నిత్యం అవికారి 37 సర్వగతమైనది 38 స్థాణువైనది 39 అచలమైనది 40 సనాతనమైనది 41 సచ్చిదానందంకానిది 42 దేనినిచూడనిది 43 విననిది 44 అడుగనిది 45 చదువుకోనిది 46 మరిచిపోనిది 47 ఒక్కటైనా వికారంలేనిది 48 వ్యవహారంలేనిది 49 చెప్పనిది 50 వస్తురూపం కానిది;

51 మూలంలేని యీగుర్తెరిగేశరీరానకు మూలంగానిది 52 గురుస్వరూపమైనది 53 శరీరం ఉన్నప్పుడు శరీరంనవ్వితే నవ్వనిది శరీరం యేడిస్తే యేడ్వనిది శరీరం తింటేతిననిది శరీరంతాగితేతాగనిది శరీరం నడిస్తేనడవనిది శరీరం మాట్లాడితే మాట్లాడనిది 54 కర్తగానిది 55 కారయితగానిది 56 అచ్ఛేద్యమైనది 57 అదాహ్యమైనది 58 అక్లేద్యమైనది 59 అశోష్యమైనది 60 ఎందరు లేదు లేదన్నా ఉన్నది 61 శరీరాలలో చొరనిది వెళ్ళిపోనిది 62 తలకాయ కాళ్లు లేనిది 63 సాధనా సాధ్య పంామర్శ రహితమైనది 64 రాకడపోకడ ఉనికి యేమి లేకపోవుట లేనిది 65 జగత్తు ఉన్నది లేదు అని యెరుగనిది 66 సర్వవ్యాపకమైనది 67 కుంఠితంగాని వైకుంఠమనే సౌజ్ఞగలది 68 శరీరానకు గల వికారాలు తనకులేనిది 69 సుఖదుఃఖాలులేనిది 70 స్వతంత్ర పరతంత్రాలు లేనిది 71 దొరగానిది 72 దొంగగానిది 73 భ్రాంతిలేనిది 74 వృద్ధిబొందనిది 75 ఐక్కపడనిది 76 శరీరాన్నిపట్టనిది విడువనిది 77 ఇచ్ఛలేనిది 78 చలించనిది 79 యిరవై అయిదు తత్వాలకు అవలిది 80 క్షేత్రజ్ఞాఖ్యజీవోపాధిలేనిది 81 తత్వాతీతమైనది 82 ద్వైతాద్వైతరహిత పరమతత్వమైనది 83 జ్ఞానకర్మాలయందు భ్రాంతిలేనిది 84 యెవ్వరిమీద అపేక్ష లేనిది 85 మహాద్వైతమైనది 86 మూలంలేని యీ గుర్తెరిగేశరీరం రాకమునుపు ఉన్నప్పుడు లేకపోయినప్పుడు అనేటి సార్వకాలం ఉండేది 87 చూడబోతే లేదు, యెంతదూరం పోయినా యెడతెగక అంతటదట్టంగా యెక్కువ

తక్కువలు లేక మనముపోకమునుపే ముందరముందర స్వతస్సిద్ధమై ఉన్నది 88 కదలనిది 89 మెదలనిది 90 యెరుకలేనిది 91 కలలో శరీరాలు, యీశరీరాలు యెన్నితిప్పలుబడినా యేమి అననిది 92 గుర్తెరిగే చైతన్యం అనే జ్ఞానమున్ను అనేక చిత్రవిచిత్రములైన కర్మాలున్ను లేనిది 93 ప్రపంచం తనలోఉన్నా ప్రపంచముతో సంబంధములేనిది 94 తానే తానైయున్నది 95 తాను పుట్టనిది 96 ఒకదాన్ని పుట్టించనిది 97 సార్వకాలం యేకప్రకారంగా నున్నది 98 బంధమోక్ష శూన్యమైనది 99 జ్ఞానకర్మ సాధనద్వయముయొక్క అపేక్షలేనిది 100 జ్ఞానకర్మాలచేత సాధ్యముకానిది;

101 భేదాభేద రహితమైనది 102 జ్ఞాన భక్తి వైరాగ్య శూన్యమైనది 103 తన సంబంధంగాని శరీరాలుగానిది 104 ఉదకపానం చెయ్యనిది 105 సుఖ దుఃఖాలయొక్క గంధమాత్రమైనా లేనిది 106 లింగత్రయంగానిది 107 ఇచ్ఛలేనిది 108 వాదించనిది 109 తత్వంవంటిదికానిది 110 క్షేత్రక్షేత్రజ్ఞరూపమైన లక్ష్యలక్షణ రహితమైనది 111 దేహిదేహాలుగానిది 112 విషయీ విషయాలుగానిది 113 దృగ్దృశ్యాలు గానిది 114 జీవేశ్వరులుగానిది 115 ఆత్మబ్రహ్మాలు గానిది 116 యేమీ అనుకోనిది 117 యెన్నటికీ చలనం లేనిది 118 రతికర్మలేనిది 119 విష్ణువనే వ్యాపకమైనది 120 గుణాలులేనిది 121 వికారాలు లేనిది 122 క్షరాక్షరవిలక్షణమైనది 123 స్త్రీపున్నపుంసకాలు గానిది 124 కొట్టనిది 125 కొట్టబడనిది 126 యేమిఅడిగినా చెప్పనిది 127 తానువున్నాననే యెరుగనిది 128 శరీరాలు లేవనియెరుగనిది 129 మహాగుహ్యామైనది 130 పరమగుహ్యామైనది 131 మహా రహస్యమైనది 132 యితరలోకాంతరస్మరణ లేనిది. జీవన్ముక్తి విదేహముక్తి నిత్యముక్తి లేనిది 133 ఇంతాఅంతా అని ప్రమాణం లేనిది 134 సమస్తమైన వస్తువులకు స్థానమైనది 135 యితర స్మరణలేనిది 136 భగవానులు గానిది 137 సత్యమని గ్రహించనిది 138 అసత్యమని విడువనిది 139 నిశ్చయ సంశయాలు లేనిది 140 ఆత్మానాత్మల వ్యవ

హారంలేనిది 141 వేదశాస్త్రిలయొక్క నిర్ణయం చెయ్యనిది 142 గురుసూచనలేనివారికి కనుక్కోరానిది 143 గురుసూచన అయినవారికి గురుశిష్య ప్రపంచములులేక తానేవున్నది 144 క్షేత్రక్షేత్రజ్ఞ రహితమైనది 145 క్షరాక్షరోపాధి ద్వయదోషరహితమైనది 146 పరాపరద్వయదోష రహితమైనది 147 జీవేశ్వర ద్వయదోషరహితమైనది 148 ఆత్మానాత్మ ద్వయదోషరహితమైనది 149 కదాచిత్ నజాయతే అని వున్నది 150 ఆత్మబ్రహ్మోపాధిద్వయ దోషరహితమైనది 151 సదసద్రూపద్వయ దోషరహితమైనది152జ్ఞానాజ్ఞానద్వయదోషరహితమైనది153విద్యావిద్యద్వయదోషరహితమైనది 154దృగ్దృశ్యద్వయ దోషరహితమైనది 155ప్రకృతి పురుష ద్వయదోషరహితమైనది 156 విషయావిషయద్వయ దోషరహిత మైనది 157 సాక్ష్యసాక్షిద్వయ దోషరహితమైనది 158 శివశక్తి ద్వయ దోషరహితమైనది 159 దేహి దేహద్వయ దోషరహితమైనది 160 క్షేత్ర క్షేత్రజ్ఞోపాధిద్వయ దోషరహితమైనది 161 తిననిది 162 లిప్తముగానిది * కారణపంచకము గానిది * మరణ సుషుప్తి మూర్ఛా సమాధి తూష్ణీ భూతావస్థల యందు గుర్తెరిగే శరీరములేకవున్నది 163 ఆత్మ బ్రహ్మ అని గుర్తెరిగే చైతన్యమును యెరుగనిది 164 స్థూల సూక్ష్మకారణ మహాకారణములనే దేహ చతుష్టయమున్ను, జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయములనే నాలుగవస్థలున్ను విశ్వతైజస ప్రాజ్ఞ ప్రత్యగాత్మ లనే నలుగు రభిమానులున్ను కలసిన యీ పన్నెండు లేనిది 165 పంచ ప్రాణములు, దశేంద్రియములు,అంతఃకరణరూపమైన జ్ఞానమున్ను కలసిన షోడశవికారములు లేనిది 166 నేను రాకమునుపే వున్నదిగాని, నాకు తెలుసుకోరానిది 167 యీశరీరమందే శరీరం లేకవున్నది 168 అత్యంత నిర్మలమైనది 169 అత్యంత స్వచ్ఛమైనది. కృష్ణశంకరులనే హరిహరులకు మెప్పైనది 170 చూడనిది 171 యిదే క్షరాక్షరాభ్యాం విలక్షణః అయినది 172 యస్మాత్క్షరమతీతోహ మక్షరాదపిచోత్తమః అనివున్నది 173 షడ్వింశః పురుషోత్తమః అనివున్నది 174 దీనికిక్షేత్రము లేదు గనుక క్షేత్రజ్ఞుడులేడు

175 యిదిచేసేది చేయించేదికాదు 176 నవద్వారపు రేదేహేనైవకుర్వన్న కారయేత్ అనివున్నది 177 వున్నదనే నిర్ణయం లేదనే నిర్ణయం లేనిది 178 యీనామరూపాలు లేనిదానికి ఆత్మఅని, బ్రహ్మఅని, జ్ఞప్తిఅని పేర్లు కల్పగురువులు పెట్టినారు 179 ఇదిపుట్టదు పుట్టించదు సార్వకాలం ఒక్క తీరుగా వున్నది. ఉండిచెయ్యదు చేయించదు 180 యిది జ్ఞానాతీతం 181 నిర్ణయానికి రానిది 182 నిర్ణయం చెయ్యనిది 183 వత్తిలేని దీపమువంటిది 184 నిరుపాధికము 185 సుషుప్తి వంటిది 186 త్రివిధాహంకారరహితమైనది 187 జ్ఞానాజ్ఞానములు రెండుగానిది 188 నేననే మూలమాయ, నేననే అంతఃకరణత్రనిది 189 మనోబుద్ధి చిత్తాహంకారములు లేనిది 190 అహం స్ఫురణ అనే పరాశక్తి లేనిది 191 సచ్చిదానందరూపమైన సర్వసాక్షిణి అనేమాయ లేనిది 192 రాకడపోకడ గల అహంస్ఫురణను తగలక, రాకడ పోకడ లేకవున్నది 193 నేనువున్నాను నేనులేను అనే జ్ఞప్తిలేక వున్నది 194 ఉన్నదనబోతే యెరుకయెరుగదు, లేదనబోతే యెరుకలేదు 195 ఇదే వ్యాప్యవ్యాపకాతీతం, జగద్వ్యాపకం జగత్తుతోటేపోవును 196 విద్యావిద్యలకు మూలంకానిది 197 అక్షర పరబ్రహ్మముకంటె వేరైనది 198 అహంబ్రహ్మము అనే అనుభవములేనిది 199 యిది అనుభవము లేని అనుభవం 200 కార్యముకాదు కారణముకాదు;

201 సర్వాన్ని గుర్తెరుగనిది 202 ప్రకృతి పురుషరహితమైనది 203 సంకోచవికాసములు లేనిది 204 సగుణనిర్గుణములు కానిది 205 బ్రహ్మభ్రాంతి జగద్భ్రాంతి లేనిది 206 యీగుర్తెరిగే చైతన్యము పుట్టకమునుపే, స్వతస్సిద్ధమై చలించక పరిపూర్ణముగా వున్నది 207 యీగుర్తెరిగే మాయోపాధిలేని శుద్ధము 208 ప్రకాశములేని ప్రకాశము 209 ప్రవృత్తి

నివృత్తులకు మూలముకానిది 210 ఒక్కటి అనేది రెండు అనేది లేక వున్నది.

ఈబోధ దక్షిణామూర్తివారి బోధ వంటిది.

ఇతి శ్రీ శివరామదీక్షిత ప్రభావే, వేదాంత విచారణే

అచలవాక్యములు. మూడవ ప్రకరణం సంపూర్ణం.

---

శ్రీ సద్గురుభ్యోనమః

ఎరుకలక్షణం.

# అచలవాక్యములు

వాయువువంటిది.

1 మూలంలేని యీగుర్తెరిగే శరీరం మసురామాత్ర ప్రమాణము 2 యిదే ప్రకృతి పురుషులు 3 గొప్ప కొంచెము యిదే 4యిదేమూలమాయ 5 ఉన్నంతసేపు బట్టబయలులోనే విహరిస్తూవున్నది 6 బట్టబయలునువిడిచి వుండేటందుకు దీనికి వేరే స్థలములేదు 7 యిది నిరుపాధికముగా వుండదు 8 బట్టబయలువలన పుట్టదు 9 శరీరము వలన పుట్టినది 10 దీనివలన శరీరము పుట్టినది 11 యిది బట్టబయలులో వున్నంతసేపు దీనికి అనేక సామర్థ్యాలు కలిగిఉండును, నీళ్ళల్లో మొసలివలె 12 యిదే సమస్తమైన త్రిపుటలు 13 ఈ అహంస్ఫురణే నేననే మూలమాయ 14 యిదే సమస్తమైన ద్వంద్వములు 15 యిదే ధ్వనిరూపము 16 యిదే అర్ధమాత్ర 17 యిదే

కృష్ణపింగళ రూపము 18 యిదే పిండ బ్రహ్మాండ స్వరూపిణి 19 దీనిపేరే యెరుక 20 దీనికే యెరుకమరుపులు గలవు 21 దీనిని రమ్మనేవారు లేరు ఉండుమనేవారులేరు పొమ్మనేవారులేరు 22 యిది సముద్రములో చేప వున్నట్టు వున్నది 23 తనకు తాను వస్తుంది, తనకుతాను వుంచుంది సకల వ్యవహారములు చేస్తుంది, తనకుతానే యేమీ లేకపోతుంది 24 నిత్యంఅనేక మార్లు వస్తుంది, వెంటనే యేమీలేదు 25 తనమూలం తానే యెరుగదు 26 సకల భ్రమలకు మూలం యిదే 27 యిది కలలోవచ్చిన శరీరం వంటిది 28 యిదే మహాకారణ శరీరమనదగినది 29 తనతో గూడా సమస్తమునకు నామరూపకుల గోత్రాదులను యేర్పాటుచేసినది యిదే 30 వేద శాస్త్రాది విద్యలను కల్పించినది యిదే 31 దీనిది అవాంతర దొరతనము 32 యిది సమస్త భాషారూపిణి 33 యిది రాకమునుపు నిశ్శబ్దమే 34 యిదే ప్రత్యక్చైతన్యము 35 యిదే పరమ చైతన్యము 36 యిదే ఉభయ ఐక్యము 37 యిదే తత్వమసిరూపము 38 యిదే బ్రహ్మాహమస్మి 39 యిదే ప్రజ్ఞానం బ్రహ్మ 40 యిదే అయమాత్మ బ్రహ్మ 41 యిదే ఒట్టబయలును బయట బెట్టినది 42 దీనినుండే ఆకాశాది పంచభూతములు పుట్టినవి * పంచకారణ స్వరూపము యిదే 43 తాను ఒక్కటే అయి వుండి తనలో తానే అనేకముగా భ్రమించుచున్నది 44 తనతోటే జీవేశ్వరులు 45 తాను లేకుంటే జీవేశ్వరులు లేరు 46 యిదే స్మరణ 47 దీనికే స్మరణ 48 దీనికేవిస్మరణ 49 నిబద్ధిపుస్తకంయిదే చేసినది 50 అబద్ధాలపుస్తకం యిదేచేసింది;

51 గురు శిష్య బోధా స్వరూపము యిదే 52 నిర్ణయాలు చేసేది యిదే 53 నిర్ణయానికి దొరికేది యిదే 54 దీనికి ప్రమాణాప్రమాణములు రెండు కద్దు 55 దీనికి వుంటే వుండేది, లేకుంటే యేమీలేదు, యిటువంటి రెండుతిప్పలు కద్దు 56 ఆసుకొయ్యవలె తిరుగుచున్నది 57 క్షణమైనా

వూరికే వుండదు, యేదైనా వొక వ్యవహారం చేస్తూనే వుంచుంది 58యేకం యిదే అనేకం యిదే 59 సూక్ష్మమాయ అహంస్ఫురణ 60 స్థూలమాయ మనోబుధ్యహంకార పంచభూతములు 61 స్థూల సూక్ష్మమాయలు రెండూ యిదే 62 విక్షేపశక్తి సూక్ష్యదేహము 63 ఆవరణశక్తి స్థూలదేహము 64 నేను అనే విక్షేపమే ఆవరణానికిమూలము, అనేక ఆవరణములకల్పిస్తుంది 65 యీ విక్షేపావరణశక్తులు రెండూ నేననేయిదే 66 అజడం విక్షేపశక్తి, జడం ఆవరణశక్తి, జడాజడాలు రెండు యివే 67 క్షేత్రం ఆవరణశక్తి క్షేత్రజ్ఞుడు విక్షేపశక్తి 68 విక్షేపముపోతే ఆవరణముపోయె, ఆవరణము తోటి విక్షేపముపోదు 69 క్షేత్రక్షేత్రజ్ఞులు రెండు యిదే 70 జ్ఞానాజ్ఞానాలే క్షేత్రక్షేత్రజ్ఞులు 71 దీనిరాకడే ప్రపంచోత్పత్తి 72 దీనిపోకడే ప్రపంచ ప్రళయము 73 సుషుప్తిని, మరణాన్ని, యెరుగనిది 74 యిదే నడమంత్ర పుది 75 పుట్టని చావని అచలానకు, తనకు సంబంధము లేనిదేసంబంధము ఉన్నదనేది యిదే 76 యిదే సకల అబద్ధాలు ఆడేది 77 యిదే చలము 78 యీచంచల స్వభావముగలది యేమిచెప్పినా చెలించి పొయ్యేదే 79 యిది చెప్పిన మాటలు దీనితోటేపోయావి 80 యిది చెప్పేమాటలు దీనివంటివారే నమ్ముతారు 81 యిదే మధ్యవచ్చి మధ్యపొయ్యేది 82 దేహమును విడిస్తే, దేహికి వుండస్థలంలేదు 83 దేహిలేకుంటే దేహమును యెరిగే వారులేరు 84 వచ్చేటప్పుడు దేహిలేని దేహమురాలేదు 85 రాగానే దేహిదేహాలు వొక్కటే 86 యీరెంటికి వేరనగూడదు 87 యిదే సకలవినోదములుచేసి, యేమి లేకపొయ్యేది 88 దీనికి ఆచలానికి యేమాత్రము సంబంధములేదు 89 తానుమూలము లేనిది 90 అన్నిటికి తానేమూలము అయినది 91 పుట్టి చచ్చేదియిదే 92 రాకడపోకడలు గలదియిదే 93 దీనికి అచలమువున్నది యెరుకలేదు 94 అచలము వున్నదని యెప్పుడుతెలిస్తే అప్పుడే తాను వుండదు 95 చలమే స్థిరమని నమ్మకునేది యిదే 96 శరీరం అబద్ధంనేను నిబద్ధిఅనేదియిదే 97 నేను శరీరం వొక్కటే అనేదియిదే 98 నేనువేరే

యీశ్వరుడువేరే అనేదియిదే 99 వివేకావివేకములను నిబంధనచేసేదియిదే 100 యిది నిబద్ధి అదిఅబద్ధమనేదియిదే;

101 నేను నేనే అనేది యిదే 102 నీవు నేనే అనేదియిదే 103 దేవుడునేనే అనేదియిదే 104 కన్నులయందువున్న పాపరూపమైన యెరుక యిదే 105 తనకుకారణమువున్నది అని భాష్యములు చేసినదియిదే 106 యీభ్రాంతి సార్వకాలము వుండేదికాదు. అయితే పోకనేపోవు 107 దీని వంటి శిష్టులేదు 108 దీనివంటి భ్రష్టులేదు 109 దీనికియేదైనా వొక రోగము, దరిద్రము, సంపత్తి 110 ఉన్నప్పుడు ఒక్కతీరుగా వుండదు క్షణేక్షణే యేమీలేదు 111 సకలమాయలు చేసినదియిదే 112 దీనిరాకడ పోకడ యెవ్వరు యెరుగరు 113 తానున్నంతసేపే యెరుకఅయినామరుపు అయినా 114 తానులేకుంటే యేమీలేదు 115 దీనిరాకడే స్వప్నము 116 గురునిచేత యిదియేమీలేదని, తెలిసి దృఢమై, దృఢముతోగూడా యిది లేక పోవటమే మెల్క, యిదిలేనప్పుడు సుషుప్తియనిమంది అన్నారు, మరణ మని మందిఅన్నారు 117 దీనికి తనకుతాను వచ్చేదికద్దు, తల్లికడుపులో యుండి వెళ్ళివచ్చేదికద్దు 118 యిది యిన్నాళ్ళు వుంచుందనే మర్యాద లేనిది 119 సకలక్రియలకు మూలముయిదే 120 అధిష్ఠానము లేనిది యిదే 121 దీనికిమూలము ఉన్నదని చెప్పంగనే వాడు పుట్టనేపుట్టె పుట్టినవాడు చావనేచస్తాడు 122 దీనిబ్రతుకు కేవలభ్రాంతిమాత్రమే 123 యిదిపోయిన వెనుక దీనివ్యవహారం వున్నదని లేదని యెవ్వరన యేమిలేదని యెవ్వరన 124 యీగుత్తెరిగే శరీరమనే చంచలముచేత శరీరం యేమీలేదని స్మారకము వచ్చెనా సార్వకాలం అచలమె 125 శరీరంవలన పుట్టినవే అన్ని 126 తనమతముతనకే సమ్మతముగాని, యేమతము నమ్మనిదియిదే 127 షణ్మతములనుకల్పించినదియిదే 128 భూమండలమందు శరీరము లేని వారు ఉన్నారంటే నమ్మనిదియిదే 129 సకలనిశ్చయములు దీనికే 130 సకలసంశయములు దీనికే 131 తాను వచ్చేటప్పుడు యేనుగులు, గుఱ్ర

ములు, లొటిపిటలు, కుక్కలు, గాడ్దెలు, పందులు, పిల్లులు, యెల్కలు, పెద్దపులులు, సింహాలు అనేకమంది గుర్రాలు తోమేవాండ్లు, ఆడవాండ్లు, బూడిదెగాండ్లు, నామదార్లు, అద్దకపు బట్టవలె నిలువునిండా ముద్రలు పొడుచుకున్నవాండ్లు, బోడివాండ్లు, ఫకీర్లు, గొడ్డలివలె పెట్టుకున్న వాండ్లు, పెద్దపెద్ద పట్టెనామాలవాండ్లు, ఆవులు, బర్రెలు, గొర్రెలు, మేకలు మాలలు, మాదిగెలు మొదలైనవాండ్లు అనేకులు తనవలెనే మూలంలేక యెక్కడనుండియోవచ్చి, సకలమైన వ్యవహారాలు చేస్తూ, పెండ్లాము, పిల్లలు, మనుమలు గలవారివలె వున్నట్టు తోచబడేది దీనికే 132 అయోని సంభవులు యోనిసంభవులు యిదే 133 తలకాయ అనే మొదలు, కాళ్లు అనే కొనగలది యిదే 134 శూన్యమైపోయేది యిదే, శూన్యమంటే యేమీలేదు 135 జ్ఞానాజ్ఞానములు యిదే 136 యిదిశరీరము లేనిదానిలోనే వుండేది 137 నిలువనీడలేనిది యిదే 138 సకలప్రయత్నములు చేసేదియిదే 139 తల్లితండ్రీ లేనిదియిదే 140 వుండేది లేకపోయేదియిదే 141 తనకుమొదలు లేదని యెరిగేదియిదే 142 కొనకువుండేటందుకు యేమీలేదని యెరిగేదియిదే 143 యీవచ్చినప్పుడు నీవు యెక్కడినుంచి వచ్చినావు యెక్కడికిపోతావు అని అడిగేదిక్కులేనిది 144 వచ్చినప్పటినుంచి సుఖమైనా దుఃఖమైనాఅను భవించిపోయేది 145 భ్రాంతి నివర్తికావలెనని కోరేదియిదే 146 భ్రాంతి నివర్తి కావలసినది దీనికే 147 అధికనీచాలు యిదే 148 యిచ్ఛారూపము యిదే 149 యేనుఁగ అధికం, యెలుక నీచం, సింహం యెక్కువ యేనుగ తక్కువ, పిల్లి యెక్కువ, యెలుక తక్కువ కనుక అన్ని మూలంలేని యీగుర్తెరిగే శరీరాలే 150 అందులో కుక్కకు బ్రహ్మజ్ఞాని అనేవాడుక, కోడికి కాలజ్ఞాని అనేవాడుక, చీమకు దివ్యజ్ఞాని అనేవాడుక, యిట్లా గుర్తెరిగినది వొక్కటీ నిలువదు.

151 మెరుపువలె వున్నా ననిపించి వెంటనే యేమీ లేకపొయ్యేది

యిదే; దురహంకార, నిరహంకార, శుద్ధాహంకారములు యిదే 152 యిది బదులులేనిది 153 దీనివల్లనే సచ్చిదానందముపుట్టినది 154 యిది సచ్చిదానందమువల్లనే పుట్టినది 155 సచ్చిదానందమే అనాత్మ, సచ్చిదానందమే ఆత్మ, సచ్చిదానందమే పరబ్రహ్మ, పుట్టిన శరీరములెల్లా సచ్చిదానందమే 156 గురుసూచన గానివారికి, గురుసూచనగానివారే మూలం 157 గురుమూలముగా విచారించినవారికి, సార్వకాలం అచలమే 158 కండ్లుమూసినా యెరుకే కండ్లు తెరిచినా యెరుకే యీ యెరుకలేకుంటే యేమీలేదు 159 యెరుక వున్నచోటనే కర్మములు 160 ఇది వున్నదన్నా పాపమే లేదన్నా పాపమే; నిర్ణయమనే పాపం లేకుండా మెదలవలె; నిర్ణయమే పాపము 161 పరిపూర్ణమనే అదిన్ని యిదిన్ని అనేరెండు లేకవున్నది వొక్క పరిపూర్ణమే యీ గుర్తెరిగే శరీరము యేమీ లేదని నిర్ణయముకాక తన్నుకుంఛారు 162 యిది యేమీ లేదని రెప్పపాటంత సేపైనా మరువక వుండవలె; వుండకపోతే యిది యెంత వొడ్డ ప్రజ్ఞావంతునినైనా మోసపెడుతుంది 163 ఉన్న పరిపూర్ణానికి యిది విరోధిగనుక దీని కూకుడువేళ్ళతో తీసివెయ్యవలె 164 యిది యేమీలేదని సకలక్రియలుచేసినా అది క్రియాశూన్యము కాదు 165 యిది లేకపోవటం గురుమూలముగా తెలిస్తే ప్రసంగములు నిలిచె 166 ఇది యిరువై అయిదోతత్వం 167 తక్కిన యిరువైనాలుగు తత్వాలు యిదే 168 జ్ఞానరూపముయిదే 169 కర్మరూపముయిదే 170 జ్ఞానకర్మరూపమైన శరీరము యిదే 171 ఆవగింజకు పర్వతానికీ యెంతయెచ్చుతగ్గో దీనికి అచలానికి అంత యెచ్చుతగ్గు 172 యిది అనిర్వచనీయమయింది; అనిర్వచనీయమంటె యేమీలేనిది 173 దీనికి వున్న సామర్థ్యము దానికిలేదు 174 యిది యేమీలేదని దీనికే తెలిస్తే వాదశూన్యం అవుతుంది 175 యిదే సమస్తమైన వస్తుమయం176వస్తువులయందు వుండేదయిదివస్తువులతోటిపోతుంది 177 యిది పరిపూర్ణానికి అన్యంకాదు. పరిపూర్ణంకాదు యేమీలేదు 178యిది దప్పవిడిచి అంతాపరిపూర్ణమే 179 యిదే చిదగ్నిగనుక యెన్నటికి నమ్మ

రాదు మహానమ్మించి చూస్తూవుండంగా యేమీ లేకపొయ్యేది 180 యిది కలవంటిది 181 పరిపూర్ణము నిమిత్తం యత్నంచేసేది యిదే 182యిదిజేసే యత్నమే దానికి విఘ్నము 183 యీ ప్రయత్నము చేసేదాన్ని తీసివేయ టమే ప్రయత్నము 184 యీప్రయత్నము చేసినవారికి యిచ్చవుండదు 185 దీన్ని నిల్పేవారికంటె నిలుపుకునేవారికంటే వేరే భ్రాంతికులులేరు 186 యిదే అనేకకోటి బ్రహ్మాండములు వున్నవని భ్రాంతి పెడుతుంది 187 తనకుమూలములేదని యెవ్వరితో చెప్పదు 188 అందరు తానే అయివున్నది 189 దీనికంటె కౌతుకములేదు 190 దీనివల్లనే కర్మాలు పుడుతావి 191 యిది సుషుప్తి మరణాల యెరుగనిది 192 శరీరమే యెరుక 193 యెరుకే శరీరము 194 యీరెంటిని వేరనేదే వెర్రి 195 దీనిచాత పుట్టని చావని దాన్ని వుండచూచి దీన్ని యేమీలేదని నిశ్చయంవుంటేచాలు. యేసాధన వద్దు 196 యే సాధన చేసినా యిది విడువదు 197 యెరుక అనే నిప్పు కాలుస్తూవుంటుంది 198 యెరుకకంటె వేరే నిప్పులేదు 199 చిదగ్నిదేహాల సర్వకాలం చింతనిప్పువలె కాలుస్తుంది 200 సకల శరీరాలు యెరుకతో కూడనే వచ్చినవి యెరుకతోకూడా యేమీలేదు.

201 శరీరంలో కొంత నిబద్ధి కొంత అబద్ధంఅనేది అన్యాయము 202 యీశరీరమువొక్కటేకానిదీనిలోపల వున్న పేర్లు అనేకాలు జ్ఞానమని అజ్ఞానమని, యింద్రియాలని, విషయాలని, గుణాలని, అంతఃకరణఅని, మనస్సని, బుద్ధిఅని, చిత్తమని అహంకారమని, వేదాలని, శాస్త్రాలని యెన్నిఅని వ్రాయుదును దీనియందు (స్వగత) భేదాలు అనంతాలుతీసివేసిన కొద్ది మొలుస్తావి 203 యిదే వికారస్వరూపం. చెవులు వొక్కతీరుగా నున్నవినోటినిండా బొక్కలు, చుట్టువెంద్రుకలు, లోపటనాలుక నోరు మాట్లాడుచున్నది. కడుపులోవికారాలకు లెక్కలేదు. తలలో వికారాలు అనేకము, ఖికారంలేనిది వొకటైనాలేదు. కాళ్ళల్లోవున్నతిప్పలు చెప్పశక్య

ముకాదు 204 యిదిలేకుంటే యేదివుంచుందో అదే అచలం. కావలెనని యిచ్చవద్దు నాకపోతినని దుఃఖంవద్దు అయితినని అబద్దాలు ఆడవద్దు 205 సర్వకాలం గురువాక్యం మరవకవుంటేచాలు 206 యీ గుర్తెరిగే చైతన్యముకు జగత్తుకు వేరులేదు 207 శరీరంవలన గుర్తెరిగే చైతన్యం పుట్టింది, గుర్తెరిగే చైతన్యమువలన శరీరం పుట్టింది, శరీరం పుట్టింది 208 యీశరీరాలు యేలాగు పుట్టినవంటె స్త్రీపురుష సంబంధంవల్ల అన్నిపుడుఛావి 209 దేహం లేదనేది దేహమె. యేమీ లేదనేది దేహమె. ఉన్నది అనేది దేహమె. యీదేహము లేకుంటె వ్యవహారానకు మూలం యేమని నిర్ణయముచేయ 210 ఈ శరీరం యెవరివలన పుట్టినదో ఆనిర్ణయము మొదలు కల్తలేకుండా విచారించవలె 211 ఈ శరీరంలేకుంటే యేమితోచదు 212 త్రివిధాహంకారము యిదె 213 చతుర్వింశతి తత్వాలు దేహం, యిరువైఆయిదో తత్వమే దేహి, యీదేహి దేహాలే ఈశ్వరజగత్తులు 214 లేని క్షేత్రజ్ఞస్వరూపమే వున్నది వుంచుంది, లేనిది లేదు అంటుంది 215 ఈ శరీరము లేదుగనుక ఉన్నదానికి వ్యవహారమే లేదు 216 అయం జీవాత్మోపాధివిలయేసతి కేవలోభవతి 217ఈక్షేత్రము లేకుంటె క్షేత్రజ్ఞుడు లేనేలేడు 218పుట్టుకా, భ్రాంతి సమానమే 219 గుర్తెరిగేదిశరీరము తోటే పోచుంది220గుర్తెరుగుటం వొక్కటేకాని రెండు గుర్తెరుగుటాలు లేవు221 ఈగుర్తెరిగేక్షేత్రజ్ఞస్వరూపమునేఆత్మబ్రహ్మమనివేదంపలికినది222యెక్కడ సర్వంతోచిందో అక్కడనే సర్వం లేకపోవలెను 223 యీ గుర్తెరిగే క్షేత్రజ్ఞస్వరూపమనే పరాప్రకృతే అధిష్ఠానము 224 యీగుర్తెరిగే చిత్ప్రకృతి సాక్షిణి 225 యీ సాక్షిణి యిన్ని చిత్ర విచిత్రాలు కల్పిస్తుంది 226 యీ గుర్తెరిగే సాక్షిణికి మూలం యేమీలేదు 227 ఇది మగడువిడిచిన ఆడది గాదు, మొగుణ్ని విడిచిన ఆడదిగాదు 228 దేహము వున్నంతసేపే జ్ఞానము వుంచుంది. దేహం లేకుంటే జ్ఞానం లేనేలేదు 229 రోగవికారాలు పోతే రోగముపోయినట్లే, యెరుక వికారాలుపోతే యెరుకపోవును 230 కలలో శరీరాలవంటివే యీ శరీరాలు, యేశరీరానికి మూలం యేమీలేదు, అన్ని

వొక్క యేడుపే 231 సమష్టి దేహత్రయావస్థాత్రయాభిమానత్రయము యీశ్వరుడు అజ్ఞానము 232 మహాకారణ శరీరతుర్యావస్థలకు అభిమాని పరమచైతన్యము యిదేజ్ఞానము 233 యిదే కారణం 234 యిది అంతా మాయ 235 అహంస్ఫురణే మాయ 236 యిదే పీతకబుర్రరశ్యామతటిల్లతలు 237 వ్యష్టిదేహత్రయావస్థాత్రయాభిమానత్రయము జీవుడు అజ్ఞానము 238 మహాకారణ శరీరతుర్యావస్థలకు అభిమాని ప్రత్యక్చైతన్యం యిది అంతా కార్యం అవిద్య అహం అహంస్ఫురణే అవిద్యయివియేరక్తశ్వేత కృష్ణనీలాలు 239 పూర్ణచైతన్యం స్ఫటికవర్ణం. ఉత్తమపురుషుడు శబ్దా తీతం ఆకాశాతీతం 240 జీవుడే క్షరుడు, ఈశ్వరుడే అక్షరుడు యీ యిద్దరులేనిదే ఉత్తమపురుషుడు 241 యిది అంతా గూడి మూలములేని యీ గుర్తెరిగే శరీరము 242 దీనికి సకల వేతృత్వాలుకద్దు బ్రహ్మవేతృత్వము దీనిదే. యీవేతృత్వమనే శబ్దతెలివికి పనియేమి అంటే, బ్రహ్మనువుండ జూచి తాను లేకపోవుటయేపని, దీనికిమూలములేదు యిదివచ్చినప్పటినుంచి యే, సకల ప్రసంగాలు, యిది సమస్తభాషా రూపిణి 243 బహ్మవేత్త బ్రహ్మ కాదు. బ్రహ్మకు బ్రహ్మవేతృత్వము లేదు. యీవేతృత్వమునే బ్రహ్మమని వాదించే వారి వాదమును తీసివేసేది శివరామదీక్షితుల వారిబోధ 244 బ్రహ్మవేతృత్వమే బ్రహ్మజ్ఞానము 245 దీనికి బ్రహ్మవేతృత్వం ప్రపంచ వేతృత్వం కూడా కద్దు 246 యిదే మూలమాయ, యిదే ప్రధమస్ఫురణ 247 ఆకాశమందు వాయువుబుట్టినట్లు సుషుప్తికిమెల్కొ వచ్చినట్టు నేను మే నులు నెరుగని బ్రహ్మయందులేని నేను మేనులు బుట్టి బ్రహ్మనుగని నేను మేనులులేచిపోవటమే యీబోధవిన్నందుకు ఫలం 248 ఎట్లావున్న ప్రపంచం అట్లావుండంగా వెతికినా క్షేత్రక్షేత్రజ్ఞులు లేకపోవటమే యీవిచారణకు ఫలం 249 ఈక్షేత్రక్షేత్రజ్ఞులలో యేమాత్రము ఆశపడ్డా అదేవిషము 250

క్షేత్రక్షేత్రజ్ఞులు లేని దేవుత్తబట్టబయ లనదగినది 251 మూలంలేని యీ గు ర్తెరిగే శరీరానికిఊర్ధనాభికి ఉపమానం చెప్పివున్నది.

ఇతి శ్రీశివరామదీక్షిత ప్రభావే, వేదాంత విచారణే,
చలవాక్యములు, నాల్గవ ప్రకరణము సంపూర్ణం.

---

# శంకరాచార్యులవారి వాక్యములు

1. యేమిలేని జీవుడువున్నాడు 2 అవిద్యవున్నది 3 ప్రకృతి వున్నది 4 ఆత్మవున్నది 5 కారణంవున్నది 6 గుర్తెరిగేజ్ఞానంవున్నది 7 అజ్ఞానంలేదు 8 సచ్చిదానందం విన్నది 9 అసంజ్ఞతమః ఖాత్మకంజగత్ 10 వొక్కటేకాని రెండోది యేమీలేదు. రెండోది శరీరం 11 శరీరమును. గుర్తెరిగేది వున్నది 12 ఈశ్వరుడువున్నాడు 13 ప్రకృతులు రెండు 14 ప్రకృతి యేమీలేదు 15 పురుషుడు యేమీలేదు 16 పురుషుడే నేను ప్రకృతి యేమీలేదు 17 దేహం అబద్ధం 18 దేహి నిబద్ధి 19 జ్ఞానం యేమి చెయ్యదు. అజడం 20 శరీరం యేమి యెరుగదు, జడం 21 జ్ఞానసాన్నిధ్యం చేత శరీరం చేస్తుంది 22 గుర్తెరిగే జ్ఞానానికి వికారంలేదు 23 శరీరానికి అన్ని వికారాలువున్నవి 24 జగత్తుకు గుర్తెరిగే బ్రహ్మము కారణం 25 శరీరము కార్యము 26 కార్యకారణాలకు భేదంలేదు 27 సువర్ణం అలంకారం యాలాగో ఆలాగే 28 ఆడదానివల్ల జగత్తు పుట్టింది 29 పురుషునికి స్త్రీ అనే ప్రకృతికి సంబంధంలేదు 30 బ్రహ్మమును నేను31 వారివారి కర్మాలచేత పుడుచారు32 కర్మాలకుకర్తలేదు,భోక్తలేడు 33 ఆనేవాడుతానే34కర్మాలకుకర్తతానే,భోక్తతానే,35అనేమాటలు యాలాగు 36 సర్వంఆత్మే37 సర్వం బ్రహ్మస్వరూపమే 38 జగత్తులేదు 39 సార్వకాలం వొక్కటీరే 40 సర్వం అహంకా

రమే చేస్తుంది 41 వేదాలు తమకు తామేస్వతః సిద్ధాలు 42 నేనే నేను 43 యీసంసారం కలవంటిది 44 జాగ్రతకద్దు 45 స్వప్నంకద్దు 46 సుషుప్తి కద్దు 47 తుర్యంకద్దు (తుర్యాతీతం) 48 ఈశరీరములో నే కనుక్కోవలెను 49 శరీరములోపటలేదు బైటలేదు 50 చిదాకాశం;

51 జడాకాశం 52 గుర్తెరిగే క్షేత్రజ్ఞస్వరూపమనే ఆత్మవలననే ఆకాశంపుట్టింది 53 ఆత్మనః ఆకాశః సంభూతః 54 ఆకాశస్యగుణః శబ్దో నిశ్శబ్దో బ్రహ్మఉచ్యతే 55 మాట్లాడేదిసగుణమననా నిర్గుణమననా 56 గుర్తెరిగే చైతన్యం బ్రహ్మగనుక గుర్తెరిగే చైతన్యం మాట్లాడదు 57 యేనవా వాచమవ్యాకరోతి అనిశ్రుతివున్నది 58 గుర్తెరిగే చైతన్యం చేతనే మాట్లాడుథాడు 59 గుర్తెరిగే నేను నిర్గుణం 60 గుర్తెరుగబడే శరీరాలు సగుణం 61 నిర్గుణం సగుణానికి కారణం 62 బ్రహ్మజగత్కారణం అయితేకార్యాలు సగుణం. ఏలాగు అంటే అంతా నిర్గుణమే సగుణం లేనేలేదు అనిఅన్నాడు. యివ్వి అన్నీ కలతవాక్యాలే.

---

శ్రీ సద్గురుభ్యోనమః

# సాందీపవాక్యములు

ఈ బోధ గలవారు కాలిన నులుకవంటివారు, చూచేటందుకు ఉన్నట్లు ఉన్నదిగాని, యేపనికి అక్కరకురాదు.

1 ఆత్మైక్య శరీరహితః । యస్యాత్మా శరీర మితిశ్రుతేః॥ 2 గురువాక్యము చేతనే వినేది, అడిగేది, చెప్పేది, పోయెను యీ శరీరమందు లేనిది అడుగదు వినదు చెప్పదు 3 వంచన రహితమైన శిష్యుడు వచ్చి అడిగితే చూతాము 4 మంచివారు యీశరీరమందు లేక అంతటా చలించకవుందురు 5 ఈశరీరమందు, లేని స్వరూపాంబరనిర్గుణంవుండును

6 జీవేశ్వరులకు మూలంలేకపోయెను అదే అంటే మూలమాయతోటి పోయి నది 7 సార్వకాలం వొక్కతీరే ఆయెను 8 శూన్యమనే వ్యాపకము లేక పోయెను 9 స్వతస్సిద్ధమై అచలమే నిలిచెను 10తానేతాను అనే అనుభవము లేకపోయెను 11 ఈ శరీరమందు వున్నది లేకపోవటమే పరమశాంతి 12 గురువాక్యము చేత బ్రహ్మభ్రాంతి లేకపోయెను, త్రిపుటికి మూలము లేక పోయెను కనుక అదేభ్రాంతిలేని పరిపూర్ణము 13 యీశరీరమందు వున్న దనే భ్రాంతిపోయెను 14 తనకుతానే అంతటా వుండెనుఆదిమద్యాంత రహితమాయెను 15 ప్రయత్నముచేసేది పోయెను 16 గురుస్వామి మహత్తు యేమని చెప్పవలెను శక్యముగాదు దీనికి బదులు లేదు 17 అక్కడ జ్ఞప్తి అంటివా యెరుకలేదు 18 అజ్ఞానమునకు మూలమే లేకపోయెను 19 అందుకేయెరుక మరుపులు లేనిది యీశరీరమందు లేకనే వుండెను 20 ఈలాగు చెప్పినవారి కంటె అధికులులేరు, యీశరీరమందులేక వున్నవారికంటె అధికులులేరు, యిదే పరమరహస్యం 21 వున్నదిఅనేది లేదనేది లేకపోయెను అప్పుడు వున్నదె వుండె సార్వకాలం వొక్కతీరె 22 దేవతా భ్రాంతితోటే దయ్యం విడిచిపోయెను, గురువాక్యం యిటువంటిది 23 వున్నదిఅంటివా యెరుక యెరుగదు, లేదంటివా యెరుకలేదు 24 ఈశరీరమందు లేకవున్నది మాటే ఆడదు. చూచుట యేలాగువుండీని వినకరి యెవ్వరికి;

25 గురువాక్యంచేత యీశరీరమందు వున్నదిపోయెను. లేనిది లేక పోయెను 26 వున్నది యెన్నటికి చలించదు, రాదుపోదు యిటువంటిది శరీరమందు వున్నవారికంటె వేరె 27 అదే,అది, అందుకే క్రియాశూన్యుడు కర్మానకుమూలంలేదు గనుక సార్వకాలం క్రియాశూన్యమే. 28 అవస్థలకు మూలం లేదు గనుక సార్వకాలం వొక్కతీరే 29 జగద్వ్యాపకము జగత్తుతోటే పోయెను 30 వ్యాప్యవ్యాపకానకు వేరే వున్నాడు 31 యీశరీర మందు లేక అంతటావుండును, అదేప్రకాశరహితము 32 బ్రహ్మవిష్ణు మహేశ్వర్లకు మూలము పోలేకపోయెను. 33 అత్యంత విలక్షణమే వున్నది విలక్షణం సూర్యునియందు చీకటి లేనట్లే. శరీరమందు లేని నిజమందు

సార్వకాలం లేకపోయె 34 విద్యావిద్యలకు వున్నది మూలముగాక వున్న దానియందు నిప్పునకు చదలుతగిలినట్లు విమర్శరూపిణి అయిన విద్యతగిలి వున్నది 35 అదిస్వతఃసిద్ధమై తనకుతానే వున్నది 36 అక్షరపరబ్రహ్మము కంటె వేరే నిజస్వరూపం. అందుకే యీ శరీరమందు లేకవున్నది 37 అహంబ్రహ్మము అనేఅనుభవములేనిదే నిజస్వరూపము 38 యీశరీరమందు వున్నది లేకవున్నది గనుక గురువాక్యంచేత కల్పనా రహితం ఆయెను 39 అనుభవము లేనిదే అనుభవము. సార్వకాలంవొక్కటీరేకనుక అహం బ్రహ్మాస్మి అనే అనుభవము లేకుంటే యీ శరీరమందు లేకున్నట్లే వుండును.

40 వున్నది, కార్యముగాదు కారణము గాదు. యీశరీర మందులేక వున్నది గనుక యీశరీరమందు వున్న సాక్షిణి మాయారహితము అయినదీ అచలమనె పరిపూర్ణము 41 యీశరీరమందు లేనిదాని జాడా ధ్యాన్యం యెన్న టికీ లేదు, సకల చింతలు గలదిపోయె, పరబ్రహ్మ లేకనే కావలెను 42 యీ శరీరమందు వున్నది లేకనే వున్నది గనుక అహంబ్రహ్మ అని అనుభవమే మూల మాయ అనే చైతన్యం అని యెరిగేది 43 సర్వాన్ని గుర్తెరుగనిది గనుక అదే పరిపూర్ణము 44 చైతన్యము దానికంటేమాయ వేరే లేదు గనుక అదే సర్వానకు అధిష్టానం సర్వానకు అదే కారణకార్యమున్ను 45 ఈ శరీరమందు వున్నది లేకవున్నది, ప్రకృతి పురుషరహితము అయినదిగనుక అంతటావున్నది యీ శరీరమందు యెన్నడు లేదు 46 పరిపూర్ణచైతన్యమే మూలమాయ అని గుర్తెరిగేది 47 చైతన్యం వున్నది భ్రాంతి వివర్తనము, వున్నదానికంటె వేరుగావున్నట్లేతోస్తుంది గనుక పరబ్రహ్మమే వివర్తనము 48 ఈ శరీరమందు వికారాలు లేవుగనుక మూలమాయ వున్నట్లు తోచితేవున్నదానియందు దానికే తోచును 49 మూలమాయాతీతం శూన్యంచేసినవారు సాందీపులనుకోవలెను, లేక పోయెనా వారి శిష్యుడు కృష్ణుడనే భగవానులేమో అనుకోవలెను. వారే

గురువులు వారే శిష్యులు 50 రాముడు శిష్యుడుకాడు, వశిష్ఠుడు గురువు కాడు, కోటివిధాలు విచారించినా వారితోను సమముకారు బ్రహ్మైవవివర్త నము;

51 యీ శరీరమందు లేకవున్న దానికి సంకోచములేదు, వికాసము లేదు 52 బ్రహ్మమనే తమస్సు తోచెను. ఉన్నదానికి తోచేదేలేదు. 53 ఉన్న దానికి సమానమైనదిలేదు, యీ శరీరమందు లేకవున్నది గనుక బ్రహ్మము అన్నమాయఅన్న ప్రకృతిఅన్న అవిద్యఅన్న అజ్ఞానమన్న ఒక్కటే 54 మూడుగుణములకు మూలంయెన్నటికిలేదు 55 ఈ శరీరమందులేక వున్నది సగుణముకాదు, నిర్గుణముకాదు అదే అది 56 ప్రకృతి పురుషులువేరు, యెన్నటికికాదు. సగుణమే. నిర్గుణము నిర్గుణమే సగుణము 57 గుర్తెరిగేది మహామాయ. అదేఅజ్ఞాన త్రయమని గుర్తెరుగుమా అదేస్వరూప సంధానము 58 అహంబ్రహ్మాస్మి అనే పరబ్రహ్మానుభవము అదే మహామాయ 59 నిజ మందు లేకనే తోచేది వివర్తనం అది యేలాగు వున్నదంటేను సూర్యుని యందు చీకటి వున్నట్లు ఉక్కుస్థంభాన్ని పురుగు తొలిచినట్లు తొలుస్తుంది. నిప్పునకు చదలు తగిలినట్లు తగిలింది. 60 ఇంతేకాని యీ శరీరమందు లేకవున్నదానికి ఒక్కటైనా వికారంలేదు జన్మకర్మాలు లేవుగనుక అది సాందీపునికేయెరుక. తరువాత కృష్ణస్వామికే కాని మరివొకరు ఉన్నారని తోచదు 61 అదే అంటే జ్ఞానవైరాగ్యాలు భ్రాంతితోనే వున్నట్టు తోస్తుంది అహం బ్రహ్మాస్మియనే అనుభవము నిశ్చయమాయెను 62 బుద్ధిమంతులైన వారు అదే మూలమాయ అని యెరుగవలెను 63 బ్రహ్మభ్రాంతి యెంత పర్యంతము వుండునో అంతపర్యంతము మాయ రహితముకాదు 64 దీనిమహిమ చెప్పశక్యముకాదు. లేనిది వొక్కటి వున్నది సంఖ్యకు రాదు గనుక అపరబ్రహ్మ వున్నట్టుతోచదు. గురువాక్యముచేత తొలు గును 65 ఉన్నదానియందు యీగుర్తెరిగే చైతన్యము లేక వున్నట్టే వుండి బ్రహ్మాదిదేవతలు వున్నారని తనవంటివారితో చెప్పుకుంచూ వుండును.

గురువుగలిగితే సూర్యునియందు చీకటి లేనట్టే యెన్నటికి లేకపోవును. లేకనే వున్నట్టు వుండును 67 ఉన్నది పుట్టని చావనిదిగనుక ఉత్పత్తికి మూలం యెన్నడులేదు. గురుకృప కలిగినదాక సృష్టిభ్రాంతి తప్పదు 68 అటు తర్వాత నిర్ణయమేలేదు, రెండోది లేదు, గనుక "బోధోహి" భయహేతుః అనివున్నది, గనుక ద్వితీయా ద్వైభయం భవత్ అనిశ్రుతి ఉన్నది గనుక అభేదమే భేద మనుకోండి. 69 బ్రహ్మమే మాయ, అహంకారస్వరూపము గనుక అదిగాక జగద్విలక్షమైనసాక్షిణి. మాయామయమే విశ్వము, బ్రహ్మమేజగత్తు, జగత్తేబ్రహ్మము, 70 అందరు యీగుర్తెరిగే చైతన్య స్వరూపులే అందుకే ఆత్మ, అందుకే గురువాక్యములేక బ్రహ్మభ్రాంతి పోదు. 71 గురువాక్యము గలిగితే అప్పుడే బ్రహ్మభ్రాంతితో గూడా జగద్భ్రాంతి సార్వకాలం లేకపోవును. అందుకే గురువాక్యముకంటె అధికులు లేరు. అటుతరువాత వున్నదే వున్నది, సార్వకాలం వొక్కతీరే, 72 ఈ శరీరమందు వున్నది లేక వున్నది, గనుక నిజస్వరూపము. యీ గుర్తెరిగే చైతన్యము పుట్టకమును పే స్వతః సిద్ధమై చలించక పరిపూర్ణముగావున్నది 73 గురువాక్యంచేత సకలసంశయరహితము తనకుతానే అవును. అది వారి శిష్యులకేకాని మరి వొకరికి వారి ప్రభావము తెలియదు.

74 చైతన్యమే రెండు, సగుణ నిర్గుణము. నిర్గుణమున్ను చైతన్యమనే మాయోపాధి.గుర్తెరిగే మాయోపాధి లేనిది శుద్ధమనే నిర్ణయము శుద్ధముకంటె అధికములేదు. 75 చైతన్యమనే మాయకే శబలమనె సౌజ్ఞ. యీగుర్తెరిగే చైతన్యమే సగుణబ్రహ్మ. నిర్గుణబ్రహ్మమున్ను. 76 యిరువై అయిదోది పరమాత్మ, అదే పరమపురుషుడు. పురుషుడు ప్రకృతితోటి పోయె గనుక యీశరీరమందు వున్నది లేకపోయితె వున్నది సర్వత్రా వున్నది 77 యీశరీరమందు యెన్నడులేదు. వ్యాప్యవ్యాపకముకంటె వేరే కనుక అనుభవములేకనే స్వతస్సిద్ధమైయుండును. అదే అంటే 78'యస్మాత్క్షరమతీ తోహ మక్షరాదపిచోత్తమః' అని భగవద్వాక్యం వున్నదిగనుక

అక్షర పరబ్రహ్మముకంటె వేరే అని సిద్ధాంతము. 79 యింతేకాదు క్షేత్రజ్ఞాఖ్యాత్మనః అక్షరాదపిచోత్తమః మూలప్రకృతికంటే వేరే నిజస్వరూపము ప్రకాశములేని ప్రకాశము నిజానకు స్వభావము. అపరబ్రహ్మము నిజము వలెనే అత్యంత గురుసాంప్రదాయరహితులకు తోచును. 80 ఆనిజము శబ్దాతీతం అయివున్నదానికి యేమీ తోచదు, యీశరీరమందువున్నదిలేకవున్నది గనుక ప్రవృత్తికి మూలంలేదు, నివృత్తికి మూలంలేదు 81గురు సామర్థ్యం చేత ఉన్నదానికి సామర్థ్యంలేదు అదే అదిగనుక ముగ్గురికి మూలంలేదు82 యెరుకేపరమేశ్వరుడు, యెరుకే మహత్తత్వం, దానికిమూలం శూన్యం, అవతారములకుమూలముశూన్యము, యెరుకే అవ్యాకృతం 83 అందుకే జ్ఞాన సామర్థ్యము, యెరుకకే యిచ్ఛాశక్తి క్రియాశక్తికద్దు, ప్రపంచములోయెరుక కన్న అధికమైనదిలేదు 84 జ్ఞానానికే సకలసామర్థ్యాలు గలవు దానిచేతనే వెర్రివాణ్ణిచేసె, గురుకృపచేతగాని ఆవెర్రితిరుగదు 85 సాందీపునివంటి గురువుకావలె కృష్ణస్వామినంటి శిష్యుడు దొరికితే ఆవెర్రి తిరుగుతుంది. 86 యెరుకకే త్రిపుటిఅనే సౌంజ్ఞ, సకలసంకల్పాలు యెరుకకే, గురుకృప చేత మూలమాయ సార్వకాలం లేకపోవును. యెరుకలోనే సర్వంతోచును. 87 అవస్థలకు మూలం యెరుకే, సర్వం జ్ఞప్తియనే మాయఅని దృఢం, సూర్యునియందు చీకటిలేనట్టు నిజమందు వొక్కటియనేది రెండుఅనేది యెన్నడూలేదు. 88 మరియేమివున్నదంటే అహంబ్రహ్మాస్మి అనే మూల మాయ క్షేత్రజ్ఞస్వరూపమనే మూలమాయగనుక యిరువైఆయిదో తత్వమనే ఆత్మ, యీ ఆత్మనే పరబ్రహ్మస్వరూపము అన్నారు. 89 అయమాత్మ బ్రహ్మ అనే శ్రుతివున్నది గనుక పంచవింశ ఆత్మాభవతి అనే శ్రుతి వుండనే వున్నది 90 యిరువైఆయిదోవాడు జీవుడున్ను, ఈశ్వరుడే జీవుడు జీవుడనే క్షేత్రజ్ఞుడే జీవాత్మ, జీవాత్మే అక్షరపరబ్రహ్మము 91 ఈ అక్షర పరబ్రహ్మమును యీశరీరమందు లేకుండా యెవ్వరుచేతురో వారే సాంఖ్యులు 92 యీశరీరమందు లేక అంతటా యెవ్వరున్నారో వారె అక్షర

పరబ్రహ్మముకంటె అతీతులు, వారికి పరబ్రహ్మము వున్నది అనే భ్రాంతి యెన్నడూ లేదు 93 యీశరీరమందువున్నది లేకవున్నారు గనుక సార్వ కాలం వొక్కతీరే, పుట్టాలేదు చావాలేదు వొక్కటైనా వికారం లేక సార్వ కాలం వొక్కతీరుగానే వున్నారు. 94 అది యేలా గంటె, వున్నది. దేహాకారం యెన్నటికికాదు, కనుక వున్నది వున్నట్టే వున్నది.

95 ఈశరీరం లేదుగనుక యీశరీరమందు యెన్నడు లేదు. స్వతః సిద్ధమైన పరిపూర్ణము యెందులో ప్రవేశిస్తుంది, యెక్కడికి పోవును, మరల యెక్కడికి వస్తుంది 96 గురువాక్యంచేత యీశరీరమందు వున్నదాన్ని సార్వకాలం లేకుండా చేసేది గనుక వొక్కటైనా భ్రాంతిలేకపోయె. యింత కంటె అధికంలేదు 97 యీగుర్తెరిగే మూలమాయ ఏలాగు వున్నదంటే సూర్యునియందు చీకటి వున్నదన్నట్టు వుండి వుక్కుస్తంభాన్ని పురుగు తొల్చినట్టు తొలుస్తూ నిప్పుకు చెదలు తగిలినట్టు పట్టివున్నది 98 ఇటువంటి దాన్ని లేకుండా చేతామని ప్రయత్నమే వున్నదానికి విఘ్నము. యేలాగైనా కాని గురువులేక నివారణముకాదు 99 అందుకే శ్రీ కృష్ణస్వామి సాందీపుని వద్దకి పోతె దృష్టాంతాలు చెప్పంగానే యీశరీరమందు లేక సర్వత్రా మరల వున్నవాడు అయ్యి కట్టెలమోపులు మోసినాడు. అలాగే బలరాముడు కుచేలుడు. వశిష్ఠాదులకంటె పెద్దలు బ్రాహ్మణులు 100 గనుకసదాచార సంపన్నులు గనుక వారికి తల్లి దండ్రిలేక దేవతాభ్రాంతిలేక అగ్రవర్ణ సంబంధములేక వున్నారు. గనుక కలవు.

101 దానిచేతనే వెఱ్రిచేసె, గురుకృపచేతగాని ఆవెఱ్రి తిరుగదు 102 కృష్ణస్వామి వారిని వివరిసైస్వామి అనుకున్నాడు గనుక సాందీపునికంటె యెవ్వరు అధికులు లేరు, స్వామి యేలాగు వున్నాడోఅలాగే కనుక్కున్నాడు.

103 ఇద్దరికి ప్రపంచంవున్నదని యెరుకలేదు, లేదని యెరుకలేదు, దాని స్పర్శలేదు 104యీశరీరమందు వున్నది లేక వున్నారు గనుక లేనిది లేక వున్నారు. ఆలాగే యెవ్వరికి సూచన అయితె వారల్లా అటువంటివారే 105 బావాభావ వివర్జితం అని వున్నది కనుక అందుకే యిరువై ఆరోవాడు యేలాగు వున్నాడో ఆలాగేవున్నాడు, సాక్షిణి మాయ సార్వ కాలం లేక వున్నవాడు. 106 వారికి యిరువై అయిదోవాడు సూర్యుని యందు చీకటి లేనట్టే. సార్వకాలం లేకవున్నారు. వారికి వుక్కుస్తంభాన్ని తొలిచేటందుకు పురుగుకు శక్యముకాదు, ఆలాగే యీమూలమాయ వారిని చలింపచేసేటందుకు శక్యముకాదు, నిప్పుకుచదలు బట్టెటందుకు యేలాగు శక్యముకాదో ఆలాగే వారిని చెడగొట్టేటందుకు శక్యముకాదు. 107 ఉన్నది వున్నట్టే వున్నది గనుక అది వ్యాపకము కాదు వ్యాప్యముగాదు. గనుక అదికారణము కాదు, కార్యముకాదు. గనుక యీశరీరమందు యెన్నటికి లేదు 108 ఆది మద్యాంతశూన్యం గనుక నిజభక్తులకు బంధమోక్షరహితము చేసును. నిజ వస్తువు నిత్యనిర్గుణ నిరాకారం జ్ఞానంలేదు గనుక వ్యవహారానికి మూలం లేకపోయెను. వ్యవహారంలేనిది నిజస్వరూపం. 109 మునిగినవాణ్ని తీసి బైటవెయ్యవలెను. మేలుకొన్నవాడు నిద్రబోయినవాణ్ని లేపవలెను. 110 గురువాక్యం చేత భ్రాంతిలేనివారికి, నిద్రలేదు, జాగ్రతలేదు స్వప్నంలేదు. బ్రహ్మానుభవములేదు. సార్వకాలము వొక్కతీరే, కనుక 111 శరీరమందు వున్నది లేకవున్నదిగనుక సార్వకాలం పరిణామ వికారములేక వున్నది దేహాహంకారము యెన్నటికికాదు, 112 ఈశరీరమందుసూర్యుని యందు చీకటి లేనట్టే జ్ఞానం యిందులేదు. అదిలేకుంటే శుద్ధసంజ్ఞ. మహాఅద్వైతమే శుద్ధం అనిపించుకుంటుంది 113 యీగుర్తెరిగే చైతన్యమేఅహంకారం ఇది లేకుంటే నిరహంకారం 114 యీశరీరమందున్నది లేదు గనుక దృష్టాంతం

లేదు. ఒక్కటిలేని ఒక్కటి గనుక ఉన్నది యెరుగదు, అందుకే ఎరుక తానుగాదు 115 ఆయెరుక సూర్యునియందు చీకటివున్నట్టున్నది. యెరుకే అంతఃకరణము గనుక 116 అభేదజ్ఞానం లేనిదె శుద్ధంయెరుకే లింగశరీరం యీదేహమువల్లను యెరుక పుట్టెను, సత్వాత్సంజాయతెజ్ఞానం అని వున్నది గనుక 117 గురుకృపచేత సూర్యునియందు చీకటి పోయినట్టు లేకపోవును. అటుతరువాత వొక్కటైనా వికారం లేకపోవును. అవస్థలకు మూలం యెన్నడులేదు 118 గురువాక్యం చేత సర్వాన్ని తీసుకపోయెనుగనుక యెరుకే స్వస్వరూప అనుసంధానం అదే మహాకారణదేహం 119 సర్వాన్ని గుర్తెరిగే యెరుకే తుర్యావస్థ, నేను యెరుకగాను, వికారంలేని దేహమందు లేనిది సర్వత్రావున్నది 120 ఉన్నదానికి అభిమానంలేదు, ఉన్నదానికి స్థానంలేదు ప్రమాణంలేదు, యీశరీరమందు వున్నదిలేదు గనుక గుణాలు లేనిదివున్నది. 121 యెరుకకంటే విశేషంలేదు వొక్కటైనా వాసనలేనిది పరమానందం 122 గురువాక్యంచాత వాసనాక్షయము ఆయెను. గురు వాక్యం ఇషువంటిది. ఉన్నదానికి వొక్కటైనా అవస్థలేదు. సుఖదుఃఖ రహితమాయెనుగనుక 123 ప్రత్యగాత్మ అనేయెరుకే అభిమాని. మహా మాయ అనేక్షేత్రజ్ఞస్వరూపము సూర్యునియందు చీకటిలేనట్టే యీశరీర మందు ఆత్మజ్ఞానము యెన్నడులేదో ఉన్నదానియందు బ్రహ్మ అనేమాట లేదు. 124 యెరుక యెప్పుడు లేకపోతె అప్పుడే నామరూపంలేక పోవును. యెరుకలేకుంటే జ్ఞానంలేదు. సర్వజ్ఞత్వంలేదు, కించజ్ఞత్వంలేదు, 125జ్ఞానం యెన్నడులేదుగనుక ఆదేఅది, నామంలేదు రూపంలేదు 126 యీ శరీర మందు వున్నది లేకవున్నది గనుక సార్వకాలం ఆదేవున్నది, మాట్లాడదు, చూడదు 127 త్రిపుటి యేలాగువుండీని వినుటయెన్నడు సంభవించదు. అందుకే యీశరీరమందువున్నది యెన్నడులేదు ఉన్నదానికి అర్థమాత్ర సౌజ్ఞ 128 ఉన్నది కారణంగాదు, గనుక కార్యాలకు మూలం యెన్నడు లేదు, గనుక 129 యెరుకతోటే నాదంపోయెను. చిత్తేనాదం, చిత్తేకళ,

చిత్తేబిందువు, వొక్కటిలేకుంటే అనే కాలు యెన్నడులేవు 130 యీశరీరమందు వున్నది లేకవుండటమే శుద్ధప్రసాదము. యెంగిలిఅన్నంయెన్నటికి కాదు, 131 ఉన్నది యెన్నడు తినదు గనుక ఒక్కటి లేకుంటే అనేకాలకు మూలం యెన్నడు లేదు 132 బింబంలేదు గనుక ప్రతిబింబం యెన్నడులేదు 133 యీశరీరమందువున్నదిలేకవున్నదిగనుక వవ్యహారంకించిత్తుసంభవించదు 134 నిరాకారనిరాభాసమైన దానికియేలాగుచెప్పనుశక్యంలేదు. గనుక యేమీ చెప్పగూడదు. 135సాధనములేదు భ్రమకుమూలంఅహంబ్రహ్మాస్మిఅనే జ్ఞప్తిరూపముగనుక యెన్ని చెప్పిన గురుసాంప్రదాయం లేక, వున్నట్టుపడదు 136ఉన్నదానియందుసూర్యునియందుచీకటిలేనట్టె పరబ్రహ్మస్వరూపం యెన్నడులేదు 137ఉన్నదానికివికారాలు లేవు గనుకపరబ్రహ్మస్వరూపంవంటిది యెన్నటికికాదు 138 భ్రాంతికి మూలం అదేకనుక గుణత్రయానకు మూలం యెన్నడులేదు. యీగుర్తెరిగే చైతన్యమునకు మాయాజ్ఞానమని వున్నది 139 యీగుర్తెరిగే శరీరంకంటే మునుపే నిజస్వరూపం తానే తానై స్వతస్సిద్ధమై వున్నది 140 ముఖ్యం అరుందతి వంటి నిరాలంబస్థూలం అరుంధతితోటే ప్రయోజనం వొడిశెను. 141 యీశరీరమందు వున్నది గుర్తెరిగే చైతన్యం విసర్జించితే నిరాలంబమే స్వతస్సిద్ధము 142 సాక్షిత్వం నిషిద్ధమని గుర్తెరిగేది, స్థూల అరుంధతి వంటిది గనుక దానికి ప్రయోజనము తీరెను. 143 ముఖ్య అరుంధతి దొరికెను గనుక యిదిజ్ఞాపకం వస్తే అదే చైతన్యము 144 అందుకే యీ గుర్తెరిగే చైతన్యం అనే పరబ్రహ్మం నీవు కావు. అదిలేకుంటే యేలాగు వున్నదో అదే నిజ స్వరూపమనే అచలం 145 అదిశుద్ధమని కీర్తివొక్కటైనా బాధలేదు గనుక శుద్ధం గుర్తెరిగే చైతన్యమని నమ్మకుమా ! యిది మహారహస్యం. యింతకంటే అధికంలేదు.

ఇతి శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే

సాందీపవాక్య పంచమ ప్రకరణము

సంపూర్ణం.

# అఖండానుభవ రహిత ప్రకరణము

శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగనసదృశం తత్వమస్యాదిలక్ష్యం
ఏకం నిత్యం విమల మచలం సర్వధీ సాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తన్నమామి॥

ద్వా అంటే యెటువంటివారికి తెలియవలె. ఆ ప్రకారం దానికి వున్నదని చెప్పరాదు. రెండవది మరి వొకటి. అహంకారం వున్నదని చెప్పరాదు.

అంతా తానులేని తానే నిశ్చయం

యీ దేహములో అహంకారం వున్నది-అహంకారంలేనిది వున్నది-గురువాక్యంలేక కుదరదు.

అహంకారం లేని స్వరూపం వున్నట్టు తోచును. గురువాక్యా నంతరం స్వతఃసిద్ధమేవ.

జ్ఞానభక్తి వైరాగ్యాలు అహంకారానికే-గురువాక్యానంతరం సాధనా సాధ్య పరామర్శరహితం శిరచ్ఛేదవత్-అహంకార రహితమేవ పుణ్యాపాప రహితం.

తానులేని తనకు యెవరు కర్త? సార్వకాలం తానులేని పిమ్మట తాను లేని తానే.

నేను యేమీలేదు-నీవు యేమీలేదు-కోటి యేమిచెప్పను? నేను నీవు లేని తరువాత యేది వున్నదో అది వుండజూచి అదే బయలని నిశ్చయించు

కొని అదే అంతా అని అభ్యాసం చేయవలె. చేస్తే అది అఖండానుభవ రహితం అగును.

ఏమి చేసినా అదే-యేమిచూచినా అదే-యేమీ మాట్లాడినా అదే-మాటి మాటికి అదే-విన్నా అదే-చెప్పినా అదే.

అది యెటువంటిదో అటువంటిదే అంతా-దానికి నామంలేదు. రూపం లేదు-అంతా తానే-తానే అంతా-తానులేని తాను-నిజస్వరూపం అంతా-తనకు పుట్టుకలేదు.వునికిలేదుయెప్పుడు యేకప్రకారంసర్వకాలం మౌనం-కర్తాభోక్తా తాను-తానులేని తాను తానులేనితనకు తానువుంటే యెరుకవున్నది -మరుపు వున్నది-నేనులేకుంటే రెండూ లేవు.

నేనులేనిది యెప్పుడు వున్నది-నేనువుంటే అది నేను కలిసి వున్నట్టు వుంచుంది-గనుక నేను అనే యెరుకే అహంకారం-అహంకారం లేనిదాని యందు అహంకారం కప్పినట్టు తోచినది. గనుక కప్పుతీస్తే పుట్టుక చావు లేనిదే వున్నది-అహంకారం తనను యెరుగును-దేహాది పదార్థాలను యెరుగును. అహంకారం లేనిదాన్ని యెరుగదు.

అహంకారమే జగత్తుకు వేదశాస్త్రాలకు బీజం. చిత్తనం జ్ఞాన స్వరూపం. అదే-కర్మస్వరూపం-అదే అహంకారము-లేనిదానికి జ్ఞాన కాండ యెందుకు ? కర్మకాండయెందుకు ? తానే నిర్మలం-తానే జ్ఞానాతీతం. తానే నిజబోధరూపం తానే అద్యంతరహితం. తాననేటివృత్తి నాశరహితం-తానే వృద్ధి క్షయ రహితం-తానుకొట్టదు-తాను కొట్టబడదు-తాను యేమిటిని కొట్టుఛాడు-తాను యేమిటిని చంపుఛాడు-సచ్చిదానందరహితుడు తాను అయివుంటే మంచిది.

ఇదిగాక తాను మరివొకడు కాడు-దేహముకాదు-తానేతాను తాను తాను అంటే యెరుక-తాననుట యెరుకకాదా-సుషుప్తియందు-వున్నదే అని

సంశయ పడితే రెండోది యేమీ లేనిది-యెరుకే అన్నది-హీనవికారమైన యెరుక యేమీ యెరుగక ఉండును. అది ఉన్నదా లేదా యేది సత్యం.

ఆచార్యప్రసాదం గలవారికి వున్నది, లేనిది, యెరుక-ప్రసాదమంటే ఉన్నపని భ్రమతోచీని, ప్రసాదమంటే అనుగ్రహము.

శ్లో॥ ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే ।
ప్రసన్నచేతసోహ్యాసు బుద్ధిః పర్యవతిష్ఠతి॥

అని వున్నది గనుక సార్వకాలం వొకప్రకారం వుండును గనుక నేను పోతె అంతాపోయె, నేనువుంటే అంతా వున్నది, నేను లేకుండ చెప్పిన వారు గురువులు.

జ్ఞానభక్తి వైరాగ్యాలు లేవు. యెవరు గురువులు, వినేవారు యెవరు చెప్పేవారు యెవరు, భ్రాంతికి మూలం యెవ్వరు? భ్రాంతికి మూలం నేను, నా దేహంనా మనసు నా చిత్తం నా చీరె నా రవికె నా ముంత నా చెంబు నేనువేరే దేహంవేరే, నేను దేహమును గుర్తెరుగుదును, దేహమునన్ను గుర్తెరుగదు, నన్ను నేను యెరుగ, దేహాదిపదార్థాలను యెరుగుదు, సర్వం నేను లేకుంటె సుఖములేదు దుఃఖంలేదు. యింతకంటె దొడ్డదిలేదు, యిటు వంటి వారు దొరికేది బహుదుర్లభము.

బహుమార్లు నేనులేదు, తానే అంతా, వ్యవహారములేదు, నేనే అంతా, అని వెరువకచేస్తే తప్పు.

సర్వకాలం యెరుకకు వెరచి పరిపూర్ణమును అవలంబించితేచాలు, వొక్కటే వ్యవహారము, అంతా తాన్నే, తానే అంతా, ౧౦౦ అంతా తానే అని దేహపతన పర్యంతం యీలాగు యుక్తివుంటే వ్యవహారానకు పనిలేదు **యిది సిద్ధాంతం, యిదే సత్యం,** యిదే మహా రహస్యం, మహాగూఢం, **యేమీలేదు.**

మళ్ళా నేనువుంటే జ్ఞానం వున్నది, అజ్ఞానం వున్నది, అహంఅంటే అహంకారం, అహంకారము అంటే అహం, నేను అనేది దేహములో వున్నది, దేహములో నేను నిజమైతే అంతా నిబద్ధే, నేను లేకుంటే అంతా ఏమీలేదు, నేను వొకకాలమందు వుండేది వొక కాలమందు లేకపొయ్యేది, అహంకారానకు స్వభావం నేను గనుక లేకవుంటే లేనిమనస్సు లేనేలేదు, లేనిమాయ లేనేలేదు, గనుక లేనిమనస్సు లేకవుంటే వారు పుణ్యపాప రహితులు, జన్మమరణరహితులు, నిష్టానేమ పర్యవసాన పరిసమాప్తి॥

శ్రుతి॥ చిదః । ఇత్యుపదేశం । చిత్తమితి । కాఉపదేశః । ఏవంస్థూల అరుంధతి । దర్శసద్వారా ముఖ్యఅరుంధతి । దర్శనవత్ । చిత్వా । ఇత్యుప దేశః । జీవత్వం చైతన్యం బ్రహ్మక్షేత్రజ్ఞ లక్షణాఖ్యం । పరప్రకృతిత్వాత్ । చైతన్యదర్శనమేవ । స్థూల అరుంధతి దర్శన బ్రహ్మదర్శనమేవ । ముఖ్యఅరుంధతిదర్శనం శఖ్యత్వాత్ రూప రహితమేవ । సూక్ష్మత్మనామ దర్శనంచ ఛిద్రహితత్వాత్ చిదేహ తత్వయితి । బోధేనాఖిలా బొధామూర్ఖానాం ఉపదేశార్థం విధీయతే॥

శ్లో॥ కర్మశాస్త్రికులో జ్ఞానం తార్కేనైవాస్తెనిశ్చయః
సాంఖ్యయోగేభిషాపన్నః శాబ్దికాశ తతత్పరః॥
ఏకం ఏవో వేదాంతజ్ఞాన స్వానుభూతి విరాజితే॥

ఇతి శ్రీమద్గురు శివరామదీక్షిత ప్రభావే, వేదాంతవిచారణే,
అఖండానుభవరహితం ఆరవ ప్రకరణము

సంపూర్ణం.

శ్రీ సద్గురుచరణారవిందార్పణమస్తు.



## శ్రీమద్భాగవత కృష్ణదేశికులచే వ్రాయబడిన సకలవేదాంతసారగ్రంథోక్త

### అచలవాక్యములు

1 బయలనగా పరమార్థము 2 పరబ్రహ్మము 3 పరిపూర్ణము 4 అధిష్టానాతీతము 5 అధోర్ధరహితము 6 నిశ్శబ్దము 7 సగుణనిర్గుణరహితము 8 తేజోంధకారరహితము 9 సర్వగతము 10 పూర్ణము 11 శుద్ధము 12 నిర్వికారము 13 నిరంజనము 14 నిరవయవము 15 నిర్మలము 16 నిత్యము 17 నిర్విషయము 18 నిరుపాధికము 19 సన్మయచిన్మయ ఆనందమయ రహితము 20 సర్వభూతాబహిరంతర అనావృతము 21 అసిపదాతీతము 22 లయవిక్షేపమునుఅంటని స్థానమేనిరాలంబము 23 ఆనిరాలంబమే బయలు

### చలవాక్యములు

1 అవస్థాత్రయమనగా లయవిక్షేపకషాయములు 2 లయవిక్షేపమే అవిద్యోపాధికమైన ఘటము 3 ఘటమే శరీరము 4 శరీరమనే ఘటములో బహిరంతర అనావృతమై వ్యాపించియున్నదే పరమాకాశము 5 ఈ ఘటాభావదృష్టే నిర్లక్ష్యము 6 ఈ ఘటములో వ్యాపించిన అకాశమునకే ఘటాకాశ మని దహరాకాశ మని హృదయాకాశమని చెప్పబడును.

### సకలమనగా

7 లయవిక్షేపము 8 తనుత్రయము 9 అవస్థాత్రయము 10 దృశ్యము 11 అసత్తు 12 సాకారము 13 భావము 14 సర్వవిష యము 15 వ్యక్తావ్యక్తము 16 లక్ష్యము 17 శబలము 18 స్థావరజంగమాత్మకమైన ప్రపంచము 19 చరాచరము 20 వృత్తి; క్రియ 21 క్షరం 22 కర్మము 23 భేదము; దేహము 24 అనాత్మ 25 విజాతీయము 26 కార్యము 27 విషయము 28 ఘటము 29 క్షేత్రము 30 సవికారము 31 ఆభాసా 32 ప్రత్యగాత్మ 33 సకల

దృశ్యనిలక్షణమై నటువంటి చూపే ప్రత్యగాత్మ 34 విలక్షణము 35 జాగ్రచ్ఛుతు 36 నిర్లక్ష్యము 37 జ్ఞప్తి 38 యెరుక 39 తెలివి 40 దృష్ట 41 దేహి 42 పురుషుడు 43 ఆత్మా 44 స్మృతి 45 జ్ఞానం 46 వెలుగు 47 ప్రకాశము 48 జ్యోతి 49 శుద్ధజీవుడు 50 సూత్రాత్మ 51 సర్వసాక్షి 52 సర్వాధారుడు 53 నిరాకారుడు 54 నిర్విషయుడు 55 నిర్వికారుడు 56 నిర్వికల్పుడు 57 పరుడు 58 అంతరాత్మ 59 అక్షరుడు 60 అసంగుడు 61 అభావుడు 62 ప్రత్యక్చైతన్యము

63 ప్రత్యగాత్మయయిన తానుపరమాత్మయైన తనను చూడవలశినది

64 ప్రజ్ఞానమందు ప్రజ్ఞానస్ఫురణయే అవకాశము

65 తన్నుతాను యెరిగేటందుకు యెరుకే కారణమైనది

66 తనను తాను మరిచేటందుకు యెరుకే కారణమైనది.

67 యీ యెరుక మరుపు లే సదసత్తులు

68 భావా భావములు 69 పట్టువిడుపులు 70 క్షరాక్షరములు 71 ప్రకృతిపురుషులు 72 సాకారనిరాకారములు

73 యెరుక మరుపుల రెంటికి చిత్ప్రకృతి అనే చిత్కారణమే అవకాశమైనది 74 చిత్ప్రకృతి అనగా అధిష్ఠానమందు అధిష్ఠానస్ఫురణయే.

75 చిత్ప్రకృతే పరావిజ్ఞాన శక్తిరూపమై త్రిగుణాత్మికమైన మహామాయ.

76 యెరుక అనగా చిత్తమె 77 ప్రకృతిపురుషులు చిత్తమె 78 యెరుక మరుపులు రెండూ చిత్తమేనని వశిష్ఠులు శ్రీరాములకు చెప్పినాడు.

79 పశ్యంతిజ్ఞానచక్షుషా అని వున్నది

80 చిదాదిత్యే చిత్కారణస్ఫురణే సదసత్తులకు అవకాశము

81 ఆదిత్యకిరణస్ఫురణ మృగజలాభావాభావములకు అవకాశమైనది

82 ఈ చర్మచక్షుశ్రోత్రాలకు పరమార్థగమ్యం గాదని శ్రుతులు చెప్పుచున్నవి.

83 జ్ఞానచక్షు అనగా యేదో తెలుపవలసినది

84 సకల లక్ష్యములు సకలయోగములు సకల తపస్సులు సకల మంత్రానుష్ఠానము సకలవేదాంత శ్రవణములు యివి అన్నియు పరంపరా మోక్షసాధనములుగాని సాక్షాత్సాధన కాదు

85 సద్గురుడు సకల లక్ష్యములకు అలక్ష్యమానమైన నిర్లక్ష్యము అనుగ్రహము చేయును

86 దీన చిత్తవిక్షేపలయ కషాయాలు పరిత్యాగమైనిరావరణమైన వస్తు సాక్షాత్కారమౌను

ఈ అనుభవమందు సకల యోగసాధనలు నిలిచెను

87 విక్షేపరహితమాయెను గనుక మాతృకా స్వరూపమైన మంత్రోచ్చారణకు మనోకల్పన లేకపోయెను.

88 సంకల్పరహితమె మోక్షము.

89 అక్షరోపాసనవలన మోక్షము గలుగును నిర్గుణసాయుజ్యముక్తి దొరుకును.

90 అక్షర పురుషుడే మోక్షమును పొందును.

91 యేది సద్గురుడు చెప్పునో దానియందు సంశయములు లేక నమ్మిక గలిగి చేసితే అదేముక్తి నిచ్చును,

92 సంశయమే బంధము

93 ఆత్మ విషయుడైనను విషయదృష్టికి విషయుడు కాడు అవిషయ దృష్టికి విషయుడగును.

94 శ్రుతులు విషయమేగనుక శ్రుతులకు కనుపడువాడుకాడు.

95 శ్రుతులు పలికి పలికి యెప్పుడు మౌనము అయినవో అప్పుడు వస్తు సాక్షాత్కారమగును అదే నిశ్శబ్దము

96 అవిషయదృష్టికి ఆత్మ విషయుడయ్యే వున్నాడు.

97 అవిషయదృష్టి నిరుపాధిక చూపు

98 అవిషయదృష్టికైతే ఆత్మ విషయుడె.

99 వినేది విషయమె, చూచేది విషయమె, పలికేది విషయమె, తలంచబడునది విషయమె.

100 ఆత్మ వినేవాడు కాడు, పలికేవాడు చూచువాడుకాడు.

101 ఆత్మ వినకనే వినేవాడు, చూడకనే చూచేవాడు, పలుకకనే పలికేవాడు, తలచకనే తలిచేవాడు, విని విననివాడు, అంటి అంటనివాడు.

102 ప్రత్యక్చైతన్య పర్యంతం ఉపాధిని చూచుచున్నది, అంత పర్యంతము తానైన పరమాత్మను చూడదు, ఉపాధిని వదలిన చూపే పరమాత్మను చూచును.

103 ఉభయానకు ప్రజ్ఞానమందు, ప్రజ్ఞాన స్ఫురణయే అవకాశము' యిదే అర్ధమాతృకయని చెప్పబడును,

104 ఉపాదే అన్యము, ఉపాధ్య భావమె అనన్యము.

105 సకల దృశ్యమునుచూచే చూపునిలుపుటయే అమ్ముదొడగుట స్వరూపదృష్టియందు, విస్మృతి గాకుండుటయే గురుజూచుట, గతాయాత విరహితమై యెడతెగని చూపే గురిదగులవేయుట, యిది స్వానుభవ విద్య

106 యిటువంటి అనుభవము గల పురుషుడే, అనన్యభజనపరాయణు డనబడును, లయ విక్షేప నిరసన పూర్వకముగా చేయబడినదియె అనన్య భజన యనబడును, దీనినే అనన్యభజన అనన్యస్మరణ అనన్యధ్యానము, అనన్య శరణు అనన్య యోగము అని చెప్పబడును.

107 జ్ఞానము వైరాగ్యము యోగము యీ మూడు లయవిక్షేప నిరసన కాలమందే సంభవించును.

108నిరుపాధిక దృష్టిచేత చేయబడిన కర్మ బ్రహ్మకర్మయనంబడును కర్మదృష్టి లేదుగనుక కర్మమనబడదు.

109 యీ పురుషుడు సంకల్పత్యాగుడు గనుక చేసినా చేయనివాడె చేయకున్నను చేసినవాడె యగును.

110 సర్వకర్మ పరిత్యాగమె స్వభావము.

111 దేహాభిమాన సంగదృష్టి నిరసనమైనది గనుక విధి నిషేధ దృష్టిలేదు, గనుక శుభాశుభకర్మ పరిత్యాగమనబడును.

112 మాయా విద్యోపాధి ద్వయము నిరసనమైనది గనుక సర్వజ్ఞత్వ కించిజ్ఞత్వ ధర్మకర్మలన్నియు పరిత్యజింపబడుచున్నవి.

113 నిద్ర అనగా స్వరూపమందు స్మృతిదప్పుట. యిదే అజ్ఞానము, యిదే నిద్ర, విస్మృతి, మరుపు, లయము, అవధానము, సుషుప్తి కారణము, తమస్సు, మాయ, ప్రకృతి, అవ్యక్తము, ఉపరమము, సామమము, చిత్తము చీకటి, మనస్సు, ఆవరణము, స్మారకము తప్పుట, పరమము, మృత్యువు.

114 జాగ్రత్త స్వప్నముల ప్రవర్తన దుఃఖరూపము ఆదుఃఖ నివర్తి కాలమే నిద్రయనబడును.

115 సకల ప్రపంచం సుషుప్తిలో మరుపుచేత లీనమైనది గనుకతిర్గి పునః అవ్యక్త మహదహంకారమైన కల్పన స్ఫురించును.

116 మనసు మొదలయిన సకలేంద్రియములు జాగ్రత స్వప్న వ్యాపారములయందు అలసి దుఃఖనివృత్తి కొరకు సుషుప్తియందు లయమగును,

117 ప్రాజ్ఞులకు తన్మయత్వ మందిరమే యోగనిద్ర, సకల ప్రపంచము వారియందు యెరుకచేత లీనమైనది గనుక తన్మయత్వమనిపించును. దీనిపేరే ఉన్మన్యవస్థ, అమనస్కము, నిర్వాణము, పరమపదము, తన్మయత్వము యోగనిద్రయనబడును.

118 యెరుకచేతనెగాని మరపుచేతనెగాని సుషుప్తి సమయమందు ప్రపంచోపరమము కన్నాము. అదే బ్రహ్మానందమని యనిపించుచున్న దంటివా.

119"అవ్యక్తాద్వ్యక్తయః సర్వాః ప్రభవంత్యహరాగమే" యనివున్నది యిదిగాక "రాగత్యాగ ప్రలీయంతె తత్రైవావ్యక్తసంజ్ఞకే" యని వున్నది గనుక సుషుప్తిని బ్రహ్మానందసుఖమని యనగూడదు.

120 సకలప్రాణుల జాగరాది ప్రపంచము వ్యక్తమనబడును. ఈ వ్యక్త ప్రపంచము సుషుప్తియనే అవ్యక్తమునందు ఉదయించుచు లీనమవు చున్నది గనుక యిది దినప్రళయ మనబడును.

121 "అవ్యక్తాదీనిభూతాని" అని వున్నది.

122 దేహాంతమందును ప్రపంచోపసంహారము కాదు. "వాసాంసి జీర్ణాని యధా విహాయ" అని వున్నది,

123 దేహాభిమానసంగుడయిన దేహి యీ యింటిలోని పురుషుడు ఆయింటిలోనికి పోయినట్లు పాతవస్త్రము విడచి కొత్తవస్త్రమును ధరించినట్లు నూతనశరీరమును ధరించును. అది యెట్లనగా స్థూల శరీరము మాత్రము భంగమైనదిగాని అనాదికాలవాసనామయమయిన లింగశరీరము భంగము కాదు. ప్రాణిచేసిన కర్మమె ప్రాణోత్క్రమణకాలమందు యాతనాశరీర గతమై సంసారద్వారా లోకాలోకములకు పోయి అక్కడి సుఖదుఃఖములను అనుభవించి క్రమముగా పంచభూతగతమై ఓషధులయి అన్నమై శుక్లశోణిత రూపమై గర్భమందు స్థూలశరీరాకారముగా యోనిద్వారా బయటికివెళ్ళు చున్నాతు.

124 స్థూలశరీరము సూక్ష్మశరీరమును విడిచియుండదు

125 బ్రహ్మదేవుని దినప్రళయమందయినను ప్రపంచోపసంహారము కాదాఅంటె, కాదు, ఎట్లనగా

126 మనుష్యులవలెనే బ్రహ్మకు దినప్రళయము గలదు, అదే అతని సుషుప్తి (ధాతా యధా పూర్వమకల్పయత్) అని వున్నది. యివియే నాలుగు

ప్రళయములు, లింగశరీరాభిమాని బ్రహ్మ, స్థూల శరీరాభిమాని జీవుడు.

127 మాయచే లింగశరీరము, యెరుక. అవిద్యయే స్థూలశరీరము మరుపు.

128 అయిదవ ప్రళయమే ఆత్యంతిక ప్రళయము, వివేకప్రళయము, యీ ప్రళయము సద్గురు కరుణవడసినవారికే దీనియందే నాల్గు ప్రళయములు సంహారమగును, ఆత్యంతిక ప్రళయమే మహాకారణ శరీరము, యిదే మోక్షసాధనము. మహాప్రళయమే నిజమోక్షము. దీనియందే పంచవిధ ప్రళయములు ప్రళయ మవును

129 త్రిపుటి సహితమయిన ప్రపంచ నిరసనము శ్రీ సద్గురువుల వారి కటాక్షము వినా కలుగదు

130 సహజానందసుఖ విశ్రాంతియందు చిత్తము నిమగ్నమగుటయే తన్మయత్వసిద్ధి. ఈ తన్మయత్వసిద్ధివలన ప్రాణికి సంసార దుఃఖతాపనివారణ మగుచున్నది

131 తన్మయత్వ పురుషుడే చిన్మయ ప్రకృతియుక్తపురుషుడు, ఇతడే సర్వజ్ఞుడు. ఇతడే మాయోపాధికుడు,అనన్యప్రేమ రసముచేత చేయబడిన సగుణోపాసన పురుషుడు.

132 సవికల్పమే సంప్రజ్ఞాత సమాది యనబడును, యిదే సగుణసాయుజ్యముక్తి, యిదే అన్వయనిష్ఠ.

133 చిత్ప్రకృతి విలీనమే సులీనావస్థ, యిదేనిర్వికల్పసమాధి, యిదే సులీనా భూమిక, యిదే సహజామనస్కము, కేవలమనోవిలీనదశ, యిదే జీవన్ముక్తి.

134 సవికల్ప సమాధి సంశ్లిష్ట భూమిక.

135 నిర్వికల్ప సమాధి సులీనభూమిక.

136 1) అన్వయమే సవికల్పము 2) వ్యతిరేకమే నిర్వికల్పము 3) శబ్దమే చిత్ప్రకృతి 4) నిశ్శబ్దమే అధిష్ఠానము 5) శబ్దమే సవికల్పము

6) నిశ్శబ్దమే నిర్వికల్పము 7) నిశ్శబ్దమేశబ్దము 8) శబ్దమే నిశ్శబ్దము 9) నిర్వికల్పమే సవికల్పము. సవికల్పమే నిర్వికల్పము 10) సత్పదమే చిత్పదము 11) చిత్పదమేసత్పదము 12) నిర్గుణమేసగుణము 13) సగుణమే నిర్గుణము 14) నిరాకారమే సాకారము 15) సాకాకారమే నిరాకారము.

137 పూర్ణానుభవమందు యిప్పుడు చెప్పిన ప్రకారము అభేదమై అఖండమై యుండును. ఇదే అఖండైకరస మని స్వానుభవ మందు ప్రసిద్ధి

138 లెస్సగా నిద్రపోయిన పురుషుని ఉపజనులు ప్రతిధ్వనులుచేసి లేపితే మేలుకొన్నాడు. ప్రబోధ చేయకపోతే లేవకపోవును. యిది నిర్వికల్పసమాధికి దృష్టాంతము. సర్వదా సులీనచిత్తుని శరీరము పరాధీనమని చెప్పబడును.

139 నిద్రబోయిన పురుషుడు నిద్ర తృప్తినిబొంది తనంతట తానే లేచినాడు. యిది సవికల్పసమాధికి దృష్టాంతము

140 నిద్రలేనిదే తన్మయత్వసిద్ధి, యిదియే యోగనిద్ర

141 నిర్నిద్ర యనగా సుషుప్తివంటి నిద్రలేనిదే. తన్మయత్వసిద్ధి యిది చిత్ప్రకృతినిష్ఠగనుక చిత్ప్రకృతి విలీనమే సులీనదశ, సులీనత్వసిద్ధియే నిర్నిద్ర యనబడుచున్నది.

142 నిద్రవచ్చేటందుకు తెలివిని బొందేటందుకు యేమి కారణమో అనగా.

నిద్ర వచ్చేటందుకు ఆత్మస్వరూపమందు విస్మృతీ యగుటయే అజ్ఞానము. ఆయజ్ఞానమే మరుపు. మరుపే నిద్రవచ్చేటందుకు కారణము, దుఃఖరూపమైన జాగరాది సర్వ ప్రపంచముయొక్క ఉపరమకాలమే నిద్ర వచ్చేటందుకు హేతువు, నిద్రవచ్చేటందుకు నిద్రయే హేతువు, తెలివిని పొందేటందుకు నిద్రయొక్క స్ఫురణయె తెలివి గనుక తెలివిని బొందే

టందుకు నిద్రయే హేతువు, సుషుప్తియొక్క స్ఫురణయే విక్షేపము గనుక ఆవిక్షేపమే మేలుక, మేలుకయే తెలివి.

143 విక్షేపము, తలంపు, సంకల్పము, ఊహాపోహ, జాగ్రత స్వప్నములు, వృత్తి యివి యన్నియు విక్షేపశక్తియొక్క పర్యాయనామములు.

144 తెలివి నొందేటందుకు నిద్రయే కారణమనబడుచున్నది.

145 నిద్రకు కారణము యేమనగా నిద్రను యెరిగే యెరుకే కారణము, మరియొక కారణములేదు.

146 దేహాదిసర్వవిలక్షణమైన ప్రజ్ఞానమందు ప్రజ్ఞాన స్ఫురణయే నిద్రకు కారణమని చెప్పబడును.

147 తన్ను తాను యెరుగనిదే మరుపు, ఆమరుపే నిద్ర, మరుపుతోచేటందుకు యెరుకే కారణమయినది.

148 అధిష్ఠానమందు అధిష్ఠానస్ఫురణయే కారణమయినది.

149 సూర్యునియొక్క కిరణమే మృగజలాభాస తోచేటందుకు కారణము. కిరణదృష్టివ్యతిరిక్తముగా మృగజలాభాస తోచదు. మృగజలము నివర్తించేటందుకు కిరణమే హేతువైనది కిరణదృష్టి మినహా మృగజలాభాస నివర్తించదు.

150 అటువలెనే చిదాదిత్య చిత్కిరణదృష్టి మినహా మృగజలాభాస ప్రతీయమాన మైనటువంటి ప్రపంచాభాస నివర్తించదు.

151 ఈ అనుభవము సర్వకాలము సమాధి నిష్ఠగల పురుషునికి గమ్యమానమేగాని మిగిలినవారు యీ శ్రవణము విన్నప్పటికిని అనుభవము లేనివారు గనుక మనస్సున పట్టదు. అట్లుచూచిన నిద్రకు యెరుకే హేతువు.

152 సాంఖ్యమనగా దేహిదేహములయొక్క యితరేతర విభాగదర్శన సిద్ధిపొందబడినటువంటి సారాసార విచార వివేకజ్ఞాన దృష్టియే సాంఖ్యము.

153 బాహ్యాంతర గుణకర్మ ధర్మత్యాగమే సాంఖ్యము

154 కేవల జ్ఞాననిష్ఠయే సాంఖ్యము

155 దేహాది సర్వవిషయత్యాగతయా కేవల ప్రజ్ఞానమందు ప్రజ్ఞాన దృష్ట్యాస్థిరభూతమే సాంఖ్యము. యిదే జ్ఞానయోగము.

156 సంగఫలత్యాగశీలతయా చేయబడినటువంటి స్వభావనియత కర్మాచరణసిద్ధియే యోగము.

157 సంగమే స్థూలశరీరము, ఫలమే సూక్ష్మశరీరము, యీ రెంటికి కారణము విక్షేపము.

158 విక్షేపమే సంకల్పము. సంకల్పమే సంగఫలము. వీటియొక్క త్యాగమే సంగఫలత్యాగము.

159 తద్వారా చేయబడినటువంటి స్వభావ కర్మాచరణసిద్ధియే యోగము.

160 సాంఖ్యము వినా యోగప్రాప్తి లేదు. యోగము వినా సంగఫల త్యాగము సంభవించదు. ఎట్లనగా బాహ్యాంతరగుణకర్మ త్యాగమే పర మార్థసన్యాసముగనుక పరమార్థసన్యాససిద్ధి జ్ఞాననిష్ఠ సాంఖ్యముగనుక బాహ్యాంతర గుణకర్మత్యాగము వినా సంగ ఫలత్యాగము సంభవించదు.

161 యోగత్యాగులకు పరమార్థదర్శనసిద్ధియే ఫలము.

162 కర్మఫలత్యాగమే శరీరద్వయనిరసనము. శరీరద్వయనిర సనమే సర్వగుణ సంగ ఫలత్యాగము.

163 యోగమనినను త్యాగమనినను రెండు ఒక్కటే.

164 సాంఖ్యమే ఆరూఢదశాసిద్ధి, యోగమే ఆరురుక్షత్వము.

165 కేవలమనోవిలీనమే ఆరూఢదశాసిద్ధి, వ్యతిరేకమేసాంఖ్యము.

166 దేహాది సర్వవిషయప్రేమతోచకూడనిదేఅనన్యప్రేమ.

167 ప్రత్యేక ప్రత్యేక యోగజ్ఞాన వైరాగ్యముల నుంచి వర్తమాన జన్మమందు మోక్షములేదు, పరంపరా గలుగ గలదు.

168 శాస్త్రజన్యజ్ఞానము ప్రమాణముగాని ప్రత్యక్షముగాదు.

ఇతి శ్రీమద్భాగవతకృష్ణదేశికేంద్ర ప్రభావే
వేదాంత విచారణే సకలవేదాంతసార
గ్రంథోక్త అచల వాక్యః సమాప్తాః.



ముద్రణ : కొండా శంకరయ్య గారి ప్రీమియర్ ప్రెస్
4-4-65 గంజ్ బజార్, సికింద్రాబాద్-500 003.

ఓం

శ్రీసద్గురవేనమః

శ్రీ మద్రామడ్గు శివరామ దీక్షితులవారిచే

రచియింపబడిన

# శ్రీ శివరామ దీక్షితీయము

## (బృహద్వాశిష్ఠము)

## అచలబోధసిద్ధాంతం - ద్వాదశిబావం



శరీర రహిత ప్రకరణం

రెండవ భాగం

సచ్చిదానంద వెంకటేశ్వర స్వామివారిచే

పరిచ్ఛేదములుగా విభజింపబడి

అచలర్షి శ్రీ దయానంద పొన్నాల రాజయోగిగారిచే

ముద్రింపబడియె

నాల్గవ కూర్పు ౧౦౦౦ ప్రతులు

ప్రీమియర్ ప్రెస్ యందు ముద్రింపబడియె, సికింద్రాబాదు.

 1990 వెల రూ. 8-00

ఓం

శ్రీసద్గురవేనమః

# శ్రీ శివరామ దీక్షితీయము

## (బృహద్వాశిష్ఠము)

## అచలబోధసిద్ధాంతం - ద్వాదశిబావం

రెండవ భాగం

శ రీ ర ర హి త ప్ర క ర ణ ం

అనది

శ్రీ మద్బృహద్వాసిష్ఠ చలబోధ సిద్ధాంతులగు

**శ్రీ మద్రామడ్గు శివరామ దీక్షితులవారిచే**

రచియింపబడి

సచ్చిదానంద వెంకటేశ్వర స్వామిగారిచే

పరిచ్ఛేదములుగా విభజింపబడి

అచలర్షి శ్రీ దయానంద హొన్నాల రాజయోగిగారిచే

ముద్రింపబడియె

నాల్గవ కూర్పు ౧౦౦౦ ప్రతులు

 1990 వెల రూ. 8-00

# అచల పరిపూర్ణబోధ సిద్ధాంత గురుపీఠం

## సాంప్రదాయక గ్రంథముల వివరములు

| | |
|---|---|
| అచల పరిపూర్ణ రాజయోగీయము నిజ ప్రబోధా విధానము | 15 00 |
| రాజయోగి స్మృతి చంద్రిక | 2-00 |
| రాజయోగీయ పరిపూర్ణ రాజయోగములు | 3 00 |
| రాజయోగి విజయము అను సద్గురు చారిత్రము | 5-00 |
| రాజయోగీశ్వర సుప్రభాతము | 2 00 |
| రాజయోగీశ్వర అష్టకములు | 2-00 |
| రాజయోగి రత్నమాల | 3-00 |
| అభినవ దీక్షితీయము ఉపాసనాకాండ | 3-00 |
| శుద్ధనిర్గుణతత్వ వ్యాఖ్యానసహితము కందార్థదర్పణలు కందపద్యములు | 20 00 |
| సుజ్ఞాన దీపమును గురుగీత తాత్పర్యసహితము | 8-00 |
| భూమానంద వాఙ్మయము | 5-00 |
| భద్రాద్రి రామశతము విశేషార్థ సహితము | 7-00 |
| పరిపూర్ణబోధ సిద్ధాంత బుర్రకథ | 3-00 |
| శ్రీ శివరామ దీక్షిత గురుపీఠ అనుష్ఠాన విధి | 4-00 |
| తారకామృత పరమహంస ప్రబోధిని | 4-00 |
| బ్రహ్మాండ పంచీకరణ పటము | 2 00 |
| అస్పర్శయోగము శ్రీమద్భగవద్గీత 18 అ | 15-00 |
| అనన్యాచల పరిపూర్ణ ప్రబోధిని | 5 00 |
| సాంప్రదాయక పరిపూర్ణ ప్రబోధిని | 5 00 |
| పరిపూర్ణ రాజవిద్యారాజ గుహ్యా శిఖామణి | 5-00 |
| పరిపూర్ణ రాజయోగ తత్వప్రకాశిక | 5 00 |
| సద్గురు వ్రతకల్పము | 5-00 |
| తత్వ ప్రకాశిక | 3-00 |
| పరిపూర్ణ తత్వసుధ | 5-00 |
| శ్రీ శివరామదీక్షితీయము చలాచలవాక్యములు ప్రథమభాగము | 5-00 |
| శ్రీ శివరామ దీక్షితీయము షోడశభావము మూడవ భాగము | 12-00 |
| శ్రీ శివరామదీక్షితీయము ద్వాదశభావము 2వ భాగము | 8-00 |

: ఈ గ్రంథములు దొరకువారు :

## పొన్నాల అనసూయాంబగారు

నెం. 4-1-96 రాజయోగాశ్రమం సికింద్రాబాదు, ఆం. ప్ర. అని వ్రాయవలయును

శ్రీ గురుభ్యోనమః

# అవతారిక

శ్రీ మద్వేద వేదాంత వేత్తలును. ఆత్మైక్య శరీరరహితులును, జనన మరణభ్రాంతి రహిత రాజమార్గ బృహద్వాశిష్ట సిద్ధాంత నిర్ధారణులును శ్రీమదచల పరిపూర్ణబోధ ప్రతిష్ఠాపనాచార్యులునగు శ్రీమద్రామద్గు శ్రీశివ రామ దీక్షితాచల పరిపూర్ణస్వామివారు నైజాంయిలోక నల్లగొండ తాలూకాలో చేరిన నారాయణపురంబను గ్రామంబులో నివసించుచు తమ నిజగురువులగు శ్రీ శ్రీధరస్వామివారు, ఆనితిచ్చిన అఖండజ్ఞాన పూర్ణభావమును సకలభక్త శ్రేణులకు బహుదూరార్థము హస్తామలక మగునటుల నాంధ్రపదములతో

1. శ్రీశివరామదీక్షితీయమను చలాచలవాక్యములు మొదటి భాగముగాను.
2. శ్రీ శివరామదీక్షితీయము ద్వాదశిభావము ద్వాదశ ప్రకరణములు రెండవ భాగముగాను.
3. శ్రీ శివరామ దీక్షితీయము బృహద్వాశిష్టము షోడశిభావం స్వప్న దృష్టాంతములు షోడశ ప్రకరణములు మూడవభాగముగాను.
4. శ్రీ శివరామ దీక్షితీయము అచలబోధ ద్రాష్టాంతము, పంచదశ ప్రకరణములు నాల్గవ భాగముగాను, రచియించిన యీ పురాతన గ్రంధము.

శ్రీ సచ్చిదానంద వెంకటేశ్వరఅవధుత స్వాములవారిచే సంపాదింపబడి ముముక్షువులకు సులభోపాయముగ తెలియునటుల శ్రీఅవదూత స్వాములవారిచే పరిచ్ఛేదములుగా విభజింపబడి అచలర్షి దయానంద పొన్నాల రాజయోగిగారు ముద్రింపించి ప్రకటింపచేసిరి.

అచల పరిపూర్ణ ప్రబోదవలన జననమరణ భ్రాంతిరహితము పొందగోరువారు సాంప్రదాయక పీఠమునుండిపీఠాధికారిచే ప్రచురింపబడిన గ్రంధ రాజములనే చదువవలయును, యెందుకనగా కొందరు నిజసాంప్రదాయక ఆచరణ విధానములు మార్చి తమతమకనుకూలమగు ఆచరణ విధానములు గ్రంధములయందు చేర్చి నిజసాంప్రదాయకము పేర ప్రకటించి అమాయక ప్రజలను అధర్మకులను చేయుచున్నారు. అందువల్ల జన్మరహితమునకు మారు జన్మసహిత రవరవాది నరకప్రాప్తి కలుగుచున్నదని మనవిచేయుచు నిజసాంప్రదాయక పీఠమునుండి ప్రకటనపరచు గ్రంథములను చూచి పఠన పాటనము లొనర్చగలరని ప్రార్థించుచున్నాము.

ఇట్లు

శ్రీ శివరామదీక్షిత అచలగురుపీఠ భక్తమండలి

# అనుష్ఠాన విధిః

## అచలర్షి సాంప్రదాయక

## 1. నిజగురు పరంపరాధ్యానం

ఓం నమోబ్రహ్మాదిభ్యో । బ్రహ్మవిద్యా సాంప్రదాయకర్తృభ్యో వంశఋషిభ్యో । మహద్భ్యో । నమోగురుభ్యః । సర్వోపప్లవ రహిత ప్రజ్ఞాన ఘన ప్రత్యగర్థో । బ్రహ్మైవాహ మస్మి అహంపదార్థ రహితః॥

శ్లో॥ ఓంకారపీఠసిద్ధాంత । బ్రహ్మవిద్యోపదేశిక
శ్రీమన్నారాయణంసూర్యం । సద్గురుభ్యో నమోనమః॥

శ్లో॥ యాజ్ఞవల్క్యంచ జనకం । శుకసాందీప మీశ్వరమ్
కృష్ణమర్జునసంయుక్తం । ఉద్ధవంచ నమోనమః॥

శ్లో॥ అంబికాశివయోగీశం । వేమనయోగి సద్గురుం
నిరంజనవెంకయార్యం । తిరువెంగళహంభజే॥

శ్లో॥ శ్రీధరస్వామియోగీంద్రం । శివరామాఖ్యదీక్షితం
కంబాలూరిఅప్పబ్రహ్మం । సద్గురుభ్యోనమోనమః॥

శ్లో॥ పరశురామసీతారామ । భాగవత కృష్ణయోగినః
ఫీలుఖాన లక్ష్మణార్య । సద్గురుభ్యో నమోనమః॥

శ్లో॥ బృహద్వాసిష్ఠసిద్ధాంత పూర్ణబోధోపదేశిక
వెంకటేశ్వర యోగీంద్ర । సద్గురుభ్యో నమోనమః॥

శ్లో॥ వేంకటేశ్వరపాదార । విందామృత రసాయనం
షిబన్మత్త మనోభృంగం । హనుమంతం గురుంభజే॥

శ్లో॥ వేదశాస్త్ర విధిఖ్యాతం । పూర్ణబోధోప దేశికం
సుగుణాకర దయానందం । రాజయార్య గురుంభజే॥

శ్లో॥ అస్మద్గురు సమారంభాం । కృష్ణసాందీప మధ్యమామ్
ఓంకారపీఠపర్యంతాం । వందేగురుపరంపరామ్॥

## 2. పరిపూర్ణ అచలధ్యానం

శ్లో॥ పూర్ణమేవ నిరాలంబం । ఆగ్నేయే నిర్గుణంతథా
దక్షిణేనిత్య శుద్ధంచ । నైఋత్యో నిరుపద్రవం॥

శ్లో॥ పశ్చిమేనిష్కళంచైవ । వాయవ్యేచ నిరంజనం
ఉత్తరేచ నిరాకాశ । మీశాన్యో నిర్మలోభవేత్॥

శ్లో॥ ఊర్ధ్వమేవ నిరాకారం । అధశ్చ నిర్వికారకః
అంతర్బహిశ్చ సర్వత్ర । అచలోయం సనాతనః॥

## పరాపూజ

శ్లో॥ పూర్ణస్యా వాహనంకుత్ర । సర్వదాసస్య చాసనం
స్వచ్ఛస్య పాద్యమర్ఘ్యంచ । శుద్ధస్యాచమనం కుతః॥

శ్లో॥ నిర్మలస్య కుతస్నానం । వస్త్రం విశ్వోదరస్యచ
నిరాలంబ స్యోపవీతం । రామస్యాభరణం కుతః॥

శ్లో॥ నిర్లేపస్య కుతోగంధః । పుష్పం నిర్వాసనస్యచ
నిర్గంధస్య కుతోధూపం । స్వప్రకాశస్య దీపకం॥

శ్లో॥ నిత్యతృప్తస్య నైవేద్యం । నిష్కామస్య ఫలంకుతః
తాంబూలంచ విభోకుత్ర । నిత్యానందస్య దక్షిణాం।

శ్లో॥ స్వయం ప్రకాశమానస్య । కుతో నీరాజనాదికం
ప్రదక్షిణ మనంతస్య । అద్వితీయస్య కాస్తుతిః॥

శ్లో॥ అంతర్బహిశ్చ పూర్ణస్య । కథముద్వాసనం భవేత్
ఇయమేవ పరాపూజా । సర్వావస్థాసు సర్వదా।

శ్లో॥ ప్రేమబుద్ధ్యాతు సర్వేశే । మనోదేవే వివేశయేత్
ఏషా మజ్ఞానజీవానాం । నమస్తారిష్ట శాంతయే
యస్యబోద్ధస్య మఖిలం । తత్తద్భక్త్యా బ్రవీమ్యహం॥

## ద్వాదశాక్షరి.

అస్య శ్రీ ద్వాదశాక్షరీ మహామంత్రస్య । అచలఋషిః । అవినాశః ఛందః అభవో దేవతా । అమృతం బీజం । అప్రమేయాశక్తిః । అయమాత్మా తత్వమస్యాది జ్ఞానరహితంకీలకం । అఖిలకాలేషు పరిపూర్ణమస్తి । మాయా సహిత మేతత్ప్రపంచం నాస్తీతి నిశ్చయ సిద్ధ్యర్థం ద్వాదశాక్షరీ మహా మంత్రజపం కరిష్యే।

## అథ కరన్యాసః.

ఏతన్మిథ్యా — అంగుష్ఠాభ్యాంనమః । శుద్ధవియత్ — తర్జనీభ్యాన్నమః కించిన్నాస్తి — మధ్యమాభ్యాంనమః । ఏతన్మిథ్యా — అనామికాభ్యాన్నమః శుద్ధవియత్ — కనిష్ఠికాభ్యాంనమః। కించిన్నాస్తి — కరతలకరపృష్ఠాభ్యాంనమః॥

## అథహృదయాదిన్యాసః.

ఏతన్మిధ్యా=హృదయాయనమః । శుద్ధవియత్ = శిరసేస్వాహా । కించిన్నాస్తి=శిఖాయైవషట్ । ఏతన్మిధ్యా=కవచాయహుం। శుద్ధవియత్ = నేత్రత్రయాయ వౌషట్ । కించిన్నాస్తి = అస్త్రాయఫట్ । ద్రష్టదర్శన । దృశ్యాదిసహిత।। అహంపదార్థరహితః భూర్భువస్సువరోమితిదశ దిగ్బంధః

### అ థ ధ్యా నం

శ్లో॥ అచలమఖిలం చాద్యం । సర్వాలోకేషు పూర్ణం
సర్వాతీతం । స్వానుభూతావ గమ్యం
సర్వాబాధ్యం । సర్వకర్తృత్వశూన్యం
సర్వావేద్యం । సర్వరహితం నమామి॥

శ్లో॥ అవాచ్యం హ్యఖండం । హ్యలక్ష్యం హ్యబాధ్యం
హ్యసంగ్యం హ్యవేద్యం । హ్యచింత్యం హ్యరూపం
హ్యసాధ్యం హ్యనాద్యం । హ్యతీతం హ్యనంతం
హ్యశుద్ధం హ్యబుద్ధం । హ్యనామం నమామి॥

శ్లో॥ మృత్యుజన్మ భయదుఃఖవర్జితం
సర్వదృశ్య దృగ్ ద్రష్టృనాశనం
అప్రతర్క్య మమలం నిరామయం
అనుపమాన మచలం నమామ్యహం॥

శ్లో॥ నిత్య పూర్ణాయ సత్యాయ । నిశ్చలాయనిరీహిణే
నిర్మలాత్మ స్వరూపాయ । నిర్గుణాయ నమోనమః॥

శ్లో॥ ఏతన్మిధ్యా శుదవియత్ । కించిన్నాస్తీతితేమయా
కృపయా పరమం ప్రోక్తం । భజ్యాగే ద్వాదశాక్షరం॥

### అ థ మ నుః

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఏతత్ | మిధ్యా | శుద్ధ | వియత్ | కించి | న్నాస్తి |
| ఈ | వుత్త | బట్ట | బయలు | ఏమి | లేదు. |

### షో డ షా క్ష రి

అస్యశ్రీ షోడశాక్షరీ మహామంత్రస్య । నిరంజనఋషిః । నిరహంకారఃఛందః । నిరాశయనిరాకారో దేవతా । నిరావరణబీజం । నిస్త్రైగుణ్యాశక్తిః । నిర్గుణప్రజ్ఞానరహితం కీలకం । నిఖిలకాలేషుమాయా సహిత

భూతపంచకనిర్మిత, దశేంద్రియ, పంచప్రాణ మనోబుద్ధిసహిత సూక్ష్మ శరీరరహిత, సిద్ధ్యర్థం షోడశాక్షరీ మహామంత్రజపం కరిష్యే॥

అథకరన్యాసః

నిర్మాలం-అంగుష్ఠాభ్యాంనమః । ఏతత్-తర్జనీభ్యాంనమః । జ్ఞానాచ్ఛరీరం-మధ్యమాభ్యాంనమః । నాస్తి-అనామికాభ్యాంనమః కేవలం-కనిష్ఠికాభ్యాంనమః॥ నిర్మాలమేతదాజ్ఞానాచ్ఛరీరం నాస్తి కేవలం-కరతల కరపృష్ఠాభ్యాంనమః॥

అథహృదయాదిన్యాసః

నిర్మాలం-హృదయాయనమః। ఏతత్-శిరసేస్వాహా। జ్ఞానచ్ఛరీరం-శిఖాయైవషట్ । నాస్తి-కవచాయహుం । కేవలం-నేత్రత్రయాయవౌషట్॥ నిర్మాలమే తదాజ్ఞానాచ్ఛరీరం నాస్తికేవలం-హస్తాయఫట్॥ సమస్తనిర్మోహాయ, త్రైగుణాతేషు, మద్రహిత, నిశ్చయో భూర్భువస్సువరోమితిదశ దిగ్బంధః॥

అథధ్యానము

శ్లో॥ సర్వనిగమగుహ్యం । శాశ్వతం సార్వకాలం
సకలదివితవంద్యం । సర్వదిక్పూర్ణమచలం
సకలభయనివారం । సర్వలోకాంతరస్థం
సకలమునిహృదిస్థం । సర్వదేశ ప్రశస్తం॥

శ్లో॥ నజ్ఞాతంపరవస్తుహావరహితం । నిస్తేజమమృతంసదా
నిశ్శబ్దం నిరుపానసం నిరుపమం । నిర్దేశపూర్ణస్థితం
నిత్యాభ్యాసవివర్జితం విహితస । ద్వ్యాపారశూన్యంసదా
నిస్సంగం నిరుపాధికం నిరవయం । నిత్యంహృదిభావయే

శ్లో॥ ఆనందరహితోస్మి నిత్యమచలం । నిర్ఘాతనిర్ఘోతనిరీంద్రియత్వాం
నిర్మోహనిర్ద్వంద్వనిరూపసత్యం । మహద్గురుంసత్యమహంనమామి॥

శ్లో॥ నిరాలంబాయనిత్యాయ । నిష్కలాయనిరంజన
నిత్యశుద్ధాయబుద్ధాయ । వస్తుమద్రహితం నమః॥

శ్లో॥ నిర్మాలమేతదాజ్ఞానా । చ్ఛరీరం నాస్తి కేవలం
షోడశాక్షరితత్ సిద్ధ । మిదంవస్త్వనిశంభజే॥

అథమనుః

నిర్మాల మేతదా, జ్ఞానా, చ్ఛరీరం నాస్తి కేవలం
మూలంలేని యీ గురైరిగే శరీరం యేమిలేదు.

దృష్టద్రాష్టాంతం

శ్లో॥ స్వప్నే ప్రతీయమానాని రూపాణిచ యథాతథా
కర్పూరదీపసంయోగం । జ్యోతిరూపం యథాతథా॥

దృ॥ కలలోదోచిన శరీరములు యేలాగో అలాగే
ద్రా॥ కర్పూరము కళికి కూడితే యేలాగో ఆలాగే

శ్లో॥ ఇతి మంత్రసమానైవ । సాందీపగుర్వగ్రణి
కృష్ణస్యమస్త కేనస్య । హస్తంతూష్టిబభూవహ॥
శ్రీ సద్గురు చరణార పిందార్పణమస్తు.

3. పరిపూర్ణబోధ స్తోత్రం

శ్లో॥ యస్యాంత ర్నాదిమధ్యే నహికరచరణం । నామగోత్రంనసూత్రం
నోజాతిర్నైవవర్ణో । నభవతుపురుషో నానపుంపో నచస్త్రీ ।
నాకారంనైవకారం । నహిజననమరణంనాస్తి పుణ్యంనపాపం ।
నోతత్వంతత్వమేకం । సహజసమరసం । సద్గురుం తం నమామి॥

శ్లో॥ ఆత్మానాత్మావినాశహేతు మనిశం । సర్వాతిరిక్తంశుభం
పూర్ణాత్పూర్ణ మనోమయం సుఖతరం సర్వాపదధ్వంసకం
సర్వాజ్ఞాన వినాశకం గురుపదం । సర్వాత్మకం నిర్మలం
సర్వభ్రాంతి వివర్జితం గుణహరం । సంపూర్ణబోధంనమః

శ్లో॥ సజ్ఞాతం పరవస్తునిత్య మచలం । సత్యంస్థితం శాశ్వతం
నిత్యానిత్యవివేక భేదరహితం । నిర్నామనిర్లేపకం
సర్వప్రత్యయహీనకంచసతతం । సర్వత్రసంస్థంపరం
వందేహం పరిపూర్ణబోధ మనిశం । సందేహనాశంప్రథమం॥

శ్లో॥ నాహంమనుష్యో । నచదేవయక్షా
నబ్రాహ్మణక్షత్రియ । వైశ్యశూద్రాః
నబ్రహ్మచారీ । నగృహీవనస్థో
భిక్షుర్నచాహం । నిజబోధరూపం॥



ఓం

శ్రీసద్గురవేనమః

# శ్రీశివరామ దీక్షితీయము

## అచలబోధసిద్ధాంతం – ద్వాదశిబావం

1 శ్లో॥ ఇదంపూర్ణ మదఃపూర్ణం । పూర్ణాత్పూర్ణముదచ్యతే
పూర్ణాస్యపూర్ణమాదాయ । పూర్ణమేవావశిష్యతే॥

శివరామదీక్షితులవారి అచలబోధ.

తుర్యాతీతం ప్రతిపాదించే నిశ్శబ్దమార్గం.

పూర్వభాగం

శరీరరహిత ప్రకరణము

గురు॥ ఈ ఉత్తబట్టబయలు ఏమిలేదు అని సిద్ధాంతము మూలం లేని యీగు ర్తెరిగే శరీరంయేమిలేదు.

ఇదేకోటిమాట్లకు జ్ఞాపకము.

యింతకంటె యెక్కువలేదుగనుక మరువవద్దు.

శిష్యు॥ యేలాగు ?

గురు॥ కలలో వచ్చిన శరీరం మేలుకుంటే యేమైనా వున్నాదా అలాగే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదని నిశ్చయం వుండవలెను.

శిష్యు॥ వుంటే ?

గురు॥ ఈలాగైతేనే భ్రాంతిరహితము ! ఈమార్గమును విడిచి యేమార్గమును నమ్మినా రాజమార్గముకాదు. చొంగత్రోవలకు లెక్కలేదు. యిటువంటి గురువాక్యము మూడుకాలాలయందు లేదు. ఇదే నమ్మవలె. ఇది నమ్మక మరియొకమార్గం నమ్మినా రాకడాపోకడా తప్పదు. భ్రాంతి రహితము కాదు.

యీ శరీరం యేలాటిదనగా :- కలలో వచ్చిన యేనుగకు ఆశపడి పది వేల వరహాలకు అమ్ముకుందామని దిగ్గునలేస్తె ఆ యేనుగ యేమీలేక పోయినట్టుగా రాకడాపోకడా లేనిది పుట్టనిచావనిది సకలదేశాలయందు సర్వకాలాలయందు సమస్తమైన వస్తువులయందు మొదలుకొన లేక చలించక స్వతస్సిద్ధమైయున్న యీ బట్టబయలందు మూలంలేని యీ గుర్తెరిగే శరీరం తోచినది.

శిష్య॥ అదియెట్లు ?

గురు॥ కలలో వచ్చిన శరీరం మేలుకుంటే యేలాగున యేమీలేదో ఆలాగే గురువాక్యముచేత మేలుకుంటే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు.

శ్రీరుక్మిణి కృష్ణ సంవాదము

కృష్ణస్వామి జాగ్రత యిటువంటిదే.

కృష్ణస్వామికంటె యెక్కువయినది రుక్మిణీదేవి అనే అమ్మవారు **ఆమెదే జాగ్రత. యెందుచేతనంటే.**

శ్రీకృష్ణస్వామి సాందీపునివద్దకు పోయి ఉపదేశమై వచ్చిన తర్వాత రుక్మిణీదేవి స్వామివారిని యేమి విచారించి వస్తిరి అని అడిగితే.

కృష్ణస్వామి॥ చెప్పక వూరికే వుండి రుక్మిణీదేవి అమ్మవారితో కలలో ఒక చౌడోలిరాజు సిద్ధమైన యెనుగ నెక్కి అనేకకోట్ల గుర్రాలతో అనేక మనుష్యులతో వచ్చి ప్రభుత్వం చేస్తువుండెను. అందులో.

సన్యాసులు॥ కొందరు అద్వైతమే దొడ్డదని వాదించిరి.

వైష్ణవులు॥ విశిష్టాద్వైతమే దొడ్డదని వాదించిరి.

పెద్దమధ్వాచారి॥ యేమిలేని దేహాన్ని చూచి నేను చేస్తాను అని జీవుడు వేరే యీశ్వరుడు వేరే అని ద్వైతమే లెస్స అని వాదించిరి.

అందులోనే భాస్కరాచార్యుడు అనే మనుష్యుడు జ్ఞానం నిబద్ధి అనే. యేలాగంటే కుక్క గుర్తెరిగే స్వభావము కలది. అలాగే అందరు తనకు తానే గుర్తెరిగేవారు తనకుతానే యెరుగు. అనేకకోట్లు వచ్చినా యెరుగు. అందుకే జ్ఞానం నిబద్ధె కర్మాలు నిబద్దె గుర్తెరుగక కర్మలు చెయ్యరు వచ్చేటప్పుడు జ్ఞాన శరీరాలయ్యే వచ్చినవనెను కలలో ఎక్కడి నుంచి వచ్చినారో !

కాని అడివంతా గోపికలే. అనేక కృష్ణావతారాలు.
భూమెల్లసీతలే. అనేక రామావతారాలు. అనేక దశావతారాలు.
వీరంతా యెక్కడినుంచి వచ్చినారని మేలుకుంటే యెవరూలేరు.
యే మహత్తులు లేవు. యీ దేహాలు లేవు.
యీ శరీరం మధ్యవచ్చినది మధ్యనే పోయినది.
దీనికి మూలంలేదు. యిది యెప్పుడు వుండేదికాదు.
మెరుగుడుపువ్వు వంటిది. మేఘం వంటిది. మెరుపు వంటిది.
నీటిబుగ్గ వంటిది. నిలిచేది కాదు. శాశ్వితమైనది కాదు.

అయితే ధృఢంకావాలే చెప్పితేవినవలే బాగా తెలుసుకోవలెనని చెప్పినాడు.

రుక్మిణి॥ సరే అని అమ్మవారు సమాధానపడ్డది.

కృష్ణస్వామి॥ యీ రుక్మిణీదేవి నాకంటే యెక్కువైనది గట్టిది సూక్ష్మబుద్ధి కలది జాగ్రత్తకలది నేను మరచిపోదునేమోనని మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని అన్నాడు.

రుక్మిణి॥ అనగానే అవును నిజమే కలలో వచ్చిన శరీరం మేలుకుంటే యేమైనా వున్నదా అలాగే గురువాక్యంచేత మేలుకుంటేమూలం లేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అను మాట నిజమేనని అన్నది.

కృష్ణస్వామి॥ ఆమె జాగ్రతకు మెచ్చి అమెయందు విశ్వాసము కలవాడై యున్నాడు.

—(గురు శిష్య సంవాదం)—

శిష్య॥ అయ్యా కలలోవచ్చిన శరీరం మేలుకుంటే యాలాగు యేమీ లేదో అలాగే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదని చెప్పితిరి దృఢం అయింది యికను భయమేమి.

గురు॥ నీకు యేమి భయములేదుకాని నాకు మహాభయముగావున్నది.

శిష్య॥ యెందుచేత భయము. కలలో వచ్చిన శరీరము మేలుకుంటే సగముపోయి సగమువుంటున్నదా యికను భయము యేమి.

గురు॥ అట్లైయితే విను, వున్నవారి సహవాసముచేత లేనివారికి భయము కలుగుచున్నది.

శిష్యు॥ అది యేలాగు చెప్పండి.

గురు॥ ఒక గవ్వైనా లేకవున్నవారు బంగారము మూటకట్టుకొని పొయ్యేవారితోకూడ పోతే భయము కలిగినట్టుగా.

శిష్యు॥ అట్లయితే వున్నవారికి లేనివారికి సహవాసము కద్దా లేదా.

గురు॥ కలలో కొందరికి కద్దు. శిష్యు॥ నీకు వున్నదా లేదా.

గురు॥ నాకు సర్వకాలం వక్కటీరే.

శిష్యు॥ అట్లయితే నీకు సుఖం దుఃఖం వున్నదా లేదా.

గురు॥ నేను యేమి.

శిష్యు॥ నీవు యేమో వెర్రివారి సహవాసం వుంటే వెర్రి పట్టగలదు. నత్తివారి సహవాసం చేస్తే నత్తివచ్చును.

గురు॥ శాబాస్ ఘట్టివాడవే నీకు యింత దృఢం యెప్పుడువున్నదో నావద్దికి రాకు నాతోకూడ వుండకు నాజోలి పుచ్చుకోకు.

శిష్యు॥ అయ్యో వొక విజ్ఞాపన నాతోకూడ వుండేది యేమిటి? నా వద్దికి వచ్చేది యేమిటి? నా జోలి పుచ్చుకునేది యేమిటి?

గురు॥ యేమో. శిష్యు॥ మీరు చెప్పకుంటే యెవ్వరు చెపుతారు.

గురు॥ చెపుతానుకాని అడిగేవారు యెవరు.

శిష్యు॥ నేను యేమి నాకు యేమితెలియదు నేను యేమి యెరుగను.

గురు॥ యెరగకుంటే జ్ఞానివే నీకు యిటువంటి నీచపు మార్గం చెప్పలేదు. మా గురుస్వామి లంచగొండివారు కారు. నాకు రాజమార్గం సూచన చేసినారు.

శిష్యు॥ ఆ మార్గం యెటువంటిది.

గురు॥ అది మహాగుహ్యం.

శిష్యు॥ అది యెటువంటిది యెవరికి చెప్పవలెను.

## బోధకు అనధికారులు.

1 మూలంలేని యీ గుర్తెరిగే శరీరం అయివున్న పతితులకు చెప్పవద్దన్నారు.

2 శాస్త్రాలు నిబద్ధియని నమ్మినవారికి చెప్పవద్దన్నారు.

3 దేవతాభ్రాంతి గలవారికి చెప్పవద్దన్నారు.

4 యెదురుబడి వాదించేవారికి చెప్పవద్దన్నారు.

5 గురుసేవ చెయ్యనివారికి చెప్పవద్దన్నారు.

6 నేను యేది అంటే అదే అనే మూర్ఖులకు చెప్పవద్దన్నారు.

7 కర్మలు నిబద్ధియని నమ్మిన అప్రమాణులకు చెప్పవద్దన్నారు.

8 స్త్రీల భ్రాంతి గలవారికి చెప్పవద్దన్నారు.

9 జ్ఞానభ్రాంతి గలవారికి చెప్పవద్దన్నారు.

10 భక్తిభ్రాంతి గలవారికి చెప్పవద్దన్నారు.

11 వైరాగ్యం దొడ్డదనే మూర్ఖులకు చెప్పవద్దన్నారు.

12 మొద్దు బుద్ధిగలవారికి చెప్పవద్దని అన్నారు.

13 మోక్షభ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు.

14 అనుభవభ్రాంతి వున్నవారికి చెప్పవద్దని అన్నారు.

15 అదే నేను కావలెనని భ్రాంతివున్నవారికి చెప్పవద్దన్నారు.

16 అదే నేను అయితినని అనుభవం కావలెనని భ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు.

17 నేను నేను అనివాదించేవారికి చెప్పవద్దన్నారు.

18 నామతమే దొడ్డదని వాదించేవారికి చెప్పవద్దన్నారు.

19 శ్రవణభ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు.

20 మననభ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు.

21 ధ్యానభ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు.

22 ద్వైత భ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు.

23 అద్వైత భ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు.

24 విశిష్టా ద్వైత భ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు.

25 మతాంతర భ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు.

26 విద్యా విద్యాతీతమైన మార్గము దుర్లభమని దొంగతనంచేత వచ్చి వుండెనా సూచన చెయ్యవద్దన్నారు.

బోధకు అధికారులు

1 సూచనచెయ్యగానే కనుక్కునేవారికి చెప్పమన్నారు.

2 అనుమానం లేనివారికి చెప్పమన్నారు.

3 స్త్రీలేకాని పురుషులేకాని భ్రాంతిరహితం కావలెనని మిక్కిలి ఇచ్ఛ వున్నవారికి చెప్పమన్నారు.

4 వొక్కటైనా భ్రాంతిలేకుండ యెవ్వరు సూచనచేసేరు. అని అత్యంత ఆసక్తిగలవారికి సూక్ష్మ ప్రజ్ఞవుండెనా సంవత్సరం చూచి సూచన చెయ్యమన్నారు. లేకుంటే చెయ్యకూడదు.
వినేవారికి తెలియకుంటే చెప్పేవారిదే బుద్ధి జాడ్యము.
దీర్ఘ కాలము గురు సేవచేతగాని భ్రాంతిరహితముకాదు.
తొందరకలిగేవారికి తెలియనే తెలియదు. అది మహారహస్యం.
అది మహాసూక్ష్మం. చెప్పితె తెలుసుకోవలె.
తెలియకుంటే యెన్నటికి తెలియనే తెలియదు. తనకుతానే గ్రహించెనా; వాడికివాడే మునిగిపోతాడు. కాన పుట్టని చావని అచలం జాడ దొరకక గాఢనిద్రలో కుక్కలు పందులు గాడ్దులు మునిగి మళ్లాతేలినట్టు తేలుతాడు.

శిష్య॥ యేలాగు చెప్పండి.

గురు॥ బంధమని పేరుపెట్టి అదివేరే మోక్షవేరే అని. అది నీవు అయితివి అని శంకరాచార్యులు అన్నట్టు.

శిష్యు॥ అయ్యా అవి యెట్లు.

గురు॥ (శంకరాచార్యులవారి వాక్యాలు)

1 యేమిలేని జీవుడు వున్నాడు అని అన్నాడు.

2 అవిద్యవున్నది అన్నాడు. 3 ప్రకృతి వున్నది అన్నాడు.

4 ఆత్మ వున్నది అన్నాడు. 5 కారణం వున్నది అన్నాడు.

6 గుర్తెరిగే జ్ఞానం వున్నది అన్నాడు.

7 అజ్ఞానం లేదు అన్నాడు.

8 సచ్చిదానందం వున్నది అన్నాడు. 9 జాగ్రత్త కద్దుఅన్నాడు.

10 సుషుప్తి అన్నాడు. 11 తుర్యాతీతం అన్నాడు.

12 జడాకాశం అన్నాడు.

13 గుర్తెరిగే క్షేత్రజ్ఞస్వరూపమనే ఆత్మవలన ఆకాశం పుట్టింది అన్నాడు.

14 యీశరీరంలోనే కనుక్కోవలె నన్నాడు.

15 చిదాకాశం అన్నాడు.

16 ఆత్మాన ఆకాశః సంభూతః అని శృతి అన్నాడు.

శృతి॥ ఆకాశస్య గుణశ్శబ్దో । నిశ్శబ్దో బ్రహ్మవుచ్యతే॥
అని వుండనేవున్నది.

మాట్లాడేది సగుణం అనెనా? నిర్గుణం అనెనా? అంటే గుర్తెరిగే చైతన్యం మాట్లాడదు అని అన్నాడు.

శృతి॥ ఏనవాచకరోతి ॥ అని అన్నాడు.

యేనం గుర్తెరిగే చైతన్యం జ్ఞానముచాతనే మాట్లాడుతాడు. అని వుండనే వున్నది.

గుర్తెరిగే నేను నిర్గుణం గుర్తెరుగబడే శరీరాది పదార్థాలు సగుణం అన్నాడు.

బ్రహ్మ సాక్షాత్కారం అయితే మొదలు జేసేదేసిద్ధం. సార్వకాలం శరీరం విడిచేదిలేదు. పట్టుమనిలేదు. తనకుతానే అనుకొయ్యవలె తిరుగు

తోంది. తనకుతానే స్వాధీనంలేదు. మందికేమి స్వాధీనం అయ్యీ వున్నట్టు వుంటుంది. చూస్తుండగానే యేమిలేదుగనుక నమ్మరాదు.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం అనే నరకాన్ని విడువలేక సుఖమనే స్వర్గానకు ఆశపడితే దుఃఖప్రాప్తి అయితే లింగమూర్తికి క్లేశమేతనకు మహాక్లేశమే.

విష్ణుభక్తులు॥ యీ గుర్తెరిగే చిత్తుకు విష్ణువని చిద్రూపమే, నారాయణుడనే మాత్రమేకాని స్వర్గనరకములు లింగమూర్తికి నారాయణునికి సమానమే. బియ్యానకు అనేక పేర్లు వున్నమాత్రమేకాని సకల తిప్పలు బియ్యానకు యేలాగో ఆలాగే మూలంలెని యీ గుర్తెరిగే శరీరానికే కాని దీన్ని తప్పించుటకే యుక్తి యెవరికి గూఢంగానే యున్నది.

శిష్య॥ అయ్యా మీకాళ్ళు మ్రొక్కుతాను యింత చులుకనగా చెప్పండి.

గురు॥ కలలోదేహాలకు యీ దేహాలకు చుట్టరికాలె. సంబంధాలు కలవు. కలలోదేహాలు యీ దేహాలను చూచి మీరు మేము సంబంధంచేయవలె మాకు తగినవారు మీరే మీకంటే మాకు ఆప్తులులేరు. మీరు మేము వొక్కటే మీకులము మాకులము వకటే. మేము పుట్టినట్టు మీరుపుట్టినవారు మేమువున్నట్టే మీరువున్నారు మీరు మేము కలిసెవున్నాము. మీకు మాకు హెచ్చుతగ్గులెదు. అనిచెప్పుకున్నవి.

శిష్య॥ చెప్పుకుంటె.

గురు॥ యీదేహాలు కలలోదేహాలను చూచి అనెగదా మీకు మాకు యెలాగు సంబంధంకలుగును యెవరికివారె మీరు యెక్కడి నుండియో తండోపతండములుగా వచ్చినారు. చిత్రవిచిత్రములుగా వచ్చినారు మంది మార్బలాలుగలవారె; గుఱ్ఱాలు; యేనగలు కలవారె; యెంతవుంటే నేమి? రెప్పపాటులో పొయ్యేవారు వెతికిపట్టుకొన్న వుండేవారుకారు. యెప్పుడంటె అపుడేవస్తారు. యెప్పుడంటె అప్పుడే పోతారు. మీకు నివాసంలేదు. వూరులేదు. పేరులేదు. మంచుమంటివారు. మీకు మాకు యెక్కడిసంబంధాలు మేముకూరుచుంటాము. నిలుచుంటాము పరుగెత్తుతాము వారుహాడుతాము చస్తూవుంటాము. బ్రతుకుతూవుంటాము. మీకుమాకు యెక్కడి సంబంధం. మాఎత్తె మీరుగారు. సహస్రాంశము హెచ్చుతగ్గుగలదు అనెను.

కలలో దేహాలు అనేగదా మేము కూరుచుంటాము. నిలుచుంటాము వస్తూవుంటాము పోతువుంటాము యిండ్లుగలవు వాకిండ్లుగలవు సంసారాలు గలవు చావు బ్రతుకులు గలవు సిరిసంపదలు గలవు మీకుమాకు సంబంధం వున్నది అనే.

ఈదేహము॥ అయితే మీకుమాకు సాటేనా. కలదేహము॥ సాటే. ఈదేహము॥ యేలాగు కలదేహము॥ మీకు మూలంయేమి ఈదేహము॥ తల్లి దండ్రులు కలదేహము॥వారికి ఈదేహము॥వారివారి తల్లిదండ్రులు కలదేహము॥ మొదలు యెవరు ఈదేహము॥ యెవరో కలదేహము॥ వారికి వారే వచ్చినారా ఈదేహము॥ వారే వచ్చినారు కలదేహము॥ వారికి మూలం కలదా లేదా ఈదేహము॥ లేదు కలదేహము॥ మూలంలేకనే వచ్చినారా ఈదేహము॥ మూలంలేకనే వచ్చినారు కలదేహము॥ యిది దృఢమేనా ఈ దేహము దృఢమే కలదేహము॥ ముమ్మాటికి దృఢమేనా ఈదేహము॥ ముమ్మాటికి దృఢమే కలదేహము॥ యెప్పటికి వుంటారా ఈదేహము॥ యెందుకు వుంటాము కలదేహము॥ మీరు యెవరివలన వచ్చినారు.

ఈదేహము॥ మాకు మేము వచ్చినాము. మాకు మేమేవున్నాము. మాకుమేమే పోతాము మీరు మావలనే వున్నారు. మేము వుంటే మీరు వున్నారు. మేము లేకుంటె మీరు లేరు మమ్ముఁను విడిచి మీరు వుండరు. మిమ్ముఁనువిడిచి మేము వుండము. నిజగురువును విచారించుడి నిలకడగా తెలుసుకొండి నిర్మలముగా నుండవలెను కళంకము వుండకూడదు.

శిష్య॥ అయ్యా బహు సూటిగా వున్నది అనుగ్రహించండి.

గురు॥ యిపుడు యదార్థంగా విను. సంసారమంటే మూలంలేని యీ గుత్తెరిగే శరీరం తోచడమే సంసారం. యీ శరీరం యేలాగు వచ్చినదంటే ఫలానిదానివలన వచ్చినది అని ప్రమాణంలేదు. యీ శరీరానకు మొదలు యేమీలేదు. యిది అప్రమాణమే యీ శరీరం లేక మునవు కేవలం బట్టబయలేవున్నది. కల దోచిన శరీరము యేలాగో అలాగే మూలంలేని యీ గుత్తెరిగేశరీరం యేమిలదు అని దృఢం వుండవలె.

**ఇతి శ్రీ శివరామదీక్షిత ప్రభావే వేదాంతవిచారణే**

శరీరరహిత ప్రకరణం ప్రథమోధ్యాయః

శ్రీ సద్గురవేనమః

# చైతన్య నిరసన ప్రకరణము

2 శ్లో॥ షడ్భ్యాతరహితంపూర్ణమ్ । అష్టావరణవర్జితమ్
షడ్వర్గరహితంపూర్ణమ్ । షట్కోశరహితంసదా॥

## 1. మతాల లక్షణం

గురు॥ ఈ పుత్త బట్టబయలు ఏమిలేదుఅని సిద్ధాంతమే సిద్ధాంతము మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు అని సార్వకాలం యెడతెగక నిద్రవచ్చినదనక చచ్చినదనుక ప్రతిదినం అభ్యాసం చేసిన వాడు పుట్టని చావని అచలమే స్వతసిద్ధముకాని మరిఒకటికాదు యిది నమ్మినవాకి రాకడాలేదు పోకడాలేదు.

1. యిదిగాక మూలంలేని యీ గుర్తెరిగే శరీరం చేసిన మర్యాద వినెనా పెద్దపులివలె వుండి చస్తాడు.

2. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం నేను అని నమ్మివుండెనా అంతరమందు గుర్తెరిగే ఎమిడికవలె వుండిచస్తాడు. బాహ్యమందు గుర్తెరిగే పందివలే వుండిచస్తాడు.

3. వైరాగ్యంచేత సన్యాసంచేసి తిరిగెనా గుర్తెరిగే గాడిదవలే వుండి చస్తాడు.

4. యోగభ్యాసం చేసి తిరిగెనా గుర్తెరిగే దొమ్మరివానివలె సాధించి పడి చస్తాడు.

5. వాయుధారణ చేసెనా గుర్తెరిగే పామువలె వుండి చస్తాడు.

6. కర్మలు చేసెనా గుర్తెరిగే పంచబ్రహ్మలవలె చాకలివానివలె, మంగలివానేవలె, కుమ్మరివానివలె సాలెవానివలె, మేదరివానివలె, మాదిగ వానివలె, వుండిచస్తాడు. యీ భూమండలమందు యెవరైనా భ్రాంతిలేని వారు వున్నారేమోనని వెతుక్కోవలె. వారివద్దకి పోవలె. వారి మార్గం విచారించవలె. వారి శిష్యుల విచారించవలె. ఆ శిష్యులతో యీ లోకమందు

భ్రాంతిలేని గురువులు వున్నారట వారి మార్గం యెటువంటిది. వారి జాడ యెటువంటిది వారు మతాలు మతగ్రంధాలు నమ్మివున్నారా ? శంకర భాష్యాలు నమ్మివున్నారా ? వారు మీకు యేమైన సూచన చేసినారా ? వానిని యేలాగున చూడవలె. వారితో యేలాగున మాట్లాడవలె వారి దర్శనం మాకు యేలాగున అవును. వారి అనుగ్రహము మామీద యేలాగున కలుగును. మేము యేలాగున కడతేరుదుము. మీరు మాకు దర్శనం చేయించలేరా వారి అనుగ్రహమునకు పాత్రులను చేయలేరా ? అని అడుగ వలెను.

గురువుల మార్గం శిష్యులవల్ల తెలుసుకోవలెను దీర్ఘకాలము గురు సేవచేయవలె. వారివెంట వెనకతిరగవలె వారి అనుగ్రహము సంపాదించవలె వారి అనుగ్రహము కలిగెనేని పది ప్రశ్నలు అడిగి తెలుసుకోవలె ఆవి యెట్లనగా.

1. యీ దేహాలకు మూలంలేదా. 2. మూలంలేక యీ దేహంయేలాగు కలిగెను. 3. యీ దేహమునకు ఆధారము యెవరు 4. పుణ్యపాపాలు చేసే వారు యెవరు. 5. తాను వేరే దేహం వేరేనా లేక రెండు వకటేనా. 6. చలంవొకటి అచలం వొకటి రెండూ వొకటేనా వేరా. 7. అచాలం యెక్కడవున్నది అది యెటువంటిది. 8. యీ గ్రంథములు పుట్టనిచావని అచలము చేసినదా మూలం లేని యీ గుర్తెరిగే శరీరం చేసినదా 9. పుట్టేది చచ్చేది వొకటి పుట్టనిది చావనది వకటా యీ రెండు వకటేనా. 10. యీ ప్రపంచం యేటువంటిది. యీ పది అడిగితెలుసుకుంటే.

1. నిప్పుదగ్గిరికి పోతె చలిపోయినట్లు వుండవలె.

2. దాహానకు పుచ్చుకుంటే దప్పి తీరినట్టు వుండవలె.

3. భోజనంచేస్తె అకలి తీరినట్టు వుండవలె.

4. ప్రయాణం నడచి యింటికివస్తే ఆయాసం తీరినట్టు వుండవలె.

5. రోగికి అవుషధం యిస్తే రోగం పోయినట్టు వుండవలె.

యెవ్వరు భ్రాంతి పుట్టకుండ చెప్పరు యేభాష్యాలు భ్రాంతి లేకుండా చెప్పలేదు. యెటువంటివాండ్లకు చెప్పంగానే భ్రాంతి పోవద్దా.

శిష్య॥ అయ్యా ఆ యుక్తి చెప్పండి.

గురు॥ భ్రాంతిరహిత యుక్తి.

1. అద్వైతంవలె గుర్తెరిగే చైతన్యం నీవు అన్నట్టుగాదు.
2. చిత్తులో చిత్తు విశిష్టం అన్నట్టుగాదు.
3. నీవు వేరే యీశ్వరుడు వేరే అన్నట్టుగాదు.
4. నీవు జీవుడవు నీవు యీశ్వరుడవు అన్నట్టుగాదు.
5. ద్వైతంవున్నది అద్వైతంవున్నది అన్నట్టుగాదు.
6. అంతా చైతన్యమనే సమరసజ్ఞానం అన్నట్టుగాదు.
7. నేను గుర్తెరిగేవాడ్ని గనుక అపరోక్షజ్ఞానం అన్నట్టుగాదు.
8. గుర్తెరిగే విషయి అన్నట్టుగాదు.
9. గుర్తెరిగేజ్ఞానమే బ్రహ్మం అన్నట్టుగాదు.
10. యిది గుర్తెరిగే దృక్కు అన్నట్టుగాదు.
11. గుర్తెరిగే సాక్షి అన్నట్టుగాదు.
12. గుర్తెరిగే సాక్షిణి అన్నట్టుగాదు.
13. నీవుగుర్తెరిగేవాడవు అన్నట్టుగాదు.
14. మోక్షమనే భ్రాంతి వంటిదిగాదు.
15. బంధమని భయపెట్టినట్టుగాదు.

యీ గుర్తెరిగే శరీరం యేమీలేదని చెప్పి సమాధానం చేసేవారు దుర్లభం, యీ శరీరానకు మూలం వున్నదనే మూర్ఖులు విస్తారం గనుక నమ్మవద్దు.

1. శిష్య॥ అయ్యా యీ దేహాలకు మూలం వున్నదా లేదా.

   గురు॥ మూలం లేదు.

2. శిష్య॥ మూలంలేక యీదేహము యేలాగున కలిగెను.

గురు॥ కలలో దేహంవలె.

శిష్య॥ కలలో దేహమునకు మూలంలేదు అని చెప్పితిరి. కలలో దేహంవలె యీ దేహం కలిగినదంటిరి కలలో దేహం యీ దేహం వొక్కటేనా ? యీషత్తు యెచ్చుతక్కువ కలదా ?

గురు॥ దేహాలకు మూలంలేదుగనుక రెండూ వొక్కటేకాని కలలోనిది లేత శరీరం కనుపడేది ముదురు శరీరం.

శిష్య॥ అలాగుకాదు గురో కనుపడేదే లేత శరీరం. యాలాగంటే కలలో సిద్ధమైన యేనుగ చౌడోలిరాజు అనేకకోట్ల గుర్రాలు అనేక కోట్ల మనుష్యులు మూలంలేకనీ వచ్చిరి. వచ్చి నూరేండ్లు వుండి సకలమైన ధర్మా ధర్మాలు చేసిరి. అనేకమైన గోదానాలు భూదానాలు చేసిరి. దీనికంటే అదే అనాధ అదే ముదురు శరీరము.

గురు॥ శాఖాసు యీలాగు వుండవద్దా.

3. శిష్య॥ హే గురుస్వామీ ! యీ దేహానకు ఆధారం యెవరు.

గురు॥ కలలో శరీరం యేలాగున వచ్చినదో కలలో శరీరానకు ఆధారం లేనట్టే యీ శరీరానకు ఆధారంలేదు. యాలాగంటే మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే నాకు మూలం వున్నాది నన్నే నమ్మవలె అని అన్నాది. నన్ను యేమిలేదని నీళ్ళలో చావను బయటవేసినట్టు వేశేరని నేనురాతిని దేవుడ్ని అనిపించి, కట్టెను దేవుడ్ని అనిపించి, తీర్థాలు సాగించే దాన్ని అందరిని రప్పించేదాన్ని నాజాడ నాకే తెలియదు నాకు నేనేవస్తా నాకు నేనే వుంటా నాకు నేనే యేమిలేదు. నాకు నేనే మూలం సముద్రంలో చావ వున్నట్టు వున్నా నన్ను రమ్మనేవారు లేరు పొమ్మనేవారులేరు. మూలం లేని గుర్తెరిగే శరీరం యేమిలేదు. యిదే షోడశిమంత్రం సంతతం విడవ వద్దు ఆవరణాంతరం వుండవలె.

4. శిష్య॥ అయ్యా పుణ్యపాపాలు ధర్మాధర్మాలుచేసేవారు యెవరు ?

గురు॥ కలలో దేహమే చేస్తువున్నది అని అన్నారు.

5. శిష్యు॥ అయ్యా తాను వేరే దేహము వేరేనా రెండు వొకటేనా.

గురు॥ తాను వేరే అయితే జంధ్యాలు తానే వేసుకోవలెగాని శరీరానకు యాలవెయ్యవలె.

తానే లింగం కట్టుకోవలెగాని శరీరానకు యాల కట్టవలె.
తానే స్నానం చెయ్యవలెగాని శరీరము యాల చెయ్యవలె.
తానే చక్రాంకితాలు చేసుకోవలెగాని భుజాలకు యాల చెయ్యవలె.
తానే బోట్టు పెట్టుకోవలెగాని శరీరానకు యాలపెట్టవలె.

అందుకే తాను వేరే శరీరం వేరే అని వాదించేది తత్వ వాదం యిదే మాయావాదము.

6. శిష్యు॥ అయ్యాచలం వొకటి అచలం వొకటి రెండా లేక వేరే వేరేనా.

గురు॥ దేహము చలము దేహమునకే అచలము తోస్తుంది. దేహము లేకపోతే యేమీలేదు. యీ వుత్త బట్టబయలు వున్నటి. యిది అంతటా వున్నది. యిందుకు సందేహములేదు. అంతా అబద్ధమే కలలో అంత నిజమే గురువాక్యముచేత మేలుకుంటే యేమీలేదు గురువు దొరికేది దుర్లభం నిజ గురువు దొరికితే భ్రాంతి పుట్టదు.

7. శిష్యు॥ అచలం యెక్కడవున్నది ? అది యెటువంటిది ?

గురు॥ పుట్టినిది చావనిది రాకథపోకడలేనిది సకలదేశాలయందు సర్వకాలాలయందు సమస్తమైన వస్తువులయందు మొదలు కొనలేక తనకు తానే స్వతస్సిద్ధమై నిండియున్నది.

శ్లో॥ అబీజంవృక్షసంపూర్ణం ।శాఖాపల్లవవర్జితం ।
పుష్పంనాస్తి ఫలంనాస్తి । సంపూర్ణంవృక్షవర్జితం॥

నిండి నిబిడీకృతమైయున్నది. దానికి విత్తనములేదు. పూలులేవు కాయలులేవు వృక్షములేదు. యీ వుత్తబట్టబయలు యేమిలేదు.

8. శిష్యు॥ యీ గ్రంథాలు పుట్టని చావని అచలం చేసినదా ? మూలం లేని యీ గుర్తెరిగే శరీరం చేసినదా ?

గురు॥ పుట్టనిచావని అచలంవల్ల వక్కటైనా పుట్టనేలేదు. యీఉత్త బట్టబయలుకు యెరుకలేదు. దానివల్ల యీ గ్రంధాలు పుట్టనేలేదు. మూలం లేని యీ గుర్తెరిగే శరీరంవల్లనే శాస్త్రాలు పుట్టినవి. అవి చేసిన గ్రంధాలు వాటికే ప్రమాణము అప్రమాణము యీ వుత్త బట్టబయలుకు యేప్రమాణము లేదు. తనకుతానే స్వతస్సిద్ధమైయున్నది. యిందుకు సందేహము లేదు. యిది విచారించవలె సావకాశము కలుగవలె నెమ్మదిగా నుండవలె.

9. శిష్య॥ అయ్యా పుట్టేది చచ్చేది వొకటి పుట్టనిది చావనిదొకటి రెండూకలవా.

గురు॥ పుట్టేది చచ్చేది దేహము. పుట్టనిచావనిది అచలము. రెండూ తోచేది శరీరానకే. ఒకటి తోచేది శరీరానకే. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు. యిది మరువవద్దు.

10. శిష్య॥ వో గురుస్వామి ప్రపంచం యెటువంటిది.

గురు॥ ప్రపంచం పుట్టనేలేదు. పుట్టని ప్రపంచాన్ని యేలాగు వున్న దందును. యీ ప్రపంచం వున్నదని చెప్పడానకు చదువుకొనిన విద్వాంసులకు.

విచారించని సన్యాసులకు , జడలు పెంచిన యోగీశ్వర్లకు, అహంకారులయిన జ్ఞానులకు.

సిగ్గుకాదేమో కలలో అనేకాలు తోచినట్టు తోచినది. తాడుయందు పాము తోచినట్టు తోచినది. ముత్యపు చిప్పయందు వెండి తోచినట్టు తోచినది ఎండమావులయందు నీరు తోచినట్టు తోచినది. యింతేకాని ప్రపంచం లేనేలేదు.

శ్లో॥ యింద్రజాల మిదంసర్వం । యథామరు మరీచికః
అఖండితమనాకారం । వర్తతే కేవలంశివం॥

యీ ప్రపంచం యింద్రజాలము యిది నమ్మరాదు కలలో వస్తువులు మేలుకుంటే యేలాగు లేదో అలాగే ప్రపంచం లేనెలేదు. ప్రపంచం వున్న దనరాదు. యీ వుత్త బట్టబయలుకు యేమీలేదు.

యీావృత్త బట్టబయలుకు యెరుక మరవులేదు. యింతకంటె అధికం లేదు.

## ప్రకృతి పురుష సంవాదం

కలలో వొక ముత్తైదువ పుట్టెను. అముత్తైదువను వెతుక్కుంటు మూలంలేని పురుషుడు వచ్చెను. వీరు యిద్దరు మూలం లేకనే వచ్చిరి.

పురుషుడు॥ నీ పేరు యేమని అడిగెను.

ప్రకృతి॥ నీపేరు యేమని అడిగెను.

పురుషుడు॥ నీతల్లి పేరేమని అడిగెను.

ప్రకృతి॥ నీతండ్రి పేరేమని అడిగెను.

పురుషుడు॥ నాకు తండ్రిలేదనె.

ప్రకృతి॥ నాకు తల్లిలేదనె.

పురుషుడు॥ అయితె మనమిద్దరము మూలంలేకనే వచ్చినాము గాని నీపేరేమని అడిగెను.

ప్రకృతి॥ నాశరీరం ప్రకృతి నేను పురుషుణ్ణి.

పురుషుడు॥ నీకు రెండుపేర్లు నీవే పెట్టుకున్నావా యెవరైనా పెట్టి నారా.

ప్రకృతి॥ నాకు నేనే పెట్టుకున్నాను.

పురుషుడు॥ నీవు శరీరం వొకటేనా వేరేవేరేనా.

ప్రకృతి॥ నేను వేరే శరీరం వేరే.

పురుషుడు॥ సుఖదుఃఖాలు నీకా శరీరానకా ?

ప్రకృతి॥ శరీరము జడము అది యెరుగదు. విలక్షణమైన నాకు లేనిలేదు.

పురుషుడు॥ నీవు నేను వొక్కటేనా.

ప్రకృతి॥ నీకు నీవే నాకు నినే.

పురుషుడు॥ అట్లయితె చూతామని పురుషుడు మాయమయ్యెను.

ప్రకృతి॥ యీ ప్రకృతి యెంత వెతకినా యెక్కడాలేడాయె, జాడ తెలియకపాయె అని తపస్సు చెయ్యంగ పురుషుడు వచ్చె.

పురుషుడు॥ యెందుకు తపస్సు చేస్తావు అని అడిగె.

ప్రకృతి॥ నీవు యెవరు ? నీ పేరు యేమి ? అని అడిగె.

పురుషుడు॥ నాపేరు గురువు అనె.

ప్రకృతి॥ నా పేరు ప్రకృతి అనే స్త్రీ.

పురుషుడు॥ నీవు వేరే శరీరం వేరేనా ? వొక్కటేనా ?

ప్రకృతి॥ నేను వేరే శరీరం వేరేకాదు. నేను శరీరం వకటే.

పురుషుడు॥ యెందుకా రెండుగా జెప్పితివి.

ప్రకృతి॥ యిందాక యేమో భ్రమసినాను యిప్పుడయితేనో నేను శరీరం వక్కటేగాని నాకు వక్కడే భ్రమ వున్నది.

పురుషుడు॥ యేమి భ్రమ.

ప్రకృతి॥ మీపేరు గురువు అంటిరే అది యెటువంటిదో అని తెలుసుకోవలెనని భ్రమ

పురుషుడు॥ అట్లయితె చెప్పుతాను గాని యెల్లప్పటికి యేకరీతిగా వుంటావా పరిపరివిధముల వుంటావా.

ప్రకృతి॥ నిద్రవస్తే నిద్రాపోతా, కలవస్తే కలగంటా, మెలుకువవస్తే మేలుకుంటా.

పురుషుడు॥ యీ మూడు శరీరానక నీకా.

ప్రకృతి॥ నేను నిదురబోతె శరీరము నిదురపోతుంది. నేను కలగంటే శరీరము కలగంటుంది. నేను మేలుకుంటే శరీరం మేలుకుంటుంది. నన్నువిడచి శరీరము వుండదు. శరీరాన్నివిడచి నేను వుండను.

పురుషుడు॥ అట్లయితె యిపుడు యేమంటావు.

ప్రకృతి॥ గురువని అంటిరే అది తెలుపుము.

పురుషుడు॥ అది మహా అసాధ్యము యెంతవారికి తెలియదు.

ప్రకృతి॥ అయ్యా శీఘ్రంగా సూచనచెయ్యండి యెపుడు యెప్పుడా అని వున్నది. యెంతదైనా తెలుసుకుంటాను. నాకు యేమీ అసాధ్యము లేదు.

పురుషుడు॥ గురుసేవచేతగాని భ్రాంతి రహితం కాదు. నేను నీ వలనే అపేక్షచే గురుసేవజేసి పుట్టని చావనిదాన్ని తెలుసుకున్నాను.

ప్రకృతి॥ అది యెక్కడ వున్నది.

పురుషుడు॥ పుట్టనిది చావనిది సకలదేశాలయందు సర్వకాలాల యందు సమస్తమైన వస్తువులయందు చలించక వున్నది.

ప్రకృతి॥ యింతేకదానాకు వేరేవున్నట్టు వున్నది. నేను అలాగు కాను.

పురుషుడు॥ నీవు అది యెన్నటికికావు. నివు అదికాదు. అది నీవు కావు అది అదే నీవు నివే నీకు దానికి చాలా యెక్కువ తక్కువ.

వున్నది మొదలు కొన లేనిది. నీకు మొదలు కొన వున్నది. దానికి ఉత్పత్తి స్థితిలయంలేదు.

నీకు ఉత్పత్తి స్థితిలయం వున్నది. గనుక చాలయెక్కువ తక్కువ వున్నది.

ప్రకృతి॥ సరే వున్నది వున్నట్టు చూడంబడేయుక్తి సూచన చెయ్యండి యేమి కష్టపెడుతావయ్యా శీఘ్రంగా చెప్పండి. దరిద్రుడు ధనవంతుడైతె ధనకాపీయంలావు. ఆలాగే మీరు శ్రమపడినారుగనుకా శీఘ్రంగా దయ రాదు. యిది నమ్మనో నమ్మదో అని చెప్పరు. యెంత కఠినమైనసరే తెలుసుకుంటాను.

పురుషుడు॥ మీకు తీవరం మహాలావు.

ప్రకృతి॥ స్వామీ దయచెయ్యండి యీ గుర్రెరిగే శరీరం రెప్పపాటి కంటె శీఘ్రంగా పొయ్యేది.

పురుషుడు॥ రాకడ పోకడలేనిది. పుట్టని చావనిది. సకలదేశాల యందు సర్వకాలాయందు సమస్తమైన వస్తువులయందు చలించక మొదలు కొనలేక తనకుతానె స్వతసిద్ధమై వున్నది.

ప్రకృతి॥ నాలుగు దిక్కులు పారజూచి నేను యేలాగున వచ్చినాను.

పురుషుడు॥ కలలో శరీరమువలె వచ్చినావు.

ప్రకృతి॥ అది యేలాగు చెప్పండి.

పురుషుడు॥ కలదోచిన శరీరము యేలాగో ఆలాగే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు. యెంత గట్టివాడు అయినా సతతం సార్వ కాలం మరువక వుండవలెను. వుండకపోయెనా భ్రాంతి పుడుతుంది అశ్రద్ధ కూడదు. యింతకంటె యెక్కువలేదు.

ప్రకృతి॥ సరే అసాధ్యం అంటె భయ మాయ. యేసాధనలేకపాయె యేయుక్తి లేకపాయె జ్ఞానకర్మాలు సకలభాష్యాలు సిద్ధాంతాలు యెక్కడ పాయెనన్నా యేమిఆశ్చర్యము గురుకటాక్షంచాత అనాయసం ఆయె వొక్క బైనా భ్రాంతి పుట్టకపాయె అచలం చలించదు. గనుక దర్వాజ తీసివేశి నటుఆయె, వున్నదే వున్నది. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమి లేదు. కలలోవచ్చిన శరీరం యేమిలేదు. అని నిశ్చయం అయినట్టు ఆయ.

పురుషుడు॥ యిదే గురువాక్యం యింతకంటె అధికమైన గురువాక్యం లేదు. సార్వకాలం శరీరంలేని అచలం మాత్రమే ఉండెను. యిదే విచార ణకు ఫలం.

శ్లో॥ అశరీరం సర్వదాఽస్తి । శరీరం రహితంసదా ।
అయమేవనద్యోముక్తి । రస్యదాభ్రమకారణం॥

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం రాకమునుపు అచలమే వున్నది. వున్నప్పుడు అచలమే వున్నది. యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు అన్నా అచలమే వున్నది.

ఇతి శ్రీ శివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే ।
చైతన్యనిరసన ప్రకరణం ద్వితియోధ్యాయః.



శ్రీ సద్గురవేనమః

# అహంకార నిరసన ప్రకరణము

3 శ్లో॥ స్వపూర్ణ । వ్యతిరేకేణ । జీవబ్రహ్మ మయంజగత్ ।
నాస్తిమాయాసదాబ్రహ్మ । నాస్తి నాస్తి విధీయతే॥

గురు॥ ఈవుత్త బట్టబయలు ఏమిలేదు. అని సిద్ధాంతమే సిద్ధాంతము. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు. యింతకంటె అధికములేదు.

యీ మూలంలేని గుర్తెరిగే శరీరమే అహంకారము.

యీ గుర్తెరుగబడె యెరుకనే అహంకారము.

అహంకారము లేని వారు యెవరూ లేరు.

అందరు అహంకార స్వరూపులే.

హం సోహం, శివోహం, ఈశ్వరోహం, కూటస్థోహం, నేను బ్రహ్మను. నేను విష్ణువును.

నేను ఈశ్వరుడను అని కొందరు హెచ్చుగా పల్కుదురు ఘనముగా పల్కుదురు.

నేను చండాలుడను, నేను మాలను, నేను మాదిగను, నేను తురకను, నేను శూద్రుడను, నేను వైశ్యుడను, నేను రాజును, నేను రెడ్డిని. నేను బ్రాహ్మణుడను అని పలుకుదురు.

అన్ని ఘననీచములే కాని అహంకారములేని వారు యెవరు లేరు.

అందరూ అహంకారులే అహంకారమే అన్నికులాలు మోసుకొని వున్నది గనుకనే అహంవృత్తి యెప్పుడు కలుగునో అప్పుడు చండాలునితో సమానము.

అహంవృత్తి లేని గురువు కావలెను.

అహంవృత్తి అన్నిటికి మూలము.

అహంకారమువల్లనే అన్ని భూతాలు కలిగినవి.

అహంకారము వల్లనే అన్నిమతాలు కలిగినవి.

అహంకారమే ప్రపంచము.

అహంకారమే అవతారాలు.

అహంకారమే స్త్రీలు.

అహంకారమే పురుషులు.

అహంకారమే వేదశాస్త్రిలను గల్పించినది.
అహంకారమే లేకుంటే యెవ్వడు యెరుగు.
శిష్య॥ అయ్యా అహంవృత్తి యెటువంటిది.
గురు॥ అహంకారం యేలాగు వున్నదంటే నీళ్ళకుండలోని చంద్రుని వలె.
శిష్య॥ నీళ్ళకుండపోతె నీళ్ళలోని చంద్రుడు యేమాయె.
గురు॥ ఛాయా పురుషవత్.
ఛాయ పురుషునితోటి పోయెను.
జగత్తు కుందేటికొమ్ము వంటిది.
జగత్తు లేకపోతె యేమిలేదు.
సత్తువుంటె అసత్తు వున్నది.
అసత్తు లేకపోతె సత్తులేదు.
జ్ఞానంలేదు అజ్ఞానంలేదు.
సుఖం వుంటెనే దుఃఖంవున్నది.
సుఖంలేకుంటె దుఃఖంలేదు.
జననంలేదు మరణంలేదు.

ప్రపంచము గొడ్రాలు బిడ్డవంటిది. కుందేటి కొమ్ము వంటిది. ఆకాశ పుష్పంవంటిది.

జగత్తులేనేలేదు వున్నదంటె అపరాధం. ప్రాయశ్చిత్తం. జగత్తు లేనేలేదు. వేదాలు వెర్రివాక్యాలు లోకుల మాటలు కాకుల కూతలు. ప్రపచం యెరుగనివారు వున్నదని అనుకున్నారు. నేతిబీరకాయ అంటేనెయ్యి కారినదా. ఆప్పచ్చికొండ అంటేభక్ష్యాలున్నవా. బెల్లంకొండ అంటె బెల్లం వున్నదా ప్రపంచం లేనేలేదు.

శ్లో॥ నారాయణాత్పరంవస్తు । తస్మిన్నాహంకదాచన ।
గుణత్రయమనవిద్యంతే । వికారరహితంసదా॥

ఇదంవస్తు నారాయణాత్పరం శేషం స్పష్టం. ఆచార్య కటాక్షంచేత

కావలె ఆచార్యకటాక్షం లేకపోతె యీ గుర్తెరిగే చిద్రూపమనెఅహంకారమే అయివుండి అహంకారం లేక పోవలెనుఅని అనుకుంటు వున్నది.

యిరువై అయిదోది అయిన యెరుక అను అహంకారమే ఆత్మ శరీరం. గనుక అహంకారం లేనివారు యిరువైఆరోది అయిన అత్యంత విలక్షణులు. వారే శ్రీయఃపతి వారే యీ శరీరమందు అహంకారం లేక వున్నవారు. వారే అశరీరులు అహంకారం లేకుంటె వేదాలను వేదోక్త మార్గాలను యెవ్వడు యెరుగు. అన్ని అహంకారనికేగాని అహంకారంలేని.

1. బసవన్న గారికి 2. నమ్మాళ్వారు గారికి
3. స్వామి జియ్యరుకు 4. శంకరాచార్యులకు

వీరులకు అహంకారమే వున్నట్టయితే రామానుజాచార్యులు బ్రహ్మణుడు రెడ్డికులపు నమ్మాళ్వారుల గారికి దాసుడు యెందుకు అయ బ్రహ్మణుడు శూద్రవాని శిష్యుడు ఆయె.

బ్రాహ్మణుడు చన్నయ్య భక్తుడు అయెను. గనుక బసవన్నగారు బ్రాహ్మణుడు గాడు.

పంచబ్రహ్మల లక్షణం

1. మనుబ్రహ్మ కమ్మరవాడు.
2. వానితమ్ముడు మయబ్రహ్మ వడ్లవాడు.
3. వానితమ్ముడు త్వష్టబ్రహ్మ కంచరవాడు.
4. వానితమ్ముడు శిల్పబ్రహ్మ కాశవాడు.
5. వానితమ్ముడు హిరణ్యబ్రహ్మ కంసాలవాడు.

వీరె దేవతల తండ్రులు వీరె మతోద్ధారకులు వీరెఅకారాది క్షకారాంతవర్ణాలు కల్పించారు.

బ్రహ్మ నిర్మాణమే అంతా । బ్రహ్మకల్పనేమను బ్రహ్మకల్పన లేక బొడ్డుతెగదు అటుతర్వాత గోడ్డలి లేక పనివెళ్ళదు.

బ్రహ్మ సమ్మంధుడు బ్రాహ్మణుడుగనుక బ్రహ్మమెయెక్కువ, కర్మంవలన నిర్మాణం.

మతంగ మహాముని, అరుంధతి గురువు, శ్యామలా శక్తి తండ్రి వ్యాసులకంటె దొడ్డవాడు.

పుట్టుబ్రహ్మణులువేరే వడుగుబ్రహ్మణులు వేరె.

మనుబ్రహ్మమే సర్వం, బ్రహ్మకంటె యెక్కువ యెవ్వరు లేరు. విచారిస్తె ఇదే సత్యం.

యీ బ్రహ్మమనే అహంకారం యెట్లపుట్టినదో అని విచారించగా మూలమేలేదు. అహంకారాన్నే నిర్గుణమని అన్నారు. ఆ నిర్గుణము వల్లనె అన్ని కలిగినవని అంటారు. ఆ నిర్గుణము పుట్టించేదికాదు. పుట్టబడినది కాదు. అనిర్గుణమనె పరిపూర్ణానకు యెరుకలేదు గనుక మరుపులేదు. లేక తోచినది అహంకారమే గనుక అహంకారంచేసిన గ్రంధాలు అహంకారానికే ప్రమాణం, ఆహంకారంవలన అహంకారం పోనేరదు.

అహంకారమే జ్ఞానం అహంకారమే అజ్ఞానం
అహంకారం అహంకారమును వృద్ధిబొందించును.
అహంకారమును అహంకారము లయమును చేయును
అహంకారం నిత్యముగాదు. అహంకారం తెలియనియ్యదు
అహంకారం అహంకారమునే నరకములో వేయింపుచున్నది
అహంకారం దేహమవుచున్నది ఆహంకారం మన్నుఅవుచున్నది
అహంకారం దుమ్ము అవుచున్నది అహంకారం చెడుది
అహంకారం మంచిది అహంకారం అబద్ధమంచున్నది
అహంకారం నిబద్ధిఅంచున్నది అహంకారమును నమ్మరాదు

అహంకారం యెవరివల్ల పుట్టినదంటె యెవరివల్లపుట్టనేలేదు. కలలో వస్తువులవలెనే వచ్చినది, కలలోనివి కలలోనె నశించును. కలకు కల నిజము. కలకు కల అబద్ధము, అహంకారం యెరుక పొక్కటె, యెరుకే

చిద్రూపం, శ్రీమన్నారాయణ రూపం, అహంకారం లేకుంటే చిత్తేవుండదు. అహంకారంలేకుంటె నామంలేదు. రూపంలేదు. కైంకర్యము చాతగాని అహంకారం వదలదు.

గురుస్వామి సాందీపునివంటి వారుకావలె. అయితె కైంకర్యము చాత యీమెరుక సార్వకాలంలేకుండ చేస్తారు.

## కైంకర్యలక్షణం

గుర్తెరిగే దేహాభిమానం లేకుంటేసరి। కైంకర్యముకంటే అధిక మైన భక్తిలేదు. గోపికలు కైంకర్యముచేతనే కడతేరినారు. కైంకర్యమే పరమ రహస్యం.

శిష్యు॥ కైంకర్యం అంటె

గురు॥ కింకరత్వం అహం బహ్మాస్మిఅనే స్వతంత్రమువిడిచి, ఆచార్యకటాక్షంకొద్ది నడవటమే కైంకర్యంవలననె జన్మరాహిత్యం గుర్తెరిగే దేహం ఆచార్యుని శ్రీపాదాల పాధరక్ష వారుయేమైనా చెయ్యని. వారికటాక్షంకంటే అధికంలేదు. వారేసంసార సముద్రం దాటించేవారు. కాని కను పదేశరీరం ఆచార్య అంతరంగ సేవకు అర్పించిమలపంచకము తీర్థ ప్రసాదములుగా వంచనలేక పుచ్చుకున్నవారే కైంకర్యరహస్య మెరిగిన భ్రాంతిరహితులమని ప్రజలను నమ్మించి జిహ్వావస్థరుచులనువిడ వక తినరాని పదార్థములు తినుచు చెయరాని పనులు చెయువారలె దొంగ గురువులు. ప్రపంచద్రోహూలు. వీరలకొరకే యమధర్మరాజు నిర్మింపబడ్డాడు. వీరల నివాసముకొరకే రౌరవాది నరకము నిర్మాణమై యున్నది. యింత కంటె కులద్రోహులు గుణద్రోహులు వేరుగాలెరు.

తీర్థం కైంకర్యమే ప్రసాదం కైంకర్యమే. కైంకర్యంతోటి అహంకారంబోవును. ఇదెపరమరహస్యం. దీనినుంచి పరమశాంతి. కైంకర్యమే ముక్తి ఫలం. ఆచార్యుని కరుణనే తీర్థం. ఆచార్యుని సమ్మతమె ప్రసాదం. యింతకంటె రహస్యంలేదు. గుర్తెరిగె దేహం ఆచార్యునికి సమర్పిస్తెసరి. **తను మనోధనములయందు వంచనకూడదు.**

శ్లో॥ యథానాహం తథాశుద్ధం । తస్మాత్ శుద్ధేననిర్ణయః ।
జగదస్తీతికోవేద నాస్తి । కోసచనిర్ణయః ।

శ్లో॥ ఆత్మాతీతం కేవలాత్మా । దేహోనాస్తికదాచన ।
అస్తినాస్తీతికోవేద నిర్ణయోనాస్తి సర్వదా॥

శ్లో॥ శుద్ధేసుషుప్తి దృష్టాంతం తస్మిన్నాహంకదాచన ।
తద్వ్యత్సదాపియస్యాస్తి ప్రపంచంనాస్తి సర్వదా॥

నిదురలో అహంకారం లేదుగనుక కేవలాత్మే వున్నది.
మూర్ఛలో అహంకారంలేదు. అపుడు కేవలాత్మే వున్నది.
మరణంలో అహంకారంలేదు. అపుడు కేవలాత్మేవున్నది.
సమాధిలో అహంకారం లేదు. అపుడు కేవలాత్మే వున్నది.
మనుష్యులచేత యేది యేది చెప్పబడుచున్నదో అదే సర్వ శూన్యము.
యేదేది చూడబడుచున్నదో అదె నరునికొమ్ములవంటిది.
యేదేది వినబడుచున్నదో అదే ఆకాశపుష్పమువంటిది.
యేదేది గుర్తెరుగబడుచున్నదో అదే గొడ్రాలు బిడ్డవంటిది.

పలికేదికాదు. చూచేదికాదు. వినేదికాదు. గుర్తెరిగేదికాదు. కదిలేదికాదు. మెదిలేదికాదు, తెలిసేదికాదు, కలిసేదికాదు, అంటేదికాదు, తలిచేదికాదు, కొలిచేదికాదు, వొలిచేదికాదు, పిలిచేదికాదు, మెలిచేదికాదు, నడిచేదికాదు, పురికేదికాదు, చెప్పేదికాదు, వొప్పేదికాదు, కొద్దిదికాదు, గొప్పదికాదు, పొడుగుదికాదు, పొట్టిదికాదు, అణువుకాదు, మహత్తువుకాదు, బ్రహ్మకాదు, విష్ణువుకాదు, శివుడుకాదు, పురుషుడుకాదు, ప్రకృతికాదు, అహంకారంకాదు ఆకాశముకాదు, వాయువుకాదు, వహ్నికాదు, జలముకాదు, భూమికాదు, జ్ఞాతకాదు, మనస్సుకాదు, బుద్ధికాదు, చిత్తంకాదు, సగుణంకాదు, నిర్గుణంకాదు, జీవుడుకాదు, ఆత్మకాదు, దేహంకాదు, రూపంకాదు, పేరుకాదు, వూరుకాదు, శూన్యంకాదు, యోగంకాదు, భోగంకాదు, రోగంకాదు, సుఖంకాదు, దుఃఖంకాదు, ఏదికాదు.

పుట్టనిచావనిది సకలదేశాలయందు సర్వకాలాలయందు సమస్తమైన వస్తువులయందు మొదలుకొనలేక చలించక తనకుతానే స్వతసిద్ధమై యున్నది.

మూలంలేని యీగుడ్డైరిగే శరీరం యేమిలేదు అని గురువాక్యం మరువకూడదు.

ఇతి శ్రీ శివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే

అహంకార నిరసన ప్రకరణః

తృతీయో ధ్యాయః.

---

శ్రీ సద్గురవేనమః

# క్షేత్రక్షేత్రజ్ఞ నిరసన ప్రకరణము

4 శ్లో॥ దృశ్యా దృశ్యవిహీనాత్మా । ద్రష్టాద్రుక్ వివర్జితమ్ ।
ఖండాఖండ విహీనాత్మ । క్షేత్రక్షేత్రజ్ఞ వర్జితమ్॥

గురు॥ యీ వుత్త బట్టబయలు ఏమిలేదు అని సిద్ధాంతమె రాద్ధాంతము.

1. క్షేత్రక్షేత్రజ్ఞలక్షణ ప్రకృతి ద్వయదోషరహితమే కర్మం
2. ప్రకృతి ద్వయదోషరహితమే వ్రతం.
3. ప్రకృతి ద్వయదోషరహితమే పుణ్యపాపరహితం.
4. ప్రకృతి ద్వయదోషరహితమే ధర్మాధర్మరహితం.

1. ప్రకృతి ద్వయదోషరహితులు.

ప్రకృతి ద్వయదోషరహితుడు చెయ్యడు విడువడు అందరివలెనే వుంటాడు వారిజాడ తెలియదు.

ప్రకృతి ద్వయదోషరహితుడైనవాడు చేస్తాడు చెయ్యడు. విడిచి పెడుతాడు అందరికంటె లెస్సచేస్తాడు.

ప్రకృతి ద్వయదోషరహితులకు పట్టడంలేదు విడువడంలేదు. సార్వకాలం ద్వయిదోషరహితమే స్వభావం.

క్షేత్రక్షేత్రజ్ఞలక్షణ ప్రకృతి ద్వయమే సర్వం
ప్రకృతి ద్వయంహితమే పారమార్థికం.

ప్రకృతి ద్వయదోషమే వేదాలకల్పించింది.
శాస్త్రాదులు వ్యాసాదులు ప్రకృతిద్వయులె.
వున్నదని యెరుకలేదు లేదని యెరుకలేదు.

ప్రకృతి ద్వయదోషరహితులు అందరివలెనె దోషద్వయంలేని యుక్తి సంపాద్యం చేయించుకొని మెదలుతారు.

దోషద్వయం లేనివారు అని యేలాగు యెరుకఅంటె.

1. వారికి రాగద్వేషాలులేవు.
2. మూర్ఖంలేదు
3. సమయోచిత ప్రజ్ఞగలవారు.
4. దేహాభిమాన రహితులు.
5. శాస్త్రాభిమానంలేదు.
6. మనిషికొద్ది నడిచేవారు.
7. స్వదృష్టిచేత వున్నదోలేదో.
8. అన్యులదృష్టిచేతవున్నట్టు వుంటుంది.

గురిగింజల బంతిచూచి యెరుగనివారు కొందరు మండేనిప్పు అని అంటారు. వారుఅంటె కాలిందికాదు. విచారించనిమాటగనుక అది గురిగింజల బంతె.

అలాగె ప్రకృతి ద్వయదోషరహితులు చేసేవ్యాపారం అన్యుల చేత కల్పితం.

1. స్వథాచూడడు, 2. వినడు, 3. మాట్లాడడు, 4. కదలడు, 5. మెదలడు, 6. [illegible]ంచెయ్యడు, 7. రెప్పపాటుఅయినా క్రియలేదు.

సార్వకాలం ఉపాది ద్వయదోష రహితులుగనుక యిది రహస్యం. యీ రహస్యం లోకమందు దుర్లభం. ప్రకృతి ద్వయదోష రహితులకు వేదశాస్త్రాల మర్యాదలేదు.

1. అజ్ఞానులకు కర్మకాండ ప్రమాణం.
2. జ్ఞానులకు జ్ఞానకాండ ప్రమాణం.
3. యీ ప్రకృతి ద్వయదోషరహితులు జ్ఞానులుగారు అజ్ఞానులు కారు గనుక వీరికి వేదశాస్త్రాలు లేవు.

వేదాలు వెర్రివాక్యాలు అయి, కర్తలేనిదే కర్మంబోధిస్తుంది, జ్ఞానం లేనిదే, జ్ఞానం దొడ్డదని చెప్పుతాది.

యీ వాక్యాలు యేలాగునమ్మ.

యెవ్వరు కర్తలు.

జ్ఞానం అజ్ఞానం ఆయ. కర్త అకర్త ఆయ. యిదియేమివింత.

భగవద్వాక్యాలు స్వాములవారి వాక్యాలు సౌకర్యం ఆయ. యిది పరమరహస్యం.

క్షేత్రక్షేత్రజ్ఞ లక్షణ శ్రు॥ ప్రకృద్వయాఖ్యః । ఉపాదిద్వయదోష రహీత మేవమోక్షః॥

శ్లో॥ క్షేత్రక్షేత్రజ్ఞ యోరన్యం । నామరూప వివర్జితం
సదాత్రిపుటీరహితం । సర్వద్వంద్వ వివర్జితం॥

## 2. ప్రకృతి ద్వయ పేర్లు

త్రిపుటి - జ్ఞాత, జ్ఞానం: జ్ఞేయం.

శబ్దోదయ॥ ద్వంద్వాలు సత్తు, అసత్తు చిత్తుజడం, సుఖం దుఃఖం, క్షేత్రం, క్షేత్రజ్ఞుడు, జగత్తు జీవుడు. జ్ఞానం అజ్ఞానం. విద్యా అవిద్యా. కారణం కార్యం: అత్మా అనాత్మ, ప్రకృతి పురుషుడు, సాకారం నిరాకారం, సుగుణం నిర్గుణం. కర్మంజ్ఞానం, దర్మం అధర్మం, పుణ్యం పాపం, పతివ్రత వ్యభిచారి, ముండ ముత్తైద, బద్ధుడు ముక్తుడు, గృహస్తు గుండ గొయ్య, అహితాగ్ని అనాహితాగ్ని, బిడ్డతల్లి గొడ్డురాలు, మంచివాడు శత్రువాడు.

గుర్తెరిగేది మాయ అదే అవిద్య అదే ప్రకృతి గుర్తెరుగబడేదిమాయ, అదే ప్రకృతి ప్రకృతిద్వయంగనుక గుర్తెరిగేది ప్రకృతి ద్వయమని అచార్య స్వాములవారిచేత సిద్ధాంతం సిద్ధాంతమె రాద్ధాంతం.

వున్నదె వున్నది.

ప్రకృతి ద్వయం యెరుగదు ప్రకృతి ద్వయం లేదుగనుక దానికె బంధం మోక్షం.

వున్న దానికి అంతరంలేదు. బాహ్యంలేదు. ప్రకృతిద్వయం లేదు. గనుక క్షేత్రక్షేత్రజ్ఞ స్వరూపమె ప్రకృతిద్వయం ఆదేవుపాధిద్వయం

ఉపాధిద్వయదోషమె దోషం యిదిలేకుంటే దేనికిలోపటా ! దేనికిబయటా !

వున్నదానికి అంతరంలేదు - బాహ్యంలేదు. మొదలులేదు కొనా లేదు యెప్పుడు వొక్కతీరె.

ప్రకృతిద్వయం లేదుగనుక సమష్టిక్షేత్రాలు. వంధ్యాపుత్రవత్ క్షేత్రం మూడుగుణాలవలన అయింది సత్వగుణంవలన నేను అనె తెలివిపుట్టింది.

తెలివికి కారణం క్షేత్రం. గాఢనిద్రపోతె కారణం వున్నదోలేదో క్షేత్రజ్ఞుడు లేకపోయినాడు. క్షేత్రంలేకుంటే క్షేత్రజ్ఞుడు వుండడు.

మాయస్వరూపం గనుక అవిద్యా స్వరూపంగనుక.

క్షేత్రం మొదలైన విషయాలకు గుర్తెరిగేది పరాఖ్య చైతన్య స్వరూపిణిఅనె పేరుగల విషయి.

1. ఆదే అదిష్ఠానం. 2. అదే పరబ్రహ్మ స్వరూపం.
3. అదే సచ్చిదానంద స్వరూపిణి 4. అదే జగత్కారణం
5. అదే ఆనందసమష్టి క్షేత్రాలు 6. అదే కార్యాలు
7. కారణం చైతన్య స్వరూపిణి 8. పరా ప్రకృతి పెద్దఅబద్ధం
9. సాక్షిణి గుర్తెరిగే క్షేత్రజ్ఞుడైన పరాప్రకృతి
10. ప్రకృతిద్వయమని రాద్ధాంతం

3. ప్రకృతిద్వయలక్షణం

1 ప్రకృతికె భ్రాంతి 2. ప్రకృతికె సంశయం 3. ప్రకృతికె యోగాభ్యాసం.

జ్ఞానమె ప్రకృతి పురుషుడు, ప్రకృతిద్వయమే అవతారాలు.
క్షేత్రక్షేత్రజ్ఞ స్వరూప ప్రకృతిద్వయానకె బంధం మోక్షం.
ప్రకృతిద్వయంవలనకే వేదశాస్త్రాగమపురాణాలు.

1. ప్రకృతి ద్వయమేకారణకార్యం. 2. ప్రకృతి ద్వయమె చెప్పేది.
3. ప్రకృతి ద్వయమె వినేది. 4. ప్రకృతి ద్వయమె చూచేది.
5. ప్రకృతిద్వయం అంటె మాయ. 6. మాయఅంటె యేమీలేదు.

7. క్షేత్రం మాయ. 8 క్షేత్రజ్ఞ స్వరూపం అవిద్య.
9. అవిద్య అంటె యేదిలేదో అదే అవిద్య.

క్షేత్రం ప్రకృతి మాయ. క్షేత్రం ప్రకృతి అవిద్య. అవిద్య లేదు. మాయలేదు. ప్రకృతిద్వయమె అవిద్యాద్వయం. మాయ యీశ్వరుడు. అవిద్య జీవుడు. మాయ అవిద్యారహితం భ్రాంతిరహితం. క్షరోపాధి క్షేత్రం అక్షరోపాధి క్షేత్రజ్ఞుడు.

శ్రు॥ "క్షరాక్షరోపాధి ద్వయదోషరహితమేవ। విచారస్యఫలం"॥

కల్పనారహితమైతే,పురుషుడుసిద్ధపురుషుడు. జగత్తువున్నదనిఅనడు లేదనిఅనడు యేమీలేదని అనడు.

ప్రకృతి ద్వయరహితుడు గనుక యెరుకలేదు. జ్ఞానజ్ఞానరహిత మైనది గనుక యెరుకలేక పోవటంలేదు.

వున్నదని నిర్ణయ కర్తగాడు. తనను తాను యెరుగడు.
రెండో దాన్ని యెరుగడు.

ప్రకృతి ద్వయరహితమైన ఆ కారాణవస్తువు ప్రకృతిద్వయాన్ని యెరుగదు ప్రకృతి ద్వయం కారణాన్ని, యెరుగదు.

ప్రకృతి ద్వయరహితమె విచారణఫలం.

## 4. కేవలాత్మ లక్షణం

1. సాధనాసాధ్య పరామర్శ రహితమె అయిక్యం 2. అదే సుఖదుఃఖ రహితం 3. అనుత్పత్తి నాశనరహితం 4. అదేవృద్ధి క్షయరహితం 5. అదే కేవలాత్మ.

అదే క్షేత్రక్షేత్రజ్ఞ లక్షణ ప్రకృతి ద్వయరహితమైన కేవలాత్మ.

1. సుషుప్తియందు ప్రకృతి ద్వయంలేదు కేవలాత్మ వున్నది.
2. మూర్ఛయందు ప్రకృతి ద్వయంలేదు. కేవలాత్మ వున్నది.
3. సమాధియందు ప్రకృతిద్వయంలేదు కేవలాత్మ వున్నది.
4. మెలకువై వున్నపుడు ప్రకృతి ద్వయంలేదు కేవలాత్మ వున్నది
5. మరణంయందు ప్రకృతిద్వయంలేదు కేవలాత్మ వున్నది.

యీ అయిదు అవస్థలయందు యెలాగువున్నదో అలాగే గురూప దేశానంతరం ప్రకృతిద్వయంలేక కేవలాత్మ వున్నది.

సాధనచాత సాధ్యంకాదు

జ్ఞానానకు యెరుకలేదు అని అనేరు. జ్ఞానంఅంటే పప్పుబువ్వ గుర్తెరిగేది కాదా అంటె ఇదికాదు వేరేవున్నదని అనేరు.

ఏలాగు చెప్పుచున్నారో

యెరుకలేనిది జ్ఞానంకాదు అజ్ఞానంకాదు. అందుకే జ్ఞాతకాడు, ద్రష్ట కాడు. త్రిపుటిరహితం.

శృతి॥ "విజ్ఞానమయముత్పన్నాం। జ్ఞాతాజ్ఞానమనోమయం। జ్ఞేయం శబ్దోదయోనైతి। త్రయముత్పత్తితఃపురః। జీవః ప్రకృతిః జీవోపాధిః। ప్రకృతిద్వయమేవ వుపాధిద్వయం"॥

దేహం లేనేలేదు. దేహంతోటి అన్నిపాయ

5. మొదటి జాబు

శ్రీ శరీరత్రయాఖ్య। పరాప్రకృతి। రహితనామ సిద్ధయేనమః।
చైతన్యాఖ్య పరాప్రకృతిరహిత నామసిద్ధయే నమః॥

సత్యాఖ్య బ్రహ్మరహిత, నిర్గుణరహిత, అద్వైతరహిత, జ్ఞానరహిత చిద్రూపరహిత మాయా అవిద్యారహిత, బంధమోక్షరహిత, ప్రకృతి పురుషరహిత, గురుశిష్యరహిత, వాచ్యార్థలక్ష్యార్థరహిత, నేనుఅనే చైతన్య రహిత, నీవు అనే చైతన్యరహిత, శబ్దరహిత, తత్వరహితమైన నీవునేను లేనటువంటి నిజరూపం, ఉత్పత్తి స్థితిలయాలను యెరుగదు.

యేమిపుట్టుతుందో, యేమిలయమౌతున్నదో, యెమివున్నదో యెవ్వరు యెరుగుదురోయివి వున్నవి అని చిత్తుకు యెరుక.

చిత్తుమాయా అవిద్య అయివున్నది యిది యెవ్వరుకారో వారి ముచ్చట వదసె.

చెప్పేవారుగురువులు వినేవారుశిష్యులు యింతకంటేమాయ వేరేలేదు.

యేమిబ్రాతును, సర్వం మీ చరణాలకు యివ్వే నూరు జాబులు.
**సచ్చిదానంద రహితాయనమః,**

## 6. రెండవ జాబు

శ్రీమద్యజన అధ్యయన దాన త్రిణీ కర్మనిరతులయిన వేరసార స్వరూపమైన చైతన్య స్వరూపమైన మహాకారణ దేహరహితమైన వేదసారా తీతులైన మీకు వేదసారాతీతం యేమివస్తుందో అదే నిజం.

మాయా అవిద్యఅనే పేరుగల అటువంటి చైతన్యాన్ని గూర్చి గుర్తెరిగే చైతన్యం యెలాగు సమాధానమైతే ఆలాగు ఆశీర్వచనములు నమస్కారములు, దండములు అని మాయ సమస్తభాషారూపిణి అయి వున్నట్టు వున్నది విచారించినవారికి.

విచారించనివారికి లేదు.

సిద్ధులు విచారించే మహాకారణ దేహమనే పేరుగల అటువంటి చైతన్య రహితులు గనుక.

వున్నదని యెరుగరు లేదని యెరుగరు. వారికి గుర్తెరుగుటమేదోషం. అటువంటి దోషరహితులు సిద్ధులు.

జ్ఞానులె అజ్ఞానులు నేను యెరుగుదును నేను యెరుగను అని చైతన్యమె యెరుగును. గనుక చైతన్యంకంటె మాయ అవిద్య వేరులేదు. యిది అత్యంత రహస్యం.

శాస్త్రంలో మాయా అవిద్య. చైతన్యంకంటే వేరులేదు అని వేదం చెప్పినది. గనుక వేదమనగా గ్రంధాలు జడం మాయా అవిద్య అని వ్రాసినారు.

ఆశాస్త్రిలలోనె ప్రకృతులు రెండు అని వున్నావి. చైతన్యం పరా ప్రకృతి. జడం అపరాప్రకృతి. అని వున్నది గనుక యిది వింతగాదు. జ్ఞానం మహాకారణ దేహం. శరీరత్రయిం అజ్ఞానం అని మర్యాద.

సర్వం గుర్తెరిగే చైతన్యం అని వేదశాస్త్రిలకు అభిమానం. మను ష్యులకు ఆలాగ జ్ఞానస్వరూపులుగనుక వొక్కటె కల్పనకు మూలం. జ్ఞానం కంటె కర్మం వెరులేదు.

గుర్తెరిగేది చేస్తుంది గనుక వేదశాస్త్ర వినోదంచూచి వెరవవద్దు.

గుర్తెరిగేదాని ప్రభావం గుర్తెరుగడం గురుద్రోహం.

సర్వసర్వం మూలం గనుక నిర్గుణంగనుక అద్వైతం గనుక హేతు లేని హేతుసటం.

మీకు పరదేవత ప్రసన్నమై తెలిసిందిగనుక తేలివివలె వున్నది. యెరుకను గెలిచేది కఠినం.

విద్యకంటే అవిద్యలేదు.

చూతామన్నా ఉత్పత్తిస్థితిలయాలు యేమిటిచాత పుడుతావి ? అంటే చైతన్యం సత్తాచాత అని పుస్తకాలలోనె వున్నది.

చైతన్యం వుంటే అలాగే. అదిలేకుంటే యేమిటిసత్తా ? యేమీ పుడు తుంది ? యీ వింత యెవరికి తేలియదు.

భగవానులకు తెలుసును అని భ్రమ. భగవానులు చిత్తా ? జడమా? రెండు లేకుంటే భగవానులు యెక్కడ ? మనం యెక్కడ ? మాయకంటే వేరుగాదు

యిది విచారిస్తె మీకుచాలు. మళ్లా మళ్లా చూడండి. అమ్మగారికి అయ్యగారికి వినుపించు. యెరుక యేమీలేదని జాగ్రతవుండవలె.

ఇతి శ్రీమద్గురు శివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే
పూర్వభాగే క్షేత్రక్షేత్రజ్ఞ ప్రకృతిద్వయ నిరసన ప్రకరణం
చతుర్థోధ్యాయః



శ్రీ సద్గురవేనమః

# ధర్మాధర్మ నిరసన ప్రకరణము

శ్లో॥ సత్యాసత్య విహీనంచ । విద్యావిద్య వివర్జితం ।
ద్వైతాద్వైత విహీనంచ । ధర్మాధర్మ వివర్జితం॥ 1

శ్లో॥ చిదేవదేవ చిదమేవలోకా । చిదేవభూతాని చిద్రింద్రియాణి ।
కర్తా నిరంతః కరణంచిదేవ । చిదేవసర్వం పరమార్థరూపం 2

శ్లో॥ చిదిహాస్తీతి చిన్మాత్ర । మిదంచిన్మయమేవచ ।
చిత్వంచిద హమేతేచ । లోకాశ్చిదితి సంగ్రహః॥ 3

శ్లో॥ చిదేవ పంచభూతాని । చిదేవ భువనత్రయం ।
విజ్ఞాన మదునాసమ్య । గహమస్మిచిదేవహి॥ 4

శ్లో॥ చైతన్యం శాశ్వితం శాంతం । వ్యోమాతీతం నిరంజనం ।
నాదబిందు కళాతీతం । తస్మైశ్రీ గురవేనమః॥ 5

1. విచారణ

గురు॥ యీ వుత్తబట్టబయలు ఏమిలేదు అనిరాద్ధాంతమే సిద్ధాంతము.

శృ॥ "సిద్ధోహం" శృ॥ "బుద్ధోహం" శృ॥ "హంసోహం"

శృ॥"అహంబ్రహ్మస్మి శృ॥ "జీవేశ్వరైక్య జ్ఞానం"

జ్ఞానమే బ్రహ్మ స్వరూపం, జ్ఞానమే పరమాత్మ, గుర్తెరిగేదినేను

1. నేను గుర్తెరిగేది యెక్కడ వున్నదో ? అంటే: ఆదిపరోక్షజ్ఞానం.
2. నేను గుర్తెరిగేది ఇక్కడ వున్నది అంటే: అది అపరోక్షజ్ఞానం
3. నేను గుర్తెరిగే ప్రకృతి అంటే :సాక్షాత్కారం

జ్ఞానంకంటే దొడ్డదిలేదు. గుర్తెరిగేది జ్ఞానమని పది వుపనిషత్తుల యందు చెప్పుచున్నది.

సాక్షి అంటె గుర్తెరిగేవాడు.

సాక్షిణి అంటె గుర్తెరిగే చైతన్య స్వరూపిణి

సాక్షివర్జితం అంటె మాయారహితం అవిద్యారహితం ప్రకృతిద్వయ రహితం క్షరాక్షరోపాధి ద్వయదోషరహితం

ప్రకృతి ద్వయానికె జగత్తుతోస్తుంది.

ప్రకృతి ద్వయరహితునికి యాలాగుతోస్తుంది

వున్నదానికి వున్నది తోస్తుంది. లేనిదానికి లేనిది లేనేలేదు.

పుట్టని చావనిది కేవలాత్మ పుట్టేది చచ్చేది ప్రకృతి ద్వయం

యిది లేకుంటే రెండు వున్నవని చెప్పితే,సత్యద్వయం రెండువున్న వని చెప్పరాదు లేనిదియెప్పుడూలేదు. వున్నది యెప్పుడూ లేకపోదు. యిదే విచారానకు ఫలం పుట్టని చావనిదే వున్న ది.

ప్రకృతి ద్వయరహితమే అనుభవం

అనుష్ఠానంలేదు విచారణమే కారణం ప్రకృతి ద్వయమే అనుష్ఠానం చేసేది విచారించేది ప్రకృతి ద్వయంలేదని నిశ్చయపర్యంతరం విచారించ వలెను.

సార్వకాలం ప్రకృతి ద్వయరహితమే మౌనం.

2. ఉపాధి ద్వయదోషరహిత లక్షణం

1. ఉపాదిద్వయదోషరహితమె మడి
2. ఉపాదిద్వయదోషసహితమె మైల
3. ఉపాధిద్వయదోషరహితమె సుజ్ఞానం
4. ఉపాధిద్వయదోషరహితమె మహాపూజ
5. ఉపాధిద్వయదోషరహిత మె యాత్రాఫలం
6. ఉపాధిద్వయదోషరహితమె జన్మరాహిత్యం
7. ఉపాధిద్వయదోషరహితమె తీర్థం
8. ఉపాధిద్వయదోషరహితమె ప్రసాదం
9. ఉపాధిద్వయదోషరహితమెసిద్ధి
10. ఉపాధిద్వయద్దోషరహితమె గురుపూజ
11. ఉపాదిద్వయదోషరహితమె లోకాతీతం
12. ఉపాధిద్వయదోషరహితమె యింద్రియజయం
13. ఉపాధిద్వయదోషరహితమె నియమం
14. ఉపాధిద్వయదోషరహితమె స్వస్త్రీవర్జితం
15. ఉపాధిద్వయ దోషరహితమె పురుషరహితం
16. ఉపాధిద్వయదోషరహితమె అఖండైశ్వర్యం
17. ఉపాధిద్వయదోషరహితమె అకర్తృత్వం
18. ఉపాధిద్వయదోషరహితమె అభోక్తృత్వం
19. ఉపాధిద్వయదోషరహితమె క్రియాశూన్యం

20. ఉపాధిద్వయదోషరహితమె నిర్గుణం
21. ఉపాధిద్వయదోషరహితమె గుణాతీతం
22. ఉపాధిద్వయదోషరహితమె పుత్తమం
23. ఉపాధిద్వయదోషరహితమె బీజరహీతం

ఇతి॥ శ్రీ సద్గురు శివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే
పూర్వభాగే ధర్మాధర్మ నిరసన ప్రకరణం
పంచమోధ్యాయః



శ్రీ సద్గురవేనమః

# కారణతను నిరసన ప్రకరణము

6 శ్లో॥ శుద్దేసుషుప్తావివచ । తస్మిన్నాహం కధాచన ।
తద్వత్ప్రదాస్తి యస్యాస్తి । ప్రప్రపంచంనాస్తి తస్యవై॥

## 1. సచ్చిదానందలక్షణం

గురు॥ యీ వుత్త బట్టబయలు ఏమిలేదు. అని సిద్ధాంతమె శత సిద్ధాంతము.

గుర్తెరిగే యెరుక సచ్చిదానందం ఆదే కన్నులయందు వున్నది. చూచేది సచ్చిదానందం గనుక నేను యెరుగుదును అని అనుభవం వున్నది గనుక నేనే సచ్చిధానందం.

యీ సచ్చిదానందమే పరదేవత అనె అమ్మవారు సర్వాన్ని గుర్తెరిగే అమ్మవారు గనుక సప్తకోటి మహామంత్ర స్వరూపిణి అనివున్నదిగనుక

శృ॥ సర్వార్ధధాత్రి సావిత్రి । సచ్చిదానంద స్వరూపిణి॥

అని వున్నాది గనుక గుర్తెరిగే సచ్చిదానంద స్వరూపులె అందరు

యీ యెరుకే అన్నికులాలు అనే, అంటే యెరుకతోటి అందరూ నేను ఫలానివాణ్ణి అని అంటారు గనుక అందరు యెరుకస్వరూపులె

యీ గుర్తెరిగే సచ్చిదానందం వుండెనా అందరు నిబద్దే.

యీ గుర్తెరిగే సచ్చిదానందం లేకపోయినా అంధరులేరుం

తనకుతానె స్వతసిద్ధమైవున్న అచలమనె పరిపూర్ణానకు యెరుకలేదు మరుపులేదు. *

ఆ పరిపూర్ణమె దేహాకారంగాక వున్నది. గనుక వికారంలేదు. గుణాలు లేవు. యింతకంటె యెక్కువలేదు. *

యీ శరీరం పుట్టకమునుపె తనకుతానె స్వతసిద్ధమై వున్నది అచలం గనుక యెన్నటికీ చలించదు.

దేహాకారంగాక వున్నది. గనుక యెరుకలేదు మరుపులేదు

వున్నది వున్నట్టె వున్నది సార్వకాలం వొక్కటీరె

వున్నదివున్నట్టు తెలిపే గురువు కలతలేని గురువుకావాలె.

## 2. మతాల లక్షణం

గురువు యెరుక స్వరూపము అయివుండెనా అరుంధతి తల్లి సాంప్రదాయంవారే

వశిష్టాదులవలె ఋషీశ్వరులు కర్మయోగులు కొందరు
శుకులవంటి విరక్తులు జ్ఞానులు మునీశ్వరులె కొందరు
జ్ఞానకర్మరహితమైన శుద్ధమార్గం వారుకారు.

వశిష్టాదులె బ్రాహ్మణులకు మూలమట. వారిసాంప్రదాయం వారికే యెరుక. శాస్త్రంలేక నడిచేవారే బౌద్ధులు

నులకచందయ్య చన్నయ్యగారు శైవులు, అప్పయ్య దీక్షితులవారు వారిభక్తుడట వారిదీ బసవన్నగారి కులమే.

రామానుజాచార్యుల వారిది బసవన్నగారి కులమే మారుసూరి నంబి గారి శిష్యుడట తిరుపణ్యాళ్వార్లగారి భక్తుడట

మాలవారైనాగాని మహాపెద్దలట వశిష్టాదులతో సమానం

శ్యామలాశక్తి అరుంధతి తంత్రిగనుక కొందరు ఋషులు ఆసాంప్రదాయంవారు, వారే శాక్తేయ మతంవారు శక్తి వున్నదని నమ్ముకునేవారు.

కొందరు చార్వాకులు సూర్యుడే దేవుడని నమ్మివున్నారు.

యీషణ్మతాలవారు కులంచెడ్డపతితులె. యీషణ్మతాలవారే వర్ణ సంకరులు.

బ్రాహ్మణుడు సత్యమైతే క్షత్రియునియొక్క అన్నం యేలాగుతినె.

శృతి॥ "ఆర్యాధిష్టితావాశూద్రాః" అనివుండె "ఆర్యాఃప్రయతాః వైశ్య దేవంనగుమ్న్కర్తారస్యు। ఆర్యాఃత్రైవర్ణికాః" అనివుండెనే వుండెగదా.

శాస్త్రంచేతనే కులంచెడేది.

శాస్త్రంచేతనే గుర్తెరిగేజ్ఞానమే చైతన్యం, సర్వంగుర్తెరిగేజ్ఞానమే చైతన్యం.

చైతన్యమే క్షేత్రజ్ఞుడు, వాడేసచ్చిదానంద స్వరూపమైన ఆత్మ.

వాడేపురుషుడు వాడేఆత్మ, వాడేయీశ్వరుడు, వాడేసర్వాన్ని గుర్తెరిగే వాడుగనుక సర్వజ్ఞుడు.

వొక్కదేహంలో జ్ఞానం కించజ్ఞురాలు వొక్కదేహంలో వాడే కించజ్ఞుడు. కర్మప్రతిపాదకశాస్త్రానకు బదులు. జ్ఞాన ప్రతిపాదక శాస్త్రం వలన కర్మంపుడుతుంది. కర్మద్వారా జ్ఞానోదయం అనేవారివెర్రి యేమని చెప్పవచ్చును.

జ్ఞానమే కర్మం చెయ్యమని బోధించె. వేదశాస్త్రాలు గురువులు రెండు వెర్రి.

గుర్తెరుగుటంచేత కర్మం పుడుతుంది, గుర్తెరిగేజ్ఞానమే సర్వార్థములు నేను నేనుఅని ప్రవర్తించేది స్వతసిద్ధమైనజ్ఞప్తి బ్రహ్మస్వరూపం. అదే ఆత్మ అదేజీవుడు అదే యీశ్వరుడు. గుర్తెరిగేజ్ఞానానికే సకల ఉపదేశాలు, చెప్పేది జ్ఞానం చూచేదజ్ఞానం వినేది జ్ఞానం, అది యెవరు యెరుగుదురో! వారు యేమి చేస్తారు ? యేమివినస్తారు ? జ్ఞానమే లోపటబైట వున్నదని చెప్పడం. అజ్ఞానం మిథ్యయని తెలిస్తే దేనిలోపల దేనిబైట అంతరబాహ్యాలు కల్పితం. బట్టబయలు దేహంలో చొచ్చిందా వెళ్ళిపోతుందా. అన్ని తిప్పలు యీ గుర్తెరిగే మాయకె. దానిమహిమ యేమని చెప్పవచ్చును. వున్నదంటె వున్నది చూస్తెలేదు. గురూపదేశానంతరంలేదు. మహావాక్య ఉపదేశం యెవరికిచెయ్య జ్ఞాన ప్రతిపాదకమే జీవేశ్వర ప్రతిపాదకం. తదాతీతం నిజం

యెరుకలేని షట్టి యెవరికికలదో వారుశుద్ధపురుషులు, వారేవారు. జ్ఞానులు కారు. అజ్ఞానులుకారు. యిదే ఉపదేశం.

అద్వైతం మిథ్యాజ్ఞాన స్వరూపంగనుక అమృతవాక్యం నమ్మిన వారికి కద్దు సంశయంలేదు.

### 3. యెరుక లక్షణం

కన్నులయందు వున్నది యెరుక. అదిమాయ ఉదే వ్యాపించి దానికి సమస్త నిర్ణయాలతో చెప్పబడ్డరి.

దానికే జ్ఞానమని అన్న. చైతన్యమని అన్న. జ్ఞప్తి అని అన్న క్షేత్రజ్ఞుడు అని అన్న అవిద్య అనీ అన్న యీశ్వరుడు అని అన్న మాయ అని అన్న. జీవుడు అని అన్న. ఆత్మ అని అన్న ప్రకృతి అని అన్న పర బ్రహ్మం అని అన్న సచ్చిదానందం అని అన్న స్వరూపం అని అన్న పరి పూర్ణం అని అన్న మహాలింగం అని అన్న. ఆదినారాయణుడు అని అన్న. అహంకారం అని అన్న జ్ఞానమయమని అన్న యిటువంటిమాయకే పరి యాయనామాలు.

### 4. జ్ఞానబీజ లక్షణం

దానియందు పెద్దలు, పిన్నలు, యోగులు, భోగులు జ్ఞానులు, కర్మలు మౌనులు, ఋషులు, దొరలు, దొంగలు, రాజులు, భృత్యులు దిగంబరులు, సన్యాసులు, వ్యాసాదిమహామునులు, దశావతారాలు, బ్రహ్మవిష్ణు మహేశ్వ రులు, ముప్పైమూడుకోట్ల దేవతలు, బ్రహ్మణులు, మాదిగలు, అష్టాదశ వర్ణాలు, సంధ్యావందనాలు, నిత్యనైమిత్తికాలు, కర్మాలు. ప్రతివిదాదిక జడాలు, కించిజ్ఞత్యాలు, సర్వజ్ఞతం, జననమరణాలు, సుఖదుఃఖాలు, ద్వైతా ద్వైతాలు, భేదాభేదాలు, కర్మాకర్మాలు జ్ఞానాజ్ఞానాలు, నానామతాలు, నానా వర్ణాలు, నానానిర్ణయాలు, భక్తిమహేశ్వరాలు, నిమిత్తమైనదాసత్వాలు, గురు వులు, శిష్యులు, మహాత్ములు, చిత్రవిచిత్రమైన స్వరూపాలు, పాపపుణ్యాలు బంధమోక్షాలు, సకలసంశయాలు, సకలనిశ్చయాలు- గుర్తెరిగే జ్ఞానబీజ మందు అంతా చెప్పబడ్డది.

### 5. బీజనిరసన లక్షణం

యిందులోపల చెప్పబడ్డది వొకటివుంటే వొకటి లేకపోదు

అట్లుగనుక అనేకజన్మాలయొక్క గురుభక్తి నిష్ఫల ప్రాప్తిచాతను

యీ బీజం నిరసనచేసేసద్గురు తావుకుపోయిన అన్నిటికి మూలం అయింది యేదోదాన్ని లేకుండా చూచిచేస్తాడు.

చేసినంతలోనె యీ చంచలమనేది నాశనమై యెక్కడచూచినా అచలమేవుండె.

యిదిమేమి ! అని అడుగుదామంటే అడిగేందుకు తానులేడు. చెప్పేటందుకు గురువులేడు. అచలంమాత్రంవుండె.

దానికి రాకడలేదు, పోకడలేదు. దానికి మొదలులేదు, కొనలేదు. దానికి పుట్టుకలేదు, చావులేదు. దానికి జ్ఞానంలేదు, కర్మంలేదు. దానికి పుణ్యంలేదు, పాపంలేదు. దానికి జన్మలేదు, మరణంలేదు. దానికి సుఖంలేదు, దుఃఖంలేదు. దానికి బంధంలేదు, మోక్షంలేదు. దానికి కించిజ్ఞత్వంలేదు సర్వజ్ఞత్వంలేదు. దానికి నిశ్చయంలేదు, సంశయంలేదు. జ్ఞానంలేదుగనుక యిన్ని నిబంధనాలు యీ గుర్తెరిగే దానికే.

సకలనిబంధనాలకు మూలమైన గుర్తెరిగే శరీరం యేమీలేకుండా చూచెనా పుట్టు చావని అచలమే స్వతసిద్ధమై వున్నది.

శృతి॥ "నజాయతే నవిద్యతే ! అచేద్యోయం అదాహ్యోయం॥"

నిజగురు కరుణాకటాక్ష సంపూర్ణమైనవారికి సార్వకాలం యేకాకారస్థితె.

ఇతి శ్రీమద్గురు శివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే
పూర్వభాగే కారణతను నిరసన ప్రకరణం.
షష్టమోధ్యాయః॥
శ్రీ సద్గురవేనమః

# కారణకార్య రహిత ప్రకరణము

శ్లో॥ కార్యోపాధి రయంజీవః । కారణోపాధిరీశ్వరః ।
కార్యకారణ తాంహిత్వా । పూర్ణబోధో వశిష్యతే॥

## 1. మతాల లక్షణం

గురు॥ యీ వృత్త బట్టబయలు ఏమిలేదు. అని సిద్ధాంతమే సహస్ర సిద్ధాంతము.

1 వైదికమతంవారు పరబ్రహ్మమే జగత్కారణం అని వాదించినారు
2 శైవులుశివుడే జగత్కారణం అని వాదించినారు
3 వైష్ణవులు శ్రీమన్నారాయణుడే జగత్కారణం, అని వాదించినారు
4 శాక్తేయులు శక్తిచే జగత్కారణం అని వాదించినారు
5 ఇదే ప్రకారం సర్వమతములవారు వారి వారి ఇష్టదేవతలే జగత్కారణం అని వాదించినారు

## 2 కారణకార్య లక్షణం

కారణమె కార్యం కారణునకు కార్యానకు భేదం యేన్నటికిలేదు కారణం వున్నంతసేపు కార్యంలేకపోదు కారణం నిబద్ధి అయితె కార్యం నిబద్దె కారణం అబద్దంఅయితే కార్యం అబద్ధమె కారణం విత్తనంవంటిది కార్యం చెట్టువంటిది కారణానికు కులంలేదు గోత్రం లెదు కారణానికు వుండెనా! కార్యానికు వున్నది కారణం దేవుడు అయెనా! కార్యం దేవతా స్వరూపమె గురువు, దేవత, ఆత్మ, అహంకార స్వరూపమె నేను నేనుఅనె అనుభవం వున్నది గనుక సోహం అని అయిక్యం జీవుడు, యీశ్వరుడు, వొక్కడే

## 3. అహం బ్రహ్మస్మి అనుభవం

అహం బ్రహ్మస్మి అనే అనుభవం వేదమందెవున్నది.

నెనేజీవుణ్ణి, నెనెయీశ్వరుణ్ణి, నెనె బ్రహ్మను, నేనే సర్వం, సర్వం నెనే, నాకంటె అన్యంలేదు, నెనువుంటె సర్వంవున్నది, సర్వానకు నెనే మూలం, నేనేగురువును, నెనేశిష్యుణ్ణి, నెనెదొరను, నేనేసేవకుణ్ణి, నేనే దొరసాన్ని, నేనేబాసనదార్ని, నేనేసర్వం సర్వానకు మూలంనెనె గనుక అహంకారంవల్లనే శరీరం శరీరం గాడ్దులకు, పందులకు, కుక్కలకు సమానమే పుట్టని చావని అచలం సార్వకాలం చలించక వొక్కతీరుగానే వున్నది.

1 యీ గుర్తెరిగే యొరుక నెను అనుకునేవారు ఖధములు,
2 యీ శరీరం నేను అనుకునేవారు అధమాధములు
3 యీ రెండు లేక వున్నవారు పుట్టని చావని అచలం

## 4. అచల లక్షణం

అచలంయేగుణాలులేనిది వికారాలులేనిది అదికావలెనంటె యెన్నటికి కాదు సాధన సాధ్యంలేనిది గనుక వున్న అచలానకు శరీరంలేదు గనుక యేమిచెయ్యదు చేయించదు సకలతిప్పలు శరీరానకే యీ శరీరంలేని అచలానకు చలంయెన్నటికిలేదు దానికి యెరుకలేదు మరుపులేదు యెరుకమరుపు యెరుకకే

## 5. గురుకటాక్షం

గురుకటాక్షంచేత అతి సులభం జ్ఞానంచేత కర్మలచేత బహుక్లేశం యెన్నటికి తెలియదు శీఘ్రంగా కార్యకారణాలులేని గురుసాంప్రదాయం వెతుక్కొని శరీరం లేని అచలంకాక కావలెను అష్లైతె సార్వకాలం వాక్కుతీరె

జన్మకర్మభ్రాంతి జ్ఞానంతోటె పోయె

## 6 గురుశిష్య అన్యోన్య దర్శనం

వున్న అచలానకు జ్ఞానంలేదు కర్మంలేదు జ్ఞానంచేతనే కర్మాలు పుడుతావి జ్ఞానమె అహంకారం

శీఘ్రంగాసార్వకాలం శరీరంలేక యేలాగువున్నదో అనివారిదగ్గరకు పోయి శరీరం అయ్యి వున్నారో నేనునేను అనె యెరుకఅయ్యి వున్నారోఅని చూచి అచలం చలించక వున్నట్టె వారివునికి వున్నదా లేదో అనిచూచి

చలించే శరీరం అయివుండిరా వారి సాంప్రదాయం ఆత్మజ్ఞాన సాంప్రదాయమె అని మాట్లడవలె.

1 జ్ఞానులు అయిరా శాస్త్రిలతోవ అనుకునేవారు వారే మద్యములు పుట్టనిచావని అచలసాంప్రదాయంయెటువంటిదిఅనితెలుసుకోవలె

2. విలక్షణంకంటే వేరెఅత్యంతవిలక్షణం యెటువంటిదిఅని అడగవలె. క్షరం శరీరం. గుర్తెరిగేయెరుక ఆనెఆత్మ అక్షరం పరబ్రహ్మ.

1. క్షరాక్షరోపాధి ద్వయదోషరహితం అయింది అది యెక్కడ వున్నది అదినేను యేలాగుకాను.

2. అది శరీరం లోపటవున్నదా శరీరంపైటవున్నదా.

3. దానికి ఆత్మకు సమ్మంధం వున్నదా లేదా అని మూడుమాటలు భగవానులు అన్నారు.

## 7. పరిపూర్ణబోధ *

యీ శరీరంకాదు. విలక్షణంఅనె యెరుకకాదు. యీ రెంటికంటె అన్యంమూడోది అదే యిరువై ఆరోది.

అది యీ శరీరమందులేదు. యీ శరీరం వున్నది లేకపోయితేసరి వున్నదానికి యెరుకలేదు మరుపులేదు. అది గురుసాంప్రదాయంచేత సూచన కావలె.

తనప్రయత్నం సూచనఅయ్యే పర్యంతం లెస్సవుండవలె. వున్నకొద్ది సకలసంశయాలకు మూలంయేదో అది లేకపోతుంది.

సర్వజ్ఞత్వంవుండెనా ! మునుపటివలెనే వుంటాడు. సార్వకాలం గురువాక్యం విడువక అభ్యాసం చేయవలె.

చేసేదియేమి ? అని అశ్రద్ధవుండెనా ! గురువునకు శాంతివున్నట్టు వుండక కుక్కవలె చలిస్తాడు.

జ్ఞానంచేత కర్మాలు విడువకవునట్టె వుంటావి.

యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని సతతంవిడువక సమస్తమైన కార్యాలయందు వుండవలె.

1. భోజనకాలమందు 2. రతికాలమందు 3. నడిచేకాలమందు 4. కూర్చున్నకాలమందు 5. నిద్రవచ్చెదాక మరువక అభ్యాసంచేస్తూ, సర్వంచెయ్యక, విడువక శరీరంలేక వుండవలె.

యీలాగు వున్నవాడె మేలుకున్నవాడు.

అటువంటివానికి పుట్టుకలేదు, చావులేదు, సార్వకాలం వొక్కతీరే.

కావలెననేవాడు లేకపాయగనుక యెన్నడు పొవ్వరుకాలేదు వున్నది వున్నట్టె వుండె.

శ్రు॥ "నిర్ణయో నాస్తిసర్వదా"॥

ఇతి శ్రీమద్గురు శివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే
పూర్వభాగే కారణకార్యరహిత ప్రకరణం
స ప్త మో ధ్యా యః॥



శ్రీ సద్గురవేనమః

# ఉపదేశ ప్రకరణము

8 శ్లో॥ ఏతస్మిత్యా శుద్ధవియత్ । కించిన్నా స్తీతితేమయా ।
కృపయాపరమంప్రోక్తం । భజాగ్రే ద్వాదశాక్షరం॥

గురు॥ యీ వుత్త బట్టబయలు ఏమిలేదు అని రాద్ధాంతమే సహస్ర సిద్ధాంతము.

1. చరమార్థం

శ్లో॥ సర్వధర్మాణ పరిత్యజ్య । మామేకం శరణంవ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో । మోక్షయిష్యామి మాశుచా॥

టీ॥ హేమనుషుడా సర్వధర్మాణ సమస్తమైన ధర్మాధర్మాలు గల యెరుక అనేఅహంకారాన్ని సమూలంగా ఆచార్యకటాక్షంచాత పరిత్యజ్య = పరిత్యాగంచెయ్యిమా; మామేకం = వొక్క అహంకారంలేని నన్ను గురు మూలంగా; శరణంవ్రజ = నాకంటె అన్యులులేరనినమ్మక నమ్మటమే శరణునుమా; అహం = అహంకారములేని నేను; త్వా = చిద్రూపమైన నిన్ను; సర్వపాపేభ్య = అహంకారమనె సమస్తపాపములనుండి; మోక్షయిష్యామి = విడిపిస్తాను;మాశుచా = లేకపోతానని దుఃఖపడకుమా.

యెరుక॥ నాకే యెరుక నేను యెరుగుదును. నేను యెరుగను అని వున్నాదిగనుక అహంకారమెజ్ఞానం అహంకారమెఅజ్ఞానం అహంకారంతోటి సర్వంపాయ గనుక నమస్కారం చేశేవారులేరు నమస్కారంలేదు.

అదివైష్ణవసిద్ధాంతం శైవసిద్ధాంతంయిలాగే శాక్తేయంయీలాగే వైదీకం యీలాగుకాదు

చరమార్థంతోకూడ తిరుమంత్రద్వయంవడిశె అహంకారంతోటి అన్నిపాయ జ్ఞానభక్తి వైరాగ్యాలకు మూలంలేదు.

## 2. స్వరూప లక్షణం

1 చెప్పందియేదో
2 వినందియేదో
3 చూడందియేదో
4 యెరుకమరుపులు లేందియేదో
5 నేననే అహంకారం లేందియేదో
6 నీవు అనే యెరుకలేందియేదో
7 దేహం వున్నదోలేదో అని సంశయంలేందియేదో
8 సమస్తమైన వ్యవహారాలు లేందియేదో
9 స్త్రీ పురుష రూపంకాందియేదో
10 నపుంసకం కాందియేదో
11 పుట్టుకచావు యెరుగందియేదో
12 ప్రకృతి అనే శబ్దం లేందియేదో
13 వర్ణాశ్రమాలను యెరుగందియేదో
14 ధర్మాధర్మాలను యెరుగందియేదో
15 పుణ్యపాపాల వర్తమానం యెరుగందియేదో
16 కర్మజ్ఞానం లేందియేదో
17 సార్వకాలం జీవభావం, జగద్భావం, యెరుకగాందియేదో
18 వాసనలేందియేదో
19 శ్రవణమునను నిధిద్యాసలను యెరుగందియేదో
20 జాగ్రత్స్వప్న సుషుప్తి తుర్యావస్థలు వున్నవని యెరుగందియేదో
21 ఆకలిదప్పి లేందియేదో
22 కార్యకారణాలను యెరుగందియేదో
23 సగుణనిర్గుణాలు కాందియేదో
24 బంధమోక్షాలు లేందియేదో
25 నేను గాందియేదో
26 నేనునీవు అనే జ్ఞానరహితమైంది యేదో

27 ఆకాశాది భూయలను యెరుగంది యేదో
28 విషయావిషయాలు లేందియేదో
29 సాధనరహితమైందియేదో
30 సర్వద్వంద్వరహితమైందియేదో
31 నేను రహితమైందియేదో
32 జడాలను యెరుగందియేదో
33 లోకాంతరాపేక్ష రహితమైందియేదో
34 సదసత్తులుగాంరియేదో
35 సుఖదుఃఖాలు లేందియేదో
36 జ్ఞానభక్తి వైరాగ్యాలు లేందియేదో
37 యేమీలేదని యేరుగంది యేదో
38 గురుశిష్యభావన రహితమైందియేదో

39 తల్లి, తండ్రి, లోకాలు, దేవతలు, వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, సూత్రాలు, ఇతిహాసాలు, దొరలు, దొంగలు, బ్రహ్మహత్యాది పాతకాలు, బ్రాహ్మణులు, మాదిగెలు, వ్యాసాదిమహాఋషులు సంధ్యావందనాది నిత్యకర్మాలు లేందియేదో అది తానుఅని యెరుకలేంది స్వరూపం అటువంటిదాన్ని భగవానులు మొదలైనవారు యెరుగరు అటువంటివారు సార్వకాలం అయ్యేవున్నారు యెవ్వరు యిప్పటికి అటువంటి స్వరూపం కాలేదు అటువంటివారు సార్వకాలం అయ్యేవున్నారు

స్వతసిద్ధమైంరి గనుక సార్వకాలం కల్పనారహితమై వున్న దానియందు కల్పనవున్నట్టు లేనట్టు వుండె

మాయచేత కల్పనలో బడ్డట్టు అవుతు వుంటుంది.

3. అసాంప్రదాయ లక్షణం

గుటసాంప్రదాయం వున్నది వున్నట్టు తెలువక శ్రవణాదులయందు ప్రవేశింపబడితే, శాస్త్రానే బొంద్లలొతట్టి భ్రాంతివిస్తరిస్తూ.

యిదిఅవును, యిదికాదు, అంతాఅదే అదేఅంతా, నేనేఅంతా అంతా నేనే అనేది అహంకారమనే యెరుకే.

ఆదివున్నంత సేపు యీలాగు అనుకొని అదిలేకపోతే దానితోటె అంతా లేకపోతావి.

మళ్ళా ఒదివున్నట్టువుంటే భ్రాంతిపోక, దరిదొరకక కాలంగుడి పైనా జన్మమరణ ప్రవాహభ్రాంతి వున్నట్టు వుంటుందుట.

సార్వకాలం యేకప్రకారంగా వున్నదానికి భ్రాంతివున్నదోలేదో
నిర్ణయంచేసెనా అందరివంటిభ్రాంతుడే
అహంకారం తద్దైక్యమై వున్నట్టువుంటుంది

4. సాంప్రదాయ లక్షణం

యిందుకొరకు శీఘ్రంగా వున్నది వున్నట్టు తెలిపేవారికి కనుక్కొని శీఘ్రంగా వున్నది వున్నట్టు తాత్పర్యమాయనా శత్రుక్షయ మైనట్టు.

అటుతరువాత సుఖదుఃఖరహితమై ఆదిమధ్యాంత రహితమై వుంటావు
రాకడాలేదు. పోకడాలేదు.

స్వరూపస్తితికంటె మరివొకటి అధికంఉన్నదని అంహకారం వున్నదో లేదో.

వున్నదని యెరిగితేజ్ఞాని యెరుగనంటె అజ్ఞాని వున్నిదోలేదో అంటే సంశయం యేమిలేదుఅంటే బౌద్ధుడు సార్వకాలం మూలంలేని పరా ప్రకృతి స్వరూపమే.

ఇతి శ్రీమద్గురు శివరామదీక్షిత ప్రభావే వేదాంతవిచారణే
పూర్వభాగే ఉపదేశ ప్రకరణం
అ ష్ట మో ధ్యా యః



శ్రీ సద్గురవేనమః

# శ్రీ శివరామ దీక్షితీయము

# అచలబోధ సిద్ధాంతం ద్వాదశిబావం

సర్వీకారశూన్య సహజామనస్క రాజయోగమార్గం

2 ఉ త్త ర భా గ ం 4

## మూల ప్రకృతి నిరసన ప్రకరణము

9 శ్లో॥ ప్రకృతి పురుషోనాస్తి। ఏకంనాప్తి ద్వయంనహి।
బాహ్యాభ్యంతరంనాస్తి। సత్యంసత్యం అహర్నిశం॥

### 1. గురుసాంప్రదాయ లక్షణం

గురు॥ యీ వుత్త బట్టబయలు ఏమిలేదు. అని సిద్ధాంతమేదశకోటి సిద్ధాంతం.

మూలంలేని యీ గుత్తెరిగేశరీరం యేమీలేదు. అని తనకుతానె తాత్పర్యం అయితే మళ్ళాతోచేటందుకు యేమీలేదుగనుక.

శరీరాన్ని గుత్తెరుగనిబట్టబయలు తనకుతానె స్వతసిద్ధఅయ్యిం యెన్నటికి చేలించక వున్నదేవున్నది.

యిది శరీరంలేని గురుసాంప్రదాయం యిదే మహా అద్వైతం యిదే ద్వైతాద్వైత రహితమైన పరమతత్వం అద్వైతమంటే విశిష్టాద్వైతం కేవల అద్వైతం కలలోనైనాలేదు వున్నకాసంత సేపు విశిష్టాద్వైతమే.

మూలంలేని యీ గుత్తెరిగే శరీరం యేమీలేదు గనుక వ్యవహారం లేదు.

### 2. సమాధానం

శ్రీబాష్యకారుల తాత్పర్యం అబద్ధమో నిజమో

నిజమే అని శ్రీశంకరాచార్యులవారు సాధించనారు గనుక.

నేను చదువుకొన్నాను గనుక వారిదానికి నేనునాకు తోచినంత వుత్తరం చెప్పినాను.

వారు అనందియేదో అది విశిష్టమైంది. అదే శుద్ధమార్గం.

ఆచార్యకటాక్షంచాత మూలంలేని యీ గుర్తెరిగే శరీరమనె తెరతీసి చూచినవారికి అద్వైతంలేదు విశిష్టాద్వైతంలేదు యీ రెండులేకుంటే ద్వైత వార్తేలేదు.

సార్వకాలం యీశ్వరుడనె వ్యాపకంవున్నది. అదేగుణాలు లేనిది.

శ్లో॥ "వికారరహితేచయీశ్వరః"॥

కలలోతోచిన రామకృష్ణులవలెకాదు.

తెరఆవల తెరయీవల వున్నది కుంఠితంకాని వైకుంఠం

ఆచార్య కటాక్షంగలవారికి అరచేతిలో వైకుంఠం

## 3. మాయవాదుల మార్గం

అఖిలాండకోటి బ్రహ్మాండాలకు నేనుదాసుడ్ని అని ఆచార్య స్వాములవారు అన్నవాక్యం.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం పరబ్రహ్మం జ్ఞానమేనిర్గుణం అన్నారా లేదా.

అదేనేను యేలాగుఅంటే. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం పర బ్రహ్మం.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరాలు స్వతంత్రులు అయినా పర బ్రహ్మమే.

అయితే అందరు అందరికి సేవకులై సిళ్ళుయెందుకు మోస్తారు. వండియెందుకు పెడతారు అగ్నిహోత్రాలు యెందుకుచేస్తారు. మాదిగ వాండ్లవలె మాలవాండ్లవలె మేము బ్రహ్మనులమని యెందుకు అభిమానం వుండవలె అందుకే మాయవాదుల మార్గం.

## 4. సిద్ధాంతం

విచారించండి మాసిద్ధాంతం మూలంలేని యీ గుర్తెరిగే శరీరమనే తెరతీసివేస్తె యేమీలేదు అంతా వైకుంఠమే అంతా కల్యాణ సహితమైన కైలాసమే.

శృతి॥ "తద్విష్ణో పరమంపదం । సదాపశ్యంతిసూరయః । యద్గత్వాన నివర్తంతె తద్ధామపరమంమమ ॥ తతః పదంతత్పరి మార్గిత వ్యం । యస్మిన్ గతాననివర్తంతె । భూయః ।"

అందుకే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం అనే తెరతీసి అందరికి చూచేకొరకు.

శృ॥ "ఉత్తమః పురుషస్త్వన్యః"॥

వొక్కడే అంటే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీ లేకుంటే వున్నది అని తాత్పర్యం.

శ్లో॥ యస్మాత్క్షరమతీతోహ । మక్షరాదపినోత్తమః॥
"శృ॥ ఉత్కృష్టతమః । అక్షరాదపిచ అమోఘోత్తమః॥
అక్షరపరబ్రహ్మణోసి । క్షరాక్షరాభ్యాంఅన్యః॥"

అందుకే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేని యీ బట్టబయలు యింతకంటె యెక్కువలేదు.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరంకంటె తక్కువలేదు. మూలం లేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు. యీ బట్టబయలే వున్నది. మూలం లేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు. యిదే భ్రాంతిలేని రాజమార్గం.

5. వాసిష్టప్రమాణం

యీ శరీరం వున్నదనే భ్రాంతిచేతనే అనేకభ్రాంతులు వున్నవి.

సార్వకాలం చలించకవున్న యీ బట్టబయలుకు యేమి భ్రాంతి వున్నది.

వున్నదానికి లేకపాయ లేనిది యేమీలేదు. అందుకే వసిష్ఠుడు రామస్వామికి చెప్పినాడు.

శ్లో॥ భ్రమేణాహం భ్రమేణత్వం । భ్రమేణోపాసకోజనః
భ్రమేశ్వరభావత్వం । భ్రమమూలమిదంజగత్॥

అందుకే వున్న బట్టబయలుకు వొక్కటైనా భ్రాంతిలేదు. మూలం లేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు. యిక భ్రాంతి యేమిటికి.

## 6. లెక్కతీర్పు

వున్న బట్టబయలుకు యేమీలేదు. యేమీలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు. వొక్కటీరె వ్యవహారంవడిశే.

చించివేసిన పత్రం యెవరిదగ్గరవున్నా యేమీలేదు భయం తీరిపాయ తీదీపులువడిశె.

లెక్కతీర్పటంకాకుంటే యేవేళ్కైనా మొఖంనలుపే అనిపిస్తుంది.

యిప్పుడు యెక్కడనిల్వబడ్డా భయంలేదు చచ్చేదియేమి ? బ్రతికేది యేమి ? వున్నదానికి యెప్పుడు వొక్కటీరే.

నేను యేమీలేదు నీవుయేమీలేదు. వున్నదానికి యేజోలిపట్టదు వున్నది పుణ్యం చెయ్యదు పాపం చెయ్యదు. నేను యేమీలేదు నీవు యేమీలేదు. యిద్దరం యేమీలేకుంటే వున్నది వున్నట్టేవుండే. యేమీలేనిది యేమీలేకపాయ వృత్తభ్రాంతికదోయి.

యిలాగని అందరు అనుకుంటారు లెస్స విచారించి లెక్కతేర్పటం అయితే భయం వుండదు.

విచారించకుంటే యేమిరంకో అనిపిస్తుంది. విచారించితే వున్నది వున్నట్టే వుండే యేమీలేనిది యేమిలేకపాయ.

## 7. బట్టబయలు లక్షణం

యీ బట్టబయలు పుట్టదు పుట్టించదు యీ బట్టబయలు భోంచెయ్యదు గనుక శుక్లంలేదు. నీళ్ళుతాగదు గనుక నెత్తురులేదు. యీ బట్టబయలుకు యెరుకలేదు గనుక రతిక్రీడ చెయ్యదు. అందుకే యీ బట్టబయలు క్రియా శూన్యం అయింది.

యీ బట్టబయలుకు పుట్టుకలేదు గనుక ఆడదికాదు మొగవాడు కాదు నపుంసంకాదు. అందుకే నొక్కటైనా వికారం లేదు.

## 8. బోధలక్షణం

యీ బట్టబయలుకు శరీరం లేకుండగానే రాకడాలేదు పోకడాలేదు. అచలం, కదలక, మెదలక, వొక్కటీడుగానే సార్వకాలం వున్నది. అంతా యీ బట్టబయలె.

యీ బట్టబయలె అభేద్యం-అదాహ్యం-అక్లేద్యం-అశోష్యం-సరేవాయి. అన్ని సూటిపడుతావి వాయి.

యీ బట్టబయలె నిత్యం యిదే సర్వగతం యిదేస్థాణు యిదే అచలం యిదే బహుకాలాలది అన్ని సరిపోతావి వాయి.

యీ బట్టబయలు కొట్టేదికాదు కొట్టబడేదికాదు. యీ బట్టబయలు యెవరిని కొడుతుంది యెవరిని చంపుతుంది. యీ బట్టబయలుకు యెరుక లేదు. యెరుకలేనిదానికి యిచ్ఛ పుట్టనేపుట్టదు యీ బట్టబయలును యేమి అడిగినా చెప్పనే చెప్పదుగదా దానంతవాడే దాన్ని అడుగవలె దానిఅంతది అదే యీ బట్టబయలుకు బదులులేదు.

యీ బట్టబయలు నేనువున్నానని యెరుగదు యీ శరీరాలు లేవని యెరుగదు. అన్ని కలలోనె సకలముచ్చట్లు.

యీ బట్టబయలుకు యెరుకలేదు గనుక వొక్కటి అయినా వికారం లేదు.

యీ బట్టబయలు వొక్కజోలి అయినా యెరుగదు.

మొదలే యీ బట్టబయలు వున్నాదిగనుక వొక్కటి అయినా భ్రాంతి వుండదు.

యీ బట్టబయలు తనకుతానే స్వతసిద్ధంఅయి సార్వకాలం చెలించక వొక్కటిఅయినా వున్నదిలేదని యెరుకలేనిదాన్ని కనుక్కోక యేమీలేనిదే వున్నది.

భ్రాంతిలేనిది భ్రాంతివున్నదిఅని అనుకుంటూవున్నది అని తీసివేసిన కొద్ది యేమిలేనిది మళ్ళామళ్ళావున్నట్టు తోస్తుంది.

గనుక మొదలే యీ బట్టబయలు వున్నాదిఅని సార్వకాలం మరువక వుంటే యేమీబాధలేదు అని అనుకున్నకొద్దివున్నట్టువుంచుంది గనుక పొట్టు దంచుకున్నట్టు వుంటుందిగాని యేమీబాగులేదు.

మొదలే యీ బట్టబయలు వున్నాదని చాలా అభ్యాసంచేస్తె చాలా సంశయం లేకపోతుంది.

గురు॥ సరేకాని యీ బట్టబయలే నేనువున్నానని అనుకుంటూ వున్నాదీ ?

శిష్య॥ యేమీలేదు.

గురు॥ వున్నదంటేలేదు లేదుఅనబడుతూ వున్నాది.

శిష్య॥ పూరికే నామాటవినండి వున్నదానికి వొక్కటిఅయినా సాధన కనేతనకుతానే స్వతసిద్ధమై చలించక సార్వకాలం వొక్కటీరుగానేవున్నది.

గురు॥ వొక్కటేయుక్తి యీశరీరం పుట్టకమునుపు శరీరంవున్నాది

శిష్య॥ యేమీలేదు

గురు॥ యీలాగు తనకుతానే దృఢమా ? సాధనచెయ్యవలెనా ?

శిష్య॥ యేమీలేదు తనకుతానే దృఢం

ఇతి॥ శ్రీమద్గురు శివరామ దీక్షితప్రభావే వేదాంతవిచారణే
ఉత్తరభాగే మూలప్రకృతి నిరసన ప్రకరణం
ప్ర థ మో ధ్యా యః



శ్రీ సద్గురవేనమః.

# మహావాక్య స్వప్రకాశ ప్రకరణము

10 శ్లో॥ ప్రజ్ఞానవాక్యహీనాత్మ । తత్వమస్యాది వర్జితం॥
బ్రహ్మోహంభావహీనాత్మా । అయమాత్మేతి వర్జితం॥

గురు॥ యీ వుత్త బట్టబయలు ఏమిలేదు అని సిద్ధాంతమే సహస్ర కోటి సిద్ధాంతం.

1. బట్టబయలు లక్షణం

వుత్త బట్టబయలుకు ప్రత్యగాత్మలేదు ప్రాజ్ఞుడులేదు తైజసుడులేదు విశ్వుడులేదు.

యీ వుత్త బట్టబయలుకు తుర్యావస్తలేదు సుషుప్త్యావస్తలేదు స్వప్నావస్తలేదు జాగ్రదావస్తలేదు.

యీ వృత్త బట్టబయలుకు మహాకారణ దేహంలేదు కారణదేహంలేదు సూక్ష్మదేహంలేదు స్థూలదేహంలేదు.

ఈ వృత్త బట్టబయలుకు అవస్థావాసులులేరు అవస్థలులేవు. శరీరాలు లేవు. మూడునాలుగు పన్నెండు యేమీలేవు.

2. యెరుక లక్షణం

1. హిరణ్మయకోశమన్న యెరుకే 2. అనందమయకోశమన్న యెరుకే 3. విజ్ఞానమయకోశమన్న యెరుకే 4. మనోమయకోశమన్న యెరుకే 5. ప్రాణమయకోశమన్న యెరుకే 6. అన్నమయకోశమన్న యెరుకే.

యీ వృత్త బట్టబయలుకు ఆరుయేమీలేదు ప్రపంచం యెన్నడులేదు.

3. బోధలక్షణం

"యీ వృత్తబట్టబయలుకు యేమీలేదు" ఇదే గురువాక్యం యిదిగాక జ్ఞానంయొక్క ఆశవున్న కర్మ యొక్క ఆశవున్న అడవిమార్గంలోకలసి కుక్కవలె రానుపోను భ్రమవిస్తారం పుట్టుతాదట.

యీ రెండు యేమీలేదు మాయ పుట్టనేలేదు ప్రపంచానికి మూలం యేమీలేదు.

"యీ వృత్త బట్టబయలుకు యేమీలేదు" ద్వాదశాక్షరి పరమాత్మ శరీరంలోలేదు. శరీరంలేదు రెండో ప్రకారముకాదు గనుక యీవృత్త బట్ట బయలుకు యేమీలేదు. యీ పన్నెండు యీ వృత్త బట్టబయలువల్లను పుట్టింది యేమీలేదు.

యీ వృత్త బట్టబయలుకు జ్ఞానంలేదు అజ్ఞానంలేదు యీ వృత్త బట్టబయలుకు అహంకారం యెన్నడు లేదుగనుక.

లేనిమాయకు లేదని కన్నవారికి యీ వృత్త బట్టబయలు పుట్టని చావనిది.

యీ వృత్త బట్టబయలు చెడి శరీరాకారం యెన్నడుకాలేదు. వెనక టికి కాలేదు యిప్పుడుకాలేదు. ముందకారపోదు.

సార్వకాలం రెండో ప్రకారంగాక వొక్కతీరుగానే వున్నది.

ప్రపంచానకు యీ వృత్త బట్టబయలు కారణంకాదు.

తానే పుట్టనిచావనిది ప్రపంచాన్ని యేలాగుపుట్టించె ప్రపంచం యొక్క జోలేలేదు.

### 4. అసంప్రదాయ లక్షణం

పుట్టని ప్రపంచాన్ని వున్నదనేటందుకు.

1. విద్వాంసులకు 2. విచారించని సన్యాసులకు 3. జడలు పెంచిన యోగీశ్వర్లకు 4. అహంకారులైన జ్ఞానులకు సిగ్గుకాదేమో.

పుట్టనిమాయను వున్నదని అనుకున్నవాడే గురుసాంప్రదాయ రహితుడు.

వాడే అసంస్కారి. వాడే గురుమూలంగా వేదశాస్త్రాలు విచారించని వాడు.

"యీ వృత్తబట్టబయలు యేమీలేదు" అని గురువాక్యం చెప్పుకోలేదు.
ద్వాదశాక్షరి గురువాక్యం యీవాక్యం సార్వకాలం స్మరిస్తు వుండవలె.
యీ వృత్త బట్టబయలె నిరంజనం అంజనం అంటె లేని అహంకారం
యెరుకే జ్ఞప్తిజ్ఞానం అని ప్రపంచంలో అనుకున్నారు.
యీ వృత్త బట్టబయలుకు యెన్నడులేదు.

ప్రపంచం లేదుగనుక యీ వృత్త బట్టబయలు మాత్రమే వున్నది.

వృత్త బట్టబయలు చొరదు వెళ్ళదు మనుష్యాకారం యెన్నడు కాలేదు.

యీ వృత్త బయలు చెడి శరీరాకారం యెన్నడుకాలేదు. యిప్పుడు కాలేదు. ముందరకాబోదు. సార్వకాలం రెండో ప్రకారంగాక వొక్కతీరు గానే వున్నది.

యీ వృత్త బట్టబయలె నిరంజనం జ్ఞప్తినిషేదంగనుక జ్ఞానంజోలె కూడదు వృత్త బట్టబయలు గనుక.

శ్లో॥ సర్వశూన్యం మాయారూపః । జన్మశూన్య స్వభావతః ।
జన్మభావేన మృత్యుశ్చ । పరిపూర్ణం స్వభావతః॥

ఈ వృత్తబట్టబయలు పరిపూర్ణం.

ఈ వుత్త బట్టబయలువలన పుట్టని ప్రపంచాన్ని యాలాగువున్న దందు వున్నదంటె అంతకంటే అబద్ధంలేదు.

అవర్తమానమే కూడదు ప్రపంచాన్ని వున్నదని అనుకోరాదు. యీ వుత్తబట్టబయలే సర్వకాలం వున్నది.

శృతి॥ "ఏనంపరమాత్మానం"॥

శ్లో॥ నైనంఛిందంతిశస్త్రాణి । నైనందహతి పావకః ।

నచైనం క్లేదయంత్యాపో । నశోషయతిమారుతః ॥

శ్లో॥ అఛేద్యోయుమదాహ్యోయ । మక్లేదోశోష్యఏవచ ।

నిత్య స్సర్వగతః స్థాణు । రచలోయం సనాతనః ॥

ఈ వుత్త బట్టబయలే నిశ్చయం

చైతన్యం నిషేదంగనుక జ్ఞప్తిలేని మాయగనుక లేని ప్రపంచం లేదని దృఢం వుంటే సరి.

5 బయలు లక్షణం

ఈ వుత్తబట్టబయలు వొక్కటీరుగానె వున్నది. ఈ వుత్త బట్ట బయలు తప్ప విడిచి రెండోది యేమీలేదు.

లేని యెరుకే ప్రపంచం. ప్రపంచమే లేని యెరుక ఈ వుత్త బట్ట బయలే వున్నాది. ఈ వుత్తబట్టబయలె నిర్వికారం. ఈ వుత్తబట్టయలె నిర్గుణం ఈ వుత్తబట్టబయలులో పిండాకారంలేదు ఈ వుత్తబట్టబయలులో బ్రహ్మాండాకారంలేదు ఈ వుత్తబట్టబయలె వున్నాది ఈ యెరుకే లేని ప్రపంచం లేనిమాయ ఈ యెరుకే లేనిమాయ ఈ అహంకారం లేనిమాయ లెనేలేదు. లేనిమనసు లేనేలేదు.

ఈవుత్త బట్టబయలుకు ప్రపంచానకుకొంచంఅయినా సంబంధంలేదు

ఈ వుత్తబట్టబయలు రెండోప్రకారంకాదు యెన్నడుకాలేదు మునుపు కాలేదు యిప్పుడుకాలేదు ముందరకాబోదు సార్వకాలం వొక్కటీరుగానే వున్నది

ఈ వుత్తబట్టబయలె పుట్టనిచావని పరమాత్మ ఈ వుత్తబట్టబయలె నిరంజనుడు ఈ వుత్తబట్టబయలె పురుషోత్తముడు

అచలంగనుక ఈ పుత్తబట్టబయలుకు రాకడాలేదు పోకడాలేదు.

శృతి॥ "సచ్చిదానంద స్వరూపిణి । శక్తి శ్రీ పురుషశ్చ"॥

పరమాత్మవలన పుట్టని ప్రపంచాన్ని యేమని వ్రాయ.

ఈ వుత్తబట్టబయలువలన వొక్కటి అయినా పుట్టనేలేదు పుట్టింది యేమీలేదు.

వుత్త బట్టబయలు మాట్లాడదు, వూరకేవుండదు ఈ ఉత్త బట్ట బయలుకు సమరసాదిద్వంద్వాలు ప్రాప్తమేలేదు గనుక.

నిషేధించపనిలేదు సార్వకాలం ఉత్పత్తి స్థితిలయాలకు కర్తమును పేలేదు యిప్పుడులేదు ముందరలేదు

6 భ్రాంతి లక్షణం

ఈ ఉత్త బట్టబయలుకు జ్ఞానమున్ను కర్మమున్ను శూన్యమే గనుక భోంచేయంటంలేదు కర్మంలేదు గనుక పరిపూర్ణస్వభావం

ఈ ఉత్త బట్టబయలువలన అహంకారం పుట్టనేలేదు గనుక భ్రాంతి యెవ్వరికి

ఈఉత్త బట్టబయలుకు భ్రాంతియెన్నడూలేదు. ప్రపంచం పుట్టనేలేదు

పరమాత్మకు జ్ఞానమున్ను శూన్యమే కర్మమున్ను శూన్యమే సార్వ కాలం వొక్కటీరుగానే వున్నది. ప్రపంచం పుట్టనేలేదు గనుక.

మాయయెటువంటిదో అటువంటివాడే ఈశ్వరుడు. ఈశ్వరుడే జీవుడు జీవుడే అహంకారమట అహంకారమే జ్ఞానమట జ్ఞానమే బుద్ధియట లేనిమనసే జ్ఞప్తిఅట చిత్తే చిత్తమట అంతఃకరణమన్నా యెరుకే అన్నారు.

ఈ ఉత్త బట్టబయలె అమృతం అమృతమంటే మరణంలేనిది.

ఈ వుత్త బట్టబయలె పుట్టని చావని పరిపూర్ణం.

ఈ వుత్త బట్టబయలు పంచఆకారం, గాడిదఆకారం, కుక్కఆకారం మనిషిఆకారం యెన్నడు కాలేదు.

ప్రపంచం పుట్టనేలేదు. గనుక మూడులకు వుత్పత్తిస్థితిలయాలకు మూలంవున్నదని భ్రాంతికద్దు.

ఈ వుత్త బట్టబయలే పరబ్రహ్మ యెరుగదు. పరబ్రహ్మకు మొదలూ లేదు మధ్యాలేదు కొనలేదు.

ఈ వుత్త బట్టబయలుకు జన్మలేదు. యిప్పుడులేదు. ముందర పుట్ట బోదు.

ఈ వృత్త బట్టబయలుకు జ్ఞానం యేమీలేదు. కర్మాలు యేమీ లేవు కర్తలేదు. గనుక సువర్ణం అలంకారం అయినట్టుకాలేదు.

ఈ ఉత్త బట్టబయలుకు నిరంజనమనేసౌజ్ఞ. జ్ఞానమని ప్రసిద్ధి మాత్రమే నేతిబీరకాయఅంటే నెయ్యికారిందే. జ్ఞప్తిలేంది అబద్ధం.

ఈ ఉత్తబట్టబయలు యేమీలేదు అని నిబంధన వున్నదన్న నిషేదం గనుక ఈ ఉత్త బట్టబయలు జన్మం యెన్నడులేదు.

ప్రత్యగాత్మఅన్నా జీవుడే జీవుడు ఉన్నాడని అనరాదు.

పరిపూర్ణంవలన పుట్టనేలేదు గనుక సమస్త శాస్త్రాలలో జీవుడు లేడని ఉండనేడన్నది.

పాపాత్ములు శరీరంలో జీవుడు వున్నాడని అనుకొనిరా వారే మిక్కిలి గురుమూలంగా వేదశాస్త్రాలు విచారించనివారు.

విచారిస్తే నింబంధనలేదు

ఈ వుత్త బట్టబయలుకు జీవుడులేడు జగత్తులేదు పుట్టనేలేదు గనుక.

ఈ వుత్త బట్టబయలువలన వొక్కటిఅయినా పుట్టనేలేదు గనుక పుట్టింది యేమీలెదు.

జ్ఞానభ్రాంతి కర్మభ్రాంతి అంతా అనుభవమే. మూలంలేని ఈ గుర్రెరిగే శరీరం వున్నంతసేపు అనుభవం.

ఈగుర్రెరిగే శరీరం యేమీలేదు అని యెప్పుడుపింటే అప్పుడు పుట్టని చావని అచలం స్వతసిద్ధమై వున్నది గనుక.

మూలంలేని ఈ గుర్రెరిగే శరీరంచాత సాధ్యంకాదు స్వతసిద్ధమై అచలమే వున్నది.

**ఈ ఆవరణంలేకుంటే పుట్టనిచావని అచలమే వున్నది.**

మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం విడిపించె గురువుపుండెనా అతిసులభం.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం చేసినపుస్తకాలువిని నమ్మెనా దీనివంటి చంచలుడై కొంతసేపువుండి కొంతసేపులేక మళ్ళావుండి మళ్ళా లేక ఈ ప్రకారాన చంచలం లేనేలేదని నేనే అచలంఅనుకొని నిద్రబోతె తాను చేసిన పుస్తకాలతో కూడా మునిగిలేచినా మళ్ళా మునుపటివలెనే సకలమైన భ్రమలచేతవుండి భ్రాంతితీరక దరిదొరకక క్లేశపడుతాడు.

## 7. బోదలక్షణం

అందుకే యేగురువునుఅంటే ఆగురువును నమ్మక, మూలంలేని యీగుర్తెరిగే శరీరంఅనె ఆవరణం లేనివార్నిగాజూచి, వారిముచ్చట విని, వారినడకలుజూచి, వారిదెగ్గరవున్న శిష్యులజూచి, ఆశిష్యులు శాంతిచాత వున్నారో, మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం అయివున్నారో శరీరం లేక వున్నారో వారిజాడ కనుక్కోని.

వారిజాడా చెప్పకపోయిరా, మీరు యెవ్వరు ? అని అడిగి వారిజాడ చెప్పితే, వారివద్దకి పోయిచూస్తే,

మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం చేసిన శంకరభాష్యం నమ్మి యున్నారో, యితరభాష్యం నమ్మియున్నారో, యేదైన మతగ్రంథం నమ్మి యున్నారో, శాస్త్రవాసనలేక యితర వాసనచేత ఉన్నారో.

వారిని భూమండలమందు మూలంలేని ఈ గుర్తెరిగే శరీరంలేని అచలస్వరూపులు ఉన్నారట వారి ఆచారంయేమి ?

వారిశాస్త్రాలుయేమి? వారు రారా పోరా, వారిజాడ యేలాగు? వారు పుట్టినారా లేరా? వారికిచావు వున్నదా లేదా? వారికి కులగోత్రాలు వున్నవా లేవా? వారుయేలాగుపుట్టిరి? వారికివేదశాస్త్రాలు ప్రమాణమాఅప్రమాణమా? వారికి తల్లి, దండ్రి, భార్య, బిడ్డలు, కొడుకులు, వున్నరాలేరా? వారి మూలంయేమి? అచలం యేలాగుఅని అడిగితే.

వారు యెవ్వరోకాని వారిమూలం నాకు తెలియదు పుట్టనిచావని అచలమే వున్నదని చెప్పి, యేమిలేక పోయిరి.

యేమని అడుగుదామంటే యెక్కడచూచినా అచలమే వున్నది. మొదలులేదు. కొనాలేదు, మూలంలేని ఈ గు_ర్తెరిగే శరీరం యేమీలేదు. సముద్రములో వాడమునిగినట్టు భూమండలం మునిగిపాయనా, దానితో గూడా యేశాస్త్రం యేమిలేకపాయె నేమి ఆశ్చర్యం.

కలలో దేహంవలెనే "మూలంలేని ఈ గు_ర్తెరిగే శరీరం యేమీలేదు."
అందుకే ఈ గు_ర్తెరిగే శరీరం మూలంలేనిది.

కలలో యేనుగ యెక్కడనుండి వచ్చెనో యెక్కడపాయనో ఆలాగే ఈ గు_ర్తెరిగేశరీరం యెక్కడనుండివచ్చింది యెక్కడపాయచూస్తేఅచలమే

ఈ గు_ర్తెరిగే శరీరం యేమీలేదు. అందుకే అచలానకు శరీరం లేకుండగానే అచలం. అందుకే పుట్టనిభావనిది. అందుకే మూలంలేని ఈ గు_ర్తెరిగే శరీరానకుసకలభ్రమలు. అందుకేఅచలం. యిదిగాక యేసిద్ధాంతం నమ్మినా రాకడపోకడా తప్పదు. అందుకే భ్రాంతిలేనిశోవ దొరికేదికఠినం

మూలంలేని ఈ గు_ర్తెరిగే శరీరం వున్నదని చెప్పినాలేదు. లేదు అని చెప్పినా యేభ్రాంతిపోదు! యిటువంటి సాంప్రదాయం దొరికెనా వొక్కటి అయినా భ్రాంతి వుండదు.

మూలంలేని ఈ గు_ర్తెరిగే శరీరం చెప్పినమాట వొక్కటివిన్నా, మునుపటివలెనేసకలనిశ్చయాలు సకలసంశయాలువుండి బాధస్తూవుంటుంది

ఆవరణంలేని గురువు ఆయెనా ఆవరణంలేకుండా చేస్తాడు.

వినేవారిది భ్రాంతిరహితంకాకుంటే చెప్పేవారిదె జాడ్యం.

ఈ వుపదేశం మునుపు యెవ్వరిదగ్గిర తెలుసుకోక తనగగ్గిరకు వచ్చినవారికి చెప్పితె శ్రీఘ్రంగా అంటుతుంది.

శాస్త్రవాసనగల శిష్యుడాయనా మూలంలేని ఈ గు_ర్తెరిగే శరీరం చేసిన శాస్త్రాలలో వున్నట్టు చెప్పేది.

ఈ గు_ర్తెరిగే శరీరం మునుపు తాను యేలాగు చెడకుండి చేసుకున్నాడో అలాగు చెప్పేది,

వచ్చినవారి అభిప్రాయంకొది చెప్పేది.

యీ రాజమార్గం చెప్పితే జనవిరోధం.

మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం చేసినట్టుచెప్పితే నావాడెఅని సంతోషం జనరంజకం అందుకే.

శృతి॥ "సత్యం జనవిరోధాయ।అసత్యం జనరంజకం" అనివున్నది.

## 8 మతాల లక్షణం

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం తనకు తనవంటివారికే సమాధానం అయ్యేటట్టు.

నానామతాలు అనేకశృతులు అనేకశాస్త్రాలు అనేక భాష్యాలు కొందరికివొకరీతి మరికొందరికి వొకరీతి

యెవ్వరికి వారికే దొడ్డది అని సమాధానంచేసి తనకు మూలం తెలియకుండా.

ఆచార్య స్వాములవారు అని పేరుపెట్టుకొని కొన్ని.

రామానుజాచార్యులని పేరుపెట్టుకొని కొన్ని.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే నాదిఅని మధ్యమతంకల్పించి

యిదే భాగవత సాంప్రదాయం నాదిఅని వొకభాష్యం కల్పించి

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం మ్లేచ్ఛదాబు అని మ్లేఛ్ఛభాషచాత మ్లేఛ్ఛశాస్త్రం చెప్పింది యింతేకాని.

పుట్టనిచావని అచలం శరీరం లేనిదిగనుక యే శాస్త్రం చెప్పలేదు.

శాస్త్రం చెప్పినవారికి చెప్పినట్టు నడువకుంటెకోపం నడవకున్నసరె నన్ను విడువకున్నా సరె నావాడే అని సంతోషం.

నాకు మూలంలేదని యెవ్వరందురో అని యింతవిస్తారంచేసి చేత పట్టుకొని యీలాగు వున్నాగాని మూలంలేని యీ గుర్తెరిగేశరీరమే తప్పున అచలంవున్నది అనివిశ్వయటపడెనా నీళ్ళలోనుంచి చేపబుడుగు పడివచ్చినట్టె

ఇతి శ్రీ సద్గురు శివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే
వుత్తరభాగే మహావాక్య స్వప్రకాశ ప్రకరణం
ద్వితీయో ధ్యాయః.

---

శ్రీ సద్గురవేనమః 70

# అమల ప్రకాశ ప్రకరణము

11 శ్లో॥ జన్మాభావే కర్మంనాస్తి । కర్మాభావే ఫలంనహి ।
ఫలాభావే భయంకుత్ర । భయభావేనసంశయః ॥

## 1. భగవానుల లక్షణం

యీ వృత్తబట్టబయలు ఏమిలేదు, అని సిద్ధాంతం. యీ వుత్తబట్ట బయలువల్ల భగవానులు పుట్టనేలేదు పుట్టని చావనివాడనిగీతలలోనే వున్నది పుట్టని చావనివాడు రేపల్లెలో యేలాగుపుట్టే. పదహారువేల గోపికలు అష్ట భార్యలు అనే మాటకు మూలంలేదు.

యీ వుత్త బట్టబయలె పుట్టనిచావని పరబ్రహ్మం ఆనె అత్యంత విలక్షణం. గనుక యీ భూమ సకలదేశాలయందు వున్నదట, సకలకాలాల యందు వున్నదట సమస్తమైన వస్తువులయందు వున్నదట.

తాను యెరుగడు. జ్ఞానాజ్ఞానాలులేనివాడు గనుక. ఆదిమధ్యాంత శూన్యుడు గనుక. తాను యెక్కడ వున్నాడు. తనకు మొదలులేదు మధ్యా లేదు కొనలేదు వున్న యీవుత్తబట్టబయలు యేలాగువున్నదో అలాగేవున్నది

## 2. మతాల లక్షణం

తురకలు పందివలన పుట్టినారు. బ్రాహ్మణులు బర్రెపలన పుట్టినారు నక్కవలన నారాయణుడు పుట్టినాడు కు[illegible]క్కవలన కోతులు పుట్టినవి

యీ నిరాకారంవల్ల ప్రపంచం పుట్టినేందు అని యెవ్వరు యెరుగరు.

అభిమానమే పంది కోపమేకుక్క జుదాకుచ్నై అట మైపణాలేదట కుక్కవలె కరుపవచ్చేదియేమో. కోపం మైపణు కాదేమో చేష్టల్న వూర పంది చేష్టలే కుక్కచేష్టలుకొన్ని వూరపందిచేష్టలు విస్తారం దానిమీద తుర కలకు యెందుకుకోపం బాగాయెరిగినవానివలె వున్నాడు.

గురువు॥ మనిషి అయితె అందరికి సమాధానమే. మొదలు యేద వున్నదో అది పందినిపుట్టించిందా. అది మనిషిని పుట్టించిందా. పంది ఆకా

రం అయినదా. మనిషి ఆకారం అయినదా. తమదినిరాకారమట నిర్గుణమట ప్రపంచానకు యెన్నడుకాదట యీ పూరపంది యెవ్వరివలన పుట్టినదో.

ఆపుకొడుకు బసవన్న (యెద్దు అనుట) యెద్దుసాంప్రాధాయం వొకరిది ఛీ ఛీ.

మొదలు చక్కనైతే కొనవేళ్లాచక్కనే. మొధలు వంకరైతేకొనవేళ్లా వంకరే. యీ వుత్తబట్టబయలు మాత్రం శుద్ధం. యిదిగాక యెవ్వరిమార్గం అడివె. యీ వుత్తబట్టబయలుమాత్రం వున్నది. యిదే పుట్టని చావనిది. యింతకంటె యెక్కువలేదు. సార్వకాలం వొక్కటీరె.

వెనుకటికికర్త పుట్టనేలేదు. యిప్పుడుపుట్టనేలేదు. ముందరపుట్టబోదు.

అభిమానయే పూరపంది. పందిపుట్టుక యెరిగినవాడే గురువు. తన పుట్టుక యెరిగినసరే. యీ పరమాత్మ పరమాత్మే.

యీ వుత్తబట్టబయలే గనుక యీ వుత్తబట్టబయలు యీ వుత్తబట్టబయలే.

దీనివలన ప్రపంచం యెన్నడుపుట్టనేలేదు. యిప్పుడుపుట్టదు ముందర పుట్టబోదు. సార్వకాలం వుత్తబట్టబయలే

## 3. నిష్కర్ష లక్షణం

శంకరాచార్యుల నిష్కర్షయింతే సామిజియ్యరు యింతే అన్నాడు. మొట్టమొదలు బట్టబయలే వున్నది. జ్ఞానం అజ్ఞానం కోటిశాస్త్రిలలోను ఛీ అని తీసివెయ్యనే వేసింది. అహంలేకుంటె జ్ఞానం యెక్కడ వున్నది. సార్వకాలం యెడతెగక యీ వుత్తబట్టబయలు వున్నది.

కోటిమందిని అడిగినా కోటిశాస్త్రిలు చూచినా పుట్టనిచావనిది యీ వుత్త బట్టబయలెఅని నిష్కర్ష.

ఇది అన్నిదిక్కుల వున్నది అహంకారం యేమిలేదు యీ వుత్త బట్టబయలుకు జన్మంలేదు మరణంలేదు.

"భూమ" అంటే గుర్తెరుగనది, వినని ది చూడనిది. "భూమ" అనే పేరు.

శృ॥ "యత్రనాన్యత్పశ్యతి నాన్యతశృణోతి । నాన్యద్విజానాతి సభూమ" అదే వుత్తబట్టబయలు.

జ్ఞానాజ్ఞానాలు మొదలైనద్వంద్వాలు నిషేదంగనుక శుద్ధం యీ బట్టబయలే.

గనుక యింతకంటే దొడ్డదిలేదు. శాశ్వితమైనది యిదే. జ్ఞానం వెతికినాలేదు.

ద్వైతాద్వైతరహితమైన పరమతత్వం. ప్రకాశ విమర్శరహితమైన పరమతత్వం యిదే.

యీ వుత్త బట్టబయలు యేమీలేదు. ప్రపంచం పుట్టనేలేదు గనుక సమయాచారం దొడ్డది. కర్తలేడుగనుక విధియెవ్వరినిగూర్చి ? నిషేదం యెవ్వరిసిగూర్చి ? యీ వుత్త బట్టబయలుకు యేమిలేదు వేదశాస్త్రసారం సంపూర్ణం.

## 4. ఉపేశ్వర లక్షణం

వుత్త బట్టబయలు వుత్త బట్టబయలే. వుత్త బట్టయలే పరమపురుషుడు

యీ పరమపురుషునివలన క్షేత్రజ్ఞుడనేజీవుడు పుట్టనేలేదు. క్షేత్రమనే శరీరమున్ను పుట్టనేలేదు.

అంతా పుట్టనిచావని బట్టబయలే అత్యంతవిలక్షణమైంది.

పుట్టనిచావనిది గనుక ప్రపంచం పుట్టనేలేదు. గనుక భగవానులు పుట్టనేలేదు. కవీశ్వరుడు పుట్టినాడు భగవానుల కల్పించినాడు. పట్టాభిషేకం కల్పించినాడు. పురాణాలు అప్రమాణమే పరమాత్మవల్ల అహంకారం పుట్టనేలేదు.

పుట్టని అహంకారంవలన తామసపురాణాలు, అప్రమాణపు వేదాలు పుట్టినవి వట్టిమాటలు యేలాగు అబద్ధమో ఆలాగే అబద్ధం.

యీ పుత్త బట్టబయిలే సత్యం పుట్టిని ప్రపంచమే అసత్యం మతాలు అడవిత్రోవలు ఛీ ఛీ చీ తలవరాదు అహంకారంతో పుడుతావి అహంకారంతో చే లేకపోతావి పుట్టని చావని మార్గంకాదు శరీరం పుట్టకమునుపు పుత్త బట్టబయలే వున్నది. శరీరం వున్నప్పుడు యీ పుత్త బట్టబయలే వున్నది శరీరం కాలిపోయినతరువాత యీ పుత్త బట్టబయలే వున్నది పుట్టని చావని బట్టబయలు చలించక వున్నది కొటిమాట్లకు యీ పుత్త బట్టబయలుకు యేమిలేదు యీ పుత్త బట్టబయలుకు శరీరం యెన్నడూలేదు.

## ౮. ప్రభువు లక్షణం

జీవుడు పుట్టనేలేదు యీ పుత్త బట్టబయలు సరి యీ పుత్త బట్టబయలే ప్రభుస్వామి పుట్టని చావనివాడే ప్రభుస్వామి.

యీ ప్రభువువలన ప్రపంచం పుట్టనే దు అని లీలచేసిన కవీశ్వరునికి యెరుక.

శైవసిద్ధాంతాలు ప్రపంచం పుట్టనేలేదని యెరుక. యీ పుత్త బట్టబయలు ప్రభుస్వామి.

ప్రభువుఅన్న పరమపదమన్న యీ పుత్త బట్టబయలుకే ద్వాదశాక్షరి సౌంజ్ఞ.

"యీ పుత్త బట్టబయలు యేమీలేదు" యీ పుత్త బట్టబయలువలన శక్తి శివుడు పుట్టనేలేదు యీ పుత్త బట్టబయలు మాత్రమే వున్నది.

యీ పుత్త బట్టబయలువలన పుట్టని చైతన్యాన్ని వున్నదని యేలాగు అన ఛీ ఛీ ఛీ .

పుట్టనిచావని యీ పుత్త బట్టబయలుమాత్రమే వున్నది

గీతాభాష్యమందు యీ పుత్త బట్టబయలుమాత్రం వున్నదని శంకరాచార్యులవారు అన్నారు.

సూత్రభాష్యమందు పుట్టనిచావని ఈ పుత్త బట్టబయలు వున్నది

వుపనిషద్భాష్యమందు పుట్టనిచావనివాడే పరబ్రహ్మం అమృతం అన్నది.

యిదే కారణకార్యం లేకవున్నది యీదే సదసత్తులు గానిది. యిదే మొదలు చెప్పవలె పరమాత్మవలన పుట్టని క్షేత్రజ్ఞుణి క్షేత్రాన్ని చెప్పరాదు. పుట్టని చావని ఈ వుత్త బట్టబయలే పరమపురుషుడు ఈ వుత్త బట్టబయలుకు యేమీలేదు పుట్టనిచావనివాడే పరమపురుషుడు విలక్షణం అహంకారం జ్ఞానా జ్ఞానాలు ఈ ఉత్తబట్టబయలుకు యేమీలేదు.

ఇతి గద్య శ్రీమద్గురు శివరామదీక్షిత ప్రభావే వేదాంతవిచారణే
పుత్తరభాగే అమలప్రకాశ ప్రకరణం తృతీయోధ్యాయః

---

శ్రీ సద్గురవేనమః

# అమృతసార ప్రకరణం

12 శ్లో॥ బందాబంధాధిరహితం। అమృతంచాస్తి సర్వదా
సూక్ష్మాత్సూక్ష్మతరంనాస్తి। మహతోన్మహితవర్జితం॥

యీ వుత్త బట్టబయలు ఏమిలేదుఅని సిద్ధాంతమే అనంతకోటి సిద్ధాంతము.

యీ వుత్త బట్టబయలు తనకుతానే స్వతఃసిద్ధం అయింది చలించక వున్నది.

ప్రపంచం పుట్టనేలేదు యిది నిజగురువు వుపదేశం ఈ వుత్త బట్ట బయలే పరిపూర్ణం ఈ వుత్త బట్టబయలు నిజగురువు చెప్పక కానరు.

శృ॥ "ఆచార్య స్వరూపోవేదా ?" అని వున్నది గనుక.
"ఖంబ్రహ్మ" "ఖంబ్రహ్మ" అని సిద్ధాంతవాక్యం వుండనేవున్నది.

వున్నా భ్రాంతిమార్గం మొదటిదికాదు మొదలు యేది వున్నదో అది చెప్పినవాడు నిజగురువు పుట్టనిచావని గురువు కావలె శరీరం అయివున్న గురువు పనికిరాడు అహంకారం అయివున్న గురువు పనికిరాడు. పుట్టని చావనిది యేదో ఆదే సత్యం అని చెప్పే గురువుకావలె జ్ఞానమార్గం నిశ్చేధమే.

గనుక పుట్టనిచావనిది ఈ పుత్త బట్టబయలుగనుక యిది మొదలు చెప్పవలె.

పుట్టని ప్రపంచంయొక్క జోలేకూడదు. ఈ పుత్త బట్టబయలువలన వేరే మాయ పుట్టనేలేదు గనుక ఈ పుత్త బట్టబయలు వున్నది ఈ పుత్త బట్టబయలు అత్యంతవిలక్షణం.

ఈ పుత్తబట్టబయలువలన క్షరమనే చైతన్యరూపిణి మాయ పుట్టనే లేదు గనుక యేమీలేదు.

ఈ పుత్తబట్టబయలు మినహాయేమీలేదు. లేకుంటే క్షరమనే శరీరం యేమీలేదు.

## 2. గురువాక్య లక్షణం

ఈ పుత్తబట్టబయలే వున్నది. ఈ పుత్తబట్టబయలు పుట్టదు పుట్టించదు అందుకే ప్రపంచం పుట్టనెలేదు చావదు. ఈ పుత్తబట్టబయలు మాట్లాడదు.

ఈ పుత్తబట్టబయలుకు వొక్కటి అయినా బాధలేదు. జన్మమేలేదు. గనుక జన్మం లేకుంటే అహంకారంలేదు.

ఈ పుత్తబట్టబయలే వున్నది ద్వంద్వాలు పుట్టనేలేదు. గనుక ఈ పుత్త బట్టబయలే వున్నాది అహంకారంలేదు.

అహంకారంలేకుంటే ప్రపంచభ్రాంతి యెవరికి.

ప్రపంచం యెక్కడవున్నది.

ఈ పుత్తబట్టబయలుకు యేమీలేదు. ఈ పుత్తబట్టబయలే పరిపూర్ణం.

ఈ వాక్యం సతతం మరువక యాదివుండవలెను. ప్రయత్నం కొంచ మనక చెయ్యవలెను.

ఈ పుత్తబట్టబయలే అత్యంతవిలక్షం.

విలక్షణంవలనవికారంపుట్టనేలేదు. సదసత్తులనే ద్వంద్వాలజోలేలేదు

"యీ పుత్తబట్టబయలు యేమీలేదు" యిది నిజగురువాక్యం మొదటి వుపదేశం.

పుట్టనిచావనివాడే పరబ్రహ్మం. పుట్టనిదే అమృతం

అత్యంత విలక్షణంవలన ప్రపంచం పుట్టనేలేదు గనుక యిదిమొదటి వుపదేశం.

యిది మహారహస్యం. రాజగుహ్యం. పరమగుహ్యం.

3. అధికారి లక్షణం

అనధికారులకు చెప్పరాదు అనే నేమం వున్నది.

పుణ్యం యిచ్ఛవున్నవారికి చెప్పరాదు. పాపం యిచ్ఛ వున్నవారికి చెప్పరాదు,

మిక్కిలి గురుసాంప్రదాయం యెరుగరు బట్టబయలు ప్రభావం యెరుగరు,

యే కులంజయివున్నారో వారికివుత్పత్తిస్థితిలయాలు కలిగి వున్నావి

అ ప్రమాణానికే వేదం ప్రమాణం. యీ వుత్తబట్టబయలు పుట్టని చావనిది. జ్ఞానాజ్ఞానాలు శూన్యం.

ఈ వుత్తబట్టబయలే నిర్భావం సతతం మరువక నిరంతరం యాది వుండవలెను.

ఈ వుత్తబట్టబయలువలన సత్తుపుట్టదు అసత్తు పుట్టదు. ఈ వుత్త బట్టబయలే నిరంజనం "బట్టబయలే తాను" "తానే బట్టబయలు" అత్యంత విలక్షణమే స్వరూపం.

శృతి॥ "ఛిందంతి సర్వశస్త్రాణి" మొదటిది సాక్షిణిమాయ.
యీ వుత్తబట్టబయలే అత్యంత విలక్షణం.
మొదటిది అదే లేని యెరుక.

శృతి॥ "విషయావినివర్తంతే నిరాహారస్య దేహినః
రసవర్జం రసోప్యస్య పరందృష్ట్వా నివర్తతే"
యీవుత్త బట్టబయలువలన వేదాలు భగవద్గీతలు పుట్టనేలేదు.

యీ వుత్త బట్టబయలుకు జ్ఞానాజ్ఞానాలు విద్యా విద్యలు సద సత్తులు అనే ద్వంద్వాలు పుట్టనేలేదు గనుక యిదే అత్యంత విలక్షణం.

ఈ వుత్త బట్టబయలు మునుపే వున్నాది యీ వాక్యం సంతతం మరువక వుండవలెను వుంటే యేమీతోచదు అక్షరంపాపమే క్షరంపారమే

ఈ వుత్త బట్టబయలే నిరాకారం నిర్గుణం నిర్వికారం నిరంజనం.

శ్లో॥ నిర్గుణోనిష్క్రియోనిత్యో। నిర్వికల్పోనిరంజనః
నిర్వికారోనిరాకారో। నిత్యముక్తోస్మి నిర్మలః॥

శృ॥ "అనణ్వస్థూలమహ్రస్వ। మదీర్ఘ మజమవ్యయం
అరూపగుణవర్ణాఖ్యం। తద్బ్రహ్మేత్యవధారయేత్"॥

బ్రహ్మట విష్ణువట మహేశ్వరుడట. ఛీ ఛీ ఛీ లోకుల మాటలు కాకుల కూతలు.

ఇతి గద్య॥ శ్రీమద్గురు శివరామదీక్షిత ప్రభావే వేదాంతవిచారణే
ఉత్తరభాగే అమృతసార ప్రకరణం చతుర్థోధ్యాయః॥
పూర్వోత్తరభాగ ద్వాదశోధ్యాయః ప్రథమ ద్వితీయ భాగం
సంపూర్ణం

ఇతి శ్రీమద్బృహద్వాసిష్ఠ అచలబోధ సిద్ధాంత నిర్ధారణులైన శ్రీ శివ రామదీక్షిత గురు సాంప్రదాయక శ్రీమత్పిల్లాన లక్ష్మణ దేశిక ప్రభుస్వాముల వారి ప్రియశిష్యుండగు శ్రీ సచ్చిదానంద వెంకటేశ్వర స్వామివారిచే ముముక్షజనులకు సులభోపాయముగా బోధయపుటకొరకై శ్రీ శివరామదీక్షితీయము అచలబోధ సిద్ధాంతంద్వాదశిఖాం పూర్వోత్తరభాగం ద్వాదశి అధ్యాయములు పరిచ్ఛేదములుగా విభజింపబడినది.

సంపూర్ణం

........

శ్రీ సద్గురవేనమః

# శ్రీ శివరామ దీక్షితీయము
# అచలబోధ సిద్ధాంతం ద్వాదశిఖావం
# ఉపనిషత్ ప్రమాణం

1. పూర్వభాగం 2.

1. శరీరరహిత ప్రకరణం

1 శ్లోకం॥ ఇదంపూర్ణమదః పూర్ణం। పూర్ణాత్పూర్ణముదచ్యతే
పూర్ణస్యపూర్ణమాదాయ । పూర్ణమేవావశిష్యతే॥
2 శృతి॥ ఆత్మానఆకాశః సంభూతః
3 శృతి॥ ఆకాశస్యగుణశ్శబ్దో । నిశ్శబ్దోబ్రహ్మాఉచ్యతె
4 శృతి॥ ఏనవాచాకరోతి

2. చైతన్య నిరసన ప్రకరణం

5 శ్లోకం॥ షడూర్మితరహితం పూర్ణమ్ । అష్టావరణవర్జితమ్
షడ్వర్గరహితం పూర్ణమ్ । షట్కోశరహితంసదా॥

6 శ్లోకం॥ అశరీరంసర్వదా స్తి । శరీరంరహితంసదా
అయమేవసదోమ్యముక్తి । రన్యద్భ్రమకారణం॥

### 3. అహంకార నిరసన ప్రకరణం.

7 శ్లోకం॥ స్వపూర్ణావ్యతిరేకేణ । జీవబ్రహ్మమయంజగత్
నాస్తిమాయాసదాబ్రహ్మ । నాస్తినాస్తివిధీయతే॥

8 శ్లోకం॥ శుద్ధేసుమస్తిదృష్టాంతం । తస్మిన్నాహంకదాచన
తద్వత్సదాపియస్యాస్తి । ప్రపంచంనాస్తిసర్వదా 1॥

9 శ్లోకం॥ యథానాహంతథాశుద్ధం । తస్మాత్శుద్ధేననిర్ణయః
జగదస్తితికోవేద । నాస్తికోనచనిర్ణయః 2॥

10 శ్లోకం॥ ఆత్మాతీతం కేవలాత్మ । దేహోనాస్తికదాచన
అస్తినాస్తితికోవేద । నిర్ణయోనాస్తి సర్వదా 3॥

11 శ్లోకం॥ నారాయణుత్పరంవస్తు । తస్మిన్నాహంకదాచన
గుణత్రయంనవిద్యంతే। వికారరహితంసదా ॥

12 శ్రుతి॥ ఇదంవస్తునారాయణాత్పరం । శేషంస్పష్టం ॥

### 4. క్షేత్రక్షేత్రజ్ఞ నిరసన ప్రకరణం

13 శ్లోకం॥ దృశ్యాదృశ్యవిహీనాత్మా । దృష్టాదృక్ వివర్జితమ్
ఖండాఖండవిహీనాత్మ । క్షేత్రక్షేత్రజ్ఞ వర్జితమ్ ॥

14 శ్రుతి॥ క్షేత్రక్షేత్రజ్ఞలక్షణ । ప్రకృతిద్వయాఖ్య । ఉపాధిద్వయదోష
రహితమేవమోక్షః ॥

15 శ్లోకం॥ క్షేత్రక్షేత్రజ్ఞ యోరస్యం । నామరూపవివర్జితం
సత్రిపుటిరహితం । సర్వద్వంద్వ వివర్జితం ॥

16 శ్రుతి॥ పరాక్షరోపాధి ద్వయదోషరహితమేవ । విచారస్యఫలం ॥

17 శ్లోకం॥ విజ్ఞానమయముత్పన్నా । జ్ఞానాజ్ఞానమనోమయం
జ్ఞేయంశబ్దోదయోనైతి । త్రయముతిత్పతఃపరః ॥

18 శ్రుతి॥ జీవః ప్రకృతి జీవోపాధిః ప్రకృతిద్వయమేవ వుపాధిద్వయం ॥

19 శృతి॥ శ్రీ శరీరత్రయాఖ్యం , పరాప్రకృతిరహితనామసిద్ధయేనమః ॥

20 శృతి॥ చైతన్యాఖ్య పరాప్రకృతి । రహితనామసిద్ధయేనమః ॥

21 శృతి॥ సత్యాఖ్యబ్రహ్మరహిత॥

22 శృతి॥ నిర్గుణరహిత॥ 23 శృతి॥ అద్వైతరహిత॥

24 శృతి॥ జ్ఞానరహిత॥ 25 శృతి॥ చిద్రూపరహిత॥

26 శృతి॥ మాయాఅవిద్యారహిత॥ 27 శృతి॥ బంధమోక్షరహిత॥

28 శృతి॥ ప్రకృతి పురుషరహిత॥ 29 శృతి॥ గురుశిష్యరహిత॥

30 శృతి॥ వాచ్యార్ధలక్షార్ధరహిత॥

## 5. ధర్మాధర్మ నిరసన ప్రకరణము

31 శ్లోకం॥ సత్యాసత్యవిహీనంచే । విద్యావిద్యవివర్జితం
ద్వైతాద్వైతవిహీనంచ । ధర్మాదర్మ వివర్జితం ॥

32 శ్లోకం॥ చిదేవదేవచిదమేవలోకా । చిదేవభూతానిచిద్రింద్రియాణి ॥
కర్తాచిదంతఃకరణంచిదేవ । చిదేవసర్వంపరమార్థరూపం ॥1॥

33 శ్లోకం॥ చిదిహాస్తి తిచిన్మాత్ర । మిదంచిన్మయిమేవచ
చిత్వంచిదహమేతెచ । లోకాశ్చదితిసంగ్రిహః ॥2॥

34 శ్లోకం॥ చిదేవపంచభూతాని । చిదేవభువనత్రయం
విజ్ఞానమధునానమ్య । గ్రహమస్మిచదేవహి ॥3॥

35 శ్లోకం॥ చైతన్యం శాశ్వతంశాంతం । వ్యోమాతితంనిరంజనం
నాదబిందుకళాతితం । తస్మైశ్రీ గురువేనమః ॥4॥

36 శృతి॥ సిద్ధోహం॥ 37 శృతి॥ బుద్ధోహం ॥ 38 శృతి॥ హంసోహం ॥

39 శృతి॥ అహంబ్రహ్మాస్మి ॥ 40 శృతి॥ జీవేశ్వరైక్యజ్ఞానం॥

## 6. కారణతను నిరసన ప్రకరణము

41 శ్లోకం॥ శుద్దేసుషుప్తావివచ । తస్మిన్నాహంకదాచన
తద్వత్స్వధానిముస్యాస్తి । ప్రపంచంనాస్తితస్యవై॥

42 శృతి॥ సర్వార్థధాత్రి సావిత్రి । సచ్చిదానందస్వరూపిణి ॥
43 శృతి॥ ఆర్యాదిష్టితావాశూద్రాః ॥
44 శృతి॥ ఆర్యాఃప్రయతాః । వైశ్యదేవాంసగుమ్స్కర్తారస్యుః
అర్యాఃత్రైవర్ణికాః ॥
45 శృతి॥ నజాయతే నవిద్యతే । అచేద్యోయిం అదాహ్యోయం॥

7. కారణ కార్యరహిత ప్రకరణం

46 శ్లోకం॥ కార్యోపాధిరయంజీవః । కారణోపాధిరీశ్వరః
కార్యకారణతాంహిత్వా । పూర్ణబోధవశిష్యతే॥
47 శృతి॥ నిర్ణయోనాస్తిసర్వదా॥

8. ఉపదేశ ప్రకరణము

48 శ్లోకం॥ ఏతన్మిథ్యా శుద్ధవియత్ । కించిన్నాస్తితితేమయా ।
కృపయాపరమంప్రోక్తం । భజాగ్రే ద్వాదశాక్షరం॥
49 శ్లోకం॥ సర్వధర్మాన్ పరిత్యజ్య । మామేకం శరణంవ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో । మోక్షయిష్యామిమాశుచా॥

2. ఉత్తరభాగం 4

9. మూలప్రకృతి నిరసన ప్రకరణం

50 శ్లోకం॥ ప్రకృతి పురుషోనాస్తి । ఏకంనాస్తి ద్వయంనహి ।
భాహ్యాభ్యాంతరంనాస్తి । సత్యంసత్యం మహర్నిశం॥
51 శృతి॥ వికారరహితేచ యీశ్వరః॥
52 శృతి॥ తద్విష్ణో పరమంపదం । సదాపశ్యంతి సూరయః ।
యద్గత్వాన నివర్తంతే । తద్దామ పరమంషమ ।
తతఃప్పదంతత్పరిమార్గితవ్యం । మస్మిన్ గతననివర్తంతెభూయః ।
53 శృతి॥ ఉత్తమః పురుషస్త్వన్యః॥
54 శ్లోకం॥ యస్మాత్షర మతీతోహ । మక్షరాదపిచోత్తమః
55 శ్లోకం॥ ఉత్కృష్టతమః ః అక్షరదపిచ అమోమోత్తమః ।
అక్షరపరబ్రహ్మణోపి । క్షరాక్షరాభ్యాంఅన్యః॥
56 శృతి॥ భ్రమేణాహం భ్రమేణత్వం । భ్రమేణో పాసకోజనః ।
భ్రమేణేశ్వర భావత్వం । భ్రమమూల మిదంజగత్॥

10 మహావాక్య స్వప్రకాశ ప్రకరణం

57 శ్లోకం॥ ప్రజ్ఞానవాక్య హీనాత్మ । తత్వమస్యాది వర్జితం ।
బ్రహ్మోహం దావహీనాత్మ । అయమాత్మేతి వర్జితం॥

58 శ్లోకం॥ సర్వశూన్యం మాయారూపం । జన్మశూన్యం స్వభావతః
జన్మభావేన మృత్యుశ్చ । పరిపూర్ణం స్వభావతః॥
59 శృతి॥ ఏనం పరమాత్మానం ।
60 శ్లోకం॥ నైనంఛిందంతిశాస్త్రాణి । నైనం దహతిపావకః ।
61 శ్లోకం॥ అచ్ఛేద్యోయ మదాహ్యోయ మక్లేద్యోఽశోష్యఏవచ
నిత్యఃస్సర్వ గతఃస్థాణు । రచలోయం సనాతనః॥
62 శృతి॥ సచ్చిదానంద స్వరూపిణి । శక్తిశ్రీ పురుషశ్చ ।
63 శృతి॥ సత్యం జనవిరోధాయ । అసత్యం జనరం జకం ।

11. అమల ప్రకాశ ప్రకరణం.

64 శ్లోకం॥ జన్మభావే కరనాస్తి కర్మభావే ఫలంనహి ।
ఫలాభావే భయంకుత్ర । భయభావేనసంశయః॥
65 శృతి॥ యత్రనాస్యత్పశ్యతి । నాన్యశృణోతి నాన్యద్విజానాతి ।
నభూమ ।

12. అమృతసార ప్రకరణం

67 శ్లోకం॥ బంధాబంధాది రహితం ।-అమృతంచాస్తి సర్వదా ।
సూక్ష్మాత్సూక్ష్మ తరంనాస్తి । మహతోన్మహిత వర్జితం॥
67 శృతి॥ ఆచార్య స్వరూపోవేదాః ।
68 శృతి॥ ఖంబ్రహ్మ ।
69 శృతి॥ ఛిందంతి సర్వశస్త్రాణి ।
70 శృతి॥ విషయా వినివర్తంతె । నిరాహారన్య దేహినః ।
రసవర్జ్యం రసొప్యన్య । పరంద్వష్ట్వానివర్తతే॥
71 శ్లోకం॥ నిర్గుణోనిష్క్రియోనిత్యో । నిర్వికల్పోనిరంజనం
నిర్వికారో నిరాకారో । నిత్యముక్తొస్మి నిర్మలః॥
72 శృతి॥ అనణ్వస్థూల మహ్రస్వ । మదీర్ఘమజమవ్యయం।
అరూపగుణవర్ణాఖ్యం । తద్బ్రహ్మేత్య వధారయేత్॥

ఇతి శ్రీసచ్చిదానంద వేంకటేశ్వర స్వామివారిచే శ్రీశివరామ దీక్షితియ్యమను అచలబోధ సిద్ధాంతం ద్వాదశిఖావములో యుండు ఉపనిషత్ ప్రమాణ శృతులు శ్లోకములు బోధ కొరకై క్రమముగా యేర్పరచబడ్డది సర్వం సంపూర్ణం॥.

ముద్రభోద్వప దేశిక

డా॥ కూన దయానంద
స్వామి
MBBS(MD)
నర్సాపురం, ములుగు
జి॥ వరంగల్-506343.
పద్మాక్షికాలని - హనుమకొండ

ఓం

శ్రీ సద్గురు వేనమః

# శ్రీ మద్రామడ్గు శివరామ దీక్షితులవారిచే

రచియింపబడిన

# శ్రీ శివరామదీక్షితీయ్యామను బృహద్వాసిష్ఠం

అ చ ల బో ధ సి ద్ధాం త ము

# షోడశిభావం
# స్వప్న దృష్టాంతములు

భ్రాంతిరహిత ప్రకరణము

మూడవ భాగం.

అమలానంద శైదల కుమారయ్యాగారిచే
పరిచ్ఛేదములుగా విభజింపబడి
ఏతత్ పీఠసాంప్రదాయక భక్తమండలివారి ప్రేరేపణచే

శ్రీ దయానంద
జయోగిగారి వలన

ర్పు (౧౦౦౦) ప్రతులు

క్షరశాలయందు ముద్రింపబడియె,
కంద్రాబాద్.

 1956 వెల 4-0-0

ఓం
శ్రీ సద్గురవేనమః

# శ్రీ శివరామదీక్షితీయ్యామును

# బృహద్వాసిష్ఠం

---

అచలబోధసిద్ధాంతం

# షోడశి భావం స్వప్న దృష్టాంతం

భ్రాంతిరహిత ప్రకరణము.

మూడవ భాగం.

ఇయ్యది

శ్రీమద్బృహద్వాసిష్ఠ అచలబోధ సిద్ధాంతులన

**శ్రీ మద్రామడుగు శివరామ దీక్షితులవారిచే**

రచియింపబడి

అమలానంద త్రైదల కుమారయ్యగారిచే

పరిచ్ఛేదములుగా విభజింపబడి

ఏకస్ పీఠసాంప్రదాయక భక్తమండలివారి ప్రేరేపణచే

అచలఋషి దయానంద రాజయోగిగారి వలన

రెండవకూర్పు (౧౦౦౦) ప్రతులు

శ్రీ దత్త ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె,
సికింద్రాబాద్.

 1956 వెల 4-0-0.

## అచల పరిపూర్ణబోధ సిద్ధాంత గురుపీఠ

సాంప్రదాయిక గ్రంథముల వివరము.

| | | |
|---|---|---|
| శ్రీశివరామ దీక్షితీయము. చలాచల వాక్యములు సదృష్టాంతములు | మొదటి భాగము | 2-8-0 |
| శ్రీశివరామదీక్షితీయము ద్వాదశీ భావము. | రెండవ భాగము | 2-8-0 |
| బృహద్వాశిష్టము షోడశీభావము స్వప్న దృష్టాంతములు | మూడవ భాగము | 4-0-0 |
| బృహద్వాశిష్టము అచలబోధ దృష్టాంతములు | నాల్గవ భాగము | 3-0-0 |
| అచల పరిపూర్ణ రాజయోగియము నిజప్రబోధ విధానము | | 8 0-0 |
| రాజయోగీయ పరిపూర్ణ రాజయోగములు | | 3 0-0 |
| ప్రబోధ చూడామణియను శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణ తత్వ కందార్ధదర్వులు, కందపద్యములు | | 5-0-0 |
| పరిపూర్ణబోధ సిద్ధాంత శిరోమణి | | 4-0-0 |
| పరతత్వసుధాబ్ధి చంద్రోదయమను అచలబోధ శిఖామణి పూర్వోత్తర భాగములు | | 3-0 0 |
| అభినవ దీక్షితీయము ఉపాసనాకాండః | | 3-0-0 |
| వేంకటేశ్వరావధూత వాక్యత్రయము పరిపూర్ణ బోధామృతమను మహాఅద్వైత సిద్ధాంత పరతత్వ కందార్థములు సద్గురుభక్తశతకము సాంఖ్యతత్వములు | | 3-0-0 |
| శుద్ధనిర్గుణ పరతత్వ బోధామృత కందార్థ దర్వులు నిజానంద తత్వములు కందపద్యములు | | 2-0-0 |
| సుజ్ఞానదీపమను గురుగీత తాత్పర్య సహితము | | 1-8-0 |
| భూమానంద వాక్యత్రయము | | 1-8-0 |
| భద్రాద్రిరామశతకము విశేషార్థ సహితము | | 1-8-0 |
| భక్తజనముక్తావళి అను సద్గురు సంకీర్తనలు | | 1-0-0 |
| శ్రీశివరామదీక్షిత గురుపీఠ అనుష్ఠానవిధి | | 1-0-0 |
| పరిపూర్ణబోధ సిద్ధాంత ప్రకాశిక | | 0-8-0 |
| శ్రీ శివరామ దీక్షిత గురుపీఠ రాజయోగాశ్రమ నియమావళి | | 0-8-0 |

ఈ గ్రంథములు వలయువారు :—

పొన్నాల రాజయోగి అచలగురుపీఠము

నెం. 2362. కంజరిగూడెం, శికింద్రాబాదు అని వ్రాయవలయును.

శ్రీ శివరామ దీక్షిత అచలగురుపీఠ

భక్తమణి



అబ్బూరి వెంకటరామమ్మ

# అవతారిక

శ్రీమదద్వైత వేదాంత వేత్తలును, ఆత్మైక్య శరీరహితులును, జనన మరణభ్రాంతి రహిత రాజపూర్ణ బృహద్వాశిష్ట సిద్ధాంత నిర్ధారణులును. శ్రీమదచల పరిపూర్ణబోధ ప్రతిష్టాపనాచార్యులునగు శ్రీమద్రామదుర్గ శ్రీ శివరామదీక్షితాచల పరిపూర్ణస్వామివారు నైజాంయిలాక నల్లగొండ తాలూకాలో చేరిన నారాయణపురంబను గ్రామంబులో నివసించుచు తమ నిజగురువులగు శ్రీ శ్రీహరిస్వామివారు, ఆనతిచ్చిన అఖండజ్ఞాన పూర్ణభావమును సకలభక్తశ్రేణులకు బహుదూరమును హస్తామలకమగునటుల నాంధ్రపదములతో శ్రీశివరామదీక్షితీయమును చలాచల వాక్యములు మొదటిభాగముగాను. శ్రీశివరామ దీక్షితీయము ద్వాదశభావము ద్వాదశ ప్రకరణములు రెండవ భాగముగాను,

శ్రీశివరామ దీక్షితీయ బృహద్వాశిష్టము షోడశ భావం స్వప్న దృష్టాంతములు షోడశ ప్రకరణములు మూడవ భాగముగాను,

శ్రీశివరామ దీక్షితీయము అచలబోధ ద్రాష్టాంతము, పంచదశ ప్రకరణములు నాల్గవ భాగముగాను, రచియుంచిన యీ పురాతన గ్రంథము శ్రీ సచ్చిదానంద వెంకటేశ్వర అవధూత స్వాములవారిచే సంపాదింపబడి శ్రీ భూమానంద మంతెన్నల హనుమంత రాజయోగి శిష్యుండగు నైదల కుమారయ్యగారిచే ముముక్షువులకు సులభోపాయముగా తెలియునటుల పరిచ్ఛేదములుగా విభజింపబడి ఏతత్ భక్తమండలివారి ప్రేరేపణచే హైదరాబాద రాజధానిలో చేరిన సికింద్రాబాద వాస్తవ్యులును శాండిల్య సగోత్రోద్భవులును బ్రహ్మశ్రీ రావులపాటి హనుమంతరావు ధర్మపత్నియగు అక్కలక్ష్మమ్మగారి గర్భమౌక్తికమును తెనాలి గ్రామవాస్తవ్యులును హారిత సగోత్రోద్భవులగు అబ్బూరి సుబ్బారావు పంతులుగారి కొమారుడగు వెంకటరామయ్యగారి ధర్మపత్నియగు అబ్బూరి వెంకటరామమ్మ తన పూర్వజన్మ పుణ్యవిశేషముచే శ్రీ శివరామదీక్షిత అచలగురుపీఠాధిపతులగు అచలఋషి దయానంద పొన్నాలరాజయోగిగారిని ఆశ్రయించి అచల పరిపూర్ణ బోధవడసి జనన మరణ భ్రాంతిరహిత పరిపూర్ణస్థితిజెంది కృతార్థులయిరి అదేప్రకారము సకల ముముక్షువులు కృతార్థులగుటకు యీ గ్రంథరాజమును తమ ద్రవ్యసహాయమున ముద్రింపచేసిరి.

ఇట్లు, పీఠాధిపతి.

శ్రీ సద్గురుభ్యోనమః

# అనుష్ఠాన విధిః

---

## ౧. గురుపరంపరాధ్యానం.

ఓంనమోబ్రహ్మాదిభ్యో । బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో । వంశఋషిభ్యో । మహద్భ్యో । నమోగురుభ్యః॥ సర్వోపప్లవ రహిత ప్రజ్ఞానఘన ప్రత్యగర్థో । బ్రహ్మైవాహ మస్మిఅహంపదార్థ రహితః॥

శ్లో॥ ఓంకారపీఠసిద్ధాంత । బ్రహ్మవిద్యోపదేశిక
శ్రీమన్నారాయణంపూర్వం । సద్గురుభ్యో నమోనమః॥

శ్లో॥ యాజ్ఞవల్క్యంచ జనకం । శుకసాందీప మీశ్వరమ్
కృష్ణమర్జునసంయుక్తం । ఉద్ధవంచ నమోనమః॥

శ్లో॥ శ్రీధరస్వామియోగీంద్రం । శివరామాఖ్యదీక్షితం
కంబాలూరిఅప్పబ్రహ్మం । సద్గురుభ్యోనమోనమః॥

శ్లో॥ పరశురామసీతారామ । భాగవతకృష్ణయోగినః
ఖీలుఖానలక్ష్మణార్య । సద్గురుభ్యోనమోనమః॥

శ్లో॥ బ్రహ్మవ్యాసిసిద్ధాంత । పూర్ణబోధోపదేశిక
వేంకటేశ్వర యోగీంద్ర । సద్గురుభ్యోనమోనమః॥

శ్లో॥ వేంకటేశ్వరపాదార । విందామృతరసాయనం ।
పిబన్మత్త మనోభృంగం । హనుమంతం గురుంభజే॥

శ్లో॥ వేదశాస్త్ర విధిఖ్యాతం । పూర్ణబోధోప దేశికమ్ ।
సుగుణాకరం దయానందం । రాజయార్య గురుంభజే॥

శ్లో॥ అస్మద్గురుసమారంభాం । కృష్ణసాందీపమధ్యమామ్
ఓంకారపీఠపర్యంతాం । వందేగురుపరంపరామ్॥

## ౨. లఘుపూజ.

శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం । కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగనసదృశం । తత్త్వమస్యాదిలక్ష్యం
ఏకం నిత్యం విమల మచలం । సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం । సద్గురుం తం నమామి॥

శ్లో॥ ధ్యాన మావాహనం సింహా । సనం పాద్యంతథైవచ
అర్ఘ్యమాచమనీయ్యంచ । స్నానం పంచామృతై స్సహా॥
శ్లో॥ శుద్ధోదకం వస్త్రయుగ్మం ।యజ్ఞసూత్రం విభూషణం
విలేపనం చాక్షతాంశ్చ । పుష్పం స్వర్ణవినిర్మితః॥
శ్లో॥ ధూపందీపంచ నైవేద్యం । పానీయ్యం ఫలమేవచ
తాంబూలం దక్షిణా ర్తిక్యం । మంత్రంపుష్పం ప్రదక్షిణం॥
శ్లో॥ నమస్కారం దేశికేంద్ర । మయాతుభ్యం నివేదితమ్
కృపయాగృహ్య తాంస్వామిన్ । న్యూనాధిక్యం నచింతయా॥
శ్లో॥ లఘుపూజా విధింభాగ । వతకృష్ణ ద్విజన్మనా
రచితంశ్లోత్ర వక్త్రాణా ॥ మిదంమోక్ష కరంపదం॥

3. పరిపూర్ణ అచలధ్యానం.

శ్లో॥ పూర్ణమేవ నిరాలంబం । ఆగ్నేయే నిర్గుణంతథా
దక్షిణేనిత్య శుద్ధంచ । నైరృత్యో నిరుపద్రవం॥
శ్లో॥ పశ్చిమే నిష్కళంచైవ । వాయవ్యేచ నిరంజనం
ఉత్తరేచ నిరాకాశ । మీశాన్యే నిర్మలోభవేత్॥
శ్లో॥ ఊర్ధ్వమేవ నిరాకారం । అధశ్చ నిర్వికారకః॥
అంతర్బహిశ్చ సర్వత్ర । అచలోయం సనాతనః॥

పరాపూజ.

శ్లో॥ పూర్ణస్యా వాహనంకుత్ర । సర్వాధారస్య చాసనం
స్వచ్ఛస్య పాద్యమర్ఘ్యంచ । శుద్ధస్యాచ మనంకుతః॥
శ్లో॥ నిర్మలస్య కుతస్స్నానం । వస్త్రం విశ్వోదరస్యచ
నిరాలంబ స్యోపవీతం । రామస్యాభరణం కుతః॥
శ్లో॥ నిర్లేపస్య కుతోగంధః । పుష్పం నిర్వాసనస్యచ
నిర్గంధస్య కుతోధూప । స్స్వప్రకాశస్య దీపకః॥
శ్లో॥ నిత్యతృప్తస్య నైవేద్యం । నిష్కామస్య ఫలంకుతః
తాంబూలంచ విభోకుత్ర । నిత్యానందస్య దక్షిణా॥
శ్లో॥ స్వయం ప్రకాశమానస్య । కుతో నీరాజనాదికం
ప్రదక్షిణ మనంతస్య । అద్వితీయస్య కాస్తుతిః॥

శ్లో॥ అంతర్బహిశ్చ పూర్ణస్య । కథము ద్ధ్యానసనం భవేత్
ఇయమేవ పరాపూజా । సర్వాపసాను సర్వదా॥
శ్లో॥ ప్రేమబుధ్యాతు సర్వేశే । మనోదేవే నివేశనాత్
ఏషా మజ్ఞానజీవానాం సమస్తారిష్ట శాంతయే ।
యద్యద్బోద్ధవ్య మఖిలం । తత్తద్భక్త్యా బ్రవీమ్యహం

ద్వా ద శా క్ష రి.

అస్యశ్రీద్వాదశాక్షరీ మహామంత్రస్య । అచలఋషిః । అవినాశి ఛందః । అభవో దేవతా । అమృతం బీజం । అప్రమేయాశక్తిః । అను మాత్మా తత్వమస్యాది జ్ఞానరహిత కీలకం । అఖిల శాస్త్రేషు పరిసంఖ్యా మస్తి । మాయాసహిత మేతత్ప్రపంచం నాస్తీతి నిశ్చయ సిద్ధ్యర్థం ద్వాదశాక్షరీ మహామంత్రజపం కరిష్యే॥

అ థ క ర న్యా సః.

ఏతన్మిథ్యా=అంగుష్ఠాభ్యానమః । శుద్ధవియత్=తర్జనీభ్యాన్నమః కించిన్నాస్తి= మధ్యమాభ్యాంనమః । ఏతన్మిథ్యా = అనామికాభ్యాంనమః శుద్ధవియత్ = కనిష్ఠికాభ్యాంనమః । కించిన్నాస్తి = కరతలకరపృష్ఠాభ్యాం నమః॥

అథహృదయాదిన్యాసః.

ఏతన్మిథ్యా = హృదయాయనమః । శుద్ధవియత్ = శిరసేస్వాహా । కించిన్నాస్తి = శిఖాయైవషట్ । ఏతన్మిథ్యా = కవచాయహుం । శుద్ధ వియత్ = నేత్రత్రయాయ వౌషట్ । కించిన్నాస్తి = హస్త్రాయఫట్ ॥ ద్రష్ట దర్శన దృశ్యాదిసహిత । అహంపదార్థరహితః భూర్భువస్సువరోమితి దిగ్బంధః॥

అ థ ధ్యా న ం.

శ్లో॥ అచలమఖిలం వ్యాద్య । సర్వలోకేషు పూర్ణం
సర్వాతీతం । స్వానుభూతావ గమ్యం
సర్వాబాధ్యం । సర్వకర్తృత్వశూన్యం
సర్వావేద్యం । సర్వరహితం నమామి॥
శ్లో॥ అవాచ్యం హ్యఖండం । హ్యలక్ష్యం హ్యబాధ్యం
హ్యసంగ్యం హ్యవేద్యం । హ్యచింత్యం హ్యరూపం

హ్యాసాధ్యం హ్యానాద్యం । హ్యాతీతం హ్యానంతం
హ్యాశబ్దంహ్యాబుద్ధం । హ్యానామం నమామి॥

శ్లో॥ మృత్యుజన్మ భయదుఃఖవర్జితం
సర్వదృశ్య దృగ్దృష్టప్రనాశనం
అప్రతర్క్య మమలం నిరామయం
అనుపమాన మచలం నమామ్యహం॥

శ్లో॥ నిత్య పూర్ణాయ సత్యాయ । నిశ్చలాయ నిరీహిణే
నిర్మలాత్మ స్వరూపాయ । నిర్గుణాయ నమోనమః॥

శ్లో॥ ఏతన్మిథ్యా శుద్ధవియత్ । కించిన్నాస్తీతి తేమయా
కృపయా పరమం ప్రోక్తం । భజేగ్రే ద్వాదశాక్షరం॥

అ థ మ నుః.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఏతత్ | మిథ్యా | శుద్ధ | వియత్ | కించి | న్నాస్తి |
| ఈ | వృత్త | బట్ట | బయలు | ఏమి | లేదు. |

షో డ శా క్ష రి.

అస్యశ్రీషోడశాక్షరీ మహామంత్రస్య । నిరంజనఋషిః । నిరహంకారఃఛందః । నిరామయనిరాకారో దేవతా । నిరావరణబీజం । నిస్త్రిగుణాశక్తిః । నిర్గుణప్రజ్ఞానరహితంకీలకం । నిఖిలకాలేషుమాయా సహిత భూతపంచకనిర్మిత, దశేంద్రియ, పంచప్రాణ మనోబుద్ధిసహిత, సూక్ష్మశరీర రహిత, సిద్ధ్యర్థం, షోడశాక్షరీ మహామంత్రజపం కరిష్యే॥

అ థ క ర న్యా సః.

నిర్మలం-అంగుష్ఠాభ్యాంనమః । ఏతత్-తర్జనీభ్యాంనమః । జ్ఞానాచ్ఛరీరం - మధ్యమాభ్యాంనమః । నాస్తి - అనామికాభ్యాంనమః । కేవలం కనిష్ఠికాభ్యాంనమః॥ నిర్మలమేతజ్ఞా నాచ్ఛరీరంనాస్తి కేవలం-కరతల కరపృష్ఠాభ్యాంనమః॥

అథహృదయాదిన్యాసః.

నిర్మలం - హృదయాయనమః । ఏతత్-శిరసేస్వాహా । జ్ఞానచ్ఛరీరం - శిఖాయైవషట్ । నాస్తి - కవచాయహుం । కేవలం - నేత్రత్రయాయవౌషట్॥ నిర్మలమేతజ్ఞానాచ్ఛరీరంనాస్తి కేవలం - హస్త్రా

యఃఫట్॥ సమ స్తసిరోమ్మహాయ, త్రైత్రికాలేషు, మద్రహింత, నిశ్చయో భూర్భువస్సువరోమితిదశదిగ్బంధం॥

అథ ధ్యానము.

శ్లో॥ సర్వనిగమగుహ్యాం । శాశ్వతం సార్వకాలం
సకలదివిజవంద్యాం । సర్వదిహ్వార్ణమచలం
సకలభయనివారం । సర్వలోకాంతరస్థం
సకలమునిహృదిస్థం । సర్వదేశప్రశస్తం॥

శ్లో॥ నజ్ఞాతంపరవస్తురూపరహితం । నిస్తేజమమృతంసదా
నిశ్శబ్దం నిరుపాసనం నిరుపమం । నిర్దేశపూర్ణస్థితం
నిత్యాభ్యాసవివర్జితం విహితప । ద్వ్యాపారశూన్యంసదా
నిస్సంగం నిరుపాదికం నిరవయం । నిత్యంహృదింభావయే॥

శ్లో॥ ఆవంతరహితోస్మి నిత్యమచలం । నిర్ఘాతనిర్ఘోతనిరింద్రియత్వాం
నిర్మోహనిర్ద్వంద్వంనిరూపసత్యం।మహద్గురుంనిత్యామహాంనవాం॥

శ్లో॥ నిష్కాలంబాయనిత్యాయ । నిర్మలాయనిరంజన
నిత్యశుద్ధాయబుద్ధాయ । వస్తుమద్రిహితం నమః॥

శ్లో॥ నిష్కాలమేతదాజ్ఞానా । చ్ఛరీరంనాస్తి కేవలం
షోడశాకురితత్ సిద్ధ । మిదంవస్త్వనిశంభజే॥

అథమనుః.

నిష్కాల మేతదా, జ్ఞాన, శ్చరీరం నాస్తి కేవలం.
మూలంలేని యీగు క్తరిగే శరీరం యేమిలేదు.

దృష్టదాష్టాంతం.

శ్లో॥ స్వప్నే ప్రతీయమానాని రూపాణిచ యథాతథా
కర్పూరదీపసంయోగం జ్యోతిరూపంయథాతథా॥

దృ॥ కలలోదోచిన శరీరములు యేలాగో ఆలాగే.
ద్రా॥ కర్పూరము కళ్లికి కూడితే యేలాగో అలాగే.

శ్లో॥ ఇతి మంత్రిసమానైన । సాందీపగుర్వగ్రిణి
కృష్ణస్యమస్తకేనస్య । హస్తంతూష్ణీంబభూవహ॥

శ్రీసద్గురుచరణార విందార్పణమస్తు.

## శ్రీ శివరామ దీక్షిత అచలగురు పీఠాధిపతులు
## అచలర్షి



శ్రీ దయానంద పాన్హాల రాజయోగి

శ్రీ గురుభ్యోనమః

# శ్రీ శివరామ దీక్షితీయ్యమను బృహద్వాసిష్ఠం షోడశి భావం స్వప్నదృష్టాంతములు.

౧॥ వేదాంత ప్రకరణము.

## ప్రథమ కల.

శ్లో॥ అశరీరంసర్వదాస్తి । శరీరంరహితంసదా
అయమేవసదాముక్తి । అన్యదాభ్రమకారణం॥

గురు॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు అనే శిద్ధాంతమే శిద్ధాంతము. మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే సర్వం నావలన పుట్టియున్నది అని తనవంటివారితో చెప్పితే నమ్మినున్నారు.

పుట్టని చావనిది మొదలుకొనలేనిది గనుక అచలం యేమి అనలేదు. చలించక సార్వకాలం వక్కతీరుగానే యున్నది.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే సకల అబద్ధాలు ఆడింది. యీ గుర్తెరిగే శరీరమే చలం.

యిటువంటి చంచలస్వభావం గలది యేమిచెప్పిన చెలించి పొయ్యేవే కాని వక్కటైన పుట్టని చావని అచలం కావు.

చంచలం చెప్పినది స్థిరమని నమ్మేమాత్రమేకాని యీ గుర్తెరిగే శరీరంతోకూడా పోయావి.

యీ గుర్తెరిగే శరీరం చెప్పినది. యిటువంటి గుర్తెరిగే శరీరాలె నమ్మచావిగాని.

పుట్టన్ని చావని అచలం వినదు, చూడదు, అడుగదు, యెరుగదు, యెన్నటికి చలించదు.

# శ్రీ శివరామ దీక్షితీయ్యమను బృహద్వాసిష్టం

యీ గుర్తెరిగే శరీరమే సకల వినోదాలు చేసి యేమిలేక పోచుంది.

తనకు తానే స్వతస్సిద్ధం అయివున్న అచలానకు యే జోలిలేదు.

మధ్య వచ్చి మధ్య పొయ్యేది యీ గుర్తెరిగే శరీరమే సకల వినోదాలు చేశి యేమిలేక పోచుంది.

అచలానకు చంచలమైన శరీరానకు కొంచమైన సంబంధంలేదు.

సమస్తమైన మహత్తు యీ గుర్తెరిగే శరీరానికేగాని

పుట్టని చావని అచలానకు వక్కటైన మహత్తులేదు.

అచలం గనుక రాకడలేదు, పోకడలేదు, సార్వకాలం వక్కటీరే.

యీ గుర్తెరిగే శరీరంతో సంబంధం యీషత్తులేదు.

దానికి అదే.

దీనికి యిదేకాని,

యీ గుర్తెరిగే శరీరానకు పుట్టని చావని అచలానకు సమ్మంధంలేనిడే సమ్మంధం వున్నదని మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే అన్నది.

సర్వకాలం వక్కటీరుగావున్న అచలం యేమి అనక వక్కటీరుగానే వున్నది. యిందుకు అనుమానం యెవ్వరికి లేదు.

పుట్టని చావని అచలం యేమిచెయ్యాదు అని అందరికి సమాధానమే.

యీ పుట్టి చచ్చే శరీరానకు అచలం మూలం అని అనరాదు. అదిగాక మరివకటి అటువంటిది వున్నదని అనరాదు.

అందరు మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే చేసిన శాస్త్రాలు వేదాలు నమ్మి అదే యిది యిదే అది అని అనుకున్నారు.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే నానా మార్గాలు చేశి నాకు మూలంలేదని వకవేళ కనుక్కుందురని వేదాలు, శాస్త్రాలు, స్మృతులు, సూత్రాలు, పురాణాలు, యితిహాసాలు అనేక కథలు చేశి యవ్వరికి యీ మూలం తెలియకుండ కాదుబడచేశి తాను చేశినని

తనంత వారికే చూపుకుంచు యన్నటికి భ్రాంతి తీరకుండ తానే ముందరబడి అచలాన్ని స్మరించక చలమె స్థిరమని మరికొందరు నమ్మక పోయేరని శరీర మబద్ధం నేను నిబద్ధఅని కల్పించి మరివక వేరుప్రకారం నేను శరీరం వక్కటేఅని కొందరితో అని నేను వేరే నాకంటె వేరు యీశ్వరుడు వున్నాడని తాను చేసిన శృతులు ముందరపెట్టుకొని కీచులాడు కుంచు యిది నిబద్ధి అది అబద్ధం అనుకొంచు సార్వకాలం యీ గుర్తెరిగే శరీరం నేను అనుకొంచు వివేకం అవివేకం అని నిబంధన చేసుకుంచు గురువు దేవుడు నేను వక్కటే అని తెల్సుకుంచు యిది యేలాగంటే మహాకఠినం మహారహస్యం అనుకుంచు.

నేను యీ గుర్తెరిగే శరీరమే

దేవతా యీ గుర్తెరిగే శరీరమే

నీవు యీ గుర్తెరిగే శరీరమే అని చమత్కారాలు చేసి చూపి

మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే చేసిన గ్రంధాలు పుస్తకాలు వినుపిస్తు అన్యోన్య సంతోషపడుకుంచు కొన్నాళ్ళకు తాను దేవతా యేమి లేకపోతే అపుడు గాఢనిద్రలో మునిగిపోయినట్లు పోచాడు. యింతేగాని వున్నది వున్నట్లు పడకపాయ.

మూలంలేనిది యిదియని తెలియకుండ అందరు గుర్తెరిగే శరీరానకు కారణం వున్నది అని భాష్యాలు చేసినారు. గనుక పుట్టని చావని అచలం వారుకారు. మంది కాకుండాకూడ మధ్యన అరికట్టినారు.

భాష్యాలనే తాళ్లతో యీ గుర్తెరిగే శరీరాన్ని కట్టివేసినారు.

తనకు యెపుడు సమాధానం అయితే అపుడే తాళ్ళతోగూడ మునిగి కొంతసేపటికి మరి తేలుచుండి మరిమరి సకలమైన చమత్కారాలు చేస్తుంది. యింతేకాని,

గురువు కావలెనని కోరదు.

తన మతం తనకే సమ్మతంకాని యే మతం నమ్మదు.

భూమండలములో శరీరము లేనివారు వున్నారని యెవ్వరు యెరుగరు. చెప్పిన నమ్మరు. తనకు శఖ్యమేకాదు.

అందుకే భ్రాంతిలేని గురువు దుర్లభం. అందరివలె నుంటాడు. గనుక నమ్మిక వుండదు.

విడిచినవారు, దొడ్డవారు, చేసినవారు, మరిదొడ్డవారు.

అందరివలె వుంటే అందఱివంటివాడే అనిపిస్తుందిగాని శరీరంలేని వారు అని అనిపించదు.

అత్యంత గురు సాంప్రదాయము లేనివారుగనుక యీ గుహ్యం అద్వైత సిద్ధాంతం వంటిదికాదు. యదేకారణంటే యే సిద్ధాంతానకు మూలంలేదు.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరము సకల సిద్ధాంతాలకు మూలం.

యీ గుర్తెరిగే శరీరం వున్నంతసేపు సమస్తమైన లీలలు అనుభవింపబడుచావి.

రెండోదానిచేత అనుభవింపబడదు.

అనుభవించేవాడు వక్కడేగనుక అంతబ్రహ్మానుభవమే.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వక్కటేగనుక అనుభవం చేతనే అనుభవింపబడుచావి. గనుక అంతబ్రహ్మానుభవమే.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నంతసేపు అనుభవము.

యీ గుర్తెరిగే శరీరం యేమి లేదు అని యెపుడు వింటే అపుడే పుట్టని చావని అచలం స్వతస్సిద్ధమై సకల దేశాలయందు సమస్తమైన వస్తువులయందు సర్వకాలాలయందు జ్ఞానకర్మాలు యెరుగిక తనకుతానే వున్నది. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు అను సంతోషం సర్వకాలం అభ్యాసము చేసిన వక్కటైనా బాధవుండదు. వున్నదే వున్నది.

గద్య

ఇతి శ్రీమద్గురు శివరామదీక్షిత ప్రభావే వేదాంతవిచారణే
వేదాంతప్రకరణం ప్రథమోధ్యాయః

—o—

శ్రీ గురుభ్యోనమః

# ద్వితీయ కల

౨ ప్రకృతిపురుష సంయోగ నిరసన ప్రకరణము.

శ్లో॥ త్యజధర్మమధర్మంచ । ఉభే సత్యానృతంత్యజేత్
ఉభే సత్యానృ తేత్యక్త్వా । ఏవంత్యజదితంత్యజేత్ ॥

గురు॥ మూలంలేని యీ గుర్రెరిగె శరీరం యేమిలేదుఅని విచారించుతే అచలం స్వతస్సిద్ధమైయున్నది. నీకు యేమికావలె.

శిష్యు॥ రాకడ పోకడలేనిది సార్వకాలం వొకటేతీరుగా వున్నది. మొదలు కొన లేనిది పుట్టని చావనిది సకల దేశాలయందు సార్వకాలాలయందు సమస్తమైన వస్తువులయందు చలించక తనకు తానే స్వతస్సిద్ధమైయున్నది సూచన కావలె.

గురు॥ సూచన చేస్తాగాని మళ్లి అడుగవుగదా ?

శిష్యు॥ మళ్లా అడుగ. నే నేమైన చదువుకున్న మగవాన్నే. నాకు యిదిమాత్రం సూచన అయితె సరి.

గురు॥ నీవు యేమి ?

శిష్యు॥ మూలంలేని యీ గుర్రెరిగే శరీరం నేను.

గురు॥ యిపుడు యేతీరుగా అడిగినావో ఆతీరు వున్నదో లేదో అని సంశయము లేదుకదా ?

శిష్యు॥ కోటిమార్లకు వున్నది.

గురు॥ అట్లైతే అటువంటి దానియందే నీవు వున్నావు ?

శిష్యు॥ సరే సరే పట్టుగావున్నది.

గురు॥ కోటిమార్లకు వున్నదిగదా ?

శిష్యు॥ కోటిమార్లకు వున్నది. నాకు యేమి విచారంవున్న యేమిలేదు కొనకు యేమిలేదు.

గురు॥ అలాగే కాదు. యిపుడు కలలో వచ్చిన యేనుగులు మేలుకుంటే యాలాగో ఆలాగు యిపుడైతే సర్వకాలం వున్నది. అది లేక సముద్రమువలె వకటేతీరుగా వుండవలె.

శిష్యు॥ యేమి అయితే అది యేమి లేదు. కేవలం అచలమే. సార్వకాలం వక్కతీరే. వ్యవహారం యేలాగు యవరికి యేమి అన్న ఆశ్చర్యం యిది?

గురు॥ ఆశ్చరియమే యేమిలేదనేటందుకు యేమిలేకపాయ.

శిష్యు॥ యిక యేలాగు అన్న యిది అంత ఆశ్చరియం. యిది గురుస్వామికే తెలియవలె. అనరాదుగాని వారికి శక్యం కాదు. బహు కఠినం.

గురు॥ అటువంటివారితోకూడ వుండి చూడవలె

శిష్యు॥ చూచిన శక్యం కానట్టె వున్నవి అన్న అందుకే బ్రిహ్మ విద్య అతిసులభం. అతికఠినం స్వామి నాకు స్వభావమైన శరీరం అనే ప్రాయంవుండే.

గురు॥ కలలో యేనుగ మేలుకొంటే యేలాగు తనకు తానే యేమి లేదనే దృఢమో ఆలాగే.

శిష్యు॥ నీ సూచనచాత మూలంలేని యీ గుర్తెరిగే శరీరం ఆలాగు ఆయనా సార్వకాలం వక్కతీరే.

గురు॥ సరేకదా.

శిష్యు॥ సరే సరే.

గురు॥ శాభాసు చదువుకున్నవారికంటే నీవు దొడ్డదానవు. యీలాగు వుండవద్దా అమ్మా యిషువంటివారు యేలాగుఅంటే ఆలాగు నడువరుకదా. యిది ప్రమాణమని నడువరుకదా.

శిష్యు॥ అయ్యా యెన్నటికి యేది మూలమో అదే కలలో యేనుగ మేలుకొంటె యేమిలేదని తనకుతాను దృఢంవున్నట్టు మూలం లేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు అని దృఢం ఆయ యేదివున్నదో అదే వుండే యిక ముచ్చట వద్దు చాలుచాలు యెక్కవ ముచ్చట. అదే అందుకు మూలం యేమిలేదుఅని శిగ్గువుండవలె వ్వారికే అదే వున్నది. అంటె వుండిపాయె. వున్నది వున్నట్టు సూచన అయినవారికి ముఖం చెల్లదు. మునుపటివలె చెళావణిలేదు. చెల్లని రూపాయవలెనే రాగిరూపాయిపాటిదికాదు యిందుకు అనుమానం లేదు అన్ని అబద్ధాల

పుస్తకములవలె అలాగుకాదు. యిది ఆపాటిదికాదు. మూలంలేని యీ గుర్రెరిగ్గే శరీరానకు బడులులేదు. పుట్టని చావనిదానికి బదులు లేదు. యీలాగు వుండవలె గురు సాంప్రదాయం

ఇతి శ్రీమద్గురు శివరామదీక్షిత ప్రభావే వేదాంతవిచారణే
ప్రకృతి పురుషసంయోగ నిరసన ప్రకరణము
ద్వితీయోధ్యాయః

శ్రీ సద్గురువేనమః

# తృతీయకల

3. శివశక్త్యోపాది ద్వయదోషరహిత ప్రకరణము

శ్లో॥ సర్వశూన్యంమయారూపం । జన్మశూన్యఃస్వభావతః
జన్మభావేనమృత్యుశ్చ । పరిపూర్ణస్వభావతః॥

మూలంలేని యీ గుర్రెరిగ్గే శరీరం యేమిలేదు. ఆ సిద్ధాంతమే సిద్ధాంతము. కలలో వక్క స్త్రీ వచ్చి మీరు యెవ్వరు అని అడిగె యెవ్వరయితె యెమిఅనె.

శిష్యు॥ యేమిలేదుగాని అయ్యా నేను యేమిలేదుఅనె.

గురు॥ అందుకే మూలంలేని యీ గుర్రెరిగె శరీరంయేమిచేసినా అవ్వి యేమిలేదు.

సార్వకాలం మొదలు కొనలేని అచలం వున్నదిగదా దానికి వుత్పత్తి లేదు స్థితిలేదు లయంలేదు సర్వకాలం వక్కతీరె. యిది నమ్మినవారికి భ్రాంతి యెన్నటికిలేదు. యెవ్వరికి అనుమానంలేదు. నిబద్ధి అను వారులేరు అబద్ధం అనేవారులేరు. శూన్యం కాదు వోయి శిష్యుడా కలలో యేనుగ వచ్చి కొంతసేపు వుండి మేలుకొంటె యేమిలేదుగదా.

శిష్యు॥ నిబద్ధే యేమిలేదు.

గురు॥ అలాగ్గే మూలంలేని యీ గుర్రెరిగ్గే శరీరం వచ్చింది. కొన్నాళ్ళువుండి కొనకు యేనుగవలెనే యేమిలేదు.

పుట్టని చావని అచలం మొదలుకొనలేక సకలదేశాలయందు సా
కాలాలయందు సవ స్తమైన వస్తువులయందు తనకుతానే స్వతసిద్ధమైయున్న
దిగనుక ప్రయత్నము యేమిలేదు. అదే అచలం చలించనిది గనుక గు
వాక్యం మరువకు.

శిష్యు॥ యేది గురువాక్యం?

గురు॥ మూలం లేని యీ గుర్తైరిగే శరీరం యేమిలేదు.

శిష్యు॥ యిందుకు సందేహంలేదు. యిదే కోటిమార్లకు సత్యం నాకు వకటైన సాధనం చెయ్యండే తనకుతానె స్వతస్సిద్ధమయివున్న దాన్ని సూచన చెయ్యండి అనె. యింత అనగానే నూరు దొమ్మరగడల యెత్తు యెనుగ చౌడోలతోగూడవచ్చె. దానిమీదనే పెద్ద చెరువు రాజ గుఱ్రాలు అనేక పిరంగులు తోపులు తుపాకులు అనేకమయిన ఆడవాండ్లు దానిమీద చిన్నచిన్న యేనుగులు దానిమీదనే వంటలు భోజనాలు నిత్యం నూరువేలపుట్ల శనగలు పదివేలమంది ఆడవాండ్లు లెస్సకాళ్లు లేకుండచేసి పెద్దగోనె పట్టాపరచి ముందరపోస్తే మూడు ఘడియలకు ఫలహారంచేశేది. చేశినతరువాత తూర్పు సముద్రంవద్దికి తోలుకపోతె వకటె బొట్టు లేకుండ పీల్చేది. మళ్లి తోలుకవచ్చి పదివేలమంది యినుపగొలుసులతో కట్టివేసి లక్ష చెరుకు మోపులు వేస్తె తినుకుంచు వుండేది. యీ గురువుగాబర అయ్యి చూస్తువుండే. వుండంగానే ఆడది వచ్చి అయ్యా శీఘ్రంగా పుట్టని చావనిది మొదలుకొనలేనిది సార్వకాలం వకటితీరుగా వున్నది. నాకు శీఘ్రంగ సూచన చెయ్యండి అనె.

గురు॥ చేస్తె యేమి అనె.

శిష్యు॥ దాన్ని వుండజూచి సకలభ్రమలకు మూలమైన యీ గుర్తైరిగె శరీరాన్ని విడిస్తె శరీరంలేని అచలమే వుంచుంది అనె.

గురు॥ అంటె యేలాగు విడుస్తావు అనె.

శిష్యు॥ అది వున్నది అని నమ్మిక అయితే సరే. యిది తనకై తానె లేకపోచుంది.

షోడశి భావం స్వప్నదృష్టాంతములు.

గురు॥ నీకు నమ్మికలేకుంటె యీలాగు అనె.

శిష్యు॥ అది పుట్టని చావనిది అయితె యిటువంటి మూఢులకు సంశయంవుండదు.

గురు॥ విను పుట్టని చావనిది సకలదేశాలయందు సార్వకాలాలయందు సమస్తమైన వస్తువులయందు చలించక సార్వకాలం వక్కతీరుగానే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం రాకమునుపు వున్నదియేమి.

శిష్యు॥ యేమి అప్పైతే కనుక్కొంటి.

గురు। కనుక్కొంటే మళ్లీ సూచన చెయ్యుమా.

శిష్యు॥ యిటువంటి మూలంలేని యీ గుర్తెరిగే శరీరాలు అనేకకోట్లు రాని పోని దానికి యేమి భారంలేదు అదే.

గురు॥ అంటే.

శిష్యు॥ సార్వకాలం అచలమే.

గురు॥ అట్లైతే సరే.

శిష్యు॥ అయ్యా మీరు యంతవారు అని అంటె.

గురు॥ నేనేమి నాకంటె యధికం యీ యేనుగ చూడు అనె. అంచువుండగానె అనేక యుద్ధం ఆయె. అయితె యక్కడిది అక్కడనే అడ్డంపడె.

శిష్యు॥ అయ్యా మీరు సూచన చేసిన అచలం వక్కతీరుగానే వున్నది గద అయ్యా పుట్టని చావనిది సకల దేశాలయందు సార్యకాలాలయందు సమస్తమయిన వస్తువులయందు చలించక ఘట్టిగా వున్నది అనె.

గురు॥ అట్లైతె సరేకాని వక్క కార్యం వున్నది అనె.

శిష్యు॥ చెప్పండి అనె.

గురు॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు అనె అంటే.

శిష్యు॥ యిందుకు సమాదానపడి సత్యం సత్యం అనె. తప్పుకలకోటి నాల్గుకోట్లు మొహరీలు తెచ్చి ముందరపెట్టంగానే యీ గురువు మేలుకొనె. మేలుకొంటె ఆ యేనుగ యేమిలేదు ఆడది యేమిలేదు.

మొహారీలు యేమిలేవ్వ యప్పటి అచలమనె గురువుపుండె ఆయనా పుట్టని చావని అచలం గనుక యాలాగు వుండవద్దా. ఆడది అయినాగాని శాబాసు ఘుట్టిదానవు. ఆమేస్గది గొలుసు అయినాలేదు. ఆ లద్ది అయినాలేదు. తిన్న శనగలు యేమాయెనో తాగిన నీళ్లేమాయనో అదివున్న స్థలమైన చూతామంటే యేమిలేదు. అలాగే మూలంలేని యీా గుర్తెరిగే శరీరం యేమిలేదు అని రాద్ధాంతం. రాద్ధాంతమే సిద్ధాంతం.

ఇతి శ్రీమద్గురు శివరామదీక్షిత ప్రభావే వేదాంతవిచారణే
శివశక్త్యోపాది ద్వయదోషరహిత ప్రకరణము
తృతీయాధ్యాయః

---

శ్రీ గురుభ్యోనమః

# చతుర్ధకల

౪. విద్యా విద్యోపాది ద్వయదోషరహిత ప్రకరణము.

శ్లో॥ వ్యాప్యవ్యాపకతా మిథ్యా । సర్వమాత్మేతిశాసనాత్
ఇతిసిద్ధాదితంశ్రుత్వా । బృహదారణ్యాసంస్థయా॥

మూలంలేని యీా గుర్తెరిగే శరీరం యేమిలేదు. ఆ శిద్ధాంతమే శిద్ధాంతము.

కలలో వక్క స్త్రీ వచ్చె వచ్చి మీారు యెవ్వరు అని అడిగితె.

గురు॥ యెవరైతె నేమిఅనె.

శిషు॥ యేమిలేదుగాని అయ్యా యక్కడజూచిన యేమిలేదు మీారు వక్కరేవున్నారు యేమి అని నాకు సంశయం అనె

గురు॥ నాకు యేమి శంక నీవు వున్నావుగదా అనె.

శిష్యు॥ నేను యిపుడు వస్తి నేను రాకమునుపు వక్కరు యాలాగు వున్నారో అని నాకు సంశయం అనె.

గురు॥ పుట్టినదానికల్లా భయం కద్దు అనె.

శిష్య॥ అట్లైతె పుట్టని చావనిది వున్నదా అనె.

గురు॥ అది వుండగానే భయంలేకవున్న నేను సకల దేశాలయందు సార్వకాలాలయందు సమస్తమైన వస్తువులయందు చలించక సార్వకాలం వకతీరుగావున్న.

శిష్య॥ అట్లైతే అది నాకు సూచన చెయ్యండి అనె.

గురు॥ అది నమ్మేవారు దుర్లభం యవ్వరు పుట్టని చావనిది వున్నదంటే నమ్మరు.

శిష॥ యిషువంటి మూలంలేని శరీరం నమ్మకుంటె లేకపోదు గదా.

గురు॥ వుండగానే యేమి మీవంటివారికి సూచన చెయ్యంగానే నమ్మికకద్దు యీ పుట్టనిచావని అచలం యెవ్వరికి కావలె.

శిష్య॥ శీఘ్రంగా చెయ్యండి అనె.

గురు॥ అట్లైతే విను నీవు యేమిఅనె.

శిష్య॥ నేను యీ మూలంలేని గుర్తెరిగే శరీరాన్ని అనె.

గురు॥ నీ నిర్ణయం మొదలు చెప్పనా పుట్టని చావనిదాని నిర్ణయం మొదలు చెప్పనా అనె.

శిష్య॥ నా నిర్ణయం నేను యెరుగుదు. నేను అనేక నిర్ణయాలు చేసిన మీరు కావలిస్తే చూడండి అని కృష్ణావద్దనుంచి గోదావరి దాక యంత వెళుపో అంత వెళుపుది తాటికమ్మల పుస్తకం తెచ్చి ముందర వెట్టి విడిచిచూస్తే ముత్యాలవంటి అక్షరాలు నూరేశి పంక్తులు వకటైన అబద్ధంలేదు. స్త్రీలింగాలు పుల్లింగాలు నపుంసకలింగాలు తప్పకుండా విశేష్యము యెలాగో అలాగే విశేషణము తప్పకుండ వున్నవి. యిది అబద్ధంలేని ప్రతి అంతది శ్రీ తాళపు ఆకులది రెండవది తెచ్చి ముందరపెట్టి విడిచిచూస్తె అక్షరాలు లెస్సలేవు. అంత అబద్ధాలతడక స్త్రీలింగందగ్గర పుల్లింగం, పుల్లింగందగ్గర నపుంసకలింగం యేమీ లెస్సలేదు భూతుల తడక.

గురు॥ సరే చూస్తి వక పుస్తకంలోని బద్ధులు రెండో పుస్తకంలో

అన్ని అబద్ధాలు లెస్స అదే రెండు నీవే వ్రాశినావు. ఒక పుస్తకములో అబద్ధాలు యేమి రెండో పుస్తకంలో నిబద్ధాలు యేమి.

శిష్యు॥ నాకే మూలంలేదు. వాటికేమి మూలము అనె.

గురు॥ సరే అప్రిమాణీకురాలవే.

శిష్యు॥ నేను వున్నంతసేపు ప్రమాణం రెండూ కద్దు. మీావలె పుట్టనిచావని జాడ తెలిస్తె రెండోది యేమిలేదు అనుకోందు. నేను మూలంలేని యీా గుర్తెరిగే శరీరం అయివున్న పుట్టని చావనిదిగనుక మీారు శరీరంలేనివారు నాకు మూడుతిప్పలు అని కొందరు నావంటి మూలంలేని యీా గుర్తెరిగే శరీరం అయివున్నారు. కాని నాకు రెండు తిప్పలువుంటె వుండేది లేకుంటె యేమిలేదు. అదేలాగు వచ్చినా వున్న కొనకు యేమిలేదు. అందుకే కలలోవచ్చి కొంతసేపువుండి మేలుకుంటె యేమిలేదు. అందుకే రాకడా యెక్కడనుంచో అది యెవ్వరికి తెలియదు మూలములేని యీా గుర్తెరిగే శరీరం కొన్నాళ్ళువుండి కొనకు చూడంగానే యేమిలేదు. స్వప్నంలో శరీరం మేలుకుంటే యెలాగో అలాగే మూలంలేని యీా గుర్తెరిగే శరీరం యేమిలేదు. అందుకే పుట్టని చావనిది మొదలుకొన లేనిది సకల దేశాలయందు సార్వకాలాలయందు సమస్తమైన వస్తువుల యందు సార్వకాలం చలించక వక్కటీరుగానే వున్నది నాకు సూచన చెయ్యవయ్యా.

గురు॥ నీవు అందులోనేవున్నావు.

శిష్యు॥ యేమి నేను అందులోనేవున్న యిదేమయ్యా ఆశ్చర్యము. అటైతే మళ్లా చెప్పండి.

గురు॥ పుట్టని చావనిది మొదలుకొనలేనిది సకలదేశాలయందు సార్వకాలాలయందు సమస్తమైన వస్తువులయందు చలించక సార్వకాలం ఒక్కటీరుగానే వున్నది.

శిష్యు॥ యింతేకదా యిది అవునో కాదో అని గాడిదవంటి మని షికి అయిన సంశయం వుండదు. అది లేదు లేదు అని కోటిమార్లు అన్నా లేకపోదు. మూలంలేని యీా గుర్తెరిగే శరీరం వున్నది వున్నది

అన్నా యేమిలేదు. కలలో యేసుగ మేలుకుంటె యేమిలేదని తనకు తాను యేలాగు నిశ్చయమో అలాగే పుట్టని చావని అచలాన్ని సూచన చేశి మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు అని చెప్పితె భ్రాంతిరహితం అయిపాయ. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదుఅని దృఢం వుండడమే. విచారనకు ఫలం మూలంలేని యీ గుర్తెరిగే శరీరంతోటి కావలెననుకొన్న యేమిలేదు. సార్వకాలం శరీరం లేకపోవడమే విచారము నకు ఫలం. మాటిమాటికి కలలో శరీరం మేలుకొంటే యేలాగో ఆలాగే ద్వష్టాంతం వుండవలె. అదియిది వక్కసారే వచ్చి అది యేమిలేకపోతే ఇది వెనకచిక్కి పెండ్లాడి సంసారి అనుకుంచు వున్నది. దానికంటే ఇది మరీ మాయలది దీనికి ఆసరా లేకవున్నది. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం రాను యేమిలేదు. లేకపోను యేమిలేదు. యిన్నియేల మూలములేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు. అని అనుకుంటే చాలు. యే ప్రయత్నం పట్టదుగనుక స్వతస్సిద్ధమై సార్వకాలం వక్కతీరే యిఘువంటి గురుసాంప్ర దాయమే భ్రాంతిరహితమైనది. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నది కాదు లేకపోయినదికాదు. అందుకే భ్రాంతి వున్న దానికి యేమిలేదు. అంటే వక్కటైనా వుండదు. కలవచ్చిన శరీరానకు అనేక భ్రాంతులు వుంది. మేలు కుంటే యేమిలేదు. కొన్ని వుండి కొన్ని పోయినవిగావు. ఆలాగే యీ మూలములేని గుర్తెరిగే శరీరం యేమిలేదుగనుక అంతకంటె యెక్కువలేదు.

గురు॥ మా గురు సాంప్రదాయం అఘువంటిది.

శిష్యు॥ సరే కాని మూలంలేని యీ గుర్తెరిగే శరీరంకు శీఘ్రంగా వుత్పత్తి స్థితి లయం లేనిదానిజాడ చెప్పండి అనె.

గురు॥ అనంగానే నీకంటె నాకు మరి తీవరంవున్నది నిను నీవు పుట్టని చావనిది మొదలుకొనలేనిది సకల దేశాలయందు సార్వకాలాల యందు సమస్తమైన వస్తువులయందు చలించక వున్న దానియందును వున్నావు.

శిష్యు॥ అట్లైతె సరే యిది వున్నదో లేదో అని నాకు అను

మాసం లేదు. నేను వున్నది అన్నా వున్నది నేను లేదులేను అన్న వున్నది.
యిగ నాకు ముందరి ముచ్చట చెప్పండి.

గురు॥ కలలో యేన్న మేలుసుంటే యేలాగో ఆలాగే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు.

శిష్యు॥ యిసు చెప్పకుండి నేను మరున మరివకటి నాకు పట్టదు.

గురు॥ యింతేచాలు నీకు సమాధానమైతే మళ్లి సూచన చెయ్యనా.

శిష్యు॥ సూచనకు మూలంలేదు పరమార్థపు ముచ్చట వదిస్తె చాలు.

గురు॥ ఘట్టివాడవే శాబాసు నీవంటివాన్ని యెన్నడు చూండ లేదు. యీలాగు వుండవలె.

శిష్యు॥ అట్లైతె సరే. మూలంలేని యీ గుర్తెరిగే శరీరంవచ్చె. మునుపటిదో మరొటిదో యేది అయితేనేమి మునుపటిదానికి మూలం యేమిలేదు. యిక కోట్లకొద్ది వచ్చినా మూలం యేమిలేదు మనకేమి భయం. శరీరంలేనిది మొదలుకొనలేక రాకడాపోకడలేక సకలదేశాల యందు సమస్తమైన వస్తువులయందు చలించకవున్నది. సార్వకాలం వక్కటీరే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నా యేమిలేదు. చచ్చినా యేమిలేదు సార్వకాలం శరీరం లేకనేఉన్నది చలించకవున్నది.

గురు॥ సరే శాబాసు యీలాగు వుండవద్దా.

---

# అయిదవకల

శిష్యు॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరంవచ్చి పుట్టని చావనిది పుట్టి చచ్చేదానిని లోపల వున్నదా బయటవున్నదా అని అడిగె.

గురు॥ నీవు చెప్పుమా.

శిష్యు॥ నాకు లెస్స తెలియదు. నాకు నేనేకాని పుట్టనిచావని దాసి జాడ యెరుగ.

గురు॥ నీవే పుట్టనిచావని వస్తువవు కావుగదా.

శిష్యు॥ నేను యెందుకు అవుచ నాకు మూలంలేని మీరే యెరుగుదురు.

గురు॥ శాద్ధాంతంగ వచ్చేది వున్నంతశేపు వుండేది కలలో పెద్దపులి వలెనే మేలుకుంటె యేమిలేదు. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం పుట్టని చావనిదాని దరిశనం గురుమూలంగా సూచనకాంగానే యేమిలేదు యేనుగుకు సింహం స్వప్నమందు వస్తె యేలాగు మరణమో అలాగే.

శిష్యు॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరానకు పుట్టని చావనిది యెక్కడవున్నదో యెటువంటిదో దాన్ని సూచన చెయ్యండి చెప్పినంతలో కనుకుంచ.

గురు॥ అలైతె కనుక్కో నీవుయేమి.

శిష్యు॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే నేను.

గురు॥ యింతేనా నీకు యేమయినా పేరు వున్నదా.

శిష్యు॥ యింతేకాని వెనుకటి ముచ్చట యేమి చెప్ప మీముందర యేమిచెపుకున్న మన్నించరు.

గురు॥ ఛీ అబద్ధాలలో యేమిలేదు వచ్చినటు విను.

శిష్యు॥ దయ చెయ్యండి అనే.

గురు॥ యిపుడు నీవు యెక్కడనుంచి వచ్చినావు.

శిష్యు॥ నాకు మూలం యేమిలేదు.

గురు॥ మరల యెక్కడకు పోచావు.

శిష్యు॥ యేమయినా వున్నంతసేపు నా ప్రభావంతోచినా యేమిలేదు. మధ్యవచ్చి యీలాగువున్న పుట్టని చావనిదాన్ని కనుకోవలెనని యిచ్ఛ పుట్టింది యిక మీకాళ్లు మొక్కుతా వెనకటి పుస్తకాల ముచ్చట తేకండి అవి నేనేచేసిన నాకే మరల ముచ్చట చెప్పితిరి అవ్వి అలాగే వుండనీ.

గురు॥ అలైతే సూచన చేతునా.

శిష్యు॥ చెయ్యండి.

గురు॥ పుట్టని చావనిది మొదలుకొనలేనిది సార్వకాలం వక్కతీరుగా వున్నది. సకల దేశాలయందు సమస్తమైన వస్తువులయందు చలించక వున్నది నీవు దానియందు కూర్చున్నావు అది నీవు కావు నీవు అది కావు నీకు దానికి కొంచమైన సంబంధం లేదు.

శిష్యు॥ సరేకాని యిఘు నా వర్తమానం యాలాగు.

గురు॥ కలలో వచ్చిన యేనుగు మేలుకుంటే యెలాగో అలాగే.

శిష్యు॥ నాకు లెస్స చెపుము సూచన చెయ్యంగానే తెలియవలె.

గురు॥ అయిన విను మేలుకుంటే కలలో చూచి గుర్రెరిగినావా లేదా.

శిష్యు॥ గుర్తెరిగినా.

గురు॥ ఆ యెరుక నిన్ను గుర్తెరిగించా లేదా.

శిష్యు॥ గుర్తెరిగింది.

గురు॥ యిపుడు వున్నదా లేదా.

శిష్యు॥ యేమిలేదు మహా మొద్దువు అన్నావుసరే.

గురు॥ ఆలాగే గుర్తెరిగే శరీరం యేమిలేదు.

శిష్యు॥ యెక్కడపాయెనో చూతామంటే.

---

# షష్టమ కల

శిష్యు॥ మళ్లా మూలంలేని యీ గుర్తెరిగే శరీరం కలలోవచ్చి వచ్చి గురుస్వామి మీరు నాకుమూలంలేని యీ గుర్తెరిగె శరీరంలేకుండా శరీరం లేక సకలదేశాలయందు సమస్తమైన వస్తువులయందు చలించక వుండి మరల పుట్టుక చావు లేక మొదలుకొనలేక సార్వకాలం వక్కతీరుగా వుండేది సూచన చెయ్యండి చేస్తె నరకస్వర్గమనే శరీరాన్ని విడిచిపెటుతా అనె.

గురు॥ మునుపు నీవ్వు కావిలెనంటె వచ్చిందే.

శిష్యు॥ అయ్యా నేను యెన్నడూ అనుకోలేదు నడుమంత్రాన తనకుతానే వచ్చింది.

గురు॥ అట్టే విచారిస్తె యీ గుర్తెరిగె శరీరానకు మూలం యేమి.

శిష్యు॥ నేను యీ వచ్చిన నాటనుంచి యేదయిన వకచింత కాశేపయిన స్వస్తతలేదు వున్నంతసేపువుండి దరిజేరుదామంటె నాకు వచ్చేటపుడు మూలం యేమిలేదు. పోదామంటె వుండేటందుకు స్థానం యేమిలేదు. నాకు బ్రతుకువున్నంతసేపు చచ్చినట్టు పడివుండవలె లేని సమయంనస్తే నేను ఏమిలేదు. రెండోది ఏమిలేదు. కేవలంఅంధకారమే.

గురు॥ నీవు వున్నావుగనుక అంధాకారమని నీకేయెరుక నేను యేమి లేదు. నాకువెనుక యేమిలేదు. ముందర యేమిలేదు.

శిష్యు॥ నీవులేవు నీమాటయేమిగాని నాకు శాంతిలేదు. యేదయిన దండి ఆసరాదొరికితె నాకుస్వస్థత లేకుంటే భ్రాంతిపోదు.

గురు॥ అట్లైతె నీకు భ్రాంతివున్నదే నీవుయేమి.

శిష్యు॥ నేను మూలంలేని యీ గుర్తెరిగే శరీరంను.

గురు॥ నీకు యేమికావలె.

శిష్యు॥ యిషువంటి వనేకకోట్లువచ్చిన వున్న యేమిలేకపోయినా చలించక యుండేదికావలె.

గురు॥ సరె మంచిమాట నీవుకావలెనంటే సూచనచేస్త కనుక్కో-మూలంలేని యీ గుర్తెరిగె శరీరానకు మూలం యేమిలేదుగదా.

శిష్యు॥ యేమిలేదు.

గురు॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం కొనకు యేమిలేదుగదా.

శిష్యు॥ యేమిలేదు.

గురు॥ యెక్కడపాయ.

శిష్యు॥ యేమిలేనిది యెక్కడనుంచివస్తుంది యెక్కడికి పోచుంది.

గురు॥ సరెసరె అట్లైతె నీవుయేమి.

శిష్యు॥ యేమిలేని యీ గుర్తెరిగే శరీరంను నేను.

గురు॥ సరె సూచనచేతు.

శిష్యు॥ చెయ్యండి.

గురు॥ పుట్టనిచావనిది మొదలుకొనలేనిది సకలదేశాలయందు సమస్తమైన వస్తువులయందు సార్వకాలాలయందు చలించక సార్వకాలం వక్కతీరుగానే యున్నది. యేమిలేని యీగుర్తెరిగే శరీరం అయివున్న నీకుదానికి యీపత్తు సంబంధంలేదు. నీజోలి దానికిపట్టదు. దానిజోలి మనకు అవశ్యంకావలె. అది మనస్సుకు పడకుంటె మనస్సుకు శాంతిలేదు. యిక సరేనా.

శిష్యు॥ యిఖనేను యేమిఅడుగ నేను అందులోనేవున్న దానికి బదులులేదు నావ ర్తమానం నాకేతెలుసు.

గురు॥ యేమితెలుసు.

శిష్యు॥ మునుపు నాతోచెప్పినట్టె మళ్లాచెప్పు.

గురు॥ మూలంలేని యీగుర్తెరిగె శరీరం యేమిలేదు. పుట్టని చావనిదేవున్నది. మూలంలేని యీగుర్తెరిగే శరీరం వున్నదాన్ని కనుకోనివుంటె బాధ. వున్నదానికి శరీరమేలేదు యేమిలేని యీగుర్తెరిగే శరీరం యేమిలేదు.

శిష్యు॥ బాధయెవ్వరికి బాధలేకపోవటం యెవ్వరికి.

గురు॥ శాబాసు కనుకోని వక్కదృష్టాంతంచెప్పు.

శిష్యు॥ నిద్రలో వెయ్యి యేనుగులువుండి మేలుకుంటే యేమి లేదు. ఆలాగే పుట్టనిచావనిది రాకడపోకడలేనిది మొదలుకొనలేనిది సకల దేశాలయందు సార్వకాలాలయందు సమస్తమైన వస్తువులయందు చలించక సార్వకాలం వకతీరుగావున్నది. సూచనకాంగానే యేమిలేని యీగుర్తెరిగే శరీరం యేమిలేదు.

గురు॥ శాభాసు మరిదొడ్డవాడవు.

---

# సప్తమకల

మళ్ళీకలలో వక్క సన్యాసివచ్చె వెంటనే పెదపట్టెనామల అయ్యవారు పుస్తకం చంకపెట్టుకునివచ్చె తరువాత అడ్డకప్పు బట్టవేసుకున్న మనిషి వచ్చె అటువంటి అయనే ముసలి ఆయనవచ్చె పిలిచి చూశామని నైను తీరువచ్చె.

ష॥ పేరునల్గురు నాలుగువిధాల పెట్టుకొన్నారు.

ష॥ మీకు మీరేపెట్టుకున్నారా మీకు యెవ్వరయినా చెప్పినారా అని అనుచు పిభూతి చెమటకు తడిసిపోయిందిగనుక అతను మనవలె నున్నాడు. యీయన మన మతమువారె అనుకొని అనుకొని నెత్తి చూచె బొమ్మచూచె చూచి మనసంబంధమే అనుకొని మీకులంయేమి అని అడిగె.

శం॥ నాకు కులంలేదు గోత్రంలేదు అనె.

ష॥ లేదని నీకేయెరుక నీకు మరివొకడు యెవ్వడయినా చెప్పినారా అని అనె.

శం॥ నాకు చెప్పేవారు యెవ్వరు నాకంటె వేరె యెరుకలేదు. నేనె అందరిలో వుండి యెరిగేవాణ్ని నేనే నేను సమస్తనిర్ణయాలకు కర్తను నేనునేనే అనె.

ష॥ అయ్యవారిని నీవేమయ్యా అనె.

రా॥ వారలు నీవు యేమి నిర్ణయంచేశినావయ్యా అనె.

శం॥ నేను నిబద్ధి శరీరం అబద్ధం అంటే [లేదుఅనుట].

రా॥ అట్లైతే పుట్టిందినీవా శరీరమా.

శం॥ శరీరమే నాకు పుట్టుకాలేదు చావులేదు. సార్వకాలం వక్కతీరె.

ష॥ నీవు చెప్పవయ్యా అయ్యవారు.

రా॥ సరెకాని నేనువేరు శరీరంవేరు అన్నాడు.

శం॥ వారు మేము నేను శరీరంవక్కటే నన్నువిడిచి శరీరంవుండదు శరీరమునువిడిచి నేనువుండ నాలోకలసి శరీరంవున్నది. శరీరంలోకలిసి నేను

వున్న యింతేకాని రెండూకావు వకటీకాదు. శిలాప్రతిమ యేలాగో అలాగే పకీర అయ్యవారుని అడుగుమా వ్యవహారంచేసేది శిలాప్రతిమ నా అడుగుమా.

రా॥ మాసిద్ధాంతం వొకటికాదు రెండుకావు విశిష్టం పకీరా వ్యవహారం అడిగితివి మీవార్ని అడుగు

ప॥ వారు మావారాయేమి.

రా॥ యేమయిన యెక్కువ తక్కువ జుట్టులేదు జంధ్యాలులేవు.

ప॥ అదియేమయ్యా అనె.

శం॥ వ్యవహారం నీవుచేస్తావా శరీరంచేస్తుందా అంటె.

రా॥ నేను యేమిచేస్త క్రియాశూన్యుడను అకర్తను అభోక్తను నేను యేమిచెయ్య అన్ని దేహధర్మాలె దేహమె చేస్తుందిఅనె అనంగానే.

ప॥ పకీరునవ్వె నవ్వి ఆద్దకపుబట్టవంటి మనిషి నీవేమయ్యా అనె.

మ॥ ఛీ శరీరం యేమిచేస్తుంది సకలవ్యవహారాలకు కర్తను గుర్తెరిగేవారిని "జ్ఞాత్వాకర్మాణి కుర్వంతి" అని వున్నది. సమస్తమయిన వ్యవహారాలు నేనేకాని స్వతంత్రుణ్ణికాను.

ప॥ నీకంటెవేరు మరివకరువున్నారా.

మ॥ వున్నారు.

ప॥ గురువును యెరిగినవారా యెరుగనివారా.

మ॥ యింత మాసిద్ధాంతం.

ప॥ ముసలిమనిషి నీదేమయ్యా.

వే॥ నీవు నిబద్దె సరీరంనిబద్దె అనె.

రా॥ నేనునిబద్దె శరీరంనిబద్దె నేనులేనిది శరీరంచెయ్యదు శరీరం లేనిది నేనుచెయ్య గుర్తెరిగే నేను జ్ఞానం శరీరంచేశేది కర్మ జ్ఞానంనిబద్దె కర్మాలునిబద్దె ద్వైతంనిబద్దె అద్వైతంనిబద్దె అనె.

ప॥ పకీరువచ్చి మీరు యెక్కడికి పోతారు అనె.

వే॥ మేము నల్గురము నాలుగుబాటలవారం మాకు యేమిపరిమాణం జనంలేదు, సకలవిద్యలు చదువుకున్నాము. చెపుదామంటె చదువుకునే

వారులేరు. శ్రవణమయిన చేతామంటె వినేవారులేరు. యెవ్వరయిన వస్తా రేమో వస్తె నలుగురము నాలుగుత్రోవలు చేతామని యున్నాము.

ప॥ యెవరైన వచ్చేరు రావలెనని తపస్సుచెయ్యమని చెప్పి సాయె.

యీనలుగురు యెక్కడచూచినా యేమిలేదు అని వుండిరి. వుండగా వుండగా అనేకమంది బూడిది పూసుకవచ్చిరి. అనేకమంది నామాలవారు వచ్చిరి. అనేకమంది నాలుగు విధాలవచ్చిరి. రాంగానే వినవలెనని యిచ్చ పుట్టి పుట్టంగానె వినిరి. మనము యీలాగే కొందరికి చెపుదామని పుస్తకాలు వారివారి సమధానంగా శాస్త్రాలు వ్రాసుకొనిరి వ్రాసుకొని చెపుకుంచూ చదువుకొనుచుండిరి. వుండగా వుండగా అనేక కోట్లకొద్ది స్త్రీలువచ్చిరి. అనేకఆభరణాలు అనేకవస్త్రాలు అనేకమయిన గుర్రాలు రథాలు అనేకమయిన బానిసవాండ్లు మంటితపుకలోయెక్కి అధాత్తువచ్చిరి. రాంగానే చదువులుచాలించి చెప్పేవారితోకూడా మోహపడి రతికర్మాలు చాయబట్టిరి. యీలాగు వుండగానే ఆవులు, బర్రెలు, మేకలు, అనేకకోళ్లు, గొర్రెలు కాచేవాండ్లతోకూడ వచ్చిరి వచ్చేవరకు యీమంటితపుకలో యెక్కడ చూచిన నతువుల వంటిగడ్డి యెక్కడినుంచో పెద్దపులులువచ్చె అవ్వి రాంగానే యీమంటితపుకలో అనేకమయినగట్లు గుట్టలు గుహాలువచ్చె రాంగానే పులులు ప్రవేశించే. యీప్రకారాన అనేక దినాలుగడిచె. దాని మొదలు యెవ్వరికి తెలియదు. కొన తెలియదు యిది యెంతకఠనం అందరికి తెల్వకుండ నలుగురు యీమూలంలేని గుత్తెరిగే శరీరానకు మూలంవున్నదని యీమూలంలేని గుత్తరిగే శరీరం నేను అని నిశ్చయంగలవారు. కొనకు మూలంలేని యీగుత్తెరిగే శరీరానకు ప్రవేశించేటందుకు స్థానంవున్నదని అన్నారు. మళ్ళావస్తుంది అని అన్నారు. మూలంలేని యీగుత్తెరిగే శరీరానకు మోక్షమని ముర్పించినారు. మూలంలేని యీగుత్తెరిగే శరీరమే యిన్నిమార్గాలు చేసింది. చెప్పేవారికిచేటు అవుతె వినేవారికి జాగ్రత్తవుండవలె. అందరికి మూలంలేని యీగుత్తెరిగే శరీరం ప్రతిదినకుందు యేమిలేదు. కలలోవచ్చినవారిని ఘట్టిగా కట్టివేసుకున్నట్టు

మళ్ళామళ్ళా ఘట్టిగానన్నే కట్టివేసుకుంటారు. యీదుఃఖం నాకు యే
అని అందరు చూడగానే మూలంలేని యీగుర్తెరిగే శరీరం ప్రతిదినమం
యేమిలేదు, కొనకుయేమిలేదు. యేమిలేని అపకీర్తి సుషుప్తి అని కల్పి
చినారు. కొనకుమరణమని కల్పించినారు. తల్లికి అలవాటు అయి
పిల్లకు తల్లి కొనకుచస్తె ఆపిల్ల అమ్మ అమ్మఅని యేడిస్తె నీళ్లకుపొయిం
జియ్యాచేశారాను పొయింది అన్నట్టు మూలంలేని యీగుర్తెరిగే శరీ
స్వర్గానకుపొయింది నరకానకుపొయింది అని కల్పించినారు. నేను రా
రాను. నేనువస్తినా కాశ్యేపువుండి మీకు తెలిసేటట్టు మళ్లయేమిలే
అని నిశ్చయంఅయేటట్టు కలలోవచ్చి కాశ్యేపు మీతోకూడ వు
మీరు అటు మొకంకాగానే మీకునేను యేమిలేదు అని నిశ్చ
అయిందో లేదో అలాగే మూలంలేని యీగుర్తెరిగే శరీరం పు
చావనిది మొదలు కొనలేనిది వక్కటయినా క్రియలేనిది శరీరంలే
సకలదేశాలయందు చలించక సార్వకాలం వక్కతీరుగావున్నది. సూ
కాంగానే మొదలు యేమిలేదు, కొనకు యేమిలేదు మధ్య కాశే
వుండి మేలుకుంటె యేమిలేనట్టు మూలంలేని యీగుర్తెరిగే శ
ఆలాగువుంచుంది. శీఘ్రంగా మూలంలేని యీగుర్తెరిగే శరీరంలేని
స్వామిని వెతికి పుట్టనిచావనిజాడ సూచనచెయ్యండి అని అడగ
వారిదగ్గరవుండి లెస్సచూచి శాంతిపొందవలె అనంగానే తప్పా
మూలంలేని యీగుర్తెరిగే శరీరంచేత సాధ్యంకాదు. స్వతసిద్ధవ
వున్నది గనుక కలలో రెండోదిలేదని ప్రసిద్ధికద్దు. కలతప్పవిడిచి రె
అవస్థలేదు. యేదయినా వున్నప్పుడేగనుక మూలంలేని యీగుర్తెరిగె శ
వున్నంతశేపు వుండేది కొనకు యేమిలేదు. పుట్టనిచావని దాని మ
కాదు. యీలాగున వుండగా తప్పన వక ఆడదివచ్చె.

శి॥ వస్తూనే నన్ను మీదగ్గర సర్వకాలం మొహతెగకుండా వు
కొండి అనె.

గురు॥ నీవు సమాధానంవుంటె వుండు నీకు సమాధానం కాక
నేను నిన్ను యేమిఅన.

శిష్యు॥ నాకు క్షణమయిన యెడతెగకుండ మీదగ్గర యుండవలెనని యున్నది.

గురు॥ వుంటేవుండు.

శిష్యు॥ నేను వున్నంతశేపు నీవునన్ను యేమనకుండా యెప్పుడు లేక పోచానో అపుడు శక్షచెయ్యండిఅనె అంచూనే బట్టపరచుకొని అడ్డంపడె ఆరునెలలకులేచె.

గురు॥ నాలుగుదినాలకు నేటిదాక యెక్కడికి పోయినావు అనె.

శిష్యు॥ మంది యేమనుకున్నారు అనె.

గురు॥ మందిమాటలుయేమి నీకు యేలాగు యెరుకవున్నాదో ఆలాగు చెప్పుమనె.

శిష్యు॥ మూలంలేని యీగుణ్త్రెగే శరీరం యేమిలేదు. నేను వుంటనే నాకుయెరుక నేను యేమిలేకుంటే యేమిలేదు.

గురు॥ అట్లైతె నీకు మూలంవున్నదీ.

శిష్యు॥ నాకు మూలం యేమిలేదు. మందిసుషుప్తి అంటారు అపుడు మందిలేరు. నేనులేదు. నేనురాంగానే నాతోటివచ్చినారు వారు నావంటివారే కాశ్యేపువుండి కొనకు యేమిలేకపోయేది పుట్టనిచావని దాన్ని వారుయెరుగరు నేనుయెరుగ.

గురు॥ దాన్ని చెప్పేవారు వున్నారు.

శిష్యు॥ యెమొ శరీరంలేనివారు అయితేయెమొ మూలంలేని యీగుణ్త్రెగే శరీరంచాత సాధ్యంకాదు.

గురు॥ నీకు యేమి యెరుక.

శిష్యు॥ అసాధ్యవస్తువని ప్రసిద్ధికద్దు యిఘ సూచనచెయ్యండి.

గురు॥ కద్దుకదా మూలంలేని యీగుణ్త్రెగే శరీరంచాత పుట్టని చావనిదాన్ని మొదలు కొనలేనిదాన్ని రాకడపోకడ లేనిదాన్ని సర్వకాలాలయందు సమస్తమయిన వస్తువులయందు చలించకవున్న దాన్ని వుండ జూచి కలపోయేనుగ మేలుకుంటే యేమాయ.

శిష్యు॥ యేమిలేక పాయనయ్యా.

గురు॥ మూలంలేని యీగు ర్తైరిగే శరీరం యేమిలేదు. అని నిశ్చయమే విచారణను ఫలము.

శిష్యు॥ సరే యిదియేమి ఆశ్చర్యం వున్నదివున్నట్టె చెప్పితిరి. అది కఠినంకాదు. అచలంవున్నది నిబద్దె చలించేశరీరం యేమిలేదని నిబద్ధె యెక్కడచూచినా పరిపూర్ణమే చూపులేదు మేపులేదు.

గురు॥ కాని వూరికే మాట అది.

శిష్యు॥ అసాధ్యంనిబద్దె అనాయాసంనిబద్దె యిదె రాజమార్గం.

౧ ద్య

ఇతి శ్రీమద్గురు శివరామదీక్షిత ప్రభావే వేదాంతవిచారణే
విద్యావిద్యోపాది ద్వయదోషరహిత ప్రికరణము
చ తు ర్థో ద్యా యః.

---

శ్రీ గురుభ్యోనమః

# అష్టమకల

౫, సదసదుపాది ద్వయదోషరహిత ప్రకరణం.

శ్లో॥ యదాకాశో హ్యృషీకేశో । నానోపాధిగతోవిభుః ।
తద్భేదాభిన్నవద్భాతి । తన్నాశో కేవలోభవేత్॥

మూలంలేని గుర్తైరిగె శరీరంయేమిలేదు అని నిశ్చయమే విచారణకు ఫలం కలలో అయోనిసంభవుడు వొకరాజు చతురంగబలాల తోటి వచ్చె వచ్చినసేనంత రాజువలెనె అయోనిసంభవులు వస్తూనే.

రాజు॥ అయ్యా నాకు మూలంయేమి అని అడిగె.

గురు॥ అడిగితె నీతోకూడ వచ్చినవారు అందరికి మూలమేదో అదే నీకు అనె.

రాజు॥ అయ్యా నాతోకూడ గుఱ్ఱాలు, యేనుగలు, లొట్టిపిట్టలు, కుక్కలు, గాడిదలు, పందులు, పిల్లులు, యెలుకలు, పెద్దపులులు, సింహ్మములు, అనేకమంది గుఱ్ఱాలు తోలేవాండ్లు అనేకంవున్నారు అనేకమయిన స్త్రీలు వున్నారు వారికినాకు వకటేమూలమా అనె.

గురు॥ అందరు అయోనిసంభవులు కారా అనె.

రాజు॥ సరేకాని నేనుమాత్రమే అనుకున్నా.

గురు॥ అదే భ్రాంతి అందరు మొదట యేమిలేకనే వచ్చినారు. నీకు తల్లిదండ్రి యేలాగులేదో ఆలాగే సమస్తమైనవారికి లేరు. నీవు అందరు సమానమైనాని నీవు వక్కడవు యెక్కువా.

రాజు॥ నేను మొదలు యేమిలేనివాడను అని యెరిగే నిన్న అడిగినాను. యెవ్వరికైన తెలుసునోలేదో అని అడిగినాను. నాకు యెరుకే స్వామి. నేనుతప్ప విడిచి యికయెవ్వరులేరు అనుకున్న. నావంటివారు అందరు అని యెరుగ. యిపుడు అందరివంటివాడని అని సంశయం వచ్చినాది. అందరికంటె యెక్కువవాడిని చెయ్యండి అయ్యా.

గురు॥ దాందేమి. పుట్టనిది వున్నది అది నీకు సూచన చెయ్యంగానే అదేకాని యొక్కటి నీకు భ్రాంతివుండదు.

రాజు॥ అది సూచన అయినతరువాత నేనేవుండ యెందుకు అందరితో సమానంగా ఛీ యిది నాకు పట్టదు. మూలంలేని యీ గుఱ్ఱెరిగే శరీరం యేమిలేదు అని తనకుతానే నిశ్చయం అయ్యేటట్టు సూచన చెయ్యండి అది నాకు సమాధానం అనె.

గురు॥ అయితే విను నీవు నీతోకూడ సేన మొదలుకొనలేని దానిలో వున్నారు. అది నీవు కావు నీకంటె వేరే.

రాజు॥ సరే అయితే నీకు మొదలులేదు కొనలేదు నావంటిదా యేమి.

గురు॥ నీవంటిదికాదు. అయితే నీవు యేమి.

రాజు॥ నేను మూలంలేని గుఱ్ఱెరిగే శరీరాన్ని అనే.

గురు॥ అంటే నీకు మొదలులేదు కొనలేదు. అది వున్నది.

రాజు॥ వుంటే.

గురు॥ నీకు యేమివున్నది తలకాయ మొదలు కాళ్ళు కొనయివ్వే.

రాజు॥ నేను దీనికి అనలేదు.

గురు॥ మరి దేనికి.

రాజు॥ యీ గుర్తెరిగే శరీరానకు మొదలు యేమిలేదు కొనకు యేమిలేదు అని అన్నారు అదే సరి నాకు చులకనే.

గురు॥ యిపుడు నీవు వున్నావా లేదా.

రాజు॥ నేను వున్నాను. మహా తిన్నగా సూచన చెయ్యండి. నాతో వచ్చినవారికి తెలియకుండా.

గురు॥ ఆలాగే మొదలు కొనలేనిది శరీరానకు మొదలు కొనవున్నది సమానంకాదు. యీ గుర్తెరిగే శరీరంకంటే అది వేరే. మొదలు కొనలేనిది రాకడ పోకడలేనిది పుట్టని చావనిది సకలదేశాలయందు సర్వకాలాలయందు సమస్తమైన వస్తువులయందు చెలించక తనకుతానే శరీరంలేక వున్నది.

రాజు॥ సరే.

గురు॥ యీ శరీరానకు మొదలు యేమిలేదు కొన యేమిలేదు.

రాజు॥ వున్నపుడు యేలాగు నిర్ణయం.

గురు॥ కలలో కోటి యేనుగలువుండే మేలుకుంటే నేమాయ.

రాజు॥ యేమిలేదు యింతేనా.

గురు॥ యింతే శరీరం యేమిలేదు అని తెలుసుగదా. వున్నపుడు మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదంటె తప్పా.

రాజు॥ యేమితప్పు యేమిలేదు. వున్నది యెన్నటికి లేకపోదు. లేనిది కాశ్శేపు వున్నా యేమిలేదు. చెలించేది యేమిలేదుగనుక అచలం వున్నది.

గురు॥ సరేకాని రాజా మూలంలేని యీ గుర్తెరిగే శరీరానకు మొదలు యేమిలేదు కొన యేమిలేదు అని నీకె యెరుక. యెవ్వరైన చెప్పినారా యిదేమి ఆశ్చర్యం. యిది అంతా కలలో యెక్కడినుంచి వచ్చె. యెక్కడవుండే తిరిగి చూడంగానె యెక్కడపాయె.

రాజు॥ యేమిలేదు.

గురు॥ అలాగేకాని పరిపూర్ణం వున్నదని సూచన మాత్రమే. దానికి అదే స్వభావం.

రాజు॥ యిదే ఆశ్చర్యం దానిలోపలవుండి దాన్ని యెరుగరు చాలు వున్నదే వున్నది.

గురు॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు అనంగానే అచలం స్వతస్సిద్ధం. మూలంలేని యీ గుర్తెరిగే శరీరాలకు మూలం యేమిలేదు. కొనకు యేమిలేదుగనుక వున్న కాశ్శేపు మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు. యిది గురువాక్యం. యిది నమినవారికి బంధంలేదు, మోక్షంలేదు, సర్వకాలం పరిపూర్ణమే. యిటువంటివారే పుట్టని చావనివారు.

---

# నవమకల

రాజు॥ కలలో మరొక రాజువచ్చె. వస్తూనే నా నిర్ణయం నాకు తెలుసు. నాకు తెలియనిది యేమయినా యుండేనా నాకు తీవ్రంగా సూచన చెయ్యండి అనె.

గురు॥ పుట్టని చావనిది రాకడపోకడ లేనిది సార్వకాలం వక్కతీరుగా వున్నది మొదలు కొన లేనిది వున్నది అనె.

రాజు॥ స్వామి అటువంటిదాని జాడ నాకు యెవరయిన సూచన చేసేరాలని మహా ఆపేక్షత వున్నాను అయ్యా. అది యెక్కడవున్నదో నాకు శీఘ్రంగా సూచన చెయ్యండి.

గురు॥ చేస్తాగాని నా వర్తమానం నాకు తెలుసును అంటివి. నీవు నీ వర్తమానం కొంచెం చెప్పు అనె.

రాజు॥ నాకు మూలం యేమిలేదు. కొనకు స్థానం యేమిలేదు. నాకు నేనేవచ్చి కాశేపు వుండి వెంటనే శూన్యమయి పోచా.

గురు॥ శూన్యమంటే.

రాజు॥ యేమిలేదు.

గురు॥ యిగ నీకు యేమికావలె.

రాజు॥ యీ ప్రకారాన పాములు, కొంగలు, కాకులు, గద్ద
గువ్వలు, పిట్టలు, చిలుకలు, గోరింకలు, నెమళ్ళు, బాతులు, హంస
డేగలు, మొదట యేమిలేనిదే వచ్చి కాసేపువుండి కొనకు శూన్యమా
నేను వాటివలెనే అయితే నీ ధర్మాన పుట్టని చావనిది వున్నదని వింటి
విన్నందుకు నాకు సూచన అయితే మాళ్ళా నాకు యీ దేహభ్రా
పుట్టకపొయ్యే. కొనకు యేమిలేదని మీకే తెలుసు.

గురు॥ నీకేమికావలె.

రాజు॥ యీలాగు అన్ని జంతువులకు సమానమే. యిటువ
రాజునయ్యి అన్నిటివంటివాణ్ని కావలేనా స్వామి. నాకు సార్థకంతో
సూచన చెయ్యండి.

గురు॥ అట్లైతే నీవు శరీరం లేనిదానిలోనే వున్నావు.

రాజు॥ నేనా యేమి గురుస్వామి.

గురు॥ దానికి మొదలు లేదు కొనలేదు.

రాజు॥ సరే సూచన అయె.

గురు॥ యిక అదే పుట్టని చావనిది.

రాజు॥ సరే మరినకటె నేను యెందుకు అన.

గురు॥ అదే రాకడాపోకడా లేనిది. అదే మొదలు కొన లేనిది.

రాజు॥ మీవంటివారిని యెవరిని చూడలేదు స్వామి.

గురు॥ సరే శబాస్.

రాజు॥ నేను యేమి నమమంత్రపువాణ్ని. మొదలు యేమిలే
కొనకు యేమిలేదు. సర్వకాలం వక్కటీరుగానే వున్నది. శరీరం లేనిది
యెంత దొడ్డవాన్ని అయితే నేమి కొనకు యేమిలేదు.

గురు॥ నీను సర్వకాలం వొక్కటీరుగా చలించక సకలదేశాలయం
సర్వకాలాలయందు సమస్తమైన వస్తువులయందు గట్టిగా యున్నది. సరే
యిందుకు అనుమానము వున్నదే.

రాజు॥ కోటిమాటలకు లేదు లేదు అన్నా అదేవున్నది. మా
లేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు అని అనంగానే స్వతసిద్ధ

అచలం తనకుతానే వున్నది. ప్రయత్నంచేత సాధ్యంకాదు. ప్రయత్నం చేసేది యేమిలేదు.

గురు॥ గనుక రాజా యీ శరీరం యేలాగులేదో వక్క దృష్టాంతం చెప్పుమా.

రాజు॥ యీకలలో కోటి యేనుగులుండే యిటు చూడంగానే యేమాయ. యేమిలేనిది అందరికి దృఢమే. నాకు వారికి వకటి యెక్కువ తక్కువా.

గురు॥ యేమి.

రాజు॥ మీరు సూచన చేసినదాన్ని వుండజూచి మళ్లా యీ వున్న శరీరం యేమిలేదు అని మునుపటి దృఢం వలెనే దృఢం కద్దు.

గురు॥ మునుపే వున్నదానికి సంశయంలేదు దృఢంలేదు సర్వాకాలం వక్కతీరే.

---

# దశమకల

వృ॥ యీ కలలో ముసలి వృద్ధు వచ్చె. వస్తూనే నా మూలం నాకు తెలియదు. యెంతవారికి తెలియదు యీ రహస్యం చెప్పండి అనె.

గురు॥ యిదియంత నీవు పుట్టని చావనిది మొదలు కొన లేనిది శరీరం లేనిది, రాకడ పోకడ లేనిది, సార్వాకాలం వక్కతీరుగా వున్నది, క్రియాశూన్యమయింది, భోగంచెయ్యనిది, వక్కటయినా భ్రాంతిలేనిది, సకలదేశాలయందు సమస్తమయిన వస్తువులయందు. చలించక వున్నదాని యందు నీవు వున్నావు.

వృ॥ యింత దొడ్డదానియందా.

గు॥ నీకు సూచన అయిందా లేదా.

వృ॥ నేను యెన్నడు వినంది, అత్యద్భుతమైంది, అధాత్తుగా శ్రవణం చేయిస్తిరి. యిటువంటిది నాకు యెవ్వరయినా సూచన చేశేరేమో అని నాకు యిచ్చవుంది.

గు॥ నీకు సూచన అయిందా యథార్థముగా.

వృ॥ వున్నది అని నాకు దృఢం అయింది అరిచేతులో వుశిరీకాయ వున్నదో లేదో అని అనుమానం లేనట్టు తనకుతానే యధార్థంకావలె.

గు॥ అయితే నీకు అయిందాలేదా.

వృ॥ అయినట్టేకాని యింక నకసారి వినుపించండి.

గు॥ విను.

వృ॥ సరె సరే.

గు॥ లెస్స వింటివి మరె వున్నది యిషువంటిది.

వృ॥ లేదని యెంత మూఢునికి, మూర్ఖునికి అనుమానంలేదు.

గు॥ అదే దృఢం.

వృ॥ అయినా మూలం చెప్పండి అనె.

గు॥ చెపుతాగాని నీకు సూచన అయినది పోదుకదా.

వృ॥ నాకు దానికియేమి సంబంధం నావంటివారలే కోట్లురాని, నీళ్ళలో పరపుబండవలె వున్నదానికి, యంతప్రవాహం వచ్చిన దానికి యేమికొదువ, యెక్కువ అయినా నీళ్లకేగాని దానికి సార్వకాలం వక్కతీరే.

గు॥ యిక నీ వర్తమానం విను నీకు తల్లిదండ్రి యెవ్వరయినా వున్నారా.

వృ॥ యీ మాట నేనెన్నడు వినలేదు, యీ పాపపు మాట నేడు వింటె.

గు॥ అదే.

వృ॥ మేము అయోనిసంభవులము.

గు॥ చూస్తే నీవు వక్కడవు. చాలామంది వునట్టు ముచ్చట ఆడుతావు.

యీలాగు వుండగానే గుర్రాలు, ఏనుగలు, మనుష్యులు, రథాలు అనేక జిల్లాలు మూతుపాళ్ల వుత్తదుర్గువాండ్లు, బూడిదగాండ్లు, నామాల వాండ్లు అనేకమంది గురాలిల దగ్గెరవాండ్లు అనేకకోట్లు వచ్చె.

గు॥ శాభాసు వృద్ధయ్య వీరంత అయోనిసంభవులు కారా.

వృ॥ సరె సరే,

గు॥ వృధా తల్లిదండ్రి) అననేరాదు. శ్ర॥ "అన్ృతాత్ పాతకంపర" అని వున్నది. (అబద్ధంకంటె వేరే పాపంలేదు.) యీా వచ్చినవార్ల అడిగేరు సుమా్మా. తపున నెత్తికొట్టి పోతారు.

వృ॥ అల్లైతే నేను అడుగనే అడుగ, యీా దుఃఖం నాకు యెందుకు అయ్యా నాకు మూలంయేమి.

గు॥ నీకు యేది సూచన చేస్తినో అది కాదుగదా,

వృ॥ అది యెన్నటికి కాదు.

గు॥ అల్లైతే నీకు యెన్నటికి మూలం యేమిలేదు.

వృ॥ కొనకు యెక్కడికి పోచా అనె.

గు॥ నీకు యెరుకే.

వృ॥ నేను వున్నంతసేపు నాకు యెరుక.

గు॥ నీవు యెపుడూలేవు

వృ॥ నేనా యెపుడంటే అపుడే శూన్యం.

గు॥ శూన్యం అంటే.

వృ॥ యేమిలేదు.

గు॥ నీవు లేకపోయిందే నేను సూచనచేసింది లేకపోదుగదా.

వృ॥ అది రానూలేదు, పోనులేదు, వుండేదియేమి, లేకపొయ్యేది యేమి నాకు నేనే యేమిలేదు.

గు॥ అని దృఢమేకదా యిక నీకు యేమికావలె. పుట్టని చావనిది నేను కావలెననియు యిచ్చలేదుగదా. గాడిద గుర్రం యెన్నడు కాదు గదా.

వృ॥ నేనని మొదట యెన్నడు లేదు. కాసేపు వున్నపుడు యేమి లేదు. కొనకు యేమిలేదుగనుక యిషువంటిది నాకు కావలెనని యెన్నటికి యిచ్చలేదు. అయితినసే అబద్ధాలు పట్టవు. పుట్టని చావనిది వున్నది అని నమ్మికవుంది.

గు॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరానకు మొదలు యేమిలేదు కొనకు యేమిలేదు, నడుమ వున్నపుడు యేమిలేదుగనుక శరీరం వున్నపుడు శరీరం లేనిదానిని వుండచూచి సర్వకాలం శరీరం లేకుండేది. యిదే భ్రాంతి లేని మార్గం. యింతకంటె అధికంలేదు.

---

# ఏకాదశకల

స్త్రీ॥ యీకలలో వక స్త్రీ వచ్చె. వస్తూనే నాకు మొదలు యేమిలేదు అని యెరుగుదు. వున్నపుడు నా వర్తమానం నాకే యెరుక. సార్వకాలం శరీరం లేకవున్నది. వున్నాదని విన్నా. దానిని సూచన చెయ్యండి.

గు॥ వున్నది.

స్త్రీ॥ యెక్కడున్నది, యెటువంటిది,

గు॥ అది పుట్టని చావనిది శరీరము వున్న శరీరాన్ని ముట్టనిది, నాకడలేనిది, క్రియాశూన్యమైంది, మొదలు కొన లేనిది సార్వకాలాల యందు సమస్తమయిన వస్తువులయందు చలించక అచలమనే ప్రసిద్ధి చేత వున్నది. యిటువంటిదానిలో నీవు వున్నావు.

స్త్రీ॥ యింతేగదా. సరే సరే స్వామి యిది వకవేళ తోచు.

**గు॥ యేమని.**

స్త్రీ॥ యిది యేమోఅనుకుందు. యిది పుట్టని చావనిది అని యెరుగ, యిపుడు తోస్తుంది. యిపుడు నాకు యింతకంటే ప్రకటము యింది యేమిలేదు. కుండ ముందర వున్నట్టు వున్నది యిదే పుట్టని చావనిది అని తోచకపాయ. యిపుడయితే పాషాణాలకు, వృక్షాలకు వేరు అయినట్లు ఆయె.

గు॥ కోటి యుక్తులకయిన పుట్టని చావనిది మూలంలేని యీ గుర్తెరిగే శరీరం కాదు. యిది కలతలేని గురు సాంప్రదాయం కలవారి చేత సూచన వేలాగులవుతుంది. మీరు యిది చూచి భ్రాంతిరహితము

అయ్యేది. ఆయిన మళ్ళా మళ్ళా చూడండి, వ్రాసుకోండి. యిది గురూపదేశం లేనివారికి యెంతవారయిన జాడ కాదు. చలం, అచలం యీ రెండేకాని మూడోది వివేకమయినా అవివేకమే. పుట్టని చావనిది మొదలు కొన లేనిది రాకడా పోకడా లేనిది సార్వకాలం వక్కటీరుగా వున్నది. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం రాకమునుపే సకలదేశాల యందు సమస్తమయిన వస్తువులయందు తనకు తానే స్వతస్సిద్ధమై యున్నది. యిషువంటిది యేమిచెయదుగదా.

స్త్రీ॥ యిషువంటిది యేమిచెయ్యదు.

గు॥ సకల నిర్ణయాలు యెవరు చేసిరి.

స్త్రీ॥ యీ పుట్టని చావని దానిలోనే మొదలు యేమిలేక కొనకు యేమిలేక యీ కలలోనే తనకుతానే వచ్చి సమస్తమయిన నిర్ణయాలు, సకల వినోదాలు, అనేక భాష్యాలు, అనంతమయిన వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, పట్టణాలు, పల్లెలు, సిద్ధాంతాలు తనకు మనసు వచ్చినట్టుగా తానే చేసి తనకుతానే కొనకు శూన్య మవుతుంది.

గు॥ శూన్యం అంటే.

స్త్రీ॥ యేమిలేదు.

గు॥ వున్నపుడు నీ పేరు యేమని అడిగేటందుకు యేమిలేదు. అది పోయినతరువాతను యేది చూచినా మన్నుపోసి అంబలి కాచినట్టే పెరుగు అంబలి తాగబోతే బురద మన్ను వున్నట్టే. నీవు యెక్కడ నుంచి వచ్చినావు మళ్లి యెక్కడకు పోతావు అని వక్కడయిన అడుగ లేదు. వచ్చినవాడల్లా రానూ, వచ్చి తన కార్యాలు చేసుకుపోను వున్న వాండ్లకు మనకు సుఖమయిన దుఃఖమయిన పుట్టని చావనిదానికి యేమి లేదు,

స్త్రీ॥ తనకు తానేవచ్చి నేను వున్నపుడు నీ పేరుయేమి అని వక్క నాడు అడిగిన. అడిగితే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం నేను అను కుంఛాను.

గు॥ దాంఁదేమోయీ మనకే కలలో అనేకమయినవి కన్నులచూచి పలానిది పలానిది అది అని గుర్తెరుగుతామాలేదా. అవి మనలను యెరుగునా యెరుగవా? కలలో వచ్చిన దొరతోటి మనుష్యులతోటి మనము వ్యవహారంచేశినామా లేదా? పుట్టని చావని జడవాండ్లు యెరుగరు. మనము యెరుగము. అటువంటివాండ్లమాట యేమి నిజద్దోయి. ఛీ వారిని వారి మాటలను నమ్మినవాండ్లు చెడిపొయ్యేరు. అయినా మనము యిటు వంటి ప్రకారంగానే యేమిలేదు. మనదే భ్రాంతి పుట్టని చావనిది యీ జోలి యెరుగదు. మూలంలేని యీ గుర్రెరిగే శరీరం రాకముందు వున్న పుడు కొనకు యేమిలేకపోయెనా సార్వకాలం నక్కతీరే. అందుకే సార్వ కాలం శరీరంలేనివారు దొడ్డవారు. యిదే గురుసాంప్రదాయం. అదే అది సులభమా కఠినమా అనే.

స్త్రీ॥ నాకయితే కఠినంవలె వున్నది అనే.

గు॥ యింతకంటే సులభంలేదు అనే.

స్త్రీ॥ నక్క యుక్తి స్వామీ. పుట్టని చావనిది యెక్కడ వున్నది, అది యెటువంటిది, దానికి మొదలు కొన వున్నదాలేదా, దానికి రాకడ పోకడ వున్నదా లేదా. మీరు సూచని చేస్తూవుండగానే తాత్పర్యము చేసుకుంటా.

గు॥ సరేకాని నీవు యేమి యథార్థంగా చెప్పుమనే.

స్త్రీ॥ నాకు వచ్చేటందుకు మూలం యేమిలేదు. కొనకు ప్రవేశించే టందుకు స్థానం యేమిలేదు. నేను యేమని చెప్ప.

గు॥ పుట్టనిదానికి యేలాగు మొదలు కొన లేదో ఆలాగే నీవు.

స్త్రీ॥ ఆలాగుకాదు. నేను మూలంలేని యీ గుర్రెరిగే శరీరం గనుక శరీరమునకు మొదలు వున్నది, కొన వున్నది, విత్తనంలేని చెట్టువంటి వాణ్ణి.

గు॥ యీ శరీరం యెక్కడినుంచి వచ్చెనంటే యీ శరీరానకు మూలం వున్నది. యెవ్వరైనా అనిరా వారు కలలో యేనుగవలెవుండి దాని మీద కూర్చుండి వున్నది అని అన్నారని నమ్మితే మేలుకొగానే యేనుగ మీద ఆ మనిషివున్నాడు.

స్త్రీ॥ యేమిలేదు.

గు॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరానకు మొదలు వున్నది. కొనకు ప్రవేశించేటందుకు స్థానం వున్నాది అనేవారు అలాగే.

స్త్రీ॥ ఆలాగే.

గు॥ యేమి యెవ్వరు యీలాగు అనంగా వినలేదు.

స్త్రీ॥ అట్లైతే చులకనవలెనున్నది.

గు॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమైనా వున్నంతసేపు వున్నది అనేది లేదనేది పుట్టనిచావనిది వుండెనా అదియేమి అనలేదు. సకల వ్యవహారాలు యీ శరీరానికే అని గుర్తెరుగు యింతకంటే అధి కంలేదు. మూలంలేని యీ గుర్తెరిగే శరీరంకంటే నీచంలేదు. అధికం నీచం యిదే.

స్త్రీ॥ యేనుగ అధికం. యెలక నీచం. సింహం యెక్కువ. ఏనుగ తక్కువ. పిల్లి యెక్కువ. యెలక తక్కువ.

గు॥ అందరు మూలంలేని యీ గుర్తెరిగే శరమే కాని, కుక్కకు బ్రహ్మజ్ఞానం అని వాడిక, కోడికి కాలజ్ఞానమని వాడిక, చీమకు దివ్య జ్ఞానమనే వాడిక. అన్ని మూలంలేని యీ గుర్తెరిగే శరీరాలకే కనుక గుర్తెరిగింది వకటీలేదు. పుట్టని చావనిది సార్వకాలం వకటీరుగా వున్నది. దానికి మధ్యవచ్చి, మధ్య యేమిలేకపొయ్యేదానికి కొంచం సంబంధంలేదు. అది శాశ్వితమయినది. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం మెరుపువలె వున్నాననిపిస్తుంది. వెంటనే యేమిలేదు. ఆలాగే కలలో రాంగానే గుర్తెరుగుతాము. మనను అవి గుర్తెరుగు. వాట్లు మనము పుట్టని చావనిదాంట్లో లేకవున్నాము. మొదలు కొన లేనిది సర్వకాలం వకటీరుగానే వున్నది. శరీరం లేనిది, క్రియాశూన్యమయి నది, రాకడా పోకడాలేనిది, సకల దేశాలయందు, సార్వకాలాలయందు సమస్తమయిన వస్తువులయందు మూలంలేని యీ గుర్తెరిగే శరీరం రాక ముునుపే చలించక తనకుతానే స్వతస్సిద్ధమయివున్నది.

---

# ద్వాదశకల

శి॥ మీా కలలో వొక మనుష్యుడొచ్చే. వస్తూనే అయ్యా స్వత స్సిద్ధమై వున్నదాన్ని చెప్పండి అనే

గు॥ స్వతస్సిద్ధము యి యున్న దానియందు మీారు మేము వున్నాము అనే.

శి॥ అదిమాత్రమే వుండేటట్టు సూచన చేసేవారు కావలెనని చూస్తున్నాము. యీలాగు వుండగానే.

అయిదుగురు అంబారీలు యెక్కి వచ్చిరి. వారివెంటనే అనేకమైన లష్కరు. వక్కరికి నూరుకోట్ల మంది శిష్యులు కోటిగుఱ్ఱాలమీాద కాగిత పుస్తకాలు, కోటి యెడ్లమీాద కమ్మాకు పుస్తకాలు, అనేకమయిన శ్రీ తాంబాలఆకు పుస్తకాలు, అనేకమయిన సంపటాలు, సర్వకాలం తీర్థంసాగి నట్టే అనేకమంది రాకడాపోకడా, ఐదుగురు గురువులు, అందరు మధ్య వచ్చినవారే. అందులో శరీరంలేని ఆయన వున్నాడని ప్రశిద్ధి కద్దు. అది యేమోఅని ఆయననే చూడవత్తురు. వచ్చిచూస్తే అందరు కూర్చున్నట్టే కూర్చున్నారు. యిది యేమిఅన్నా అనుకుంటిమి. మనకు కావలిసినట్టిది యెవ్వరయినా సూచన చేస్తారేమో అడిగి చూతామనుకొనిరి. ఆయితే ఆయె కాకుంటే కాకపాయె. అడుగుదామని అడిగిరి. ఏావ్యేటపుడు వారికి వారి లష్కరుకు సకల సమాగ్రి గడ్డి, కట్టెలతో కూడా తీసుకుపోయి యిచ్చి నమస్కారాలుచేసి స్వామి మొదలు యేమిలేదు కొనకు ప్రవేసించే టందుకు స్థానం యేమిలేదు. మాకు మేమే వస్తిమి సకల భాగ్యాలతో వుంటిమి. మాకు పుట్టని చావనిది మొదలు కొనలేనిది, సార్వకాలం వకటీరుగా యున్నది, శరీరం లేనిది, క్రియా శూన్యమయింది, సకల దేశాలయందు, సార్వకాలాలయందు, సమస్తమయిన వస్తువులయందు చలించక తనకు తానే స్వతస్సిద్ధమయి యున్నదానిని సూచన చెయ్యాంగా వెంటనే మేము యేమిలేకుండ మాకు సూచన చెయ్యండి, సాధనం చెయ్యాందె మాకు స్వతస్సిద్ధం కావలె.

నవ్వీన బోధగురు॥ సరేకాని నీవు యేమని అడిగిరి.

శిష్యులు॥ నేనా నాకు మొదలు కొన యేమిలేదు. కొనకు యేమి లేదు. మధ్య వచ్చివున్న నేను మూలంలేని యీ గుర్తెరిగే శరీరంనే. నాకంటే అధికంలేదు, నాకంటే నీచంలేదు అనంగానే.

స॥ బో॥ గు॥ అందులో నక్క గురువు పక్కన నవ్వె.

బోధగురువులు ర॥ నవ్వంగానే ఆ నలుగురు చిన్నపోయిరి. పోయి ఆలోచనచేసిరి. దీనికి యేమి విచారం అనిరి.

స॥ బో॥ గు॥ దాందేమి మీదగ్గర విస్తారంగానే యున్నది. మా దగ్గర విస్తారంగానే వున్నది. పుస్తకాలు విడిచి విచారించండి అని నవ్విన గురువు అనే.

బో॥ గు॥ ర॥ నలుగురు అదే పనిమీదవుండిరి.

స॥ బో॥ గు॥ నవ్విన అయన యెప్పటివలె కూర్చున్నాడు.

శిష్యులు॥ అందులో కొందరు అయ్యా మేము అడిగినది సూచన చెయ్యకపోతిరి అనే.

బో॥ గు॥ వారిదగ్గిరకి పోయిరండి చూస్తువున్నారు అనే.

శిష్యులు॥ అక్కడికిపోయి భోంచేశి అందరు మళ్ళా నవ్విన ఆయన దగ్గరకు వచ్చిరి. అందరము మొద్దులముకాము. మమ్ము మేము యెరుగుదుము. మావంటివారు కోట్లకొద్ది వచ్చినా యెరుగుదుము. కారుంటే మాకు మొదలు యేమిలేదని గుర్తెరుగుతామా. ఆలాగే మాకు ప్రవేసించేటందుకు యేమిలేదని గుర్తెరిగినామా. మాకల్లా పుట్టనిది చావనిది యెక్కడవున్నది అని ఆశ తగిలింది. అదిమాత్రం సూచన చెయ్యండి అనిరి.

స॥ బో॥ గు॥ అట్లైతే సరే.

శి॥ మాకు యేమి పట్టదు. మరివకటి శరీరంలేక కొందరు వున్నారట అది యేలాగో అని రెండు ఆశలు వున్నవి. అట్లైతే శరీరం కొనకు యెక్కడకు పోచుంది అనె.

స॥ బో॥ గు॥ ముందు యేమిలేదు కొనకు యేమిలేదు యిది అందరికి సమానమే. యిక యేమి.

శి॥ సార్వకాలం శరీరం లేకనే వక్కతీరుగా వుండవలె.

న॥ బో॥ గు॥ వుండేరు అనే.

బో॥ గు॥ ఆ నలుగురు నవ్విన ఆయనదగ్గరకు వచ్చిరి. యే పుస్తకములోను అడివిమార్గమేకాని వారు అడిగినట్టు సమాధానం చేతామంటే దొరకదు. మందర యెవ్వరు దగ్గిరవచ్చి దండమయిన యేలాగు పెట్టేరు. చేతులో పుష్పం పుట్టదు. లేనిపోని అపకీర్తి యెన్నడు యీలాగు పిడుగుపడలేదు అనిరి.

న॥ బో॥ గు॥ పుస్తకాలు కట్టించండి పోదాము అనే అనంగానే.

శి॥ నేటిదాక నడిచినవాండ్లు చిన్నపోయి పోయ్యా అయ్యా అయ్యా సూచన చెయ్యమని అంటే చేయకపోవడము ధర్మమా అనిరి. అనంగానే.

న॥ బో॥ గు॥ పుట్టని చావనిదానిలోనే మీరు వున్నారు. మేము వున్నాము అనే.

శి॥ అనంగానే సరె సరే అనిరి.

(రెండో కూచి ఆయ)

గు॥ ప్రిజల్లారా మీరు మేము యింతపర్యంతంకూడ వున్నాము గదా.

శి॥ వున్నాము వున్నాము.

గు॥ మమ్ముల మీరు యెరుగుదురు. మిమ్ముల మేము యెరుగుదుము. మేము మేలుకొంటే మాకు మీరు యేమిలేదుగదా.

శి॥ యేమిలేదు.

గు॥ మీరు మేలుకుంటే మీకు మేము యేమిలేదుగదా.

శి॥ యేమిలేదు.

గు॥ మీరు మేము యేమిలేదని తనవుతానే దృఢమా యేమైన కష్టపడవలెనా.

శి॥ యేమి కష్టంలేదు.

గు॥ పుట్టని చావనిది వున్నాది కదా.

శి॥ వున్నదే అది.

గు॥ మనవంటివారు కోటిమంది రానీ కోటిమంది పోనీ దానికి యేమికావలె.

శి॥ అవునయ్యా నీవే గురువుకు తగుదువు. అందుకే శరీరం లేనివారు వున్నారని యందురు.

[మూతో కూచి] కాంగానే యీ ప్రజలెల్ల మేలుకునిరి. మేము మేలుకుంటే యెక్కడచూచుకొన్న యేమిలేదు. ఆ యేనుగ లడైన లేదు. యేమి మహాశ్చర్యం యేమిలేదు. యేది వున్నదో అదే వున్నది. ఆ గురువు చెప్పేగదోయి మేము మేలుకుంటే మీరు యేమిలేదు. మీరు మేలుకుంటే మేము యేమిలేదు. యిక యేమోయీ యీలాగు చెప్పే గురువు యెక్కడున్నాడోయి. సరేకాని నలుగురు ఆ నలుగురే. వారి పుస్తకాలలో వన్నదే నమ్మికే.

గు॥ ఛీ ఆ నమ్మికే ఆ పుస్తకాలు యిపుడు యేమాయ.

శి॥ యేమిలేదు.

గు॥ ఆలాగు అవ్విచూచి చెప్పేవారేమైరి.

శి॥ వారు యేమిలేదు.

గు॥ అనేకమంది శిష్యులు యేమైరి.

శి॥ యేమిలేదు.

గు॥ యిన్ని గానలెనా మేలుకుంటే యేమిలేదు. అపుడు యెపుడు పుట్టని చావనిది, మొదలు కొన లేనిది, సర్వకాలం వక్కతీరుగావున్నది, శరీరం లేనిది, రాకడ పోకడ లేనిది, క్రియాశూన్యమయినది, సకల దేశాలయందు, సర్వకాలాలయందు చలించక, దేన్ని స్మరించక తనకు తానే స్వతస్సిద్ధమయియున్నది.

శి॥ యిటువంటిదాన్ని గురుస్వామివలన సూచన చేసినారు. చెయ్యాగానే శృతి॥ "ఆకాశం గగనంశూన్యం" ఆలాగు యిక్కడ శూన్యంగాదు. కోటిమాట్లు వున్నదన్నా మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు. కోటిమాట్లకు లేదు లేదన్నా పుట్టని చావనిది లేకపోదు.

గు॥ యిదే సిద్ధాంతం. సిద్ధాంతమే రాద్ధాంతము.

శి॥ చాలు చాలు వినుకువస్తుంది.

గు॥ నీకు చాలుగదా.

శి॥ నాకు చాలు.

ఇతి శ్రీమద్గురు శివరామదీక్షిత ప్రభావే వేదాంతవిచారణే
సద సదుపాది ద్వయదోషరహిత ప్రకరణము
పంచమోధ్యాయః

---

శ్రీ గురుభ్యోనమః

# త్రయోదశకల

మాయ విద్యోపాధి ద్వయదోషరహిత ప్రకరణము

శ్లో॥ ఉల్కాహస్తో యథాలోకే । ద్రవ్యమాలోక్య తాంత్యజేత్
జ్ఞానేనజ్ఞేయమాలోక్య । పశ్చాజ్ఞానంపరిత్యజేత్॥

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు అని సిద్ధాంతం. సిద్ధాంతమే రాద్ధాంతం.

యీ కలలో వకటి అబ్బ మనిపివచ్చె. వస్తూనే నేను వున్నంత సేపు వుండేది, యేమి లేకపొయ్యేది యీ రెండూ నాకు స్వభావమే నా జాడ తెలియక కొందరు సుషుప్తిఅని అనుకొన్నారు. కొందరు మరణము అని అనుకున్నారు. ఆ రెండు మంది అనంగ నేను దొరికించుకున్నా. నాకు సుషుప్తి యెరుకలేదు, మరణము యెరుకలేదు, తప్పున వచ్చేది, వుండేది, సుఖమైన, దుఃఖమైన అనుభవించేది. కొనకు అందరూ చూడంగ యేమిలేదు. నిత్యం కోటిమాట్లు వుండేది, యేమి లేక పొయ్యేది, నాకు స్వభావమే. మందికి ఆశ్చర్యం.

గు॥ అయితే నీవు యెకటినుంచి వచ్చినావు.

శి॥ నాకు మూలం యేమిలేదు, కొనకు ప్రవేశించేటందుకు స్థానం యేమిలేదు.

గు॥ నీవుయేమి.

శి॥ నేను మూలంలేని యీగుర్తరిగే శరీరమును. నన్ను నేను యెరుగుదును. నేను వున్నంతసేపు కోట్లకొద్ది వచ్చినా యెరుగుదును యింతే.

గు॥ యిపుడునీకు యేమికావలె.

శి॥ రాకడ పోకడలేనిది సర్వకాలం వక్కతీరుగావున్నది మొదలు కొనలేనిది పుట్టనిచావనిది సకలదేశాలయందు సర్వకాలాలయందు సమస్తమయిన వస్తువులయందు తనకుతానే స్వతసిద్ధమయి యున్నది సూచన కావలె.

గు॥ సూచన చేస్తాకాని మళ్ళా అడగవుగదా.

శి॥ మళ్ళా అడుగ నేను యేమయిన చదువుకున్న మొగవాణ్ణే నాకు యిదిమాత్రం సూచన అయితే సరి.

గు॥ నీవుయేమి.

శి॥ మూలంలేని యీగుతేరిగే శరీరమును.

గు॥ నీవు యిపుడు యేతీరుగా అడిగినావో ఆతీరు వున్నదో లేదో అని సంశయం లేదుగదా.

శి॥ కోటిమాట్లకు వున్నది.

గు॥ అటువంటిదానియందే నీవు వున్నావు.

శి॥ సరెసరె.

గు॥ గట్టిగా వున్నదిగదా.

శి॥ కోటిమాట్లకు వున్నది. నాకు యేమివిచారంవున్న యేమి లేదు కొనకు యేమిలేదు.

గు॥ అలాగేకాదు యిపుడు కలలోవచ్చిన యేనుగు యేలాగో అలాగే.

శి॥ యిపుడు అయితె సర్వకాలం వున్నది కేవలం అదిలేక సముద్రం వలె వక్కతీరుగా యుండవలె.

గు॥ అదియేమిలేదు యిదియేమిలేదు. కేవలం అచలమె సర్వకాలం వక్కతీరె ఆలైతె వ్యవహారం యేలాగు యెవ్వరికి.

శి॥ యేమి అన్నా ఆశ్చర్యం.

# శ్రీ శివరామ దీక్షితీయ్యమను బృహద్వాసిష్టం

గు॥ యిది ఆశ్చర్యమే.

శి॥ యేమిలేదనేటందుకు యేమిలేకపోవు యిక యేలాగు అన్నా యిది అంత ఆశ్చర్యము యిది గురుస్వామికే తెలియవలెను. అనరాదు గాని వారికే శక్యముగాదు బహుకఠినం అటువంటివారితో కూడావుండి చూడవలెను చూచినా శక్యముకానట్టువున్నది.

గు॥ అందుకే బ్రహ్మవిద్య అతిసులభం అతికఠినం.

శి॥ స్వామీ నాకు స్వభావమే శరీరమనె ఆవరణంవుంటె.

గు॥ కలలో యేనుగ మేలుకుంటె యేలాగు తనకు యేమిలేదని దృఢమో ఆలాగే సూచనచేత మూలంలేని యీగుతెరిగే శరీరం యేమిలేదు.

శి॥ అయినా మూలంలేని యీగుతెరిగే శరీరం యేమిలేదు.

గు॥ యేమిలేకుంటె సర్వకాలం వక్కతీరె సరేనా.

శి॥ సరెసరె.

గు॥ శభాస్ చదువుకున్నవారికంటే నీవుదొడ్డదానవు యీలాగు వుండవద్దా అమ్మా.

శి॥ యిటువంటివారు యేలాగుఅంటె అలాగు నడువరుగదా, యెన్నటికి.

గు॥ యేదిమూలమో అదేకలలో యేనుగ మేలుకుంటె యేమిలేదని తనకుతానే ధృఢంవుండవలె.

శి॥ ధృఢంఆయె ధృఢంయేమిలేకపాయె.

గు॥ యేదివున్నదో అదేవుండె యిఖముచ్చటేవద్దు చాలుచాలు యెక్కువముచ్చట లాడేటందుకు మూలం యేమిలేదని సిగ్గువుండవలె వారికె అది వున్నదంటె వుండిపాయె వున్నది వున్నట్టుసూచన ఆయెనా వారికి ముఖంచెల్లదు మునువటివలెనె చెలామణిలేదు. చెల్లనిపాయి వలెనే రాగిరూపాయి పాటిగాదు యిందుకు అనుమానంలేదు.

శి॥ అన్నా మూలంలేని యీగుతెరిగే శరీరంయేమిలేదు. పుట్టచావని దానికి బదులులేదు.

గు॥ యీలాగు వుండవలెను గురుసాంప్రదాయం.

# చతుర్ధశకల

యీ కలలోనే వెనుకటి అయిదుగురు వచ్చిరి. వచ్చినవారిలో వొక్కరు శరీరంలేనివారు అనిరి. ఆయనే గురువు. అదే భ్రాంతిలేని మార్గం. అటువంటిది మూడు కన్నులవాడయినా సూచన చేయలేడు. యిదె యిటువంటిది వచ్చి అడుగంగానే సూచన చేస్తువుండంగానే కనుకుం చాడు. యిదియేరాజమార్గం నాకు సూచనచాయండి,

గు॥ నేను యెటువంటిదని సూచన చేస్తానో అటువంటి దానియందె నీవు వున్నావు. నీకు సూచనచేసినట్లు మళ్లా అడగవ్వుగదా,

శి॥ అడుగకుండా అన్నం వడ్డిస్తే యెందుకు అడుగుతా.

గు॥ విను పుట్టనిచావనిది వొక్కదాన్నిఅయినా, ముట్టుకోనిది అనే కమంది సూచన చేస్తే అనేకమంది భ్రాంతిరహితులు అయినారు.

శి॥ సరే యిదే.

గు॥ యిదిగాక మరోదానిని యెప్పుడు సూచనచేసినా చేసినవి పడవు. యిటువంటి శరీరాలు కోట్లకొద్ది వచ్చినా అది అలాగే వున్నది. యీ గుర్తెరిగే శరీరానకు దానికి సంబంధంలేదు. దీనివంటిది అదికాదు. కలలో యేనుగు వచ్చింది. దానిమీద మనుష్యులు వున్నారు. వారు మనము కూడా మాట్లాడితిమి. వారిని మనము యెరుగుదుము, మనను వారు యెరుగుదురు. వారు మేలుకుంటే వారికి మేము యేమయినా వున్నామా. మనము మేలుకుంటే మనకు వారు యేమయిన వున్నారా.

శి॥ వారు మనము కూడా వున్నప్పుడు, లేనపుడు దానికి యెన్నటికి భయంలేదు.

గు॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరంవంటిది గాదుకదా.

శి॥ అదిగాక రెండోది యేమయిన వున్నదా. అదివే అది. వాలు వ్యవహారానకు మూలం యేమిలేదు.

గు॥ శాబాసు యెంతదొడ్డవాడవు మీకు సూచన చేసినంతా అందరికి అదే.

# పంచదశకల

శి॥ యీ కలలోనే వొక మనిషివచ్చే. వస్తూనే నాకు యెనిమిదు దృష్టాంతరాలతో సూచన చెయ్యండీ అనే అంటే.

గు॥ మా బాగు అనే. సరేకాని నీవు యేమిటా అని అడిగే అడు గుత్తే,

శి॥ నేను మూలంలేని యీగుర్తెరిగే శరీరమును అనే.

గు॥ యీశరీరానకు యెవ్వడైనా దొరవున్నడా.

శి॥ నేను దొరను యెరుగ, దొరసాన్ని యెరుగ. నాకు మొదలు యేమిలేదని నాకు యెరుకే. నాతోకూడా వచ్చినవారే అతిప్రీతిచాత పడి వుండి తనవంటి ఆడదాన్ని తగిలి కొడుకులా బిడ్డలా కంచూ వున్నవారం. మాకు దుఃఖంపట్టదు. మేము రెండుమార్గాల వున్నాము. స్వేదస్సిద్ధమై మాకు మేమే వస్తాము. వొకవేళ కషపులోవుండి వెళ్లివస్తాము. మాకు అనంతమయిన ప్రకారాలు అన్ని నిర్మాణాలు చేసినాము. మా కంటే అన్యం పుట్టని చావనిది దానికి మొదలు యెక్కడ వున్నాదో కొన యెక్కడవున్నాదో.

గు॥ దానికి రాకడాలేదు పోకడాలేదు సార్వకాలం వొక్కతీరే శరీరంయెన్నటికీలేదు. క్రియాసూన్యమైంది సకలదేశాలయందు సార్వకాలాలు యందు సమస్తమైన వస్తువులయందు చలించక తనకుతానే స్వతస్సిద్ధమై వున్నది. దానికివొక్కటైనా పేరులేదు. దానికి అదేకాని రెండోది బదులు లేదు. మూలంలేని యీగుర్తెరిగేశరీరానకు మర్యాదాలేదు యిన్నాళ్ళు వునికిఅని తన సమాధానమేకాని రెండోదాన్నిచూచి భయపడదు.

శి॥ రెండోది అంటే,

గు॥ పుట్టని చావనిది.

శి॥ అదే అంటే నాస్తానమేఅది నేను వుండేది దానియందు పుట్ట నిది మాతో సంభాషణ చాయదు. మేము దాన్ని పుష్టిపెట్టి వ్యవహా రం చాయము. మాకు అది మూలం కాదుగదా. మళ్ళా ప్రవేశించే

టందుకు స్థానం కాదుగదా. మా సుఖమేమో మా దుఃఖమేమో వున్నంతసేపూ వుండవలె. లేకుంటే యేమిలేదు. దానికి మాకు సమ్మంధంవుంటే అదీయిదీ వొక్కటే అవును. యిది మధ్యవచ్చి మధ్యనే యేమీలేదు. అది సర్వకాలం వక్కటీరే. యిది యెప్పుడు విచారిస్తే అప్పుడే యేమిలేదు. అది విచారించినా విచారించకున్నా సార్వకాలం చలించక తనకుతానే స్వతస్సిద్ధమైవున్నది.

గు॥ స్వతస్సిద్ధమై వున్నదిగనుకనే సాధనచాత సాధ్యంకాదు. అది నేను వక్కటే అంటే యెవ్వరునమ్మరు. వొక్కటీసరిపోదు మూలంలేని యీగు తేఁరిగే శరీరం చంచలం అది క్రియాశూన్యమైంది. సకలక్రియలకూ మూలంలేని యీగుర్తెరిగే శరీరమే మూలం పుట్టని చావని దాని యందే వున్నావు అంటివి అందరూ అనంగా అన్నావా నీకు ధృఢమా.

శి॥ అధిష్టానమని అనుకోంగా అన్నా.

గు॥ అధిష్టానము వుంటే నీకు మూలం వుండనేవుండే మళ్లా ప్రవేశించేటందుకు స్థానం అది కాదా యేమి.

శి॥ యేమీ ఛీ ఛీ అది యేమీలేదు,

గు॥ నాకు మూలం వున్నదనీఅంటే తలలుకొట్టించే కొరకు ప్రవేశించేటందుకు స్థానంవున్నది అని అంటే మెడలకు వుర్లుబోయించే. ఛీ ఛీ అషువంటి అధికమైన అబద్ధాలు వెనక యెందరుకూసినా యేమీ యెదురుగా నిలబడి అనుమను యెవ్వడులంటే వాడే పుట్టేవాడు కొరకు యేమీలేకపోయ్యేవాడు. పుట్టని చావనిది సంభాషణచేస్తుందీఅని చచ్చిన శవాలు తినేవాండ్లుఅయినా అనరు. తలలు గొరిగేవాళ్ళు అయినా అనరు. బట్టలు వుతికేవాండ్లుఅయినా అనరు. పుట్టని చావనిదానికి వక్కటైనా వికారం లేదు. సార్వకాలం వొక్కటీరే.

శి॥ నేను దానియందే వున్నాగాని నాకు అధిష్టానం మరియూదా లేదు.

గు॥ యిఘు యేమీ.

శి॥ దానికీ నాకు యీపత్తుఅయినా సంబంధం లేకవున్నాము.

గు॥ యిది సరే. యిదీ అందరికీ సమాధానమే.

గు॥ నీకు యీలాగు కావలె.

శి॥ గురువాక్యం యెప్పుడు వింటే అప్పుడే వుండవలె. లేనిది యేమీ లేకపోవలె.

* మొదటి వుపమానం *

గు॥ మంచిది నీకు ఆలాగే అయ్యె పుట్టనిచావనిది సూర్యుడు వున్నాడో లేడో అని అనుమానం లేనట్టువున్నది.

శి॥ అది యేమీ సాయంకాలానికీ యేమీలేదు యిది అచలం.

—♦ రెండవ వుపమానం ♦—

గు॥ చంద్రుడు వున్నాడో లేడో అని అనుమానం లేనట్టు రాకడ పోకడలేనిది వున్నది.

శి॥ అది యేమీ తెల్లవారీ యేమీలేదు యిది సార్వకాలం వొక్కతీరే.

—* మూడవ వుపమానం *—

గు॥ భూమి ప్రత్యక్షంగావున్నట్టు మొదలు కొనా లేనిదివున్నది.

శి॥ యీ భూమికి మొదలుకొనవున్నది. తనకుతానే స్వతశిద్ధమై వున్నదానికీ మొదలు యెవ్వరూ చూడలేదు. కొన యెవ్వరూ చూడ లేదు. యీ శరీరం వంటివే యివి అన్ని.

[ నాల్గవ వుపమానం ]

గు॥ పుట్టని చావనిది నిప్పు ప్రత్యక్షంగా వున్నట్టువున్నది.

శి॥ ఆలాగే వున్నదిగాని కట్టె లేకున్నా పిడక లేకున్నా యేమీ లేదు పుట్టని చావనిదానికీ రెండోది యేమీలేదు.

—: ఐదవ వుపమానం :—

గు॥ పుట్టనిచావనిది శరీరం ప్రత్యక్షంగా వున్నట్టువున్నది.

శి॥ శరీరం వున్నప్పుడూ వుండదు శరీరం లేకుంటే లేకపోదు. సార్వ కాలం యేమీలేదు మూలంలేని యీగుతెరిగేశరీరం.

* ఆరవ వుపమానం *

గు॥ పుట్టనిచావనిది సార్వకాలం ముందర పెద్దఘట్టూవున్నట్టు వున్నది.

శి॥ ఘట్టూ యెక్కడవుంటే అక్కడనే వున్నది. పుట్టని చావనిది సకలదేశాలయందువున్నది.

* శ్రీభగవద్గీతా *

శ్లో॥ అవినాశితుతద్విద్ధి । యేనసర్వమిదంతతమ్
వినాశమవ్యయస్యాస్య । నకశ్చిత్కర్తుమర్హతి॥

తా॥ దేనిచేత ఈ సకలప్రపంచమును వ్యాపింపబడినదో అట్టి కేవలాత్మ నాశము లేనిదని తెలియుము. నాశములేని యీ కేవలాత్మకు నాశము గలిగించుట ఎవరికిని శక్యముగాదు. [యీ శ్లోకము బ్రహ్మ తత్వమును గూర్చినదని శంకరభాష్యము.]

[ ఏడవ వుపమానం ]

గు॥ యీ పుట్టని చావనిదీ పెద్దచెట్టూ వున్నట్టు వున్నది,

శి॥ చెట్టువంటిదికాదు, పుట్టని చావనిది; గొడ్డండ్ల ఛేదింపబడదు. నిప్పుచాత కాలంది, నీళ్ళచాత చీకంది, యండచాత, ఘాలిచాతయెండి పోంది.

* శ్రీభగవద్గీతా *

శ్లో॥ నైనంఛిన్దన్తిశస్త్రాణి । నైనందహతిపావకః
నచైనంక్లేదయంత్యాపో । నశోషయతిమారుతః

తా॥ యీ కేవలాత్మను ఆయుధములు నరుకజాలవు. అగ్ని దహింపజాలదు. నీళ్లు తడుపజాలవు. వాయువు యెండింపజాలదు.

శ్లో॥ అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ । మక్లేద్యోఽశోష్యఏవచ
నిత్యస్సర్వగతస్థాణు । రచలోఽయంసనాతనః॥

తా॥ ఈ కేవలాత్మ ఛేదింప నలవిగానిది, దహింపనలవిగానిది, తడుప నలవిగానిది, ఎండింప నలవిగానిది, నాశములేనిది, అంతటను వ్యాపించియుండునది, స్థిరరూపమగునది, చలింపనిది, అనాదియైనది.

శ్లో॥ యఏనంవేత్తిహంతారం । యశ్చైనంమన్యతేహతం
ఉభౌతౌనవిజానీతో । నాయంహంతినహన్యతే॥

తా॥ యెవడీ కేవలాత్మను వధించుదానిగా దలంచుచున్నాడో, ఎవడు ఈ కేవలాత్మను వధింపబడుదానిగా దెలియుచున్నాడో, వారిద్దరును దెలియనివారలు. ఎందువల్లననగా నీ కేవలాత్మ వధించునదియును గాదు వధింపబడునదియునుగాదు కర్తృత్వ, కర్మత్వములు రెండును కేవలాత్మకు లేవు. అవికారములుగాన పరబ్రంహ్మాకవి లేవు.

* యెనిమిదవ వుపమానం *

గు॥ ప్రత్యేకంగా స్త్రీముందరవున్నట్టూ పుట్టనిచావనిది, కంట్లో ముందర వున్నది.

శి॥ స్త్రీవంటిదికాదు, కేవలం అపవిత్రవస్తువు మూత్రపురీషాల కంటే తక్కువ.

గు॥ మగవాడు ముందరవున్నట్టూ, కండ్లుయెత్తి చూడంగానే పుట్టనిచావనిది, రాకడ పోకడలేనిది, సకలదేశాలందు, సార్వకాలాలందు సమస్తమైన వస్తువులయందు, చెలించక తనకుతానే స్వతశిద్ధమైవున్నది. దానికిపేరులేదు ఆకారంలేదు శరీరంకొట్టుబడ్డా ఆ పుట్టని చావనిది కొట్టు బడదు.

శ్లో॥ నజాయతేమ్రియతేవాకదాచి । న్నాయంభూత్వాభవితావానా
భూయః । అజోనిత్యశ్శాశ్వతోఽయంపురాణో । నహన్యతే
హన్యమానేశరీరే॥

తా॥ ఈ కేవలాత్మ ఒకప్పుడుపుట్టదు. ఒకప్పుడుచావదు. ఒకప్పుడుండి మరల మరియొకప్పుడు ఉండనిదియుగాదు. మునుపులేక వెనుక వచ్చినదియునుగాదు. ఎందువల్లననగా నిదిపుట్టుకలేనిది, మరణములేనిది, ఎల్లప్పుడుఉండునది, అనాదియైనది. శరీరములుహతమైనను ఈ కేవలాత్మ హతముకాదు.

శి॥ యదార్థంగావున్నది వాకుచాలు కొనకుా వాక్యం దయ చేయండి.

గు॥ "మూలంలేని యీగుతెఱిగేశరీరం యేమీలేదు" మూలం లేని యీగుతెఱిగేశరీరం కలలో యేనుగ మేలుకొంటే యాలాగో అలాగే మూలంలేని యీగుర్తెరిగేశరీరం యేనుగ.

మూలంలేని యీగుతెఱ్గేశరీరం యేమీలేకుంటే యాలాగువున్నదో ఆలాగ్గే సార్వకాలం అదేపరిపూర్ణంగనుక యిది భ్రాంతిలేనిరాజమార్గం.

ఇతి శ్రీమద్గురు శివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే
మాయవిద్యోపాధిద్వయ దోషరహిత ప్రకరణం
సష్టాద్యాయః.

---

శ్రీగురుభ్యోనమః

౭. దేహదేహోపాది ద్వయదోషరహిత ప్రకరణం

# శోడశకల

శ్లో॥ గురుణావరణత్యాగః । అనావరణ ఉత్తమం ।
పరిపూర్ణాణం పూర్ణమేవా । పూర్ణాచల సముద్రవత్ ॥

మూలంలేని యీగుర్తెరిగే శరీరం యేమిలేదు. అనే శిద్ధాంతమే శిద్ధాంతము.

కలలో గుఱ్ఱముయెక్కి ఒకమనిషివచ్చె. గుఱ్ఱముయేమొ మనము యెందులోవున్నామో అదేపుట్టని చావనిది అనిచెప్పి. నేను యేమీలేదు. యీగుఱ్ఱం యేమిలేదు. నీవు యేమీలేదు అని చెప్పిరి. మేలుకుంటె పుట్టనిచావనిది వున్నది. వారు యేమిలేదు.

గురు॥ శాభాసు సరెసరే యీలాగు వుండవద్దా కలతప్పవిడిచి మరివక అవధలేదు. యంతసేపు యీశరీరం మేలుకోక వుంచుందో అంతసేపు కలే కలతప్పితే యేమిలేదు. యీశరీరం యేమిలేదు. సుషుప్తి అని మరణమని ప్రజలు కల్పించినారు. వున్నవేరెండు. కండ్లుమూశిన

మెరుకె కండ్లుతెరచినామెరుకె, మెరుక లేకుంటె యేమిలేదు. సార్వకాలం శరీరంలేక వున్న దానికి యేమివున్నదని నిర్ణయంచాయు మరివకటి యేమి వున్నది.

మూలంలేని యీగుతెఁరిగె శరీరమే సకలనిర్ణయాలకు శరీరము ప్రమాణము, పుట్టనిచావనిది క్రియాశూన్యమైనది. గనుక పుట్టనిచావని దానికి మెరుక లేదు. కర్మాలు యెక్కడవున్నావి. ఛీ అందుకే మూలం లేని యీగుతెఁరిగేశరీరం వున్నదన్న పాపమే లేదన్న పాపమే యేమిలేదు అన్నా పాపమే తాను పుట్టనిచావని అచలంగనుక తాను నిర్ణయమనే పాపం తగలకుండా మెదలవలె నిర్ణయంచేశినా శరీరంలేనివారుకారు. యెం తవారికి అంతవారిని దంటశాయవలెను. నేను శరీరంలేనివాణ్ణి అని చెశినా పాపమే విడిచినా పాపమే యెమిలేదని చేశినా పాపమే.

శి॥ అట్లైతె యాలాగు.

గు॥ పుట్టనిచావనిది యేలాగువున్నదో మొదలుకొనలేనిది యాలా గువున్నదో రాకడపోకడలేనిది యాలాగువున్నదో శరీరంలేకయాలాగు వున్నదో సకలదేశాలయందు సర్వకాలాలయందు సమస్తమైన వస్తువుల యందు చలించక తనకుతానే స్వతస్సిద్ధంగా యాలాగువున్నదో సర్వకాలం యాలగువున్నదో ఆలాగే యావత్తునిర్ణయం అంతాఅదే రెండోదిలేదు.

శి॥ సిద్ధులు యాలాగు వుంచారు.

గు॥ ఛీ ఛీ మూలంలేని యీగుతెఁరిగే శరీరంచాత యెన్నటికి సాధ్యంలేదు గనుకనే సిద్ధి యెన్నటికిలేదు.

శి॥ వెనుకటివారు అందరు యేలాగు అయినారు.

గు॥ ఛీ ఛీ యెవ్వరుకాలేదు.

శి॥ కాకుంటె యెందుకు ప్రయత్నం చేస్తారు.

గు॥ అన్నిప్రయత్నాలవలె యీ ప్రయత్నం అన్నియిచ్ఛలవలె యీయిచ్ఛ అన్నిచేసినట్టె యిదిచేస్తారు. మొదలుపెట్టిన నాటినుంచి చేస్తూనేవున్నారు. యిప్పటికి దరిలేదు. జ్ఞానంచేత సాధ్యంకాదు. కోటి యెందుకు చెప్పవలె మూలంలేని యీగుతెఁరిగేశరీరం చాతకాదు.

యీశరీరానకు మూలం లేదు. కొనకు ప్రవేసించేటందుకు స్థానంలేదు. పరిపూర్ణంవేరు. శరీరం వేరేవున్నదని యెషువంటి పశువులయినా అనదు పరిపూర్ణవస్తువు వకటేవున్నది. మూలంలేని యీగుతెలిరిగేశరీరం యేమి లేదు. అని రెప్పపాటంతసేపు మరువకవుండవలె. మూలంలేని యీగు తెలిరిగేశరీరం యేమిలేదు అని నిర్ణయంకాక తన్నుకుంచాడు. మూలం లేని యీగుతెలిరిగేశరీరం యేమిలేదు అని రెప్పపాటంతసేపు మరువక వుండవలె వుండకపాయనా యెంతప్రజ్ఞవంతుణ్ణి అయిన మోసపెడుచుంది. మూలంలేని యీగుతెలిరిగేశరీరమే విక్షేపశక్తి యీవిక్షేపశక్తే ఆవర్ణ శక్తి విక్షేపంలేకుంటె ఆవర్ణంపాయ ఆవరణంపోతె విక్షేపంపోదు విక్షేపశక్తి ఆవరణంకుమూలం విక్షేపంచేతనే అనేక ఆవరణాలు వస్తావి. అందుకే గురు సాంప్రదాయం కావలె.

సకలభ్రమలకు మూలం మూలంలేని యీగుతెలిరిగేశరీరమే అందుకే మూలంలేని యీగుతెలిరిగేశరీరం యేమిలేదు, యింతకంటె అధి కంలేదు. యిదే గురువాక్యం పరిపూర్ణం పుట్టనిది చావనిది మొదలు కొన లేనిది రాకపోకడలేనిది సార్వకాలం క్రియాశూన్యమైనది. సకలదేశాల యందు సర్వకాలాలయందు సమస్తమైన వస్తువులయందు చలించక తనకు తానే స్వతసిద్ధమైయున్నది గనుక అందుల ప్రయత్నంలేదు. మూలంలేని యీగుతెలిరిగేశరీరం యేమిలేదు. అని యెన్నికోట్లుచేస్తె అంతదృఢం వున్నదానికి యిది విరోధిగనుక దీన్ని కూకుడువేళ్లతో తీసివెయ్యవలెను. యిది అభ్యాసం ఆయినాకొద్ది సుఖదుఃఖరహితం అవుచుంది యెప్పటి పరిపూర్ణం యెప్పటివలెనే వుంచుంది. పరిపూర్ణం యేతీరుగావున్నదో ఆతీరుగా కుదరవలె. మూలంలేని యీగుతెలిరిగేశరీరం యేమిలేదు అని సకలక్రియలుచేసినా అది క్రియాశూన్యంగాదు. విడచినా క్రియాసూన్యం గాదు. కొన్నివిడిచి కొన్నినడిచినా క్రియాశూన్యంకాదు. యిది పరమ గుహ్యం యిదేమహాగుహ్యం యెంతవారికి శఖ్యంకానట్టె యుంచుంది. దీనికి కలలో యేనుగవచ్చి మేలుకుంటె కొంతవుండి కొంతలేకపోచుందా యేమిలేదా.

శి॥ యేమిలేదు.-

గు॥ ఆలాగే గురువాక్యంచాత ఆయ.

శి॥ యేమి ఆయ.

గు॥ మూలంలేని యీగుత్తేరిగేశరీరం యేనుగవలెనే జాడలేక పోయ.

శి॥ లేకపోతే.

గు॥ పుట్టనిచావని పరిపూర్ణమేవుండె మూలంలేని యీగుత్తేరిగే శరీరం మధ్యవచ్చె మధ్యపోయె వున్నదివున్నట్టెవుండె సర్వకాలం వకటీరె మూలంలేని యీగుత్తెరిగేశరీరం యేమిలేదు. యిదిలేకుంటె ప్రసంగాలు నిలిచె యిదిమహా గుహ్యం పుట్టనిచావనిది వ్యవహారంలేనిది యేలాగు వ్యవహారంచేస్తుంది, గురుకటాక్షం తప్పవిడచి మరివకటి భ్రాంతిలేని మార్గంలేదు. యెవ్వరు మూలంలేని యీగుత్తేరిగేశరీరాన్ని విడిపించక బోధిస్తారు. గనుక భ్రాంతి తిరుగదు.

పుట్టని చావని దానిజాడ తెలియదు. అందుకే స్త్రీ స్త్రీతోకూడ వుండి సంతోషపడలేటె పురుశుడు పురుశునితోకూడి సంతోషపడలెట్టె యెప్పుడు యెంతో అంతె సార్వకాలం యీ మూలంలేని గుత్తేరిగే శరీరమే అయ్యి భ్రాంతుడయ్యి వుంటాడు. దరవాజా తీశె గురువుకావలె దర్వాజతియ్యక మంత్రాలు, సాధనాలు, లక్ష్యాలు, మూలంలేని యీగుత్తేరిగే శరీరానకు చెప్పినా దర్వాజకుతాళం వేశినట్టె తాళంచెవి ఆగురువు దగ్గరలేదు ఆగురువు వెయ్యమెరుగుగాని తియ్యనేరడు ఆగురువుకు మరియొకగురువు తాళంవేసి పొయినాడు, యిదిఅని జాడచూపలేదు.

యీలాగే హూంకరికిహూంకరు, హూంకరికిహూంకరు. తలుపుతీసి పుట్టనిచావనిది యిదియని జాడచూపి తలుపురెక్కలు విప్పివేసి యిదే రాజమార్గం అని వకసారి సూచనఆయితె మల్లావాడు యెవ్వరిని నమ్మడు. వానితలుపు తీసివేసినమార్గం వానికి దృఢంఅయితె వానికి వకటైన బాధలేదు. సార్వకాలం వకటీరె అందుకే శరీరంలేని గురు సాంప్రదాయం అరుదు.

మూలంలేని యీగుత్తేరిగేశరీరం యేమిలేదు. పుట్టనిచావనిది తనకుతానే స్వతసిద్ధమైయున్నది. దానికి ప్రయత్నంలేదు మూలంలేని

యీగుత్తారిగేశరీరం యేమిలేదు. అని పరిహరిస్తెసరి సుఖంవున్నది తనకు తానే స్వతసిద్ధమైయున్నది. దానికి జ్ఞానంలేదు కర్మాలులేవు, యీశరీరమే జ్ఞానకర్మస్వరూపం యీశరీరం లేకమునుపే మొదలు కొనలేక రాకడపోకడ లేక పుట్టనిచావనిది సకలదేశాలయందు సార్వకాలాలయందు సమస్తమయిన వస్తువులయందు సార్వకాలం చలించక వక్కతీరుగా దనకుతానే స్వతసిద్ధమై యెన్నటికి శరీశంలేకయున్నది.

అందులోనే మూలంలేని యీగుత్తారినే శరీరంవున్నది యిది అదికాదు, అది యిదికాదు. పర్వతానకు ఆవగింజకు యెంతయెక్కువ తక్కువో అంతయెక్కువతక్కువ సరేకాని మూలంలేని యీగుత్తారిగే శరీరానకు వున్నసామర్థ్యం పుట్టనిచావనిదానికిలేదు. చూడబోతె మొదలు యేమిలేదు కొనకుయేమిలేదు. వున్నంతసేపు ఆడది మొగవేషంవేశి మొగవాడనిపించుకున్నట్టు చేస్తుంది. మొగవాడువచ్చి విచారిస్తె యప్పటిఆడదె యిక్కడ గురుసాంప్రదాయం దొడ్డది. అయినా యీమూలంలేని గుత్తారిగేశరీరం యేమిలేదు. కలలోయేనుగ మేలుకుంటె యెలాగో ఆలాగె మూలంలేని యీగుత్తారిగేశరీరం వాదశూన్యమాయ యప్పటిపరిపూర్ణంవుండే దానికి శరీరం రానులేదు. పోనులేదు. సకలభ్రమలు శరీరంతోటి వచ్చినవి. శరీరంతోటెపాయ వున్నంతసేపు వకటితప్పదు. సర్వంవుంది సర్వంశరీరంతోటి పోతుంది శరీరంలేనిది వుండిలేదు లేకపోలేదు. సర్వకాలం వక్కతీరె కలలోయేనుగ యీశరీరంపొక్కటె లుది యేమిలేదు అదియేమి లేదు రెండులేకుంటె వున్నదేవున్నది శరీరంలేనిదేవున్నది.

శి॥ శాభాసు సరెసరే యేమితెలుసుకుని నీకుచెప్పాదును అన్నా యేమి గురుస్వామికి తెలియవలెగాని మల్లా పలికేటందుకు నాకుతోచదు నీవుయేది అయివున్నావో అదేనేను అన్నావు సరేకాని నాకే యెక్కడ తోచదు.

గు॥ నీవు సార్వకాలం వ్యవహారంచేస్తు వున్నావా లేదా.

శి॥ యేమి అనాకు లెస్స తెలియదు.

గు॥ అట్లైతే అనుమాన మెందుకు.

శి॥ మొదలుదొరకదు, కొనదొరకదు.

గు॥ నీవు యేలాగు తెలుసుకున్నావు.

శి॥ నేను తెలుసుకొన్నట్టు నాకుతోచదు.

గు॥ అట్లైతే యేలాగువున్నది. నీవు యేలాగు అయినావు.

శి॥ నేను యేలాగు అయినా నేను యేమికాలేదు.

గు॥ అట్లైతే నీవు యేమి.

శి॥ అన్నా నాకుతోచదు నాచేతకాదు. అందుకు బహుసమర్థులు కావలె చెప్పేదికాదు. చదువుకొనేదికాదు.

గు॥ రెండు మూలంలేని యీాగుతేంరిగేశరీరం చావనేకాని పుట్టని చావని పరిపూర్ణంచెప్పదు వినదు యెరుగదు. అది శరీరాకారముకాదు. మూలంలేని యీాగుతేంరిగేశరీరం అదికాదు. అది శాశ్వితమైనది. యిది వున్నట్టు వుంచుంది అగ్ని హోత్రమువలె చూస్తుండగానే యేమిలేదు. సకలదేశాలయందు వున్నదానికి సార్వకాలం వక్కటీరే సార్వకాలాల యందు వున్నదిగనుక వక్కటయినా వికారంలేరు. సమస్తమయిన వస్తువులు అందు లేవుగనుక సర్వకాలం నక్కటీరే వస్తువులయందువుండేవి వస్తుఫలతోకూడా యేమిలేదు. అన్యవస్తువు పుట్టనేరదు. మొదలు యేమి లేదుగనుక కొనకుయేమిలేదు. మూలంలేని యీాగుతేంరిగేశరీరం అన్య వస్తువువలెనున్నది. నిప్పువంటిదిగనుక వున్నంతసేపు వున్నట్టె వుంచుంది కొనకుయేమిలేదు గనుక మూలంలేని యీాగుతేంరిగేశరీరం అన్యంకాదు. అదికాదు యేమిలేదు. దీనికి సామర్థ్యం విస్తారంగనుక అబ్బా అనిపించు కుంచుంది ధీరులకు కలలోయేనుగ మేలుకుంటె యేలాగో అలాగే సూచన చేసేటప్పుడు యేమిలేదు.

శి॥ ఆటుతరువాత.

గు॥ అంతా పపూర్ణమే యీాశరీరం చిదగ్నిగనుక యెన్నటికి నమ్మ కూడదు. మహానమ్మించి చూస్తుండగానే యేమిలేకపొయ్యేది యిది వున్నది అనుకున్నా శక్యంగాదు. మూలంలేని యీాగుతేంరిగేశరీరం యేమిలేదు. అని అనుకున్నవాడే సకలభ్రాంతిరహితుడు అవుచాడు పరి

పూర్ణము స్వతసిద్ధమయివున్నది. దానికే యత్నంచేయటమే దీనికి విఘ్నం యత్నంచేసేదాన్ని తీసివేయడమే ప్రయత్నం.

శి॥ అదియేది.

గు॥ మహాగుహ్యం మూలంలేని యీగుతేఃరి గేశరీరం యేమిలేదు. యింతకంటె అధికములేదని యీగురువాక్యం.

శి॥ గురుపరంపరా ప్రాప్తిఅయింది. దీన్నినిల్పేవాడు నిల్పుకునే వారింతకంటే వేరేభ్రాంతికులులేరు. వారేవికారస్వరూపులు ఛీ ఛీ ఆవాక్యంమాకు యన్నటికిపట్టదు.

గు॥ మూలంలేని యూగుతేఃరిగేశరీరం యేమిలేదు మూడు కాలాలయందు కాలాకువెయ్యిచొప్పున ప్రతిదినమందు జపంచాయవలె చేస్తే కృతకృత్యుడు అవుతాడు యిదిగాక మరివకటితగిలెనా మునిగితేలడు యింతకంటె అధికంలేదు.

మొదలుకొనలేనిది, పుట్టనిచావనిది, రాకడపోకడలేనిది, సార్వకాలం వకటేతీరుగాయున్నది. అచలంగనుక శరీరం యెన్నటికికాదు. కలలో అనేకశరీరాలు వస్తావి వాటికిమూలం యెన్నటికిలేదు. సకలదేశాల యందు వున్నది. యీశరీరానకు మూలంకాదు. సమస్తమయిన వస్తువుల యందువున్నది. యీశరీరానకు మూలంకాదు మూలంలేని యీగుతేఃరిగే శరీరమే అనేకకోటి బ్రహ్మాండాలువున్నవి అని భ్రాంతి పెడుచుంది. నాకు మూలంలేదని యవ్వరితోటిచెప్పదు. అందరు తానే అయివున్నది. యింత కంటె కౌతుకంలేదు. అందుకె చూచినగురువు అల్లాపనికిరాడు. యీశరీరా నకు మూలంయేమిలేదని చెప్పేగురువుకావలె వున్నప్పుడు వున్నట్టెవుంచుంది చూస్తువుండగానే యేమిలేదు.

మొదలు కొనలేనిది పుట్టనిచావనిదిగనుక సార్వకాలం వకటేకే అందుకే సకలదేశాలయందు సమస్తమయిన వస్తువులయందు తనకుతానే చలించక స్వతసిద్ధమయివున్నది. యెరుకలేనిదిగనుక కర్మాలులేవు. యెరక వున్నా కర్మాలువుంటవిగనుక శరీరమేయెరుక యెరుకేశరీరం వేరే అని వెరిగివిడవండి శరీరం రాకమునుపే పుట్టనిచావనిది మొదలు కొనలేనిది రాకడపోకడలేనిది సకలదేశాలయందు, సార్వకాలాల

యందు సమస్తమైన వస్తువులయందు తనకుతానే స్వతసిద్ధమయి చలించక సర్వకాలం ఒకతీరుగానే యున్నది. గురువాక్యంచాత భ్రాంతిరహితం అయితె సరి.

మూలంలేని యీగుత్తెరిగేశరీరం యేమిలేదు యిదిలేకుంటె అది స్వతసిద్ధం వున్నదోలేదో అని దర్శ్రదంవిడవలేరు విడిసె చస్తామంటు విడవరు. వారివలె అనుమానంలేదు. పుట్టనిచావనిదాన్ని వుండజూచి మూలంలేని యీగుత్తెరిగేశరీరం యేమిలేదు అని నిశ్చయంవుంటె చాలు.

యేసాధనవద్దూ యేసాధనాచేసినా దేహమనేశరీరం విడవదు. మెరుకఅనే నిప్పుకాలుస్తువుంటుంది. మెరుకకంటె వేరేనిప్పులేదు. చిదగ్ని దేహాల సర్వకాలం చిత్తుఅనే చింత నిప్పువలె గాలుస్తుంది. సమస్తమయిన శరీరాలు మెరుకతోకూడ వచ్చినవి. మెరుకతోకూడా యేమిలేదు. సార్వకాలం అచలమేవున్నది. శరీరంలో కొంతనిబద్ది కొంతఅబద్దం అనేది అన్యాయం అందుకేగురువాక్యం మూలంలేని యీగుత్తెరిగేశరీరం యేమిాలేదు. అని వాక్యంవచ్చింది. చలనములేకుంటె అచలమే స్వతసిద్ధం. చ చలం మూలంలేని యీగుత్తెరిగేశరీమేకాని మరి ఓటిలేదు. శరీరంరాశమునుపు వకటైనా వికారంలేదు. శరీరమే వికారస్వరూపం.

యిందులో చొల్లు ఒకతీరుగావున్నది. నోటినిండబొక్కలు చుట్టు వెంటుకలు లోపలనాలుక నోరు మాట్లాడుచున్నది. యీవికారాలు శరీరానకు ప్రత్యక్షంగావున్నవి. శరీరం యేవికారంలేనిది వకటైనా లే[illegible] కడుపులో వికారాలకు లెక్కలేదు. తలలోవికారాలు అనేకము. కా[illegible]లో వున్న [illegible]ప్పులు చెప్పశక్యంగాదు. యిన్నిఅయినా యీశరీరాన్ని మన్నించేటందుకు ఆదరువులేదు. గురువుఅనేసింహం మూలంలేని యీగుత్తెరిగేశరీరాన్ని యేమిలేదనిచెప్పి అచలము తెలిపితె వుండగానే స్వస్తఅయె అందుకే (నగురోరధికం) అని శాస్త్రం మొరపెట్టుచుంది. మూలంలేని యీగుత్తెరిగేశరీరం యేమిలేదు. యిదిలేకుంటె వేది

వున్నదో అదే అచలం కావలెనని యిచ్చవద్దు కాకపోతినని విచారంవద్దు అయితినని అబద్దాలు ఆడవద్దు సార్వకాలం గురువాక్యం మరువకుంటె చాలు.

శి॥ యెటువంటిది గురువాక్యం.

గు॥ మొదలు గురుస్వరూపమే లెస్సవ్రాడ జూడవలె.

శి॥ గురుస్వరూపం యెటువంటిది.

గు॥ శరీరంలేంది; పుట్టనిచావనిది, మొదలుకొనలేనిది, రాకడపోకడ లేనిది, సకలదేశాలయందు చలించకవున్నది. సార్వకాలాలయందు జ్ఞాన ఖర్మాలులేక వున్నది, తనకుతానే స్వతసిద్ధమయి చలించకయున్నది. గురు స్వరూపం అటువంటిది.

గురుస్వరూపములోనే మొదలు యేమిలేదు కొనకుయేమిలేదు. మధ్య తనకుతానే శరీరంవచ్చి యెక్కడతోచకవున్నది. వుండగానే వక్క మనిషివచ్చి యిదేగురుస్వరూపమనీ కండ్లుతెరచి చూడమనె.

శి॥చూచినతర్వాత విస్తారమయిన గురురూపము వున్నదిగదా అనె యెక్కడచూచిన అదేవున్నది అనె.

గు॥ మూలంలేని యీసుతెంరిగేశరీరం యేమ్మిలేదు. యీగురు వాక్యం సర్వకాలము మరువకవుంటెసరి. యీశరీరంచాత.. యీవాక్యం తప్పవిడిచి మరివకటి అభ్యాసంచాయకు సర్వకాలం వున్నదేవున్నది. నేను యేమిఅనె.

శి॥ వున్నది యేతీరుగావున్నదో ఆతీరుగావుంచ సరీరం గురువు యెపుడు శ్రవణంచేసినాడో అపుడులేదు యెదివున్నదో అదేవున్నది.

గు॥ సర్వకాలంవక్కతీరు వున్నదానికి శరీరంరానూలేదు పోనూ లేదు. బాటతొలగివుండి బాటమళ్ళ రాజమార్గంఅయె దరవాజతీస్తెసరి దరవాజవేస్తె బాటదొరకదు దర్వాజతీసే గురువుకావలె శిష్యులు మూర్ఖులుకాకపోవలె యిద్దరు మంచివారు అయితె బట్టబయలు అయి పొయె యిక అతకదు. మూలంలేని యీగుతెంరిగేశరీరం రాజద్వారం యీదరువాజవేస్తె రాజదర్శనం కానేరదు. యీదరువాజతీస్తె రాజ్యం నిండారాజె ఈదరువాజ వేసేవారేకాని తీసేవారులేరు. దరువాజవేసుక

వున్నావారు అనేకకోట్లువున్నారు. యీదరువాజదాటేది మహాకఠినం సులభం గురుకటాక్షంలేక శక్యంకాదు. శాస్త్రీలు యీదరువాజకు అనంతమయిన తాలాలువేసి చేతులుదాచుకున్నారు. అన్ని తాలంచేతులు గురువుదగ్గిరవున్నవి. ఆయనా వెయ్యగలడు తియ్యగలడు.

మతాలవారు దరువాజకు పూజచేస్తువున్నారు. యెన్నటికయినా దాటేమని నమస్కారాలు చేస్తువున్నారు. దరువాజలోపల వున్నాడని కొందరికిఆశ చెక్కలోపల వున్నాడని కొందరికిఆశ గడపక్రింద వున్నాడని కొందరికిఆశ తాలంబుర్రలో వున్నాడని కొందరికిఆశ తినేవాడు స్వామిఅని కొందరికిఆశ ముంతచేతబట్టుకొని పొయ్యేవాడు స్వామిఅని కొందరికిఆశ.

ఛీ ఛీ అది మంచిదికాదు. దాహానికి పుచ్చుకొనేవాడుస్వామి, మూత్రంచేసేవాడుస్వామి అయితాడా ఛీ అది మంచిదికాదు.

మందికి యిటువంటి వెర్రివున్నది.

శి॥ నేను యేమియెరుగ అందుకే గురువాక్యంతోటి సమాసమయింది యేమిలేదు. మూలంలేని యీగుత్తెరిగేశరీరం యేమీలేదు. అని వినంగానే అచలం తనకుతానే స్వతసిద్ధమయియున్నది.

గు॥ యింకా యేమయిన ప్రయత్నం చేయవలెనా,

శి॥ యేమిలేదు శరీరం యేమిలేకుంటె ప్రియత్నం యేమిటి చేతచేయ స్వతసిద్ధమయి వున్న దానికి ప్రయత్నం యందుకుచాయ అది నేను అవుచానా నేనుఅది అవుచానా వున్నపరిపూర్ణంకాక నేను వేరే వున్నానేమొ అని అనుకున్న మూలంలేని యీగుర్తెరిగే శరీరమే నేను అనుకున్నట్టుకాక నాకంటెమునుపె తనకుతాన స్వతసిద్ధమయి చలించక యున్నది. అదినేనుయెరుగ నేను అందులోనేవున్నాను. అదినన్ను యెరుగదు నాకంటెవేరే.

గురు॥ మొదలుకొనలేక రాకడపోకడలేక పుట్టుచావులేక సకల దేశాలయందు, సార్వకాలాలయందు, సమస్తమయిన వస్తువులయందు, గుర్తెరుగుటం ఖర్మాలులేక తనకుతానే స్వతసిద్ధమయి చలించక సార్వకాలం వకటీరుగానేవున్నది. యీశరీరం వున్నట్లెవుంచుంది. చూస్తు

వుండగానే యేమిలేదు. పుటనిచావనది శాశ్వితంగ అలాగెవున్నది. శరీరం వున్నపుడు శరీరం నవ్వితేనవ్వదు. శరీరం మాట్లాడితె మాట్లాడదు. శరీరం వుంటేవున్నది. ఒకవేళ శరీరం యేమిలేదు. అది యెప్పటివలెనె వుంటాది. యీబట్టబయలు శరీరంవున్నా చచ్చినా వొక్కతీరుగా వుంచుందా వుండదా.

శిష్యు॥ శరీరానికి దానికి యేమిసంభంధం యిటువంటివి కోటిశరీరాలు వచ్చినావున్నా చచ్చిన యీబట్టబయలుకు యేమిచింతలేదు.

గురు॥ మూలంలేని యీగుతెంరిగేశరీరం దానసంమ్మంధం అయినవికాదు. దానిప్రేత్యం యీపత్తులేదు. అది శాశ్వతమైన పదార్థం జ్ఞానఖర్మాలను యెరుగనే యెరుగదు. యీశరీరానకు మూలం యేమిలేదు. ఆగంతుకంగా తనకుతానే వచ్చింది. వుండేది వెంటనే యేమిలేదు. తనకు తానే స్వతసిద్ధమయవున్న అచలం వక్కతీరుగా వున్నది. దీనిజోలి దానికి పట్టదు. దానిజోలి దీనికిపట్టదు. మూలంలేని యీగుతెంరిగేశరీరం యేమిలేదు కొనకు యేమిలేదు. మెర్పువలె మెరసి వెంటనే యేమిలేదు. మూలంలేని యీగుతెంరిగేశరీరం నేను అని వున్నవారికి సుఖదుఃఖంకద్దు. శరీరములేకనే తనకుతానే స్వతసిద్ధమయి వుంచుంది. వక్కటయినా భ్రాంతివుండదు. మొదలు కొనలేనిది బట్టబయలువున్నదా లేదా దీనికి అనుమానమా.

శి॥ యిది యెక్కడికి పోచుంది శాశ్వితంగా యెప్పటికి వుంచుంది. మూలంలేని యీగుతెంరిగేశరీరం యేమిలేదు. బట్టబయలు యెప్పటికి వున్నది. యిందుకు సంశయంలేదు.

గురు॥ యిక వకవాక్యం మహారహస్యం తలకొట్టిన వకరితో అనాదు. తాను మరువకూడదు. దీనికంటె ద్రోంవాక్యంలేదు. కలలో యెంతపెద్దయేనుగ అయినా కాని శాశ్వతంగా వుండదుగదా కలలో యెంత మంచి స్త్రీ వచ్చినా శాశ్వితముగ వుండదుగదా కలలో భూమండలము చూచినాము, ఆభూమండలము శాశ్వతంగా వుండదుగదా గట్టంత బంగారము చూసినాము అది శాశ్వితముగ వుండదుగదా కలలో మహా చదువుకొన్న మొగవాణ్ణి చూచినాము, ఆమగవాడు ఆచదువు

శాశ్వతంగా వుండదుగదా వచ్చినవాటికి మూలం యేమి లేదుగదా వున్నంతసేపు యెవ్వరి ఆశ లేదుగదా మేలుకోంగానే అవి అన్ని ప్రవేశించే దానికి స్థానం యేమిలేదుగదా ఆలాగేమూలంలేని యీగుణత్రారిగే శరీరానకు మొదలు యేమిలేదు. కొనకు యేమిలేదు. వున్నపుడు యీశరీరానకు దిక్కు యెవ్వడూలేదు. తనకుతానే తిప్పలుపడవలె యీశరీరానకు కారకుడున్నంటె ధైర్యం వుండనేవుండదు దిక్కుమాలింది. యీశరీరానకు కలలోవచ్చిన యేనుగును యినుప గొలుసులతో కట్టి వేసుకుంటె వుండనట్టె తండ్రి కొడుకును నమ్మ్రతాడు. తల్లి బిడ్డను నమ్మ్రచుంది. భార్య మొగణ్ణి నమ్మ్రచుంది. మొగడు భార్యను నమ్మ్రతాడు. వకణ్ణి వకరు నమ్మ్రకొని వున్నమాత్రమే కలలో మేలుకుంటె యేలాగు యేమీలేదో ఆలాగే.

యేదైన వొక రోగం మించివస్తె యీశరీరము యేమిలేదు. కలలోవచ్చిన శరీరం కొంతవుండి కొంతపోదుగదా ఆలాగే యీశరీరం కొంతవుండి కొంతపోదు. వచ్చేటపుడు యెంతవచ్చిందో అంత యేమి లేదు. స్వప్నంలోవచ్చిన శరీరం పుణ్యం పాపం చేసిందా లేదా అవ్వి అన్ని వ్రాసుకున్నవారు యెవ్వరు. ముందర విమర్శ చేసెవారెవ్వరు. అది వేరే యిదివేరేకాదు. వకటె వ్యాపారం పునికినక్కతీరె కొనకు యేమి లేదు. యీలాగు అన్నిశరీరాలకు సమానమే పుట్టినవి మళ్లిపుట్టవు. కలకు మరిమీదచేసేవారు యెవ్వరులేరు. కల యెవ్వరిస్వాధీనంలేదు. అందుకే యీజగత్తుకు దిక్కులేదు. యెవ్వరికి యేలాగు అనుకూలం అవ్వుతె ఆలాగే యెవ్వరెవ్వరి నమ్మలమే మతంయేమరియాద నిలుపదు ఆదరువు లేనిదిగనుక.

న్యాయం నమ్మరాదు, అన్యాయం నమ్మరాదు.
ఆచారం నమ్మరాదు, అనాచారం నమ్మరాదు.
ధర్మం నమ్మరాదు, అధర్మం నమ్మరాదు.
కీర్తినమ్మరాదు, అపకీర్తినమ్మరాదు.

యీశరీరానకు మొదలు యేమివుండేది అని యెవ్వరువిచారించరు. తనకు తానేపుట్టి తనకుతానే కొనకు యేమిలేదు. యీలాగు

నిశ్చయంవుంటె వున్నపుడు వ్యవహారానకు కర్త లేదు కారయిత లేదు, వున్నంతసేపు మూలంలేని యీగుత్తెరిగేశరీరమే కర్త. మూలంలేని యీగుత్తెరిగేశరీరమే చేయిస్తుంది. సమస్తమైన వ్యవహారాలకు మూలం లేని యీగుత్తెరిగేశరీరమే కాని మరివకటిచెయ్యదు చేయించదు.

మొదలు కొనలేనిది రాకడపోకడలేనిది. పుట్టనిచావనిది యెన్నటికి శరీరంలేనిది, సకలదేశాలయందు, సార్వకాలాలయందు, సమస్తమైన వస్తువు లయందు, చలించక తనకుతానే స్వతసిద్ధమై సార్వకాలం వకటీరుగా వున్నది. దాన్నివుండజూచి మూలంలేని యీగుత్తెరిగేశరీరమేమిలేదు అని ధృఢంవుంటె చాలు.

పుట్టనిచావనిదే గాక శక్యంగానిది వకవింతవున్నది.
ఆవింతకు మొదలు యేమిలేదు. విచారిస్తె కొనకు యేమిలేదు.
ఆవింతనేను అని తగిలింది.
ఆవింతను వదలించుకున్నవాడు భ్రాంతిలేనివాడు.
ఆవింత మూలంలేని యీగుత్తెరిగేశరీరమేకాని మరివకటికాదు.
సర్వం మూలంలేని యీగుత్తెరిగేశరీరముతోటె వున్నది.
మూలంలేని యీగుత్తెరిగేశరీరంతోటి సర్వం యేమిలేదు.

వున్నది తనకుతానే స్వతసిద్ధముగు వున్నది గనుక ప్రయత్నం యీమత్తులేదు. గురువాక్యంకంటె యెక్కువలేదు శరీరమునేదరవాజ తీసి వెయ్యనిగురువు పనికిరాడు. యిది ఆత్మ ఇది అనాత్మ అని సఘునిబద్ధి సఘుంఅబద్ధం అని చెప్పిన ఆయనే దొంగగురువు.

జ్ఞానందొడ్డది దేహాదిపదార్థాలను గుర్తెరిగేవాడవునీవు. అని చెప్పిన ఆయనే అజ్ఞాని. నేను యెరుగుదు నేనుయెరుగ అనెజ్ఞానికే అజ్ఞానం వున్న దిగనక జ్ఞానజ్ఞానంవకటె వుంటె రెండువున్నవి. లేకుంటె రెండులేవు, మూలంలేని యీగుత్తెరిగేశరీరం యెప్పుడులేకుంటె అప్పుడే అచలం స్వతసిద్ధం అయివున్నది.

శ్రు॥ 'నిత్యస్సర్వగతస్థాణురచలోయంసనాతనః' శ్రు॥ 'అయమచలః' శ్రు॥'నిత్యంసర్వగతఃస్థాణుసనాతనః' శ్లో॥అయమిత్యత్ర ఆత్మేతికే చిదిచ్ఛతి

తదసత్ జీవభూత క్షేత్రజ్ఞస్వరూప పరాపకృతి స్వరూపత్వాత్ ప్రకృతి ర్నామ కింశరీరమిత్యర్థః॥'

అందుకే గురువాక్యం మూలంలేని యీగుత్తేరి గేశరీరం యేమీ లేదు అని రాద్ధాంతం రాద్ధాంతమే సిద్ధాంతం.

ఇతి శ్రీమద్గురు శివరామదీక్షిత పరిభావే వేదాంత విచారణే
దేహదేహోపాదిద్వైత దోషరహిత ప్రకరణము
సప్తమోధ్యాయః..

---

శ్రీగురుభ్యోనమః.

# ౮॥దృగ్దృశ్యోపాదిద్వయ దోషరహితప్రకరణం॥

శ్లో॥ అబీజంవృక్ష సంపన్నం । శాఖాపల్లవ వర్జితం ।
పుష్పంనాస్తి ఫలంనాస్తి । పరిపూర్ణం వృక్షసంకులం॥

మూలంలేని యీగుర్తేరి గేశరీరం ఏమీలేదు అనే సిద్ధాంతమే సహస్ర సిద్ధాంతం.

యీగు త్తేరి గేశరీరానకు బీజంవుండెనా యీగు త్తేరి గేశరీరం ప్రమాణమే యీగు త్తేరి గేశరీరమునకు బీజంలేకుంటె యింతకంటె అప్ర మాణము వేరేలేదు. యీగు త్తేరి గేశరీరం ఏమిపలికిన అప్రమాణాలె.

శృ॥ "అయమలః అజః నిత్యంశాశ్వతః పురాణః
శృ॥ అయమచలః అచ్ఛేద్యః అదాహ్య అక్లేద్యః అశోష్యః"

చలించే యీగు త్తేరి గేశరీరానకు చలించక సార్వకాలము వకటే తీరుగా సకలదేశాలయందు, సార్వకాలాలయందు, సమస్తమయిన వస్తు వులయందు, తనకుతానే స్వతసిద్ధమయి వున్న దానికి జ్ఞానకర్మాలులేవు. వక్కటైన వికారములేదు. యీగు త్తేరి గేశరీరము అదికాదు. అది

యీగుత్తేరిగే శరీరం కాదు. మూలంలేని యీగుత్తేరిగే శరీరం యేమి లేదు. సార్వకాలం పక్కతీరుగానే వున్నది.

శిష్యు॥ రెండువున్నవిగనుక ఒకదానిచేత ఒకదాని సాధించనా.

గురు॥ శరీరములేనిది పక్కేవున్నది. యీనసించే శరీరానకు మూలం యేమిలేదు గనుక వున్నట్టువున్నా యేమిలేదు. విచారించి యేమిలేదు. యీగుత్తేరిగే శరీరంయొక్క నిర్ణయంఅవ్వుతే సమస్తనిశ్చయాలుఆయె మొదలునిబద్ధిఅయితే అంతసిబద్ధె మొదలు యేమిలేకుంటే కొనవేళ్లు యేమిలేదు. యప్పటిపరిపూర్ణమే వున్నది. అదిలేదు నేడ లేదుఅన్నా వున్నది. మూలంలేని యీగుత్తేరిగే శరీరం వున్నదన్న యేమి లేదు. యిఘు అతకదు. యీదగాకూతలనుంచి యేమిలాభము వున్నది వున్నట్టువిచారించినవారు దొడ్డవారు. లేనిది వున్నది అని వున్నదిలేద అని అంటె యెవరికి భ్రాంతితిరుగక క్లేశపడితె ఆక్లేశం అబద్ధాలు ఆడినవారి మరి వఘరికి కాదు.

వూరికె వున్నది వున్నదనిచెప్పి లేనిది యేమిలేదనిచెప్పితె యేమి పాయె అందుకే చదువుకున్న పాపాత్ములకంటె వూరికేవున్న రాళ్లునయం గుంజలునయం, పశువులునయం కన్నులున్నవాడు, గుడ్డివాడు సమానమాయె. యిద్దరిదివక్కలె గుర్తెరుగుటంగనుక వున్నది వున్నద లేనిది యేమిలేదు. అని చదువుకున్నవాడు యెరుగకపాయె శ్రీగురుసాంప్రదాయం లేని చదువెందుకు యంతవారికి దేహాభిమానం బరువుగావుంచుంది. అందుకే వున్నది వున్నట్టుపడదు మూలంలేని యీగుత్తేరిగే శరీరం యేమిలేదు. అని సార్వకాలం అభ్యాసం చేసేవారికి పుట్టనిచావని బట్టబయలు అరచేతిలో వుసరికాయవున్నట్టు వుంచుండి. శీఘ్రంగా భ్రాంతిరహితం అవుచుంది గురువుదగ్గర వున్నకొద్ది ఘట్టి.

శరీరంలేని గురువుకావలె శరీరంలేక యేలాగువున్నదో అని చూచి నేర్చుకోవలెగాని అడిగిచెప్పితె సాధ్యంకాదు. అటువంటివారి సహవాసం చెయ్యవలె యిదియేరహస్యం చూస్తె శరీరంవున్నట్టె వుంచుంది అన్యదృష్టికి స్వదృష్టిచేతలేదు. యేమిలేనివారు శరీరంలేకనే సకలప్రయోజనాలు చేస్తరుగనుక వారే క్రియాశూన్యులు వారికే చేసేటం

శరీరంలేదు, విడిచేటందుకు శరీరంలేదు, యేమిలేదనేటందుకు శరీరంలేదు, సర్వకాలం శరీరం లేకనేవుంటారు. గనక వారే పరిపూర్ణులు, వారే బంధమోక్షరహితులు, వారే జ్ఞానకర్మరహితులు, వారే జన్మ భ్రాంతిలేనివారు, వారే పుట్టనిచావనివారు, వారే రాకడపోకడలేనివారు, వారే మొదలు కొన లేనివారు, వారే సకలదేశాలయందు చలించక యున్నవారు, వారే సార్వకాలాలయందు వక్కతీరుగ వున్నవారు, వారే సమస్తమయిన వస్తువులయందు వున్నారు. వారే సకలవస్తువులను స్పృశించక యున్నవారు, వారే కర్తలుగాక, కారహితులుగాక యున్నవారు. వారికి బదులు యెవరులేరు వారేవారు.

అందరు పరిపూర్ణులేకాని మూలంలేని యీ గుర్తెరిగే శరీరం నేను అని నమ్మియున్నవారు గనుక వారికంటే నీచులు లేరు, వారికంటే పాపాత్ములులేరు, సకలకులాలవారు వక్కటే. పశువులకు, మనుష్యులకు సంభాషణమాత్రమే యెక్కువతక్కువ. పశువులు పవిత్రం. మనుష్యులు చెడిపోతే పంచకవ్యము పుచ్చుకుంటే పవిత్రులు అవుతారని వున్నాది. లోకాచారం పశువులు యేలాగు నడిచిన పాపంలేదు. పశువులు చదువుకోలేదు గనుక చదువుకుంటేగాని యిది విహితం అది అవిహితం అని తెలియదు. తెలిసి నడవకున్నాసరే యింతే. మనుష్యులకు, పశువులకు యెక్కువతక్కువ నడత సమానమే. మూలం యెవ్వరికి యేమిలేదు. అవాంతర దొరతనం.

యీ గుర్తెరిగే శరీరానకు మూలం యేమిలేదు. కొనకు యేమిలేదు. వున్నంతసేపు సకలతిప్పలబడి నానామార్గాల నడిచి నానా భ్రాంతులబడి కొనకు యేమిలేదు. అదే సత్త కలది ఆయ. వున్నట్టేవుండే యేమిలేక పాయ. పుట్టనిచావని అచలం హాటి పుట్టి చచ్చేది హాటి, అని రెండు యెన్నడులేవు. సార్వకాలం వక్కటేకాని యిది వున్నట్టు భ్రాంతి కద్దు. విచారించనివారికి అత్యంత గురు సాంప్రదాయ రహితులకు.

వున్నట్టు పడకుండ దొంగత్రోవలు మూలంలేని యీ గుర్తెరిగే

శరీరమే చేసిపెట్టింది. వాటి అన్నిటిని తీసివేసి దరువాజ తగులబెట్టి రాజ బాటచేసి గురువు దొరికెనా అప్పుడే వక్కటైన భ్రాంతి వుండక కృత కృత్యుడవుచాడు. యే సిద్ధాంతం నమ్మినా బుద్ధిదలో గుంజ వున్నట్టు వుంటాడు. దేహమనే దరవాజదగ్గర కావలివాడు అయ్యివుంటాడు ఆవలికి పోలేడు, తాళం వున్నాదికనక ఆవలికి రాలేడు. కడుపులో యెముడుకవలె గుర్తెరుగుచు వుంటాడు. గురుస్వామిని వెతుక్కోలేడు. అందరు గురువులే అనుకున్నాడు.

జ్ఞానమును బోధించినవాడు గురువుకాడు.
భక్తిని బోధించినవాడు గురువుకాడు.
వైరాగ్యముసు బోధించినవాడు గురువుకాడు.
దేవతాభ్రాంతి బోధించినవాడు గురువుకాడు.
శ్రవణము చేయించినవాడు గురువుకాడు.
మననం చేసినవాడు గురువుకాడు.
ధ్యానము చెయ్యమని చెప్పినవాడు గురువుకాడు.
యెన్ని అని వ్రాతు జన్మభ్రాంతి లేకుండచేసినవాడు గురువు.
వున్నది వున్నట్టు తెలిపినవాడు గురువు.

లేనిది వున్నది అని వున్నది లేదని చెప్పినవాడు వేషదార్లుగాని తమరు దాటలేరు. మరి వఘరిని దాటెంచల్లేరు. లోకుల చెరుస్తువుంటారు. ఘట్టివాడు యెవడిని నమ్మడు. చూచిచూచి సహవాసం చెయ్యవలె. రాజమార్గం అయింది పిల్లబాట అయింది. చూడవలె చూచి విచారిం చెనా అటుతర్వాత యేది రుచివుండదు.

మొట్టమొదట పుట్టనిచావని జాడ కనుక్కోవలె.
కనుక్కోని యీ దేహపు వర్తమానం అడుగవలె.
యీ రెండేకాని మూడోముచ్చట వద్దు.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం చంచలం. యీ శరీరం దేని యందు వున్నదో అది అచలం. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం అచలాన్ని స్పృశించక యున్నది. ఆ అచలం మూలంలేని యీ గుర్తె

రిగే శరీరాన్ని తగలక వున్నది. దాని ప్రేక్ష్యం దీనికి లేదు. దీని ప్రేక్ష్యం దానికిలేదు. దానికిందిది యిదికాదు. దీనికిందిది అదికాదు. అది శాశ్వితంగా వుండేది యిది యేమిలేదు. వెనకయేమి లేదు, ముందర యేమిలేదు, వున్నట్టువుండేది వెంటనే యేమిలేదు. విత్తనములేని చెట్టు యింత నమ్మతగంది యేదిలేదు. మూలంలేని యీ గుర్తెరిగే శరీరము అనేక అవతారాలు యెత్తినదట. పుట్టనిచావని అచలం యెన్నటికి పుట్టదు చావదు. యీ బట్టబయలు వున్నదాలేదా.

శి॥ వున్నది.

గు॥ యీ బట్టబయలుకు పుట్టుట చచ్చుట వున్నదాలేదా ?

శి॥ యీ బట్టబయలుకు పుట్టుటలేదు చచ్చుటలేదు.

గు॥ యీ బట్టబయలుకు మొదలు కొన వున్నదా లేదా ?

శి॥ ఆ బట్టబయలుకు మొదలు కొనలేదు.

గు॥ యీ బట్టబయలుకు రాకడపోకడ వున్నదా లేదా ?

శి॥ ఆ బట్టబయలుకు రాకడపోకడలేదు.

గు॥ యీ బట్టబయలుకు శరీరం వున్నదా లేదా ?

శి॥ యీ బట్టబయలుకు శరీరం యెన్నటికి లేదు.

గు॥ యీ బట్టబయలుకు చెయ్యటం చేయించటం వున్నదాలేదా ?

శి॥ యీ బట్టబయలు చెయ్యదు చేయించదు.

గు॥ యీ బట్టబయలుకు వక్కటైన వికారం వున్నదాలేదా ?

శి॥ యీ బట్టబయలుకు వక్క వికారము లేదు.

గు॥ సార్వకాలం వక్కతీరుగావున్నదా మరివకతీరుగా వున్నదా ?

శి॥ సార్వకాలం యాలాగువున్నదో ఆలాగే వుంచుంది.

గు॥ యీ బట్టబయలు సకలదేశాలయందు సమంగ వున్నట్టు వున్నది. యీ శరీరంవలె కాదుగదా ?

శి॥ యీ శరీరాన్ని క్షణమయిన నమ్మరాదు. నమ్మినవారిని చెరిచేది మూలంలేని యీ శరీరం వంటిదగాది యేమీలేదు. యీ బట్టబయలు సమస్తదిక్కుల వున్నాది. శరీరాలలోపట లేదు, బయటలేదు,

ఆ బయలు చొరచొరదు వెళ్ళవెళ్ళదు తనకుతానే చలించక స్వతస్సిద్ధమయివున్నది. యెన్నటికి వకతీరే ఆకలిలేదు దప్పిలేదు యెన్నటికి భోం చెయ్యదు మాటాడదు తలలేదు కాళ్ళులేవు అందుకే గురువాక్యం మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు అని శిద్ధాంతం. శిద్ధాంతమే రాద్ధాంతం.

ఇతి శ్రీ శివరామదీక్షిత ప్రిభావే వేదాంతవిచారణే
దృగ్దృశ్యోపాది ద్వయదోషరహితప్రకరణము
అష్టమోధ్యాయః

---

శ్రీగురుభ్యోనమః

# ౯॥ జ్ఞానజ్ఞానోపాది ద్వయదోషరహిత ప్రకరణము

శ్లో॥ నస్వతఃప్రిత్యభిజ్ఞనా । న్నిరంశత్వాన్న చాన్యతః
నచాశ్రియవినాశాన్మే । వినాశస్యాదనాశ్రయత్॥

మూలంలేని యీ గుర్తెరిగే శరీరము యేమిలేదు అని శిద్ధాంతమే రాద్ధాంతము. రాద్ధాంతమే శిద్ధాంము. యీ మూలంలేని గుర్తెరిగే శరీరము మొదలు యేమిలేదు కొనకు యేమిలేదు. యీ శరీరాన్ని యేలాగునన్నా వకవేళ నమ్మితిమి కలలో యేనుగును యినుపగొలుసులతో కట్టివేసుకొని దాణా పెట్టుకుంచు చెరుకు మోపులు కొనివేసుకుంచూ ధర రానతెలిసిని కావలి పండితే ధరవచ్చి రూపాయిల సంచులు అడిగినట్టు యిస్తామనే మంచి సమమానకు మేలుకుంటె యాలాగో అలాగే యీ మూలంలేని గుర్తెగే శరీరం. యింతేకాని మనము అమ్ముకున్నట్టు పడేదికాదు. మొదలు అదరువులేదు కొనకు ఆదరువులేదు. వున్న బట్టబయలుకు యీ శరీరం జోలేపట్టదు.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం అనేక అబద్ధాలు ఆడింది.
నమ్మకపొయ్యేరుఅని శాస్త్రాలు చేసి యింటింటా పెట్టింది.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే అనేకభాషలు నేర్చుకోని సమస్తమైన భాషలచాత గ్రింథాలు రచించి పాంచాలపువారు కౌతుకం నగలు చేసినట్టుచేసింది విచారిస్తేకందు వెండి మెనమిదోవన్నె యేడోవన్నె బంగారుమాత్రం యెక్కడలేదు.

మూలంలేని యీ గుర్తెరిగేశరీరం యేమిలేదుగనుక యిటువంటి శరీరం చాత పుట్టనిచావని బట్టబయయి సాధ్యం అవుచుంది అనియాలాగు నమ్మి. గురుకటాక్షం తప్పవిడిచి యీశరీరంచాత సాధించుతానసే మూర్ఖం విడిచి గురుకటాక్షం శీఘ్రంగా సంపాదించుకోని భ్రాంతిలేక కాలం గడిపినవాడు ధన్యుడు.

యీ బట్టబయలు వున్నదోలేదో అని అనుమానంలేక వుండ జూచి మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదని క్షణమయినా మరువక కాలం గడిపినవాడు భ్రాంతిలేనివాడు అని రాద్ధాంతం. రాద్ధాంతమే సిద్ధాంతం.

సకల శాస్త్రాలు వాడియబోస్తే యీ అభిప్రాయం బైటపడ్డది. యీ అభిప్రాయంచేతనే అనేకమంది భ్రాంతిలేనివారు అయినారు. యిది గాక మరివకటి నమ్మినా భ్రాంతి అధికమయి సుఖదుఃఖ సముద్రములో బడి మునిగి తేలడు.

శరీరంలేని గురుసాంప్రదాయం చూచి శరీరానకు నాకు మూలం యేమి అని అడిగి యీ రెండు వుండజూచుకోని పుట్టనిచావనిది యెక్కడ వున్నది అని అడిగి కోనకు ప్రవేసించేటందుకు స్థానం యేమి అని అడిగి యీ రెండు వుండజూచుకోని పుట్టనిచావనిది యెక్కడవున్నది అని అడిగి నాకు సార్వకాలం వక్కతీరుగా యేలాగు అయ్యా అని అడిగి తెలుసుకోవలె.

శిష్యు॥ క్రియాశూన్యం యేలాగు. జన్మభ్రాంతి యేలాగు. పాశి పోయ్యేని సార్వకాలం శరీరంలేక యేలాగువుండ.

గురు॥ దాండేమి యేమిలేని బట్టబయలులో యేమిలేకవుంటే విచారణకు ఫలం యీ గుర్తెరిగే శరీరంలో కొంచం ఆశపడ్డా వికారం

తప్పదు. యేమిలేనిదానిలో గురువాక్యం చాత యేమిలేకుంటే పరిపూర్ణమే చలించకవున్నది. పట్టువద్దు విడుపువద్దు యేమిలేదని యాలాగంటే అలాగు నడువవలె. సార్వకాలం క్రియాశూన్యమె చేసేశరీరం యేమి లేకుంటె చేశేది యేమివున్నది.

శిష్యు॥ గురువాక్యం వినకమునుపు భ్రాంతివుండె యిపుడు గురువాక్యం మూలంలేని యీ గుత్తేరిగేశరీరం యేమిలేదు అని పరిపూర్ణమైన అఛలమే వుండే, మళ్ళా అడిగేటందుకు ఆశలేదు. యీ శరీరం తీసివేసిన తరువాత యేమిటిచాత అడుగ.

గురు॥ యేమిలేని శరీరాన్ని తెచ్చుకున్నదాక యేమి. అడిగెదాక యేమి. మంచి గురువు ఆయనా మాటే ఆడడు. శిష్యుడు మూఢుడు. ఆయనా మంత్రంచెప్పి తంత్రంలో కలిపితె పాయ. లేకుంటే రుద్రాక్షలు ధరించినా సరే. దొంగశిష్యుడు ఆయనా లింగధారణ చేసేది. మరి మోటు ఆయనా చెక్రాంకితం చేసేది. మరి ఘుట్టివాడు ఆయనా అగ్నిహోత్రాలు చెయించేది. దేవతార్చన చేసుకొమ్మని చెప్పేది. కాశీ నుంచి జగన్నాధం జగన్నాధం నుంచి రామేశ్వరం శీఘ్రంగా పోయి రమ్మని చెప్పేది. వున్నది వున్నట్టు మొద్దులకు తెలుపకూడదు. బట్టబయలు పుట్టని చావ ది అని అందరికి యదార్థమే. యెవ్వరు యెరుగరు. అందరు యీ బట్టబయలులోనే వుండి యీ బట్టబయలు యింత దొడ్డదని యెరుగరు. యీ బట్టబయలు అచలంబని యెరుగరు. యీ బట్టబయలులోనే అందరువున్నారు. యీ బట్టబయలు పుట్టనిచావనిదని యెరుగరు. యేమీలేని మూలంలేని యీ గుత్తేరిగే శరీరం నేను అని జ్ఞానమనే అజ్ఞానంచాత భక్తిఅనే ఆ భక్తిచేత వైరాగ్యమనే రాగంచేత యీ శరీరాన్ని ఘట్టిగా కట్టివేసుకున్నారు. పుస్తకాలనే గుంజలకు యీతేకాని యీ శరీరానికి మూలం యేమిలేదు అని యెరుగరు. కొనకు ప్రవేసించేటందుకు స్థానం యేమిలేదని యెరుగరు. మధ్యవున్నట్టే వుంచుంది. వెంటనే యేమిలేదు అని యెరుగరు, యేమిలేదని అందరికి యెరికె వున్నాది వున్నాగాని నిద్ర అని అబద్ధాలు ఆడుతారు. యేమిలేదుగనుకనే నిద్ర కొంచమున్న కల అనుపించుకొంచుంది. గాఢనిద్రఅంటే యేమి లేదు అనుట. మూలంలేని

యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు అనుట. అభిప్రాయం అలాగే సార్వ కాలంయీ గుర్తెరిగే మూలంలేని శరీరం యేమిలేదు అని నిశ్చయం గలవారు. పరిపూర్ణమనే అచలమే వారు చలించే శరీరం యేమిలేదుగనుక యీ పుట్టనిచావని బయలువలన యీ శరీరం పుట్టలేదుగదా. మరిపోటి మూలం వుండెనా దాన్ని బయటపెడితే తునకల బడ చిన్నవాండ్లే తీశివేస్తారు.

ఆచార్య స్వాములవారు మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే శరీరాలకు మూలం అని గుర్తెరిగే దానికి వికారాలు లేవు అని.

గుర్తెరిగే దానికి కర్మాలు లేవు అని.

గుర్తెరిగే దానికి గుణాలు లేవు అని.

గుర్తెరిగేదే వక్కటే అని.

గుర్తెరిగేది భోంచేయదు అని.

శరీరం వేరే గుర్తెరిగేది వేరే అని.

అందరిచాత భంగపడ్డాను.

గుర్తెరిగే అన్నం తించుంది అని అన్నారు

అందరు గుర్తెరిగే శరీరం అన్నారు.

అందరు గుర్తెరిగేదే అన్నం తింటె అన్నం తించుంది అని అన్నారు.

అందరు యీ మూలంలేని గుర్తెరిగే శరీరమని అన్నారు.

యీ గుర్తెరిగే శరీరం తనకు తానే వచ్చి తనకుతానే యేమిలేదు. యీ పుట్టనిచావని బట్టబయలులో యీ గుర్తెరిగే శరీరం వున్నట్టు వుండేది. యేమిలేకపొయ్యేది స్వభావం. దీన్ని నిల్పేవారు లేరు తీసివేసేవారు లేరు. యేమిలేని యీ బట్టబయలులో యేమిలేని వింతవున్నట్టు వున్నది.

గురుసాంప్రదాయంవలన విచారిస్తే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు పుట్టనిచావని బట్టబయలే వున్నది. సార్వకాలం వక్క తీరే గురుమూలంగ యీ మూలంలేని గుర్తెరిగే శరీరం యేమిలేదు అని వినంగానే అచలం స్వతస్సిద్ధం.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు అని చెప్పంగానే పుట్టని చావనిది మొదలు కొన లేనిది రాకడపోకడలేనిది సకలదేశాల

యందు సార్వకాలాలయందు సమస్తమైన వస్తువులయందు తనకు తానే స్వతస్సిద్ధమై చలించక సార్వకాలం వక్కతీరుగ శరీరం లేకవున్నది.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరంనుంచి సర్వం తోచి యీ శరీరం తోచే అన్ని పోయినవి. వున్నదానికి తోచలేదు. పోనూలేదు. యేలాగు వున్నదో ఆలాగే వున్నది. గురుసాంప్రదాయం దొడ్డది. ఆయనా భ్రాంతిరహితం అవ్వుచుంది. గురుసాంప్రదాయం లేక తన కల్పన ఆయనా మూలంలేని యీ గుర్తెరిగే శరీరం సకల కర్మాలకు మూలం. మూలం లేని యీ గుర్తెరిగే శరీరమే మహాలింగం. యీ మహాలింగమే నకర్త, నారాయణ, అందరు మూలంలేని యీ గుర్తెరిగే శరీరంను మోసు కున్నారు. యెన్నటికైన శీఘ్రంగా శరీరంలేని గురుసాంప్రదాయం కను క్కోని మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యీలాగు వచ్చినదని అడిగి యదార్థంగ చెప్పగా నమ్మి శీఘ్రంగ కనుక్కోవలే. కనుక్కోక శరీరం నిల్పుకోని సాధనచేశెనా కోటి శరీరాలచేతనైన పరిపూర్ణం సాధ్యంకాదు. తనకుతానే స్వతస్సిద్ధమై వున్నదిగనక రెండోది వున్నదంటే రెండో దానికే భ్రాంతి.

యీ శరీరానకు మూలం వున్నది అని అందరు గడ్డితిన్నారు తించున్నారు. శంకరాచార్యులు దేహాది పదార్థాలను గుర్తెరిగే క్షేత్రజ్ఞ స్వరూపమనే పరాప్రకృతిని ఆత్మఅని అబద్దం ఆడి. యీ ఆత్మే పరబ్రహ్మ స్వరూపమని అన్నాడు. అయమాత్మ బ్రహ్మఅనే అబద్దాల శృతి ముందర పెట్టినాడు. అబద్దాలనే లెస్స విచారిస్తాము. గుర్తెరిగే క్షేత్రజ్ఞ స్వరూపమే పరబ్రహ్మ అయితే క్షేత్రమెందుకు? పరబ్రహ్మస్వరూపముకాదు. బ్రహ్మ జగత్కారణంగనుక క్షేత్రజ్ఞస్వరూపమయిన ఆత్మకు బ్రహ్మకు వేరుగానట్టే. బ్రహ్మకార్యమయిన క్షేత్రానకు వేరులేదు. సర్వం బ్రహ్మస్వరూపమే. కార్యకారణాలకు యెన్నటికీ భేదంలేదు. బ్రహ్మసత్యం. జగత్తుప్రేదనుటు యెందుకు.

౧. సర్వం గుర్తెరిగే బ్రహ్మస్వరూపమే. గుర్తెరిగే చైతన్యమనే జ్ఞానస్వరూపం నిబద్ధి. కర్మాలు అబద్ధం అని యెందుకు మొరగవలె.

౨ గుర్తెరిగే శరీరం చైతన్యం నిర్గుణం. శరీరాలు సగుణం అని యెందుకు కయ్యవలె.

3 దేహాదిపదార్థాలను గుర్తెరిగే బ్రహ్మస్వరూపం శాశ్వితమయింది. దేహాలు అసత్తు యేమిలేదు అని యెందుకు వదురవలే.

౪ రెండోది యేమిలేదు. అవిద్యఅని యెందుకు అనవలె.

౫ ప్రకృతి అంటే పరమేఅని యెందుకు అనవలె.

౬ శుక్తియందు రజితం తోచినట్టు తోచినదని యెందుకు అనవలె.

౭ హాటి వున్నది హాటి లేదుఅని యెందుకు అనవలె.

౮ క్షురోపాది అని యెందుకు అనవలె.

౯ అక్షురోపాది అని యెందుకు అనవలె.

౧౦ జగత్తుకు కారణం వున్నంతసేపు కార్యాలు యెందుకు లేక పోవాలి. సరే యీలాగువుండని.

గుర్తెరిగే పరబ్రహ్మమే శరీరమైయుండే. శరీరాన్ని పుట్టించిండే పరబ్రహ్మ సాన్నిధ్యంబువలన ప్రకృతి కల్పించిందే. గుర్తెరిగే పరబ్రహ్మకు వికారాలులేవు అన్నావు. వికారాలు యెవ్వరికి అకర్త అన్నావు, అభోక్త అన్నావు.

రెండో దేమిలేదు అబద్దం రజ్జువందు సర్పభ్రాంతి తోచినట్టు తోచింది. యేమివున్నది అని భ్రాంతి కలకు మూలం వున్నది అనేవారు కలలో వారే. కలలో అన్నమాటకు పాటిలేదు. శంకరాచార్యుల పాండిత్యమునకు పాటిలేదు. కలలో వచ్చిన పురుషుడు నమ్మవలెగాని మరి వొకరు నమ్మేటందుకు ఆశలేదు.

అందుకే శంకరాచార్యులది హా అవతారంగాని వుట్టనిచావని పరిపూర్ణులని అనుకోరాదు. కృష్ణావతారం రామావతారం ఆలాగే.

వుట్టనిచావని పరిపూర్ణులైతే జగత్తుకు మూలం వున్నదని యీలాగు అని యెవ్వరైన అన్న మధ్యవచ్చి మధ్యనే యేమీలేకపొయ్యే అప్రమాణీకుడే ఆడే. వాక్యాలవలె వున్నాదికాని వున్నది వున్నట్టు పడే యుక్తిగాదు. యిటువంటి అప్రమాణంవలన యేమిలాభమోకానీ బహు

శ్రమపడ్డాడు. దీన్నుంచి ప్రజలకు సుఖంలేకపాయ. తనకు మహాపాపం ఘటించే.

జగత్తుకు కారణం వున్నదని పెద్ద అబద్ధం ఆడి అందరిని అడవిలో కల్పి సంకరుల చేసిరి.

శిష్యు॥ వక్కటే వక్కటే అని గుర్తైగే చైతన్యం నిబద్ది అని అందరు వక్కటే అని దేహాలు యేమీలేవు అని సంకర్ల చేశిరి. గుర్తెరిగే శరీరం వక్కటే అని నమ్మినవాండ్లకు నరకం తప్పకపాయ. స్వర్గం యిషు వంటిదే శరీరాలకల్ల వక్కటే. జ్ఞానం నిబద్ది కర్మాలు అబద్దం అనే.

గురు॥ శాభాస్ శంకరాచార్యులవారు జ్ఞానం నిబద్ధి ఖర్మాలు అబద్ధంఅంటే గుర్తెరిగే జ్ఞానం వున్నంతమట్టుకు కర్మాలు వదలనే వదలవు. ఆచార్య స్వాములవారు మహా చదువుకున్న వారేకాని వారి మార్గం అబద్ధాల మార్గం అని చాకలవాడు అయిన వొప్పకపాయ.

ఛీ యీ గుర్తెరిగే జ్ఞానం వున్నంతమట్టుకు కర్మాలు పోనేపోవు అని మంగలివాడు సంతోషపడకపాయె. అయ్యో యెంత వెర్రిమాట అన్నాడు అనే. లేవంగానే గుర్తెరిగే. నేనే మాదిగవాన్ని అని చెప్పాలు ముందరవేసుకొని కుడుచాడు. యీ గుర్తెరిగే శరీరమే మాదిగది. నేను వున్నంతసేపు నా మాదిగతనం పోదు. నేను యీ గుర్తెరిగే జ్ఞానం నేనయ్య అంటే యెవ్వరు చారనివ్వరు. యీ గుర్తెరిగే చైతన్యం చెప్పాలు కుట్టపెట్టి మూటలు మొయ్యి యింతేకాని యీ గుర్తెరిగే జ్ఞానం గవ్వకైన పదికిరాదు. అందుకే రావణాసురుడు సన్యాసివేషం వేసుకొని సీతను దొంగులుకపోయినాడు. మూఢులకు దొడ్డది సీత. భ్రాంతిరహితులకు యేమీలేదు. సీత మూఢురాలుగనుక సన్యాసి అని భక్తిచేత పూరికే వుంటె యెత్తుకపోయినాడు. సన్యాసి మొద్దులకు మొద్దు. సన్యాసిని నమ్మరాదు.

మనిషిని కుక్కనుజేసి రాత్రి దానితోను సంసారంచేసి మళ్లి కుక్కను చేస్తాడట. సర్వాత్మన సన్యాసిని నమ్మరాదు. శరీరాన్నల్ల నమ్మరాదు. సన్యాసిని మరి నమ్మరాదు. తమరు చెడి మందిని చెరిచేవాండ్లు. ఛీ ఛీ సన్యాసుల స్మరించరాదు. జగత్తుకు కారణం వున్నదన్న పాపి

కంటే రెండోవాడులేదు. తమకుతామే వచ్చినవారు మనను యెరుగుదురు. మనము వారిని యెరుగుదుము. వారు రాకున్నా మనము యేమీ లేదు వారు యేమి లేదు. కల రాకమునుపు యేలాగువున్నదో అలాగే సార్వ కాలం వచ్చేటందుకు మూలం యేమీలేదుగదా.

శిష్యు॥ యేమీలేదు.

గురు॥ ఉన్నపుడు పాలించేటందుకు యెవ్వరువున్నారు?

శిష్యు॥ అపుడు యేమీలేదు.

గురు॥ కొనకు శరీరంలేకుండ యెవ్వరుచేసిరి?

శిష్యు॥ కొనకు యేమిలేదు.

గురు॥ యిటువంటి శరీరానకు పరబ్రహ్మ కారణమంటే యెవ్వరు నమ్మేరు?

శిష్యు॥ నమ్మి చెడిపొయ్యే మాత్రమే.

గురు॥ యీ గుర్తరిగే శరీరం వికారాలు లేనిది అంటే యెవ్వరు నమ్మేరు?

శిష్యు॥ యీ గుర్తరిగే శరీరం వున్నదని అంటే యేలాగు. మొదలు యేమిలేదు. కొనకు యేమీలేదు.

గురు॥ వున్నపుడు యేమైన ఆశ వున్నదేమో?

శిష్యు॥ చూస్తువుండగానే యేమీలేదు.

గురు॥ మాటలు వినుటం చెయ్యబట్టి నిబద్ధి అనిపిస్తుందో యేమో?

శిష్యు॥ మూలంలేని యీ గుర్తరిగే శరీరాన్ని యేమి ఆదరువు చూచి నమ్మ.

గురు॥ అందుకే యీ మూలంలేని గుర్తరిగే శరీరం చేసిన వ్యవహారానకు మర్యాదలేదు. పెద్దపులిని చూసి పశువులు వణికినట్టు బలవంతమైన శరీరాన్ని చూసి బలహీనమైన శరీరాలు వణుకుతావి. ఇంతే కాని కేవలం న్యాయంలేదు. శక్తికొద్ది వ్యాపారం. అడవిలో పెద్దపులివలె యెంతవారికి మూలం వున్నదని భ్రాంతి కద్దు. యీ శరీరానికి మూలం ఫలానిది అని యెవ్వరు గెల్వలేరు.

శిష్యు॥ అబద్ధాలు నమ్మికకు రావు. అందుకే మొట్టమొదలు బట్టబయలు వున్నదా లేదా అని అడుగవలె. గట్టిగా వున్నది అనెనా అప్పుడే భ్రాంతిలేనివాడు అవుతాడు.

గురు॥ అవుతాడుకాని యీ శరీరానకు మూలం యేమయినా వున్నదా లేదా అని అడిగి శ్రమంగా తెలుసుకోవలె. తెలుసుకుంటే మూలం వున్నది అనెనా కల్తసాంప్రదాయం అని గ్రహించేది లేదు అనెనా దృష్టాంతపూర్వకంగా సమాధానం చెప్పండి అనేది. అంటే యిదియంత కడకు మూలం యేమీలేదు. కలలో వచ్చి యెంత ప్రతాపం చూపించినా నిబద్ధిఅని నమ్మరాదు. వెంటనే మేలుకుంటే వారికి మనము యెమీలేదు. మనకు వారు యేమీలేదు. తనకుతానే స్వతస్సిద్ధమయివున్న బట్టబయలు యేలాగువున్నదో ఆలాగే వున్నదానికి రాకడలేదు పోకడలేదు వునికిలేదు యేమిలేకపోవటంలేదు సార్వకాలం వకటీరే. యిషువంటి యేమీలేని దానికి యేమీ సాధించినా యేమీలేదు అని చెప్పే నా కలతలేని సాంప్రదాయమని గ్రహించి వారి అనుగ్రహముకు పాత్రుడు ఐతే పుట్టని చావనిది మొదలు కొన లేనిది రాకడపోకడ లేనిది సార్వకాలం శరీరంలేనిది క్రియాశూన్యమైంది తనకుతానే స్వతస్సిద్ధమయి వున్నది. యెన్నటికి చలించనిది సకలదేశాలయందు సర్వకాలాలయందు సమస్తమయిన వస్తువులయందు జ్ఞానకర్మాలు లేక ఖర్మాలకు కారణమనే జ్ఞానం శూన్యమై జగత్తు వున్నది లేనిది యెరుగక, (శ్లో॥నిత్యః సర్వగతః స్థాణుః। అచలోయం సనాతనః॥) అయింది యీ బట్టబై లేకాని మరి హోటికాదు. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని ధృడం చేస్తాడు. యిషు సర్వకాలం వకటీరే.

పరిపూర్ణం తనకుతానే స్వతస్సిద్ధమై వున్నదిగనుక ప్రయత్నంలేదు. యేది ప్రయత్నం చాయ పోతుందో అదే యేమిలేదు. అందుకే మూలం లేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని రెప్పపాటులో సఘం కాలమయిన మరువక వుండవలె. వుండకపాయనా అందరివంటి భ్రాంతికుడే అవుచాడు. యీ రుచి అభ్యాసధారుఢ్యం వున్నాకొద్ది అనాయాసం.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం ఆవర్ణంవలె వున్నది. గురువాక్యంచాత సకల భ్రాంతిరహితం అవుచుంది. యీ శరీరం వుంచుకొనెనా వకటైన భ్రాంతిపోదు. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం చాత సాధింతామని సాధన చేసెనా యెన్నటికి సాధ్యంకాదు. యీ బట్టబయలు తప్ప విడిచి రెండోది యేమీలేదు. యేమీలేని మూలంలేని యీ గుర్తెరిగే శరీరం మొదలు యేమిలేదు కొనకు యేమిలేదు. వున్నపుడు గురువాక్యం చేత మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు అని అన్నప్పుడు కనుక్కొనెనా వాడు ధన్యుడు. వున్నపుడు కనుక్కొకపోయనా అన్నిటి వంటివాడే. శరీరంలేని గురు సాంప్రదాయం అరుదు. దాన్నుంచెకాని సకల భ్రాంతిరహితం కాదు.

ఖర్మాలకు మూలం మూలంలేని యీ గుర్తెరిగే శరీరమేకాని మరి యేటికాదు.

యీ శరీరంతో కొంత మంచి అని ఆశపడ్డ అదేవిషయం.

కలలో వచ్చిన యేనుగ యొక్క దంతాలకు ఆశపడితే మేలు కంటే యేమీలేదు. కలలో వచ్చిన శరీరం కొంత వుండి కొంత పోయిందే.

శిష్యు॥ మేలుకుంటే యేమీలేదు.

గురు॥ అలాగే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు అని గురువాక్యంచేత మేలుకుంటే యెప్పటి బట్టబయలే వున్నది. యీ దేహ భ్రాంతిని నిశ్చయంగ వదలవలె కంటిలో నెరుసువలె బాధ పెడుచుంది అందుకే యీ శరీరం లేని మార్గం కఠినం సులభం.

బుద్ధిమంతులకు సులభం వేషధారులకు కఠినం కోటిమాట్లకు మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదుఅని సంతతం సార్వకాలం యిదే అనుష్టానం.

యింతకంటే తక్కువ గాయత్రిమంత్రం.

పంచదశీ యింతకంటే తక్కువ.

పంచాక్షరీ యింతకంటే తక్కువ.

అష్టాక్షరి యింతకంటే తక్కువ.

యెన్ని అయినా గురువాక్యం కంటే తక్కువ యేది అంటే అదెల్లా గురువాక్యం కాదు.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు. మొదలు ఏమి లేదు కొనకు యేమిలేదు. వృష్ణపుకు యేమీలేదు. సార్వకాలం యీ బట్టబయలు వక్కటీరుగా వున్నది. యేమీలేని బట్టబయలులో యేమీ లేక వున్నవారు. భ్రాంతిలేనివారు యీబట్టబయలుకు తనకు వేరుగాకుండా యుక్తివుంటే సరి.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరంచాత అదే నేను నేనే అది అని భావనచేస్తే పనికిరాదు. మొదలు కొన లేక కేవలం బట్టబయలే. అది నేను యెన్నడు కాదు, గురువు కలతలేనివాడు అయితే సరి యీలాగంటే ఆలాగు నడిచే గురువు పనికిరాదు. నడిచే శరీరమే అయివున్నాడు. గనుక విడచి గాభరా అయివున్న గురువు పనికిరాడు. మూలంలేని యీ గుర్తెరిగే శరీరమయివున్న గురువు సార్వకాలం శరీరంచేత సాధన చేసే గురువు పనికి రాడు. యేమీలేని శరీరం నేను అని నమ్మినాడు గనుక.

సార్వకాలం యీ మూలంలేని గుర్తెరిగే శరీరం యేమీలేదు అని నమ్మిక వున్న గురువు కావలే. యిటువంటి గురువుకు శరీరం లేదుగనుక చెయ్యా చెయ్యడు, విడువా విడువడు, పట్టాపట్టడు, శరీరమేలేదు చేశెది దేనితోటి.

శిష్యు॥ అల్లైతే గోడవలె వున్నాడా?

గురు॥ గోడవల గోడవున్నది.

శిష్యు॥ శరీరంలేక వున్న గురువేడి?

గురు॥ శరీరంలేక వున్నవారికి యిచ్ఛే వుండదు.

శిష్యు॥ యిచ్ఛే లేకుంటే?

గురు॥ కేవలం బట్టబయలు వారు.

కేవలం బట్టబయలుకు రాకడాలేదు పోకడలేదు,
లేదులేదు అని నడిచేవారు కొందరు.
వున్నది వున్నది అని నడిచేవారు కొందరు.

అన్ని విడిచినవారు కొందరు.

అన్ని విడిచి గాభరా అయ్యేవారు కొందరు.
అందరికీ యీ గుర్తెరిగే మూలంలేని శరీరమే.

శరీరం వదిలిన గురువు వున్నాడో లేడో వుండేనా వారితో కూడ వుండ చూడవలెను. చూస్తే శరీరం అయివున్నది, శరీరం లేకవున్నది, తెలుస్తుంది. వారు భోంచెయ్యగా కనిపెట్టిచూడవలె. నీళ్ళు త్రాగంగ కనిపెట్టిచూడవలె. దేహమై ప్రవర్తించేది దేహంలేక ప్రవర్తించేది తెలుస్తుంది. శరీరంలేక వుండేవారి సామర్థ్యం చెప్ప శఖ్యంకాదు.

సకల కౌతుకాలు శరీరం అయివున్నవారి దగ్గర కద్దు. వారికంటే మాయకులు వేరే లేరు. ఛీ యిటువంటివారి సాహసం కలలోనయిన కూడదు. సార్వకాలం కలలో వచ్చిన దేహం మేలుకుంటే యేలాగు యేమిలేదో ఆలాగే మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే నేను. యీ శరీరం సూన్యస్వరూపం అయినాగాని వున్నది అని కలలో వచ్చిన యేనుగను యినుపగొలుసులతోటి కట్టివేసి కావలి పండుకుంటే మేలుకుంటే యేమిలేదు అని తనకు తాను ధృఢము వున్నట్టు వుండేనా యీ శరీరం మందికి చూడ వున్నటు వుంచుంది. తనకు వున్నదని యెరుకలేదు. సార్వకాలం శరీరంలేక వున్నాడుగనుక శరీరంలేని యీ బట్టబయలుకు శరీరం వున్నదని యెరుక, లేదు అని యెరుక, యేమిలేదు అని యెరుక. యీ మూడు విధాలు యీ గుర్తెరిగే శరీరానికే నా శరీరం నీ శరీరం అని బట్టబయలుకు కాదు. మూలంలేని యీ గుర్తెరిగే శరీరంకంటే పాప స్వరూపం లేదు. షరాతురోపాధి ద్వయదోష స్వరూపమని ఆచార్య స్వాముల వారు పదిహేనో అధ్యాయం భాష్యంలో అన్నారు. (క్షేత్రక్షేత్రజ్ఞ స్వరూపం అనుట) అభిప్రాయం యింతేకాని ఆత్మనిబద్ధ అనాత్మబద్ధం అనుటంకాదు. ఆత్మ అనాత్మ వేరే వేరే అనుట కాదు. సార్వకాలం మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు అని అభిప్రాయం.

పుట్టనిచావని బట్టబయలేకాని మరిహోటి వున్నదని యెన్నటికి సంశయం వద్దు. యీ శరీరాలకు దిక్కు యేమీలేదు. యీ శరీరాలకు శరీరాలే దిక్కు. మూలంలేని యీ గుర్తెరిగే శరీరాలకు దేవుడు అయినా దేవత అయినా దిక్కు వున్నది అని కలలోనైన నమ్మవద్దు యిటువంటి

మాయ. యీ ప్రకారాన వున్నట్టే వుండి చూస్తువుండగానే యేమీ లేదు. కలలో ప్రపంచం తనకుతానే వచ్చింది. తనకుతానే వున్నది. తనకు తానే యేమీలేదు. గురుకటాక్షం గలిగినదనుక తన్ను కుంచు వుంచుంది. తప్పున కల మేలుకున్నట్టే మేలుకొనెనో పుట్టనిచావని బట్టబయలే వున్నది.

యేమీలేని బట్టబయలులోనే మొదలు యేమీలేదు. కొనకు ప్రవేశించేటందుకు యేమీలేదు యీగుర్తెరిగే శరీరం వున్నట్టేవుండి వెంటనే యేమీలేదు. మొదలు కొనలేని యీ బట్టబయలుకు రాకడ లేదు పోకడలేదు. యీ బట్టబయలే అచలంగనుక.

యీ బట్టబయలే సకల దేశాలయందు వున్నది.

సార్వకాలాలయందు వున్నది.

సమస్తమయిన వస్తువులయందు జ్ఞానశూన్యమయియున్నది.

పుట్టిన శరీరాలకే జ్ఞానకర్మాలు యీ బట్టబయలుకు యెరుకలేదు. కర్మాలులేవు కర్మాలకు మూలం యెరుకఅనే జ్ఞానమేకాని మరి వోటి మూలంలేదు. గుర్తెరుగక వక్కటైన కర్మాలు చేయబడదు. గుర్తెరిగే జ్ఞానం వున్నంతసేపు కర్మాలు తప్పవు. గుర్తెరిగే చైతన్యమనే జ్ఞానం నేను అని గుర్తెరుగంగానే కర్మాలు వారిపోవు. జ్ఞానములేని యీ బట్ట బయలు యేమి కర్మాలు చేస్తుంది. గుర్తెరిగే శరీరం పుణ్య పాపాలకు మూలం. శరీరాలకు మూలం. మూలంలేని యీ గుర్తెరిగే శరీరమేకాని పుట్టనిచావని బట్టబయలు యీ శరీరానికి మూలంకాదు. యీ బట్ట బయలుకు యెరుకలేదుగనుక కర్మాలు చెయ్యదు. సకల వినోదాలు మధ్యవచ్చి కాసేపు వున్నట్టు వుండి వెంటనే యేమిలేకపొయ్యేది. మూలం లేని యీ గుర్తెరిగే శరీరంయొక్క ప్రభావమేకాని రాకడ పోకడలేని యీ బట్టబయలుకు సుఖంలేదు దుఃఖంలేదు. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యెన్ని తిప్పలు బడ్డా యీ బట్టబయలు యేమీ అనదు. యీ బట్టబయలులోనే తనకుతానే వచ్చి తనకుతానే వుండి తనకుతానే యేమీ లేదు. గురుకటాక్షంచాత యీ బట్టబైలు సాక్షాత్తు శివుడు అని తెలిసి మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని నిరహేతుక జాయ

మాన కటాక్షం. దాసుడైన నాయందు ప్రసరించినా నేను బ్రహ్మను అనె ఆఘాత్యంచెడి దాసత్వంవదలి బట్టబయలే వుంచుంది. అద్వైతం నమ్మినా అడవిలో కలసి యమలోకమనే శరీరమందు యముల్లై వుంటారు. మూలం లేని యీ గుత్తేదారిగే శరీరం నేను అని యెన్నాళ్లు నమ్మివున్నా గురు కటాక్షం కలుగదు. దేహం నేను అనే భావనలేకుండా యెవ్వరు చేస్తారో వారేగురువులు.

మూలంలేని యీ గుత్తేదారిగే శరీరమే పరబ్రహ్మ మూలంలేని యీ గుత్తేదారిగేశరీరమే దాసుడు బ్రహ్మకు దాసత్వంకద్దు దాసునికి బ్రహ్మత్వంకద్దు రెండుసమానమే మునుపు బ్రాహ్మణుడు. రెండోసారి బిక్షుకుడు బ్రాహ్మణుడు బిక్షం సమానమే వేరే యెక్కువ తక్కువా బ్రహ్మ అయినా సుఖదుఃఖాలు తప్పలేదు. దాసుణ్ణిఅన్నా సుఖదుఃఖాలు తప్పు లేదు. రెండు వక్కటేయేద్పు.

భ్రాంతిరహితం బ్రహ్మత్వంచాతకాదు దాసత్వంచేతకాదు యిద్దరు పరతంత్రులే పుట్టనిచావని బట్టబయలు యెవ్వరుకారు జ్ఞాన కర్మాలులేని బట్టబయలుకు శరీరం యెన్నటికిలేదు.

శిష్యు॥ ఛీ బ్రహ్మత్వంభ్రష్టుడే దాసత్వంభ్రష్టుడె రెండు అహం కారమే మూలంలేని యీగుత్తేదారిగే శరీరం యేమీలేదు. యీ వాక్యము చేత అహంకారము మునిగిపోయె పుట్టనిచావని బట్టబయలు బయటపడె. యీలాగు కనుకొన్నవాడు భ్రాంతిలేనివాడు. సుఖదుఃఖాలకు మూలం మునిగిపాయె మతంసమ్మతమాయె అన్ని మూలంలేని యీ గుత్తెదారిగే శరీ రానికే యీమహిమలన్ని అందరికి తెలిసె యీకల నమ్మరాదు వొక్కటే కల మేలుకొంటె పుట్టనిచావని అచలమనే వ్యాపకం అరచేతిలో వైకుంఠ మనే పేరుచేత బట్టబయలు అని వున్నది.

గురు॥ ఆబట్టబైలే వైకుంఠం ఆబట్టబయలుచేయదు చేయించదు. ఆబట్టబయలుకు స్వతంత్రంలేదు పరతంత్రంలేదు. యేలాగువున్నదో అలాగే వున్నది. శరీరం అగంతుకం వున్నట్టువుండేది వెంటనే యేమీలేదు. మూలంలేని యీగుత్తేదారిగే శరీరం మాట్లాడితేభోంచేస్తే యెమోమహాత్తు

వున్నది అనిపిస్తుంది. కలలోవచ్చిన శరీరం గుర్తెరుగదా, మాట్లాడదా, భోంచెయ్యదా, మేలుకుంటే యేమిఅయె.

శిష్యు॥ యేమిన్నీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరానకు వున్నసామర్థ్యం పుట్టనిచావని బట్టబయలుకు లేదు. సకల సామార్థ్యాలు మూలం లేని యీ గుర్తెరిగే శరీరానకే యీశరీరానికి యితరాపేక్ష లేదు.

గురు॥ స్వతంత్రురాలు యికయేమి

శిష్యు॥ అంటె నమ్మరాదు, ఆదరువులేనిదిగనుక అవాంతర దొరతనం చేసేవారు చేయించేవారు దొర చెయ్యనివారు చేయించనివారు దొర కాదు దొంగకాదు.

గురు॥ యిద్దరికేకద్దు యీకలలోనే దొరవచ్చినాడు దొంగవచ్చినాడు కొనకు యిద్దరు యేమిలేదు. పుట్టనిచావని బట్టబయలు సార్వకాలం వకటేతీరుగానే యున్నది. చదువా చదువదు మరువా మరువదు సార్వకాలం శరీరం లేకవున్నది.

మూలంలేని యీగుర్తెరిగేశరీరం అన్ని పేర్లు పెట్టింది. పుట్టని చావనిది మొదలు కొనలేనిది రాకడ పోకడలేనిది సకల దేశాలయందు సార్వకాలాలయందు సమస్తమైన వస్తువులయందు తనకుతానే స్వతసిద్ధమై చలించక సార్వకాలం వకటేతీరుగా యున్నది. మూలంలేని యీగుర్తెరిగే శరీరానకు యీ బట్టబయలుకు కొంచమైన సంభంధంలేదు. మూలం లేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు. యీ బట్టబయలు చలించక తనకు తానే స్వతసిద్ధమైయున్నది. రాకడాలేదు పోకడాలేదు సార్వకాలం వకటే తీరే యీ శరీరంజోలి యీబట్టబైలుకుపట్టదు. బట్టబయలుజోలి మూలం లేని యీ గుర్తెరిగే శరీరానకు అవసరం. యీ శరీరంయొక్క వికారాలు బట్టబయలుకులేవు. సార్వకాలం యీమూలంలేని గుర్తెరిగే శరీరం యేమీ లేదు. యీ బట్టబయలు శాశ్వితంగా వకటేతీరుగా వున్నది. వున్నదానికి వకటైన వికారంలేదు. యెన్నాళ్లు యీమూలంలేనీ యీ గుర్తెరిగే శరీరం నేను అని నమ్మకున్నా భ్రాంతిపోదు. యథార్థంగా యీబట్ట బయలు వున్నది అని ధృడం యీశరీరానకు యేమీ మూలంలేదని నిశ్చయం యీశరీరానకు కొనకు ప్రవేసించేటందుకు స్థానం యేమీ

లేదని నిశ్చయం వున్నంతసేపు యీ శరీరానకు దిక్కు యెవ్వడులేడని భృడం వెంటనే యేమీలేదు.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరంయొక్క స్వభావం యిటువంటి దని నమ్మి కలలో తనకుతానే వచ్చి తనకుతానేవుండే తనకుతానే అన్ని తినే దాణాతినేవి దాణాతినే అన్నంతినేవి అన్నంతినె గడ్డితినేవి గడ్డితినె పండులుతినేవి పండులుతినె పాలుతాగేవారు పాలుతాగిరి సురతాగేవారు సురాతాగిరి మాంసంతినేవారు మాంసంతినిరి యెవ్వరి స్త్రీలతో కూడ వారువుండి వారి స్త్రీలతోవీరు వీరిస్త్రీలతోవారు సంతోషపడుకుంచు గుర్రాల తోమేవారిభార్య చక్కంది అని దొరచూచి దానితో సహ వాసం చేసేది. గుర్రాలు తోమేవాడు లెస్సవుంటే రాజుభార్య వానిని చూచి వానితో సహవాసం చేసుకుంచూ కాలంగడుపుకుంచు ఆచారం అని అనాచారం అని మందికి తెలుపుకుంచు మేముయెక్కువ మీరేతక్కువ అని అనుకుంచూ మా ఆచారం దొడ్డది మాఆడవాండ్లు నిప్పువంటి వాండ్లు మాయింటివంటియిల్లు యెవరియిల్లూలేదని మా మొగవాండ్లకు సంతోషం అని వచ్చినవారితోటి మా మొగవాండ్లు మహాభాష్టాకారివాండ్లు పగటి వ్యాళ్ల మాతోటి మాట్లాడకుండి మమ్ముల చూడకుండ్రి మాసంగతి చొప్పున మేమెవస్తాము. మీరుమాత్రం సంగతిచొప్పున నడుచుకోండ్రి అని నిభంధనచేసుకొని యీ ప్రకారాన కలకు మర్యాద.

యెరుకలేకుంటెసరి వారికివారే మనకుమనమే మూలంలేని యీ గుర్తెరిగేశరీరం యేమీలేదు గనుక యీయేమీలేనిది తనకుతానే స్వాధీనంకాదు. మంది తనవంటివారేగనుక మందిస్వాధీనంలేదు. వున్నంత సేపు పెట్టితె తినేటందుకు పుట్టిది. సమయంవస్తె యేమీలేదు. పెట్టిపెట్టి చెడిపొయ్యేదేకాని కొనకు యేమీలేదు. మూలంలేని యీగుర్తెరిగేశరీరం తిన్నంతసేపేతిండి లేకుంటె అడ్డంపడె అందుకె మూలంలేని యీ గుర్తెరిగే శరీరం నేను అని నమ్మి వుండరాదు. నమ్మక యేమిచెయ్యి మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు. అని సంతతం సార్వకాలం యెడ తెగక జ్ఞాపకం వుంచుకొని కాలంగడపినవాడె భ్రాంతిలేనివాడు. కలలో

కొంతనిబద్ధి కొంతఅబద్ధం అని దంద్వాలు నమ్మినా అడవిలోకలసి తోవకు మెన్నటికిరాదు.

సార్వకాలం యీమూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని నిద్రవచ్చినదాక మరణంవచ్చినదాకా విడువక రెప్పపాటులో సఘం కాలమైన మరువకవున్నవాడే బంధమోక్ష రహితుడు.

వాడే క్రియాశూన్యుడు.

వక్క-శరీరం యేలాగో అన్నిశరీరాలు ఆలాగే.

మూలంని యీ గుర్తెరిగే శరీరంలో కొంచంనిబద్ధి అనుకొన్న వానికి భ్రాంతిపోదు.

తిండి అన్ని శరీరాలకు సమానమే మనిషికి మాటలు యెక్కువ.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరంయేది అభ్యాసంచేస్తె అది కొందరికి లెస్స అభ్యాసంఅవుచుంది. కొందరికి కొంచం అవుచుంది. సూక్ష్మబుద్ధి కొద్ది యింతేకాని యీశరీరంలో శాశ్వతమయినది కొంచమైనా లేదు.

శాశ్వతమైనది. మొదలుకొనలేక రాకడపోకడలేక శరీరం మెన్నటికి లేక తనకుతానే సర్వకాలం వొక్కతీరే వున్నది.

సర్వకాలాలయందు శరీరంలేకనే వున్నది.

సమస్తమయిన వస్తువులయందు ప్రవేసించక తనకుతానే శరీరం లేక వున్నది.

శరీరం లేదుగనుక యెరుక లేదు.

కర్మాలులేవు.

గుర్తెరిగిగాని కర్మాలు చెయ్యదు.

కర్మాలులేకుంటె శరీరాలు లేవు.

యెరుకలేదు కర్మాలులేవు.

కలలో శరీరాలువచ్చినవి ఆశరీరాలు గుర్తెరుగుగనుక సకల కర్మాలు చేసినవి.

గుర్తెరుగకుంటె కర్మాలు పుడుచావె.

జ్ఞానంనుంచే కర్మాలు.

కర్మాలకు మూలం యీ గుర్తెరిగే జ్ఞానమే.

జ్ఞానం నిబద్ధి కర్మాలు అబద్ధమని యీకలలోనే వక్క-సన్యాసి అన్నాడు.

శిష్యు॥ ఆసన్యాసి అప్రమాణీకుడా.

గురు॥ మేలుకుంటె ఆసన్యాసి యేమాయె.

శిష్యు॥ యేమీలేదు.

గురు॥ యీ గుర్తెరిగే జ్ఞానమే మాయ.

శిష్యు॥ యేమీ లేదు.

గురు॥ జ్ఞానం యేలాగునిబద్ధి కర్మాలుయేలాగు అబద్ధం జ్ఞానం వున్నంతసేపు కర్మాలునిబద్ధి జ్ఞానం మునిగితె కర్మాలు మునుగుతావి అంతపర్యంతం కర్మాలు లేకపోవు జ్ఞానభ్రాంతిపోయినా విడువబట్టదు. జ్ఞానభ్రాంతివుండెనా కర్మాలు విడిచినాపోవు జ్ఞానమే కర్మాలకు మూలం గుర్తెరిగితేకాని కర్మాలు చెయ్యదుగనుక గాఢనిద్రలో మూలం లేని యీ గుర్తెరిగేశరీరం యేమీలేదు. అప్పుడు గుర్తెరిగే జ్ఞానంలేదు. కర్మాలు లేవు. వ్యవహారమేలేదు సరేకదా సార్వకాలం ఆలాగే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు లేకవున్నవారికి వ్యవహారం లేదుకదా.

శిష్యు॥ వ్యవహారం లేనేలేదు.

గురు॥ శరీరంలేకుంటె యేమీలేదు. వుత్తబట్టబైలే యేమీ లేనిదానిలో యేమీలేదు గదా.

శిష్యు॥ యేమిలేదు.

గురు॥ యీ శరీరంతోటె జ్ఞానకర్మాలు శరీరంలేకుంటె జ్ఞానమే లేదుగనుక కర్మాలు పుట్టనేపుట్టవు. అందుకే గురువాక్యంకంటె దొడ్డది యేమీలేదు. యేమీలేదనేటందుకు మూలం యేమీలేదు. వ్యవహారమే లేదుగనుక గురువులు శిష్యులకు యేలాగు తెలుప.

గురుసేవ చెయ్యంగ చెయ్యంగా జాడదొరకదు.

జాడదొరికినా వ్యవహారమేలేదు.

అందరివలెనె వుంటాడు.

మూలంలేని యీగుత్తేఁరిగే శరీరం యేమీలేదు.

సార్వకాలం శరీరంలేక వున్నవారుగనుక వ్యవహారానకు మూలం యేమీలేదు. అనిదృశ్యం వున్నవారికి. వున్నది అని అనేటందుకు మూలం యేమీలేదు.

పుట్టని చావనిది మొదలు కొనలేనిది తనకుతానే స్వతసిద్ధమై చలించక సార్వకాలం వక్కతీరే వున్నది.

సకల దేశాలయందు, సార్వకాలాలయందు, సమస్తమైన వస్తువుల యందు శరీరంలేకనే క్రియాశూన్యమై తానుచెయ్యక చేయించక సార్వకాలం భోంచెయ్యక వక్కటైన వికారంలేక శాశ్వితంగా వున్నది.

శిష్యు॥ వ్యవహారం లేనిదానిలో వ్యవహారంవున్నట్టు మూలంలేని యీగుత్తేఁరిగే శరీరంచేత తోచివుండె యిపుడు గురుకటాక్షంచేత యీ శరీరానకు కలలోవచ్చిన శరీరానకుకూడా మూలం యేమీలేదు అని చెప్పిరి.

గురు॥ దేనికి మూలం యేమీలేదని చెప్పిరి.

శిష్యు॥ కొనకు కలలోవచ్చిన శరీరాలు యెక్కడికి ప్రవేశించినావో అక్కడికే ఈ శరీరాలు పాయెనని చెప్పిరి. చెప్పితె రెండు సమానంవలెనే వుండే మొదలు యేమీలేదని నిశ్చయమాయె వున్నపుడు వున్నవి అని నాకు తోచివుండే ఆలోచటం కలలో వచ్చినవి. యేటివలనె యదార్థంగా వుండి వ్యవహారంచేసి వెంటనే యేమీలేదాయె.

అలాగే యీశరీరాలయొక్క యునికి అని గురుస్వామి తెలిపితే ఆవునికి యీవునికి సమానంగా వున్నట్టెవుంది కొంచమైన యెక్కువ తక్కువ వున్నట్టు తోచదాయె యిఘు యేమిఅంటే అనేక భ్రమలు కద్దు కలలో సమానమని తెలిపితె చులకంగా వున్నట్టువుండెగాని మూలంలేని యీగుత్తేఁరిగే శరీరం కలలో శరీరం మేలుకుంటె తనకుతానే యేమీలేదు అని నిశ్చయంవున్నట్టు కావలెనని నాకు భ్రాంతికద్దు.

గురు॥ కలిగితె అలాగె అయ్యా యీశరీరానికి మూలంలేదు అని దృఢం వున్నదికదా వున్నపుడు నిబద్ధి అనుకోవటం భ్రాంతియేకదా.

శిష్యు॥ భ్రాంతే.

గురు॥ నిత్యం కలలోవచ్చిన గుర్రాలు, యేనుగులు. లొట్టిపిట్టలు, వున్నావి.

శిష్యు॥ యేమిలేదు.

గురు॥ ఆలాగే మూలంలేని యీ గుతేరిగే శరీరం యేమిలేదు అని నిశ్చయంవుంటెచాలు పుట్టనిచావనిది తనకుతానే స్వతసిద్ధమై వున్నది గనుక ప్రయత్న మేమిలేదు.

శిష్యు॥ మూలంలేని యీగుతేరిగేశరీరం యేమీలేదు. అని ధృడం వుంటె యేమిటిచేత ప్రయత్నం చెయ్య.

గురు॥ యేప్రయత్నాలకు మూలం యేమీలేదు. సకలకర్మాలకు మూలం మూలంలేని యీ గుతేరిగేశరీరమేకాని రెండోది యేమీలేదు.

పుట్టనిచావని బట్టబయలుకు వకటైన భ్రాంతిలేదు. భ్రమకు మూలంకల కల కల్పనగాకుంటె శరీరమే లేదుగనుక భ్రాంతిలేదు. యెపుడు శరీరంలేకుంటె అప్పుడే భ్రాంతిలేదు.

గాఢనిద్రలో మూలంలేని యీగుతేరిగే శరీరం యేమీలేదు గనుక వ్యవహారమేలేదు.

శరీరం రాగానే కలసిద్ధం.

యీకలలోనే అనేకభ్రాంతులు సిద్ధం.

గుతేరుగగానే భ్రమ పుడుచుంది.

భ్రమవలన కర్మాలుచేస్తాడు.

శరీరంవలన గుతేరుగుటం కర్మాలు పుడుచావి.

యీ వకటశరీరంలేకుంటె కర్మాలులేవు జ్ఞానం లేదు.

జ్ఞానానకు కర్మాలకు మూలం శరీరమే.

యీశరీరానకు మూలం యేమీలేదు.

యేమీలేని శరీరం యేమిచేసినా యేమీలేదు.

శరీరంచేసిన కర్మాలునిబద్ధి అయితె గుతేరిగేది సార్వకాలం వుండవలె.

సార్వకాలం గుతేరిగేదివుంటె కర్మాలువుండవలె.

అందరివలెనె వుంటాడు.

మూలంలేని యీ గుత్తేరిగే శరీరం యేమీలేదు.

సార్వకాలం శరీరంలేక వున్నవారుగనుక వ్యవహారానకు యేమీలేదు. అవిదృష్టం వున్నవారికి. వున్నది అని అనేటందుకు యేమీలేదు.

పుట్టని చావనిది మొదలు కొనలేనిది తనకుతానే స్వతసిద్ధం చక సార్వకాలం వక్కతీరే వున్నది.

సకల దేశాలయందు, సార్వకాలాలయందు, సమస్తమైన యందు శరీరంలేకనే క్రియాశూన్యమై తానుచెయ్యక చేయించక కాలం భోంచెయ్యక వక్కటైన వికారంలేక శాశ్వతంగా వున్నది.

శిష్యు॥ వ్యవహారం లేనిదానిలో వ్యవహారంవున్నట్టు మ యీ గుత్తేరిగే శరీరంచేత తోచివుండె యిపుడు గురుకటాక్షం శరీరానకు కలలోవచ్చిన శరీరానకుకూడా మూలం యేమీలే చెప్పిరి.

గురు॥ దేనికి మూలం యేమీలేదని చెప్పిరి.

శిష్యు॥ కొనకు కలలోవచ్చిన శరీరాలు యెక్కడికి ప్రవేశ్చి అక్కడికే ఈ శరీరాలు పాయెనని చెప్పిరి. చెప్పితె రెండు సమా వుండే మొదలు యేమీలేదని నిశ్చయమాయె వున్నపుడు వున్న నాకు తోచివుండే ఆతోచటం కలలో వచ్చినవి. వీటివలనె యేద వుండి వ్యవహారంచేసి వెంటనే యేమీలేదాయె.

అలాగే యీశరీరాలయొక్క యునికి అని గురుస్వామి చవునికి యీవునికి సమానంగా వున్నట్టెవుంది కొంచమైన తక్కువ వున్నట్టు తోచదాయె యిఘు యేమిఅంటే అనేక భ్రమ కలలో సమానమని తెలిపితే చులకంగా వున్నట్టువుండెగాని మ యీ గుత్తేరిగే శరీరం కలలో శరీరం మేలుకుంటె తనకుతానే లే అని నిశ్చయంవున్నట్టు కావలెనని నాకు భ్రాంతికద్దు.

గురు॥ కలిగితె అలాగె అయ్యా యీశరీరానికి మూలం దృశం వున్నదికదా వున్నపుడు నిబద్ధి అన్నూవటం భ్రాంతియేకద

శిష్యు॥ భ్రాంతే.

గురు॥ నిత్యం కలలో వచ్చిన గుఱ్ఱాలు, యేనుగులు. లొట్టిపిట్టలు, వున్నావి.

శిష్యు॥ యేమిలేదు.

గురు॥ ఆలాగే మూలంలేని యీ గుఱ్ఱేరిగే శరీరం యేమిలేదు అని నిశ్చయంవుంటెచాలు పుట్టనిచావనిది తనకుతానే స్వతసిద్ధమై వున్నది గనుక ప్రయత్న మేమిలేదు.

శిష్యు॥ మూలంలేని యీగుఱ్ఱేరిగేశరీరం యేమీలేదు. అని ధృఢం వుంటె యేమిటిచేత ప్రయత్నం చెయ్యా.

గురు॥ యేప్రయత్నాలకు మూలం యేమీలేదు. సకలకర్మాలకు మూలం మూలంలేని యీ గుఱ్ఱేరిగేశరీరమేకాని రెండోది యేమీలేదు.

పుట్టనిచావని బట్టబయలుకు వక్కటైన భ్రాంతిలేదు.

భ్రమకు మూలంకల కల కల్పనగాకుంటె శరీరమే లేదుగనుక భ్రాంతిలేదు. యెపుడు శరీరంలేకుంటె అప్పుడే భ్రాంతిలేదు.

గాఢనిద్రలో మూలంలేని యీగుఱ్ఱేరిగే శరీరం యేమీలేదు గనుక వ్యవహారమేలేదు.

శరీరం రాగానే కలసిద్ధం.

యీకలలోనే అనేకభ్రాంతులు సిద్ధం.

గుఱ్ఱేరుగగానే భ్రమ పుడుచుంది.

భ్రమవలన కర్మాలుచేస్తాడు.

శరీరంవలన గుఱ్ఱేరుగుటం కర్మాలు పుడుచావి.

యీ వక్కశరీరంలేకుంటె కర్మాలులేవు జ్ఞానం లేదు.

జ్ఞానానకు కర్మాలకు మూలం శరీరమే.

యీశరీరానకు మూలం యేమీలేదు.

యేమీలేని శరీరం యేమిచేసినా యేమీలేదు.

శరీరంచేసిన కర్మాలునిబద్ధి అయితె గుఱ్ఱేరిగేది సార్వకాలం వుండవలె.

సార్వకాలం గుఱ్ఱేరిగేదివుంటె కర్మాలువుండవలె.

కర్మాలు జ్ఞానం రెండు నిబద్ధి అయితే శరీరం శాశ్వతంగా వుండవలె.

వుండనేవున్నది అంటె కొడుక్కి నొప్పివస్తె తండ్రి మంచంవద్ద కూర్చుండి ఆపదపడవలె తల్లి ము త్తైద అయి వుండవలె.

శిష్యు॥ ఛీ ఛీ అప్రసంగం విడువండి యీశరీరానకు మర్యాదలేదు.

యేమిలేనిదిగనుక యేమీలేని శరీరానకు యేమీలేని శరీరమే మూలము వున్నదని అందరు భంగపడ్డారు.

యీశరీరానకు మూలంవున్నదని అందరు మొరిగేమాత్రమేకాని యెవ్వరిమాట ముందరపడదు.

స్వామి భోంచేస్తాడని నైవేద్యాలు చూపుదురేకాని అవ్వి భోం చెయ్యటమే నిబద్ధి అయితే భోంచేసేదానికి పెట్టక.

బలుపపురాతికి యెందుకచూపవలె కేవలం నల్లసరపుగుండుకు యెందుకు చూపవలె.

కటెకు యెందుకు చూపవలె

ప్రతిమ నిబద్ధి అయితే ప్రత్యక్షంగా శరీరంవుండగా యెరుక కర్మాలులేని రాగిప్రతిమకు యెందుకు చూపవలె.

రుద్రాక్షకు యెందుకుచూపవలె.

శరీరంలేనిది యెండిది అని యెవ్వరికి తెలియక శరీరాన్ని గూర్చి జ్ఞానభ్రాంతి కర్మభ్రాంతి తగిలింది.

గురు॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని నిశ్చయంగలవారే పరిపూర్ణులు,

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని యేలాగం[illegible] అలాగేనడిస్తె వారికి శరీరం వున్నది.

అన్నివిడిచినా వున్నది.

అన్నిచేసినా వున్నది.

కొన్నిదొడ్డవి, కొన్నిచెడ్డవి అని మంచివి గ్రహించి చెడ్డవి విడిచినా వారికి మరిఘట్టిగా వున్నది.

శిష్యు॥ అలాగైతె మరి యేలాగునడువ.

గు॥ చడిచేది యేమీ మూలంలేని యీ గుత్తేరిగే శరీరం యేమీ లేదు అని ధృడం వుండవలె.

శి॥ వుంటే.

గు॥ మూలం యేమీలేదుఅని తనకుతానే ధృడం అవుచుంది.

ఇతి శ్రీ శివరామదీక్షిత ప్రభావే వేదాంతవిచారణే
జ్ఞాన జ్ఞానోపాది ద్వయిదోషరహిత ప్రకరణము
నవమోధ్యాయః

---

శ్రీగురుభ్యోనమః

# ౧౦ విక్షేపావరణ ద్వయదోషరహిత ప్రకరణము.

శ్లో॥ బీజశూన్యంమనశూన్యం। శూన్యంవ్యోమాదిపంచమం
క్షరాక్షరాదిశూన్యంచ। శూన్యాతీతంనిరంతరం॥

గురు॥ మూలంలేని గుత్తేరిగే శరీరం యేమిలేదు అనే సిద్ధాంతమే సిద్ధాంతము.

మూలంలేని యీగుత్తేరిగే శరీరం ఆవరణంవలె నున్నది.

యీ ఆవరణం వేసేవారేకాని తీసేవారులేరు.

లేనివారు అయితే లేకుండా చేస్తారు.

వున్నవారు అయితే మూలంలేని గుత్తేరిగే శరీరానకు దరువాజకు తాళంవేశినట్టు తాళం వేస్తాడు.

నోట్లో మంత్రంవేశి చెతులో మోనిముద్ర చూపుతారు.

యింతేకాని వున్నది వున్నట్టు సూచన చెయ్యరు.

మొద్దులకు ముందరబెట్టితే భోంచేస్తారు. భోంచేశినట్టు అనుభవం.

మూలంలేని యీ గుత్తేరిగే శరీరంచాత అనుభవం కావలెనని అందరికె అభిలాష కద్దు.

మూలంలేని యీ గుత్తేరిగే శరీరంలో కొంచం సత్యమని ఆశ పడ్డా శరీరం యీవత్తు వుంచుంది.

యీ శరీరంలో కనుక్కోవలెనని యీ శరీరమే మొరపెట్టింది.

విత్తనం విడువకూడదని కపటవాక్యం నమ్మినవారు భ్రాంతిలేనివారు ఆవుతారా.

శరీరంవలన పుట్టినవి శరీరం వున్నంతసేపు చప్పట్లుకొట్టి అనేక సంకేతాలు చేతులతోటి చూపుతారు తప్పవు.

సార్వకాలం శరీరాన్ని విడిచిలేదు, పట్టుకొనిలేదు. తనకుతానే అన కొయ్యవలె తిరుగుచుండి తనకు స్వాధీనంలేదు. వున్నట్టే వుంచుంది. చూస్తే వుండగానే యేమీలేదు గనుక నమ్మరాదు. నమ్మక మనము యేమి చేయగలము. అంటే యీ శరీరం మూలంలేనిదిగనుక తెగినగాలి పటం వలె వున్నది.

మొదలు కొనలేని యీ బట్టబయలువలె శాశ్వతమయిందికాదు వుండి యేమీలేదు.

యీ శరీరం తనకుతానే తండ్రి. అపేక్షలేక పెద్దది అయ్యీ యేను మీద యెక్కి అనేక దండుతోటి తనకుతానే వచ్చి తనకుతానే కొంతసే వుండి తనకుతానే యేమిలేదు.

యీలాగే హోప్రకారం తప్పున తనవంటి స్త్రీని జూచి తనకుతాను గుతెకారిగి కూడితే కడుపులోనే శరీరాకారమై పుట్టేది కద్దు.

యీ పుట్టుకకు వొక్కవిధం మర్యాదలేదు.

నానాప్రకారాలు.

మూలంలేనిదిగనుక వక్కవిధంలేదు.

అనేకప్రకాలు.

స్త్రీపురుష సంయోగంవల్లనే అని మర్యాదలేదు.

తనకుతానే వుంటావి.

తనకుతానే యేమీలేదు.

కొనకు గిట్టించేది యేమీలేదు.

శాశ్వితమైంది వక్క బట్టబయలే.

యీ బట్టబైలు వున్నది.

విజాతీయమైన శరీరం ఆ బట్టబైలుకు లేదు.

యీ శరీరమందువున్న భేదాలు ఆ బట్టబైలుకు లేవు.
శరీరం వకటేకాని దీనిలోపటవున్న పేర్లు అనేకాలు.
జ్ఞానం అని.
అజ్ఞానం అని.
యింద్రియాలు అని.
విషయాలు అని.
గుణాలు అని.
అంతఃకరణ అని.
మనస్సు అని.
బుద్ధి అని.
చిత్తం అని.
అహంకారమని.
వేదాలు అని.
శాస్త్రాలు అని.

యెన్ని అన్ని వ్రాతు. యీ శరీరంలో స్వగత భేదాలు అనంతాలు వున్నవి. తీసివేసినాకొద్ది మొలుస్తావి. వున్నవాటికి లెక్కలేదు, పోయిన వాటికి లెక్కలేదు, వ్రాయ శక్యంకాదు.

స్వజాతీయ విజాతీయ స్వగతశూన్యమైంది. యీ బట్టబైలుకు బదులులేదు.

యీ బట్టబయలుకు శరీరంలేదు గనుక స్వగత భేదాలు యెన్నటికి లేవు.

యేమీలేని బట్టబయలులో యేమీలేకవున్నారు పరిపూర్ణులు.
యీ శరీరం వున్నంతసేపు కలేకాని మరిఘోటి కాదు.
అందరు స్వప్నావస్థచేతనే వున్నారు.
జాగ్రత అయితేనే కల.
జాగ్రత లేకమునుపు ఈ శరీరం యేమీలేదుగనుక వ్యవహారమే లేదు.

వ్యవహారానకు మూలం గుత్తేరిగే జ్ఞానమేకాని మరిహోటి లేదు.

గుత్తేరిగే జ్ఞానం పుట్టగానే కల సిద్ధం.

యీ కలలోనే అనేక చిత్రవిచిత్రాలు పుదుచావి. వెంటనే యేమీలేదు.

యంతవారు కలకంచూనే వున్నారు. కల రాకమునుపు మూలంలేని యీ గుత్తేరిగే శరీరం యేమీలేదుగనుక మొదలు కొనలేని బట్టబయలు తనకుతానే స్వతస్సిద్ధమై చెలించక సార్వకారం శరీరంలేక వున్నదిగనుక వకట్లైన వికారంలేదు.

శరీరం లేకవున్నదే క్రియాసూన్యం. కావున పుణ్యకర్మాలు లేవు.

పాపకర్మాలు లేవు, శరీరంలేని యీ బట్టబయలు చెయ్య చెయ్యదు, చేయించా చేయించదు, సార్వకాలం వకటతీరే. కోటిమాట్లకు శరీరంలేని గురుసాంప్రియయం కావలే, భ్రాంతి లేకపోవలే.

భ్రాంతికి మూలం. మూలంలేని యీ గుత్తేరిగే శరీరమే కాని మరి హోటి భ్రాంతికి మూలంకాదు.

సార్వకాలం శరీరంలేని బట్టబయలుకు వకట్లైన భ్రాంతి వున్నదని యటువంటివాడు అనడు.

మూలంలేని యీ గుత్తేరిగే శరీరానకు భ్రాంతిలేదు అంటే యిషు వంటి అవివేకుడు వివేకుడుకూడా వొప్పడు.

లేనిదానికి వున్నదన శక్యం కాదు, వున్నదానికి లేదన శక్యం కాదు.

పుట్టని చావనిది, మొదలు కొన లేనిది, రాకడ పోకడ లేనిది, సార్వకాలం చెలించక వకటతీరుగా తనకుతానే స్వతస్సిద్ధమైవున్నది. సకల దేశాలయందు, శమ సమైన వస్తువులయందు ప్రవేసించక వెళ్లిపోక యేమొది వున్నదో అదే శాశ్వితమైంది అని నమ్మి కారణంలేక కార్యాలులేక తనకు తానే వచ్చి తనకుతానే వుండి తనకుతానే యేమీలేదు. యిషువంటి మూలంలేని గుత్తేరిగే శరీరం నేను అని భ్రిమచేత వున్నారుగనుక.

పుట్టని చావనిది వృద్ధిపొందనిది బక్కపడనిది పుష్టపుష్టికైన మూలంలేని యీ గుర్తెరిగే శరీరమనే మాయావరణం వుండంగా యంత వారికి తనకుతానే తీసివేసుకొనేటందుకు శక్యంకాదుగనుక జ్ఞానమనే భ్రాంతి చేత యిచ్చావిస్తారం వుంచుంది. కొంత కర్మాలు ఆచరిస్తు వుంచారు. యింతేకాని శరీరంలేని గురుసాంప్రదాయం వున్నది అని యెరుగకా అద్వైతమనే అడవిలో పులిని దొరికించుకొన్నట్టు దొరికించుకొని గుర్తెరిగే సచ్చిదానందం నేను అని అనుకుంటూ మునుపటికంటే రాగద్వేషాలు అధికమై అడివిపట్టి శరీరమనే గృహాలో పెద్దపులివలె గుర్తెరిగే చైతన్యం నేను అని లెస్స గుర్తెరిగి ఆవులు రాగానే ఆవులని గుర్తెరిగి కదలక మెదలక గుండుకింద నక్కకి తప్పిన పశువును దొరికించుకొని ఫలహారం చేస్తున్నట్టు యీ శరీరంలో గుర్తెరిగే చైతన్యం నేను అని నిశ్చయంగల వారు ప్రజల క్లేశపెడుచు వుంటారు.

చైతన్యం చేయదు, చేయించదు అనుకుంచు సర్వం గుర్తెరిగి తర్వాత చేస్తువుంటాడు.

మధ్యమధ్య నాకు కర్తృత్వం లేదు అనుకొంచు.

శంకరాచార్యులు వారి సిద్ధాంతం దొడ్డది దొడ్డది అనుకుంటూ నరకం అనే శరీరంలో గుర్తెరిగే చైతన్యం నేనుఅనుకొని నమ్ముకొని పుట్టలో పామువలె వకవేళ పెట్టలో పామువలె హోవేళ్ళ భుస్సభుస్స మనుకుంచూ కాలం గడిపేవారు.

యెవ్వరైన వక పెద్దలు యేమీలేదు. సర్వం ప్రపాధికర్మం నేను అసంగున్ణ కర్మలు మిధ్య లేనేలేవు. అవిద్యా కార్యాలుని హితమైన కర్మాలు విడువరాదు. మనకు కావలె లోకసంగ్రహార్థం నాకు వున్నానరే లేకున్నానరే. చెయ్యకపోతే నలుగురు నెత్తికొడుతారు. అసంసారులు కొందరుమాత్రం పనికిరాదు అని అంటారు.

కాశికి పోయినమాత్రమే యెక్కువ.

గోదావరికి పోయినమాత్రమే యెక్కువ.

కృష్ణకు పోయినమాత్రమే యెక్కువ.

రామేశ్వరం పోయినమాత్రమే యెక్కువ.

గోవులది యెంతో దొడ్డ పుట్టుక.

గోవులను మించిన పవిత్ర వస్తువు లేదు.

గోమూత్రం యెంత దొడ్డది వేదాలకంటే, గుత్తేఁ రిగే చైతన్యము కంటె దొడ్డది. యీ గుత్తేరిగేది గోమూత్రం త్రాగితేకాని పవిత్రం కాదు.

బ్రాహ్మణుడు గోవుకంటే తక్కువ.

వీడేమోయి ద్విపాద పశువు. యంత గుత్తేఁరిగే చైతన్యం అనుకున్నా గోమూత్రంవలె పనికివస్తుందే ఛీ గోమూత్రం యెక్కడ బ్రాహ్మణుడు యెక్కడ మూత్రమేకాని పురీషం పనికిరాదు. పంచగవ్యంకంటే పవిత్రం యేదిలేదు గోవుల పురీషం పనికివస్తుంది. తిన్నదల్లా అన్నమే. వెళ్లినదల్లా పురీషమేకాని మనిషిది, భ్రష్టుది, గోవులది, బర్రది, యడ్లది, దున్నపోతులది, మేకలది, గొర్లది పనికివస్తుంది. యిందులో గోవులది శ్రేష్టం అని శాస్త్రం (వేద) తినిపించింది, మూత్రపానం చేయించింది. శాయరానివి యెన్నివున్నవో అన్ని శాస్త్రాలచాత మూలంలేని యీ గుత్తేరిగే శరీరమే చేసింది.

పుట్టని చావని యీ బట్టబయలు యేమి చెప్పలేదు. యేమి చెయ్యదు. సార్వకాలం వక్కటీరే.

మూలంలేని యీ గుత్తెరిగే శరీరం తోచకమునుపు కేవలం బట్టబయలే వున్నది. ఆ బట్టబయలు ప్రవేసించదు. వెళ్ళిపోదు. యీ బట్టబయలులోనే అనేక శరీరాలు వస్తావి. తనకుతానే వుంచావి, తనకుతానే యేమీలేదు.

పుట్టని చావని బట్టబయలుకు జ్ఞానం లేదుగనుక కర్మాలు పుట్టాగ పుట్టవు.

జ్ఞానకర్మాలు శరీర జన్యాలు.

క్షేత్రానకు క్షేత్రజ్ఞ స్వరూపానకు భేదం లేదు.

కార్యకారణాలకు భేదం లేనేలేదు.

వచ్చిన శరీరాలు జ్ఞానంతోకూడ వచ్చినవి. జ్ఞానంతోకూడ యేమీ లేదు గనుక జ్ఞానకర్మాలు లేవు.

యీ బట్టబయలుకు రాకడలేదు పోకడాలేదు.

సార్వకాలం వకటీరే గనుక యీ బట్టబయలే క్రియాశూన్య మయినది.

యీ బట్టబయలే పుట్టని చావనిది.

యీ బట్టబయలుకు శరీరం వున్నదని తోచాతోచదు.

శరీరం లేదు అని తోచాతోచదు.

చేసేవారికి అన్ని తోస్తావి.

శరీరం నేనుఅని చేసేవారికి తోస్తావి.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదుఅని యాలాగంటే అలాగు చేసేవారికి అన్ని తోస్తావి యదార్ధంగా.

కలలో వచ్చిన యేనుగు మేలుకుంటే యాలాగు యేమీలేదో అలాగే యీ మూలంలేని గుర్తెరిగే శరీరం యేమిలేక వున్నవారికి తోచేటందుకు మూలం యేమీలేదు. వారిది వారికే తెలియవలెగాని యితరులకు శఖ్యంకాదు. వారితోకూడ వుండిచూడవలె. వారి జాడ కనుక్కోవలెగాని లేకుంటే తెలియదు. యిది మహారస్యం. యీలాగు వున్నవారికి యిచ్చకు మూలంలేదు. యే నిర్ణయం చేసేటందుకు మూలం యేమీలేదు. వున్నది వున్నట్టుండే. యిటువంటివారే భ్రాంతికి మూలం లేనివారు.

వుపాధినుంచి అన్ని తోచివుండే.

యీ శరీరోపాధినుండి అన్ని పాయ.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం తోచినప్పటినుండి భ్రాంతి పుట్టింపె.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం కలలో వచ్చిన మనుష్యులు మేలుకుంటే యేలాగులేదో అలాగే శరీరానకు మూలం యేమీలేదు.

వున్నపుడు తన సత్తా తనకుగాని పుట్టని చావని బట్టబయలు యీ శరీరాన్ని పుట్టించిందికాదు. విడువ విడువదు.

యీ శరీరం తనకుతానే మధ్యవచ్చి మధ్యపొయ్యేది.

యీ బట్టబయలు శాశ్వితమయింది.

మొదలు కొన లేదు.

రాడా లేదు పోకడా లేదు.

పుట్టుకా లేదు చావు లేదు.

మెరుక లేదు కర్మాలు లేవు.

వకటయినా వికారం లేదు.

యిచ్చ యెన్నటికి లేదు.

శరీరం లేదుగనుక చలించనే చలించదు.

యీ కలలో శరీరం తోచంగానే వెంటనే క్రియాసిద్ధం.

మాటలచేత కుదురదు.

సాధనలచేత కుదురదు.

యిది యేలాగుఅంటే కలలో కొన్నికోట్ల ప్రజలు వచ్చినా వున్నా అనేక చిత్రవిచిత్రాలు చేసినా అనేక పుణ్యాలు చేశినా అనేక మహాపాతకాలు చేశినా యెంత భాగ్యవంతులు అయినా దరిద్రులు అయినా యెన్ని యేనుగలు వున్నా యెందరు కొమాళ్లువున్నా అనేక గోవులున్నా అనేక మొహారీలు మూలను రాసులు వున్నా యంత చదువుకున్నవాడు అయినా కొత్తగా శాస్త్రాలు చేశేవాడుఅయినా వెంటనే మేలుకుంటె యేమీ లేదు అని తనకుతానే యే సాధన చెయ్యందే యీలాగు ధృడం వున్నదో అలాగే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం కొంచమయినలేదు.

సాధన చెయ్యందే ధృడం వుండేనా వాడే పుట్టని చావని బట్ట బయలు.

వానికి వకటైన వుపద్రవం లేదు.

సార్వకాలం వకటీరే.

యెన్నికోట్ల శరీరాలు వున్నా యీలాగే.

నోట అనేటందుకు యీాపత్తు శరీరం లేదుగనుక నోరు యేలాగు వుండి.

యిదే భ్రాంతికి మూలంలేని రాజమార్గం.

సార్వకాలం వకటీరే.

శిష్యు॥ అవయితే యిషువంటివారు కదలరా మెదలరా భోం చెయ్యరా యేలాగువుంటారు ?

గురు॥ కలవచ్చినమనుష్యులు మేలుకుంటె యేలాగువుంటారుయేమి.

శిష్యు॥ యీవత్తు యేమీలేదు సర్వశూన్యం అరచేతిలో బట్ట బయలు వున్నటువున్నది. ప్రజలు లేనేలేరు గనుక వ్యవహారమేలేదు.

గురు॥ యీవత్తు ఆ శరీరాలు యేలాగు యేమిలేదో అలాగే యీ మూలంలేని గుతే౽రిగే శరీరం యేమిలేకుండ విచారించు.

విచారిస్తె అది యిది సమమే.

నోట ప్రసంగాలు మొదలుపెడితే బడి చదువు చదువుకో.

శాస్త్రాలు చదువుకో.

అనేక యజ్ఞాలు చెయ్యి.

చేయించు.

మహా పెద్దలు అనిపించుకో.

కుక్కలవలె మొరుగు.

గాడిదవలె కుయ్యి.

పందివలే చూచిందల్లా తెగబడి తిను.

ఆవుల వుచ్చతాగు.

పేడ తిను.

కాశీ రామేశ్వరం పో.

తీర్థాలు చేస్తువుండు.

కొనకు కుక్కకు యేమిగతో నీకు ఆ గతే.

యీ భ్రాంతిలేని రాజమార్గం సాధనలచేత సాధ్యంకానిది.

విచారంచాత అతి సులభం అయింది.

మొద్దు గాడిదకొడుకులకు రెండు మొద్దులు ముందరపెడితే ఊంఞ కుంచూ వుంచారు.

మొద్దులకు మొద్దులే గతి.

మహా ఆస్తికులకు అతిసూక్ష్మ ప్రజ్ఞావంతులకు దృష్టాంతం యేలాగు

వున్నదో అలాగు తాత్పర్యం చేసుకొని మహాగుహ్యం మహారహస్యం వుత్కృష్టమయిన గుహ్యమని యవ్వరితో ప్రపంచముచ్చట ఆడక పార మార్ధపు ముచ్చట ఆడక మహాయుక్తిచొప్పున కాలం గడిపినవాడు భ్రాంతి లేనివాడు.

యిది అద్వైతంవలె లేదు లేదుఅని యెగబడి చేసే మార్గంకాదు.

గుణాతీతం రిగే జ్ఞానం నేనుఅని కర్మాలు లేనేలేవు అని యెగబడి చేసే రాక్షస కృత్యం కాదు.

తత్వము దొడ్డదిఅని యిరువది అయిదోది గుణాతీతం రిగే క్షేత్రజ్ఞ స్వరూపమనే విద్యాస్వరూపము నేను అని చేసేది అవిద్యఅని యెగబడి చేసినట్టు కాదు.

యిరువది ఆరవది యెటువంటిదో అటువంటిదాన్ని కనుకొని శాంతిచేత వున్నవాడే కృతకృత్యుడు.

శ్రద్ధామార్గం కావలశినదానికి గురుకులవాసం చెప్పినట్టు దృష్టాంతం చాత సూచన చేస్తే దార్ష్టాంతికాన్ని వుండజూచుకొని శాంతిచేత వున్నది వున్నట్టూ పడితేసరి.

కలలో వచ్చిన శరీరాలు చూస్తువుండంగానే యేలాగో అలాగే మూలంలేని యీ గుణాతీతం రిగే శరీరాన్ని తాత్పర్యం చేసుకోవలెను.

అటుకర్యాత తాత్పర్యానకు మూలం వుండదు.

వడ్లు దంచినట్లు దంతామంటె మెద్దను.

సాధ్యంకాదు.

అగ్ని హోత్రాలవలె మందిచేత మధించినట్టుకాదు.

కాశీనుంచి కావడి మోసుకొని రామేశ్వరం పోయినట్టుకాదు. అప్పు చేసి అన్నం దానంచేసినట్టుకాదు.

వున్నది వున్నట్టు పడే యుక్తి కనుకొని సార్వకాలం శరీరం లేని వారిది జన్మభ్రాంతి లేనిమార్గం.

ఇతి శ్రీ శివరామదీక్షిత ప్రభావే వేదాంతవిచారణే నిక్షేపావరణ
వ్యయదోషరహితప్రకరణము దశమోధ్యాయః

శ్రీగురుభ్యోనమః

# ౧౧॥ క్షేత్రక్షేత్ర ద్వయదోషరహిత ప్రకరణము.

శ్లో॥ జగదాఖ్యమహాస్వప్నే । స్వప్నాత్స్వప్నాంతరంవ్రజేత్
రూపంత్యజతినోశాంత । బ్రహ్మైకాంత్రిత్యబృంహితం

గురు॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని సిద్ధాంతమే రాద్ధాంతము.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరాన్ని తాత్పర్యం చేసుకోని వున్నట్టు పడేయుక్తి కనుక్కోని సర్వకాలం శరీరం లేకవున్నవారికి జన్మ భ్రాంతి లేనిమార్గం యిది. శాస్త్రాలు చదువుకున్నవారు దున్నిన యెడ్ల వంటివారు. వేదం చదువుకొన్నవారి నోరు దంచిన రోలు మెదిగినట్టు మెదిగే మాత్రమేకాని దృష్టాంతంచొప్పున దార్ష్టాంతంగా వుండచూచుకోనే సామర్థ్యంకాదు.

యీ శరీరం యెన్ని చదువుకొన్నా చదువుకోనిది దొరకదు.

కుక్కలవలె కూసేది నక్కలవలె వదరేది యింతేకాని కలలోయెన్ని చదువులు చదువుకొన్నా మేలుకుంటేయేమే చదువులేదు. ఆలాగేగురుసూచన చెయ్యంగానే దృష్టాంతం తనకుతానే యేమీలేదుఅని ధృడం అయినట్టు అయి ధృడం యేమిలేకపోయెనా యెప్పటి శరీరం లేని యీ బట్టబయలు చెలించక తనకుతానే స్వతస్సిద్ధమై వుంచుంది, యీ బయలేకదా అని చూస్తువుండెనా యెప్పటి కోతిచాష్టలు తప్పవు. మునుపటివలెనే (జీవాఖ్యాక్షురోపాధి) అనే దోషరూపం అయివుంటాడు.

శ్రు॥ జీవఃసర్వమలంజ్ఞాత్వా । జ్ఞానదృష్టాతిముహ్యతి॥
శ్రు॥ క్షేత్రజ్ఞాఖ్యాజీవోపాధిః॥

పుట్టనిచావని అచలము తానేనని అవివేకంచాత కట్టుకోని నేను యెరుగుదును అని కర్మాలు చేస్తాము.

శ్రు॥ సంయోజ్యం చవివేకేనజానామీతి । ప్రవర్తతేక్షేత్రజ్ఞాఖ్య ।
శ్రు॥ జీవోపాధివిలయేసతి కేవలోభవతి॥

అదే తత్వాతీతం జగత్తు తత్వస్వరూపమే తత్వాతీతం మహా గుహ్యం। పరమరహస్యం॥ అందుకే ద్వైతాద్వైతరహిత పరమతత్వం అనే సౌజ్ఞ.

తత్వాతీతం యిరవై ఆరోది.

అదే శరీరం లేనిది.

అదే పుట్టగిచావనిది.

అదే మొదలు కొన లేనిది.

అదే రాకడపోకడ లెనిది.

తనకుతానే స్వతస్సిద్ధమై చలించకవున్నది.

సార్వకాలం యేకప్రకారమే.

శరీరం లేనిదిగనుకనే సకలదేశాలయందు జ్ఞానకర్మాలయందు భ్రాంతి లేక వక్కటీరుగా వున్నది.

అదే సార్వకాలాలయందు మోక్షభ్రాంతి బంధభ్రాంతి లేక వక్కటైన వికారంలేక ప్రవేసించక వెళ్లిపోక పెద్ద గుట్ట కదలకవున్నట్టు సర్వత్రా దట్టముగా యెడతెగక వున్నది.

అందరికి అది కావలెనని అపేక్ష కద్దు.

దానికి యెవ్వరిమీద అపేక్షలేదు.

అందరూ నాయందే వుండి నన్ను కనుక్కోలేరు. అన్ని సాధనల చాత కట్టుబడి జ్ఞానభ్రాంతిచాత కట్టుపడి కర్మాలు తరంగాలవలె పుట్టినా కొద్ది తీసివేసుకుంచు దేహాభిమానంచాత గురువులనే మాట మాత్రమైన తలవక సమస్తదేశాలయందు శరీరం లేకవున్న గురురూపాన్ని ఛీ అని ఛీ అని ఉపేక్షచేశి చచ్చిన గురువుల పేర్లు చెప్పుకొని లెస్సవండుకొని మా గురువు సమస్తమైన దేశాలయందు పిపీలికాది బ్రహ్మపర్యంతం సకల దేశాలలో వుండి సమస్తం భోంచేస్తాడు. అగ్ని హోత్రం వంటివాడు సమస్తం తింటాడు సకలమయినవి తాగుతాడు. వారికి పాలువక్కటే సురా వక్కటే. వారు సకలశరీరాలలో వున్నారు. వారు గుర్తెరిగే చైతన్య స్వరూపులు.

యిన్ని లిప్పలు పరబ్రహ్మకే గుర్తెరిగే చైతన్యం పరబ్రహ్మగనక

గుత్తేరుగక వక్కటైనా తినడు వక్కటైన తాగడు సర్వం గుత్తేరిగే చైతన్యమే. యిటువంటి గురువు మా గురువు. మా గురువు అని వేషదార్లు చెప్పుకుంటారు. మా గురువు మహాదొడ్డవాడు, రామోపాసకుడు, వారి ఆచారం సార్వకాలం మడితోటే వుండేది. సార్వకాలం దంచేవాండ్లు సూకలు బుక్కచున్నట్లు సార్వకాలం నోరు వూరికే వుండదు. యేదైన ఒక పారాయణ చేస్తుండేది. సార్వకాలం దేవునిమీద చింతే

దీపారాధన యేలాగు గడిచి.

భక్ష్యభోజ్యాలు యేలాగు జరిగి అని చింత.

సంసారం నెత్తికొట్టినారు.

"దేవతా శేషం క్షుదా శాంతి" అయితే సరి.

యేమయినా భక్తి దొడ్డది. జ్ఞానం వున్నది అన్న నేనేజ్ఞానం లేదు లేదు అన్నా నేనే జ్ఞానం స్వభావికమే భక్తి దొడ్డది అని నెత్తికొట్టినారు. స్వామికి వుత్సవం నడిచితే సరి.

శిష్యు॥ యిటువంటి వేషధార్ల జోలియేమి. యీ కలలోనే అనేక వింతలు తోచిపాయె. యదార్థంగా భ్రాంతిలేని మార్గం సూచన చెయ్యండి.

గురు॥ చేస్తా విను యీ కలలో వక్కమనిషివచ్చె. వచ్చి కొంతసేపు వుండే. వెంటనే చూస్తువుండగానే యేమీలేదు. యిది నీకు దృఢమా అనుమానమా.

శిష్యు॥ దృఢమేకాని కలలో వచ్చినవి అయోనిసంభవులు. ఇపుడు యోనిసంభవులు యేలాగుఅయ.

గు॥ కలలోనే స్త్రీపురుషసంయోగము లేదా, పెద్దవారుకారా, వడుగులుకావా, వివాహములుకావా, మళ్ళి కొడుకులు బిడ్డలు పుట్టరా, కోరతనం చెయ్యరా, బిక్షం యెత్తరా.

శిష్యు॥ దానికిమూలం యేమీలేదు.

గురు॥ దీనికి మూలంయేమీలేదు. నీకు యేమైనాయెక్కవతక్కవ తోచెనాచెప్పు. భ్రాంతి మేలుకున్నదాక తప్పదు. వున్నంతసేపు యీ కల నిబద్ధివలె వుంచుంది. వెంటనే గుత్తేరుగుచుండగానే యేమీలేదు.

అది వున్నపుడు అలాగే గర్భితిఅయింది నీవే గుర్తెరుగుదువు. కొనకు చస్తే యేమీలేదని నీవే గుర్తెరుగుదువు కలకు దీనికి యెక్కువతక్కువ యేమి.

శిష్యు॥ యేమీ యెక్కువతక్కువ లేదు.

గురు॥ సరేకదా నీకు నొక్క భ్రాంతివున్నది. అది పోకడ పెట్టు కుంటివే నీకంటే అధికులులేరు.

శిష్యు॥ అది యెటువంటిది సూచనచెయ్యండి.

గురు॥ చేస్తాగాని యెక్కువ ప్రసంగాలు చెయ్యవుగదా.

శిష్యు॥ యింత నీకు భయమేమి? ప్రసంగం పుట్టకుండా సూచన చెయ్యండి.

గురు॥ నేను సూచన చెయ్యంగానే యేమీ సంప్రకనుకోవాలె.

శిష్యు॥ వున్నట్టు చెప్పితే యెటువంటి మొద్దుకూడ వినంగానే తనకు తానే తోస్తుంది.

గురు॥ నీమాట సరేకానీ యీకలలో వచ్చిన శరీరాలు మనకు యిప్పుడు కానుపించే శరీరాలు సమానమా యెక్కువతక్కువా.

శిష్యు॥ యేమీ యెక్కువతక్కువలేదు యిది వకసూటిదే.

గురు॥ యిది అందరికి యెరుకేకదా.

శిష్యు॥ యెరుకే.

గురు॥ అట్లైతే నీవు యేమి.

శిష్యు॥ నేనా నేను యీ మూలంలేని గుర్తెరిగే శరీరం.

గురు॥ కలలో వచ్చిన శరీరాలకు మూలం యేమీలేదు.

శిష్యు॥ యెవ్వరిసత్తాచేత వున్నది.

గురు॥ కలలో వచ్చిన శరీరాలు యెవ్వరి సత్తాచేతవున్నవి. వాటి కవ్వే వీటి సత్తా యెవ్వరికిలేదు వాటివలె వీటికి యెవ్వరిసత్తాలేదు. వీటికి యివ్వే యీ శరీరాలు యెవ్వరు రమ్మనేవారులేరు పొమ్మనేవారులేరు వుండుమనేవారులేరు విచారించని మహాత్ములు వీటికి మూలం వున్నదని భ్రాంతిచేత వున్నారు. విచారిస్తే అందరికి మూలంలేదని యెరుకే.

శిష్యు॥ అట్లయితే కలలో వచ్చిన శరీరంవంటిదే యీ కానుపించే

శరీరం. కానుపించే శరీరంవంటిదే కలలో వొచ్చిన శరీరం.

గురు॥ యేలాగైనా నాకంటే కలలో వచ్చిన శరీరంవంటిది అయినా యేమీలేదు. మనకు కానుపించె శరీరాలవంటిది అయినా యేమీలేదు.

శిష్యు॥ అట్లయితే నీకు శరీరం వున్నట్టా లేనట్టా.

గురు॥ నాకా. కలలోవచ్చిన శరీరం మేలుకుంటే వున్నట్టా లేనటా.

శిష్యు॥ మేలుకుంటే యేమీలేదు.

గురు॥ కొంచమైనలేదు యేమీలేదు యీ శరీరం యేమిలేదు.

శిష్యు॥ యిపుడు చస్తేనా.

గురు॥ ఛీ యెపుడు విచారిస్తే అపుడు గురుకటాక్షంచాత యేమి లేదు. నిబద్దేనా ?

శిష్యు॥ నిబద్ధే.

గురు॥ యిందుకు అనుమానమేమి.

శిష్యు॥ కొందరూ చస్తే యేమిలేదంటారు అలాగయితే గురుస్వా యిందుకు విచారణకు ఫలమేమి చచ్చిన తరువాత భ్రాంతిరహితమెవరికి.

గురు॥ ఛీ అదిమాటకాదు. చచ్చేది యేమి మొదలు యేమీలేదు [illegible] యేమీలేదు.

శిష్యు॥ యీలాగు అందరికి సమానమే.

గురు॥ గురుమూలంగా విచారించినవారికి యెపుడు విచారిస్తే అప్పుడు మూలంలేని యీ గుత్తెరిగే శరీరరం యేమీలేదు.

శిష్యు॥ యీలాగు సరేసరే. యిందుకు అనుమానం లేదుగాని గురు స్వామీ నాకు రెండబద్ధాలు తోస్తావి.

గురు॥ యేవేవి.

శిష్యు॥ సుషుప్తి అనేమాట మరణం అనేమాట అది యేలాగు ?

గురు॥ మూలంలేని యీ గుత్తెరిగే శరీరం యేమీలేకుంటే యేమో.

శిష్యు॥ సరే అది జాడే.

గురు॥ సుషుప్తిమరణము అని ముంది కల్పించినారు, యింతేకాని

వున్నది వక్కటే. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నంతసేపు కలే గురుమూలంగా కలలో వచ్చిన శరీరాలు మెరుకతోటి వుండగానే యేమి లేదు అని తనకుతాను యేలాగు దృఢమో అలాగే గురుమూలంగా మూలంలేని యీ గుర్తెరిగే శరీరము యేమిలేదుఅని తాత్పర్యమాయెనా అదే మేలుకొనుట యింతేకాని వక్కటయినా అవస్థలేదు. స్వాప్నావస్థ గురుడు మేలుకొలిపితే అదే జాగ్రత. ఇంతేకాని నాలుగు అవస్థలు లేవు. యీ శరీరం వక్కటే నాలుగు శరీరాలు అనుట అబద్ధం. మూలంలేని యీ గుర్తెరిగే శరీరము స్వాప్నావస్థ గురుకటాక్షంచేత మేలుకుంటే అప్పుడే జాగ్రత యింతేకాని యెక్కవ ముచ్చట్లు యేమీలేవు.

శిష్యు॥ స్వామీ నాకు చాలు మీరు కష్టపడితిరి శిష్యుడు మొద్దు యేమో అని మహా భయపడితిరి. యిటువంటి ముచ్చట యెవ్వరికి దృఢం కాకపొయ్యేని అని మీరు భయంవిడవండి యెంత మొద్దులయిన అనాయాసంగా తనకుతానే దృఢం అవుచుంది.

గురు॥ ఏమయినా ఆయాసమున్నదే.

శిష్యు॥ అతిసులభం యిటువంటి సులభం యెన్నడు వున్నదని విన లేదు. మహాకఠినం వున్నదని విన్నా. అనేక సాధనలువిన్నా. కొన్ని నేను చేసినా. యిప్పుడు విచారించుకుంటే గట్టుకు మోసిన కట్టెలవలెనుంటే వక్క సాధన అక్కరకు రాకపాయ. సముద్రం కాళ్లచేత నడిచిపోయినట్లు ఆయ.

గురు॥ శాభాసు.

శిష్యు॥ గురువు అంటే యీలాగు వుండవద్దా.

గురు॥ శాభాసు.

శిష్యు॥ అయ్యా సత్యం యెవ్వరూ నమ్మరు. అబద్ధాలు మహా నిబద్ధి అనిపిస్తుంది. వారు యెంతోవారు అనిపిస్తుంది. వున్నది వున్నట్టే సాధనలేకుండ అనాయాసంగా చెప్పి సూచన చేసినవారికి పస్తైన యిత్తా మంటే ఓ వారికి యేమీగావలె. మనకు ఏమిగావలె. మనకు యేమి వున్నది ఎక్కడికక్కడనే అనిపిస్తుంది. యెన్నడైన స్వయంపాకమైన

యిత్తామంటే అనుకూలపడదు. అబద్ధాలు చెప్పినవారి ఖర్మం మంచిది గనుక మనకు బుద్ధి పుట్టింది. వారికే ప్రాప్తివున్నది. బహువిద్యాభ్రాత్ నై అన్నమాట యథార్థంవలెనున్నది. అదియేమోకాని అధికులకు ప్రయత్నం చేసినా వారికి ముట్టదు. యిదియేమోకాని వారికే ప్రాప్తిలేదో మనకే భాగ్యం లేనో అన్నా యీ వింతు తెలియదుస్వామీ నాకు చాలుచాలు

గురు॥ యింకా యేమైన అడగమనే.
శిష్యు॥ యిచ్ఛలేదు నేను యేమిఅడుగుదు.
శ్రవణం చేసేటందుకు మూలం యేమీలేదు.
మననం చేసేటందుకు మూలం యేమీలేదు.
ధ్యాన్నం చేసేటందుకు శరీరము కొంచమైనా లేకుండ చేశే.
యేది చేసేటందుకు మూలం యేమీలేదు.
వున్నది వున్నట్టే వుండే.
సకల నిర్ణయాలు చేసే శరీరం కొంచమైనా లేకపోయె.

వున్న బట్టబయలుకు యెరుకలేదు కర్మాలు లేవు అని అన్నపుడు అందరికే యెరుకే. శరీరంలేనిదే వుండె గనక యేమీ నిర్ణయం చేసేటందుకు మూలం యేమీలేదు. వున్నట్టు తెలిస్తే చచ్చినట్టు పడివుండవలె అనే మాట కొంచం సూటివలెనున్నది. చస్తే శరీరం యేలాగు యేమీలేదో అలాగే.

గురు॥ గురుమూలంగా విచారిస్తే కలలో వచ్చిన యేనుగ మేలు కంటే యేలాగు యేమీలేదో ఆలాగే మూలంలేని యీ గుర్తిగే శరీరం యేమీలేదు. మళ్ళా యేమైన అనేటందుకు కలలో యేనుగ కొంచమైన యేమీలేదు గనుక అలాగే యీ శరీరం యేమీలేదు అని సూచన చెయ్యంగానే యెప్పటి పరిపూర్ణమే బట్టబయలు వుండే. తనకు ఆశక్యం యితరులకు యేమీ జాడ వచ్చీ యీలాగు గురుస్వామి మహాత్మువున్నది. యిషువంటి గురుసాంప్రదాయం యే భాశ్యంచాత జాడవస్తుంది. చదివి చదివి చచ్చేదేకాని యే చదువు యీలాగు వ్యావహారం శూన్యం అయ్యే టట్టు పడదు.

అందుకు అందరికీ శరీరమనే బ్రహ్మరాక్షసి పట్టి.
విభూతి కొందరికి పూస్తుంది.
తిరుమణి కొందరికి పూస్తుంది.
కొందరికి భాగవతమనే గొడ్డలి పెడుతుంది.
కొందరికి నిప్పులునిండా ముద్రల్లు పెడుతుంది.
కొందరికి యేమిలేకా వుత్త నొసట వుంచుతుంది.
కొందరికి కుంకుమ.
కొందరిని బోడవాండ్లు.
కొందరిని బ్రహ్మచార్ల.
కొందరిని సన్యాసుల చేసి.
కొందరిని ఆహితాజ్ఞులచేసి.
కొందరిని వుపాసకుల.

కొందరిని లింగధారులచేసి అందరిని మూలంలేని యీ గుర్తెరిగే శరీరమనే పరబ్రహ్మ యిన్ని తిప్పలు పెడుచుంది.

గుర్తెరిగే చైతన్యమునకు వకటైన వికారంలేదని అనుకుంచూ యిన్ని గుర్తెరిగే చేష్టలు చేసుకుంచూ యిదే బ్రహ్మమనే రాక్షసిని విడిపించేవాడు యెవడైనా వున్నాడో లేడో.
దేమహానే చెట్టుకు శంకరాచార్యులు అనే సన్యాసి గుర్తెరిగే జ్ఞానమనే చైతన్యాన్ని కట్టివేసినాడు.

వేశినమాత్రమేగాని వుంటే వుంచుంది. లేకుంటే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు.

కలలో వచ్చిన శరీరము మేలుకుంటే యేలాగు యేమీలేదో అలాగే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు.

నామరూపమేలేనిది తనకుతానే స్వతస్సిద్ధమై చలించక సార్వకాలం వకటీరుగా వున్నది.

స్వాములవారి అద్వైతం స్వాములవారితోటే పోయినది.
ద్వైతాద్వైతరహిత పరమతత్వమే వున్నది.
యిదే మహా అద్వైతం.

దశముఖుడు వేరే శతముఖుడు వేరే అన్నట్టు యెక్కడనంటే అక్కడ బట్టబయలై వున్నది.

మూలంలేని యీ గుత్తేదారిగే శరీరం యేమీలేకుంటే యేలాగు వున్నదో ఆలాగే వున్నది.

కాకపోతేనని చింతవుండేనా శరీరం వుండనే వున్నది.

కావలెనని యిచ్ఛ వుండేనా శరీరం వుండనే వున్నది.

అయితేనని నిశ్చయం వుండేనా మరి ఘట్టిగా వున్నది.

మూలంలేని యీ గుత్తేదారిగే శరీరం యేమి లేకపొయ్యేది స్వభావము.

యిటువంటి చంచలమైన శరీరాన్ని సత్యమని నమ్మి మూలంలేని యీ గుత్తేదారిగే శరీరమే నేను అని బ్రహ్మానుభవముచేత సకల అనుభవాలు చేస్తు అనుభవ వేదాంతమని ప్రసిద్ధి చెప్పుకుంటూ అచలం యొక్క జాడ యెరుగక అచలమందే వుండి అచలంలోనే సంచారము చేసుకుంటూ అచలం మాకు యెన్నటికైన జాడ దొరికేనా అని అనుకుంటూ సుఖ దుఃఖము సర్వకాలం అనుభవింపుకునుచూ వేదాంత కాలక్షేపముచేత అనేకమంది క్లేశపడుచూ వున్నారు.

శరీరలేని గురు సాంప్రదాయం కనుక్కొని సుఖదుఃఖ రహితము కావలెనని యెవరికి యిచ్ఛలేదు.

శీఘ్రంగా యేలాగు భ్రాంతిలేకపొయ్యేనని ప్రయత్నం చాయక సాధనలచేత క్లేశపడుచూ వున్నారు.

అత్యంత గురుసేవచేత అత్యంత గురుసాంప్రదాయం గలవారిని చూచి విద్వాంసులయొక్క శిష్య సాంప్రదాయం చూచి యే సిద్ధాంతం చొప్పున తగులక మహాద్వైత సాంప్రదాయం భేదాభేదరహితమైన గురు సాంప్రదాయం చూచి వారి సహవాసం దీర్ఘకాలంచేసి కనుక్కొనిన భ్రాంతి లేనివాడు అయి సర్వకాలం యేకప్రకారంగా యేలాగు వున్నాడో ఆలాగే వుంటాడు.

మూలంలేని యీ గుత్తేదారిగే శరీరముచాత సాధిత్తామంటే యిటు వంటివి అనేకకోట్ల శరీరాలు సాధనలు చేసినా పరిపూర్ణం దొరకదు

కొనకు కొన్నాళ్లు నేను గుత్తేరిగే జ్ఞానమనే బ్రహ్మాస్త్రము వేసనుకొని సకల సుఖదుఃఖగాలు సకల భ్రాంతులు వదలక భంగపడి కొనకు యేమీలేక పోయినారు.

యిటువంటి దగాపనులు మా మార్గంలో లేవు.

మేము లెస్స సమాధానంగా చూచి విచారించుకొని పుట్టని దావ నిది యీ బట్టబయలు అని మేము అన్నాము.

యీ బట్టబయలుకే మొదలు కొన లేదు అన్నాము.

యీ బట్టబయలే అచలమని అన్నాము.

యీ బట్టబయలుకు యెరుక లేదు గనుక కర్మాలు పుట్టనే పుట్టవు అన్నాము యీ బట్టబయలుకు శరీరం లేదుగనుక సార్వకాలం భోగించె య్యాదు అన్నాము.

యీ బట్టబయలుకు శరీరం లేదుగనుక క్రియాశూన్యమయింది అన్నాము.

యీ బట్టబయలు తనకుతానే స్వతస్సిద్ధమై సార్వకాలం వక్కటీరుగా సకలదేశాలయందు వున్నది అన్నాము.

యీ బట్టబయలే సార్వకాలాలయందు వక్కటీరుగా వక్కటయినా వికారంలేక వున్నది అన్నాము.

సార్వకాలాలు అంటే శరీరాలు రాకమునుపు యీ బట్టబయలే వున్నది.

మూలంలేని యీ గుత్తేరిగే శరీరము వుండగానూ వున్నది.

మూలంలేని యీ గుత్తేరిగే శరీరం యేమిలేకపోయినా యీ బట్ట బయలు వక్కటీరుగా చలించక సార్వకాలం వక్కటీరుగా వున్నది.

యీ బట్టబయలు గాక మరివకటి వున్నదని యీ బట్టబయలు యెరుగదు.

యీ బట్టబయలును జ్ఞానచక్షువుచేత వుండజూచినవాడు భ్రాంతి రహితుడు అవుతాడు.

శిష్యా॥ యీ బట్టబయలుకు బదులు మరియొక బట్టబయలు లేదు. అని అందరికి నమ్మికె కద్దు మనకు కూడ కద్దు. యెంతదూరంపోయినా

కెగిక అంతట దట్టంగా వెనక్కు ముందుకు లేక మనము ఏకమునునే ర ముందర స్వతస్సిద్ధమైయున్నది. యిటువంటి బట్టబయలు వున్నదో అని యెటువంటి మనిషికి సంశయం లేదు.

గురు॥ యీ శరీరాలు బట్టబయలు వలన పుట్టవుగదా కదిలినా నా వ్యవహారమే లేదు. యెటువంటి గడ్డితినే పాము అయినా యీ సులు వలన పుట్టినదనడం.

శిష్యు॥ అనమగాను యీ శరీరాలు అనేక ప్రకారాలుగా వున్నవి. గు నిర్మాణాలు ఆయె వక శరీరంవలె వక శరీరంలేదు.

యెద్దు వకతీరుగా వున్నది.
యెనుబోతు వకతీరుగా వున్నది.
గుఱ్ఱము వకతీరుగా వున్నది.
గాడిద వకతీరుగా ఉన్నది.
యేనుగ వకతీరుగా యున్నది.
లొట్టపిట్ట వకతీరుగా వున్నది.
కుక్క వకతీరుగా వున్నది.
పిల్లి వకతీరుగా వున్నది.
యెలుక వకతీరుగా వున్నది.
పంది వకతీరుగా వున్నది.
పాము వకతీరుగా వున్నది.
తేలు వకతీరుగా వున్నది.
కాకి వకతీరుగా వున్నది.
గద్ద వకతీరుగా వున్నది.

పక్షులు వకతీరుగా వున్నవి. యీ ప్రకారాన అనేక విధాలు శక్యంకాదు. యిన్ని విధాలు యెవ్వరు చేసిరి. యెవ్వరినుంచి యెవ్వరి సత్తాచేత వుండేది కానక యెవ్వరి వలన లయం ఆయె. యీ ప మానా సమాధానం అయ్యేటట్టు యిందరు స్వానుభవం అన్ని సంతోష ం వెంటనే భ్రాంతిలేక పొయ్యేటట్టు అనేక సాధనలు లేక వక్కసారి [illegible] నే స్వతస్సిద్ధం అయ్యేటట్టు వాళ్ళ సంశయం వున్నది.

[illegible]

టందుకు మూలం యేమీలేకుండా సకల భ్రాంతులు తోచకుండా శీఘ్రంగా మాకు సమాధానం అయ్యేటట్టు దయచేసి చెప్పండి. చెప్పా చుండగానే మాకు సమాధానం కావలె మహత్వరలో శ్రవణం చెయ్యండి అనె.

గురు॥ నీకు మహాతీవ్రం.

శిష్యు॥ తీవ్రంఅంటే మీరే అనేకమాట్లు యిదేకలా యిదేకలా అని చెప్పితిరి. గనుక దీన్ని నమ్మరాము అని తప్పున మీరే మేలుకుందురో నేనే తప్పున మేలుకుందునో మీ వంటివార్ని యెన్నటికి చూచేము. అను కుంచూ వుంటిమి. తప్పున మీకు మీరే వస్తిరి. గనుక వేగిరం చిక్క-విందామని యిచ్ఛ వున్నది.

గురు॥ సరేకాని నేను మేలుకుంటే నేను యేమీలేదు. నీకు యేమి.

శిష్యు॥ నాకు వినిపించేవారు యేరి.

గురు॥ సరే అందుకా అట్లైతే విను. నీవు యేమి.

శిష్యు॥ నేనా మూలంలేని యీ గుర్తిరిగే శరీరమును నేను.

గురు॥ సరే యీ బట్టబయలుకు వక్క-టైన యెరుక వున్నాదీ.

శిష్యు॥ దానికి యేమియెరుక. దానికి యెరుకలేదు.

గురు॥ యిన్ని శరీరాలు రాకమునుపే అది వున్నది. యీ శరీరాలు వచ్చింది యెరుగదు పోయింది యెరుగదు యిది అవాంతర దొరతనం. యీ బట్టబయలువలె శాశ్వతమయినది కాదు. దీనికి వక మూలం వున్నదిగాదు. యీ శరీరం చూచి నప్పటినుంచి అన్ని కండ్లపడుచున్నవి. యీ శరీరం యెప్పుడు యేమీలేదు. అని తనకుతానే తోచదు. యీ శరీరం తనకు తానే లేకపోవలె,

శిష్యు॥ కొనకు చస్తె యేమీలేదు.

గురు॥ ఛీ ఆలాగు కాదు. చావు లేనేలేదు. యీ శరీరానకు మూలం యేమీలేదు. కొనకు చావు యెక్క-డిది. చావుఅనే మాట మాత్రమే.

శిష్యు॥ సుషుప్తి అన్నట్టా.

గురు॥ ఛీ ఛీ ఆమాటలు విడువు. యీ శరీరం యేమిలేదు. లేకుంటె మంది సుషుప్తి అన్నారు. మళ్లా యేమిలేకపోతే మంది మరణం అని అన్నారు. యింతేకాని విచారిస్తె యీశరీరంయొక్క రాకడకు మూలం లేదు. వునికీ మూలంలేదు. పోవడకు మూలం యేమీలేదు. యీశరీము నకు స్వభావం వున్నట్టే వుండేది వెంటనేయేమీలేదు. మరి యిపుడు యెన్ని విధాల శరీరాలు చూస్తావో అపుడు కలలో యిన్నివిధాల శరీరాలు చూస్తావుగదా.

శిష్యు॥ అహ చూడనేచూస్త లెన్న గుర్తెరుగుతా ఆశరీరాలు నేను కొంతసేపు ముచ్చటాడుతాము యింకా వింత వింత అనేక శరీరాలు అనేక చిత్రవిచిత్రాలు లెన్నఅవి మమ్మల గుర్తెరుగును మేము వాటిని గుర్తెరుగుదుము మాకు వాటికి కొంచమైన యెక్కువతక్కువలేదు. రెండు సమానమే గుర్తెరుగుచూ ఉండగానే ఆశరీరాలు గుర్తెరిగే చైతన్య ముతో కూడా యేమీలేదు ఆశరీరాలు యీశరీరం రాకమునుపే గుర్తెరిగే చైతన్యమనే జ్ఞానము అనేక చిత్ర విచిత్రమైన కర్మాలతో యీ శరీరం యేమీలేదు. కర్మాలు లేని యీబట్టబయలు యిప్పటివలెనే వున్నది.

గురు॥ యేలాగు వున్నది.

శిష్యు॥ ఆలాగే వున్నది. యీశరీరం ఆశరీరాలు యెన్నితిప్పలుపడ్డా యేమీఅనదు చూడబోతే యీబట్టబయలులోనే ప్రపంచం వున్నట్టు వున్నది.

గురు॥ ప్రపంచానకు యీబట్టబయలుకు యేమీ సంబంధం లేదు.

శిష్యు॥ యీబట్టబయలు తాను చెయ్యాచెయ్యదు చేయించా చేయించదు తానేతాను అయివున్నది.

గురు॥ సరేకదా.

శిష్యు॥ సరే.

గు॥ యిపుడు నీకువక్క దృష్టాంతం చెప్పుతాను విను యీకలలో శరీరం వస్తేనే భ్రాంతివచ్చె ఆశరీరాలు యీశరీరంకంటె వేరేనా.

శిష్యు॥ యీశరీరమే అనేకశరీరాలు అయినది.

గురు॥ అయినావే మూలంలేని యీ గుర్తెరిగే శరీరానకు నానావిధ

శరీరాలు యీశరీరంవకటే వేరేతోచినవి యీశరీరంకంటే వేరేవరెకావు యీశరీరం అనేక చిత్రవిచిత్రాలుకాలేదు. మూలంలేని యీ గుత్తేరిగే శరీరం వున్నంతసేపు చిత్రవిచిత్రిపు శరీరాలుతో స్తావి యింతేకాని వచ్చే టందుకు మూలం యేమీలేదు.

శిష్యు॥ మూలంలేని యీ గుత్తేరిగే శరీరానను కల్పించే సామ ర్థ్యంలేదు.

యీలాగు అవాంతర పిశాచంవలె నున్నది.

తల్లిగారి పిశాచంకాదు.

తండ్రిగారి సంభంధంవలనవచ్చిన పిశాచంకాదు.

చుట్టాలదీకాదు.

అత్తగారి సంభంధందికాదు.

కాశికిపోంగా తోవలో అడ్డంతగిలిన బ్రహ్మఅనె రాక్షసివలె బ్రహ్మ రాక్షసికాదు.

మధ్య యీశలలోనే సన్యాసివచ్చి బ్రిహ్మరాక్షసిని పేరుపెట్టి మందికి తగులుపెట్టి పోయినాడు.

వున్న బట్టబయలుకు గుత్తేరిగే జ్ఞానమేలేదు. గనుక నేకర్మాలు లేక పేరూవూరూలేక తనకుతానే స్వతసిద్ధమై చలించక నాత్యకాలం వకటేతీరుగా వున్నది.

యీబట్టబయలుకు శరీరంలేదు గనుక వొకట్టైనా తోచదు.

సకలభ్రమలకు మూలంలేని యీ గుత్తేరిగే శరీరం.

యీశరీరం లేనివారికి యేమితోస్తుంది అనగా

మూలంలేని యీ గుత్తేరిగే శరీరం లేని యీ బట్టబయలుకు యెలాగుతోచదో ఆలాగే దృష్టాంతం యెలాగో ఆలాగే దార్ష్టాంతికమని సూచనకాగానే పుట్టనిచావని బట్టబయలే వుంచుంది అని అన్నారు.

గురు॥ మూలంలేని యీ గుత్తేరిగే శరీరం లేనివారి సహవాసం చేసిచూడవలెను.

శిష్యు॥ చూస్తె యెలాగుతోస్తుంది.

గురు॥ [illegible]

శిష్యు॥ విచారిస్తె.

గురు॥ దార్ష్టాంతం సూచనచేస్తారు.

శిష్యు॥ చేస్తే.

గురు॥ తాత్పర్యం చేసుకోవలె.

శిష్యు॥ చేసుకుంటే.

గురు॥ మూలంలేని యీ గుత్తెరిగే శరీరం వున్నంతసేపు తోస్తుంది. తోస్తువున్నా కొలది భ్రాంతి విడువదు.

శిష్యు॥ భ్రాంతి విడువకపోతే విచారానకు ఫలమేమి.

గురు॥ వున్న యీ బట్టబయలు తాను పుట్టదు పుటించదు. యీ బట్టబయలుగాక మరిహోటి శాశ్వతమయినది వక్కటైన వికారంలేనిది మరిహోటిలేదు. యీ శరీరం మధ్యనే తోస్తుంది. మధ్యనే యేమీలేదు. మూలంలేని యీ గుత్తెరిగే శరీరానకు సర్వం తోస్తుంది. యీ శరీరం యెప్పుడు యేమీలేకపోతుందో అప్పుడే యేమీతోచదు. యీశరీరాన్ని కలలో వచ్చిన యేనుగు మేలుకుంటే యేలాగు యెమీలేదో అలాగే యీ శరీరాన్ని చూడవలె అలాగు తాత్పర్యం అత్యంత శూన్యంగా విచారించవలె. విచారించక కలలోవచ్చిన యేనుగను పుణ్యానకు అమ్ముకుంటె పదివేల రూపాయిలు వస్తవని ఆశపడినా మేలుకుంటె యేమీలేదు. మూలంలేని యీ గుత్తెరిగే శరీరం చేత యేమి సాధనచేశినా కలలో యేనగను ఆశపడితే అమ్ముకునేటందుకు యెంత ఆశవున్నో ఆ ఆశవలెనే మేలుకుంటె యేమీలేదు. తనకుతానే దురాశ అని యెరుగు. ఆ దురాశ వంటిదే మూలంలేని యీ గుత్తెరిగే శరీరంచేత సాధిస్తా. పుట్టని చావని బట్టబయలు జ్ఞానిఆశ వూరికే కలలో వచ్చినట్టు తోచింది. తానూలేదు వుండనూలేదు. యేమీలేదు. మూలంలేని యీగుత్తెరిగే శరీరానకు మూలం యేమీలేదు. గనుకా వున్నట్టు వున్నది. వున్నాగాని మూలం లేని యీగుత్తెరిగే శరీరము యేమిలేదు. అని కలతోచినది. కలలోనే యేమీలేదు అని కలలోతోచిన శరీరాలు వెంటనే యేమి చింతలేక సర్వ శూన్యమయిపాయెను గనుక అలాగే మూలంలేని యీ గుత్తెరిగే శరీరం కొంచమైనా యేమిలేకుంటె పరమ శాంతం తనకుతానే అవుతుంది.

సాధనలచేతగాదు. కల తోచినట్టు మూలంలేని యీ గుత్తేరిగే శరీరం నేను అని తోచింది.

శిష్యు॥ తోచిన మాత్రమేగాని శరీరం అయినతేను.

గురు॥ సర్వకాలం శరీరంలేని పరిపూర్ణ స్వభావముచేతనే వున్నాడు. యిల్లు యాదివస్తే నాయిల్లు అని యీ శరీరం పోతుంది పోయి యెప్పుడైన వకవేళ నాకొడుకు అని యాదివస్తుంది. నాబిడ్డ అని యాదివస్తుంది. నా భార్య అని యాదివస్తుంది. సార్వకాలము పుట్టని చావని పరిపూర్ణ స్వభావమే సర్వకాలం యీ మూలంలేని గుత్తేరిగే శరీరమే అయివుంటే సార్వకాలం యెరుకేవుండు సార్వకాలం కర్మలే చేస్తువుంటు మధ్య తగులుతుంది మధ్యనే యేమిలేదు. సార్వకాలం మొదలు కొనలేని అచలమే.

శిష్యు॥ కాని మూలంలేని యీ గుత్తేరిగే శరీరం నెనేమో ఆశపుట్టా ఆశపడితే తాను అనుకున్నట్టు యేది అయింది. తాను వకటి అనుకుంటె వున్నది పూటి రాజమార్గం వుండంగా అడవికిపోవు తోనవలె మూలంలేని యీ గుత్తెరిగే శరీరం నెనేమో అనుకున్నా యిపుడు యెంతవారు అయినా తోవతప్పేదికద్దు. యెవ్వరైన యిది బాటకాదు అని రాజమార్గంలో పడవేస్తే మళ్ళా చిల్లరతోవలు నమ్మనట్టు మూలంలేసి యీ గుత్తెరిగే శరీరం యేమీలేదని చెప్పితే పుటని చావనిది మొదలు కొనలేనిది రాకడ పోకడలేనిది తనకుతానే స్వతసిద్ధమై చలించక వున్నది. సర్వకాలం యేక ప్రకారంగా వున్నది. దానికి ప్రతిబంధం మూలంలేని యీ గుత్తేరిగే శరీరమే మరిపూటిలేదు. తనకుతానే కలతోచినట్లు తనకు మూలంలేని యీ గుత్తేరిగే శరీరం తోచింది యీ తెరతీసే గురు సాంప్రదాయం కోట్లలోపల వొక్కరు వున్నారోలేరో.

గురు॥ వారి సహవాసంచేసి చూచేదాక నమ్మరాద తెరఅయితే గాలికి యెగిరి పొయ్యేది,

శిష్యు॥ సరె సరె,

గురు॥ శరీరాన్ని గట్టిగా రాళ్లగోడవలె నిలిపినవారు కొందరు గోడవలె నిల్పినవారు కొందరు. అందుకే శంకరాచార్యుల సంప

మానందు. మూలంలేని యీ గుత్తెరిగే శరీరమే బట్టతెరవలె వున్నది గనకా మేము పరమపదమనే వైకుంఠము బట్టతెర తీసినట్లు మూలంలేని యీ గుత్తెరిగే శరీరం లేని ఆచార్య కటాక్షంచేత నిరుహేతుక జాయమాన కటాక్షము గలిగినా యీ బట్టతెరతీస్తె అంతా వైకుంఠమే రెండో ప్రతిమ లేదు.

వైకుంఠంలోనే అనేక ప్రతిమలు వున్నవి.
వైకుంఠమును యెరుగవు.
బట్టతెర వున్నది.
తానుతీసుకోలేడు
తనకుతాను పోదు.
సామాన్యులు తీయలేరు
బట్టతెరవలె మూలంలేని యీ గుత్తెరిగే శరీరం వున్నది.
యీ తెరతీస్తె సకల దేశాలయందు యీశ్వరుడు వున్నడు.
యీశ్వరునకు కుంఠితంగాని వైకుంఠానకు వేరులేదు.
సకల దేశాలయందు వైకుంఠం వున్నది.
యెక్కడనైతె అక్కడనే విష్ణువున్నాడు.
యీ రహస్యం యెవ్వరికి తెలియవు.
విష్ణునారాయణ అని ప్రసిద్ధికద్దు.
అరచేతిలో వైకుంఠం మున్నది.

ఆచార్య కటాక్షంగలిగి మూలంలేని యీ గుత్తెరిగే శరీరమనే తెర తీస్తె కుంఠితంగాని వైకుంఠం తనకుతానె స్వతసిద్ధమై చెలించక సార్వకాలం యేక ప్రకారంగ వున్నది.

యేసిద్ధాంతం నమ్మినా మూలంలేని యీ గుత్తెరిగే శరీరంలేని రాజమార్గం లేదు.

మూలంలేని యీ గుత్తెరిగే శరీరంనునిల్పి యేమి చెప్పినా మునుపటి గాడిద వాలకంపోదు.

యిందుకే మొట్టమొదలు బట్టబయలు వున్నదిగదా అని నిత్యనూరుమార్లు పదిదినాలు చెప్పవలె గట్టిగావున్నది అని పదకొండోనాడు

అనేనా వీడు ఘట్టివాడే అని వాడిని దగ్గరవుండు మనవలె వుండి శేవవంచన లేక చేశేనా భ్రాంతిలేని రాజమార్గం సూచనచాయవలె మొద్దు ఆయనా వేగిరం సూచన చాయకూడదు. చేస్తే వ్యర్థం అవుచుంది వెయ్యిమాట్లికి వుపదేశం చెప్పి వుండవలె శరీరంలో కొంచం నిబద్ధి అని చెప్పెనా గురువు పుత్ర మిత్ర కళత్రాదిలతోటి నిర్మూలమయి వంశక్షయమయిపోతాడు అని భరద్వాజుడు పలికినాడు యేమి అని అంటె.

స్వః సమూలోవా ఏషపరిశుష్యతి । యోఽనృతమభివదతి
తస్మాన్నార్హామ్యనృతం వక్తుం॥

అని ప్రశ్నోపనిషత్తునందు వున్నది అందుకే ఛీ అని యెవ్వరికి అబద్ధాలు చెప్పకూడదు. అధికారి అయితే నిబద్ధి సూచనచేసేది. మూలం లేని యీ గుత్తేదారిగే శరీరానకు సార్వకాలం జగత్తుతోచే స్వభావం తనకుతానే కలతోచింది.

అందులో యెంతమంది సన్యాసులు తోచినారు యెంతమంది అనేక మయినవారు తోచినారు వారు గుత్తేదారుగే చైతన్య స్వరూపులా మరి హా స్వరూపులా.

శిష్యు॥ అందరు గుత్తేదారిగేవారే.

గురు॥ వారూ శరీరం సమానమా

శిష్యు॥ యెరుకతో వుండంగానే వారు యెక్కడికి పోయిరి, యెక్కడి నుంచి వచ్చినారుగనుక యెక్కడికి పోయిరి అని చెప్పుదు. తనకు తానే తోచింది వెంటనే యేమిలేదు.

గురు॥ తనకుతానే స్వతసిద్ధమయిన బట్టబయలులో తనకుతాను వచ్చిన శరీరం శరీరమే నేను అనుకొనుచున్నది. మూలంలేని యీ గుత్తేదారిగే శరీరం వుండంగా అనేక శరీరాలు తోస్తువున్నవి. కలలో వచ్చిన శరీరాలవలెనే మూలంలేని యీ గుత్తేదారిగే శరీరం యేమీలేదు అని మేలుకుంటే యెవ్వరికి తోస్తావి. యీ గుత్తేదారిగే శరీరం యేమీలేకుంటే యేమీతోచదు. కలలో వచ్చిన శరీరాలు మేలుకుంటే యేమీలేదు అని తనకుతానే ధృఢంవున్నది.

శిష్యు॥ యేమీ సాధన చెయ్యకుండానే తనకుతానే మూలంలేని

యీ గుర్తైరిగే శరీరం యేమీలేదు అని సరిపుచ్చుకోవలె.

గురు॥ యేమీ యెన్నడయినా కల తోచిన దేహాలు యేలాగు యేమీలేదో ఆలాగే మూలంలేని యీ గుర్తైరిగే శరీరం యేమీలేదు అని సరిపుచ్చుకున్నావు.

శిష్యు॥ సరిపుచ్చుకోలేను.

గురు॥ యెప్పుడున్నా

శిష్యు॥ యీ గుర్తైరిగే శరీరం కల తోచిన శరీరం మేలుకుంటే యేలాగు యేమీలేదో ఆలాగే యేమీలేదుఅని అనుకున్నా. నాకు స్మారకంవచ్చు. యెవ్వరు అనుకోరయ్యా పూరికే కలవంటిది యీ సంసారం అని అనుకుంటారు.

గురు॥ అప్పటిది అప్పుడేపోయె. యీ సరిపుచ్చుకుంటే వున్న దానికి శరీరం యేమీలేదుగనుక దానికి తోచనేతోచదు. అందుకే మూలంలేని యీ గుర్తైరిగే శరీరంకు తోచిన శరీరాలు వెంటనే ఏమీ లేదు అని దృఢం వున్నట్టు వుంటే చాలు. యిందుకు యెట్టైన సాధన చెయ్యవలె.

శిష్యు॥ యే సాధనచేస్తే కల దోచిన శరీరాలు యేమీలేదు అని దృఢం అయింది యేమీలేదు. తనకుతానే దృఢం వున్నది. యిక్కడ దృఢంతోకూడా ఏమీలేదు అనుకుంటూ వున్నా వున్నంతసేపు వున్నట్టు వున్నవి వెంటనే యేమీలేదు.

గురు॥ ఆలాగే గురుమూలంగా యెప్పుడు మేలుకుంటే అప్పుడే కొంచమైన శరీరం లేక కల తోచిన దేహాలవలె వెంటనే యీ గుర్తైరిగే శరీరం యేమిలేక. యీషత్తు ఆశపడ్డా అంతా వుంచుంది. యిది రాజ మార్గం.

ఇతి శ్రీశివరామదీక్షిత పరిభాషే వేదాంతవిచారణే
క్షేత్రక్షేత్ర ద్వయదోషరహిత ప్రకరణము
ఏకాదశోధ్యాయః

శ్రీగురుభ్యోనమః

# ౧౭॥ ఆత్మానాత్మ ద్వయదోషహారత ప్రకరణము

శ్లో॥ ఆకాశం నైవమాకాశం । సర్వమస్తినచాస్తిచ
ఇతిస్థితం సమం శాంతం । యస్తస్మైసంసుష్టుప్తివత్॥

గురు॥ మూలంలేని యీ గుత్తెరిగే శరీరం యేమిలేదు సిద్ధాంతమే సహాస్రసిద్ధాంతం.

కల దోచిన దేహాలు యీ దేహాలు చుట్టాలు వీరికి వారికి స్నేహం నిత్యా మీరు లెస్స వున్నారుగదా అని అన్యోన్య యోగా కద్దు. మీకు యేమి విపత్తులేదుగదా అని కల తోచినవారు మీకు మీరే దిక్కు మాకు మేమే దిక్కు అని వీరు వారు సమ చేసుకుంటారు.

కల॥ సరేకాని మనము చేసిన పుస్తకాలు చూస్తారుగదా.

జా॥ చూస్తారుగాని మనలోనే పోటీలు వున్నవి.

కల॥ అదేమి.

జా॥ వీరువారు సమానమే అని గులగుల పుట్టింది.

కల॥ యిక యీలాగు అన్నా.

జా॥ మనకు మూలం యేమీలేదు. కొనకు పవేసిం స్థానం యేమీలేదు అని పుట్టింది.

కల॥ అంతా యీ కల తోచిన దేహాలు వెంటనే గదా.

జా॥ ఆలాగే మూలంలేని యీ గుత్తెరిగే శరీరం అని కొందరు కనుక్కొంచువున్నారు.

కల॥ యేమిా యేమిా అట్లైతే మునిగే వెళ్లివచ్చినట్టే యీలాగు వున్నది యేమి సంతోషంలేదు. యింతమర్మా యే మనలో సామి దో్రహులువున్నారు. అట్లైతే దేవతాభ్రా లేదా

జా॥ మీరు యేమిలేకుంటే మీరాడు యేమి భ్రాంతి వున్నది.

ఆలాగే మూలంలేని యీ గుతేరిగే శరీరం యేమిలేదు అని సరి పుచ్చుకుంటే భ్రాంతికి మూలం యేమీవున్నది.

కల॥ అట్లైతే మనపనికూడా కూకుడువేళ్లకు వూడిపాయ. యిప్పటిది ఆలాగే వున్నది.

జా॥ యెంతఅయినా యీ శరీరంలో గ్రహించేనా కదలక మనమంతా వుందుము. యీ దరువాజ తగులబెట్టితే యేకబాట ఆయ.

కల॥ యిది యెవ్వరి తరం.

జా॥ మొదలు కొనలేని యీ బట్టబయలు వెయ్యిమార్లు వుపదేశించి చెప్పేది. కల దోచిన శరీరాలు వెంటనే యీలాగు యేమిలేద ఆలాగే మూలంలేని యీ గుతేరిగే శరీరం యేమిలేదు అని తాత్పర్య మయితే యిప్పటి పరిపూర్ణం తనకుతానే స్వతస్సిద్ధమై వున్నది.

కల॥ మనకు చోటుయేది మొదల శక్యంకాకుండా ఆయ. మహాచాటిలు చెప్పినట్లు రాను వెంటనే యేమిలేదు. మమ్ములను మవాండ్లు మీ జాడ కనుక్కునిరి. మీరు జాగ్రతచాత వుంటరారు. మీ యేమిదిక్కు మాకు యేమి దిక్కు వెనక యేమిలేదు ముందర యేమి మగడులేని ముత్తైదువతనం యంతకని ఆపశరం. కాని యీలాగే ఆలాగు మనస్వభావమె లేదు. మనము దేనియందువున్నామో అదే పోదుగదా.

జా॥ ఉందరికీ అదే ఆశ.

గురు॥ యేమిలేనిది యేమిలేదు వున్నదిరాదు పోదుగదా.

శిష్యు॥ సార్వకాలం వక్కతీరే దీన్ని యెంతనమ్మినా యేశీఘ్రంగా యీ బట్టబయలు వున్నదనినమ్మి మూలంలేని యీ గు శరీరం యేమిలేదు అని తాత్పర్యంచేసుకో వలెను.

గురు॥ యీ గుత్తేరిగే శరీరంచేత లేదు లేదు అంటె ం రమే వుంచుంది కలదోచిన శరీరం కొంతవున్నదా,

శిష్యు॥ యేమిలేదు.

గురు॥ ఆ శరీరాలు యేమయిన అనుకునుచున్నవా.

శిష్యు॥ యేమీ లేదు యేమి అనుకుంచావ్.

గురు॥ ఆలాగు మూలంలేని యీ గుర్తెరిగే శరీరాన్ని తాత్పర్యం చేసుకుంటే పరిపూర్ణం చెలించక తనకుతానే స్వతస్సిద్ధమై వున్నది. విచారించాతనేకాని సాధనచాతకాదు. అట్లైతే శ్రమమాత్రమే.

శిష్యు॥ అట్లైతే యెందుకు శ్రమపడవలె. పుట్టనిచావని బట్టబయలు తనకుతానే స్వతస్సిద్ధమై చలించకవున్నదిగదా.

గురు॥ యీ బట్టబయలు శాశ్వతంగా వుండనేవున్నది. యిఘ యేమిఅంటే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం అగంతుకం. కల తోచి నట్టు దేహం తోస్తుంది. యిందుకు యుక్తి.

కల తోచిన దేహాలు వెంటనే యేమిలేదు అని తనకు యేలాగు దృఢమో ఆలాగే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు అని తాత్పర్యం అయితే సరి.

యీ రెండు దేహాలు ఆగంతుకాలే
కల తోచిన దేహాలు యీ దేహాలు వక్కటే.
రెంటికి మూలం యేమిలేదు అని తాత్పర్యం అయితే సరి.
మధ్యవచ్చి మధ్యపొయ్యే వాటికి మధ్యనే తోచింది.
మధ్యనే యేమిలేదు.
మూలంలేని యీ గుర్తెరిగే శరరం లేకుంటే యేమితోచదు.
సకల భ్రాంతులకు మూలం మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే.
శరీరంలో కొంత సత్యమని ఆసపడ్డా అంతయెప్పటివలెనే వుంచుండి.
శరీరం పుట్టకమునుపే మొదలుకొనలేని యీ బట్టబయలు తనకు తానే స్వతస్సిద్ధమై యున్నది.
వుండి తాను పుట్టదు.
రెండోదాన్ని పుట్టించనే పుట్టించదు.

సార్వకాలం చెయ్యక చేయించక తనకుతానే జ్ఞానకర్మ సాధనధ్యేయంయొక్క అపేక్షలేక జ్ఞానంచేత కర్మాలచాత సాధ్యంకాక వక్కటేరుగా వున్నది.

సాధనసాధ్య పరామర్శరహితమై తనకు తానే స్వతసిద్ధమై వున్నది.

మూలంలేని యీ గుణ్తెరిగే శరీరం యేమిలేదు అంటే తనకుతానే విచారించాత కలలోవచ్చిన శరీరాలు అంటనే తనకుతానే యేమిలేదు, అని దృఢం ఆయినట్టు మూలంలేని యీ గుర్తెరిగే శరీరం అలాగుకొంచ మైన యేమిలేదు. అని తాత్పర్యం లెస్సఆయితె యెప్పటిబట్టబయలే స్వతసిద్ధము వున్నది.

ఆత్మ అనాత్మలనే అడవిలో వుండెనా నరఅడవితప్పదు.

సకలభ్రాంతులకు మూలం.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే గనుక యిదిద్వైతాద్వైత రహితపరమ తత్వం.

ఇతి శ్రీశివరామ దీక్షితప్రభావేవేదాంత విచారణే
ఆత్మానాత్మ ద్వయదోషరహిత ప్రకరణము.
ద్వాదశోధ్యాయః.

---

శ్రీగురుభ్యోనమః

# ౧౩॥ ఆత్మబ్రహ్మాపాదిద్వయదోషరహిత ప్రకరణము.

శ్లో॥ దృశ్యదర్శనయోర్లీనం । క్షణక్షణవినాశనోః ।
కేవలేదక్షిణాక్షిణం । రూపనామామచేతనం॥

గురుః మూలంలేని యీ గుణ్తెరిగే శరీరం యేమిలేదు అనేసిద్ధాంతము రాధ్ధాంతము రాధ్ధాంతము సిద్ధాంతము.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని కలలో వచ్చిన శరీరాలవలెనె యేమిలేదని సాధనలు చెయ్యండె తనకుతానే భ్రాంతి రహితం ఆయనా పుట్టని చావనిది రానడపోకడలేనిది జ్ఞానకర్మ శూన్యమైంది, బంధమోక్ష శూన్యమయింది బేధాబేధ రహితమయింది జ్ఞానభక్తివైరాగ్యాలు శూన్యమైంది శరీరాలలో ప్రవేశించనిది వెళ్లిపోనిది సకల

దేశాలయందు సార్వకాలాలయందు సమస్తమైన వస్తువులయందు తనకు తానే తనంతది రెండోది లేక తనసంభంధం శరీరాలుగాక తనకుతానే ఆ శరీరాలయందు వున్నా అనేకభేదాలుగాక సార్వకాలం భోంచెయ్యకా వుదక పానమైన చెయ్యకా సుఖ దుఃఖాలయొక్క గంధమాత్రమైనలేక మహా ద్వైతమనే నామముధరించక నామరూపము లేక సార్వకాలం వక్కటైన వికారంలేక చదువుకోక మరచిపోక లింగత్రయంగాక యీలాగున్నదో ఆలాగేవున్నది యిచ్చాలేదు శరీరంలేదు గనుక.

మూలంలేని యీ గుత్తెరిగే శరీరం వక్కటేకాని రెండోశరీరం లేదు శరీరంవున్నంతశేపు స్వప్నావస్థేకాని రెండోఅవస్థలేదు వక్కటే దేహం వక్కటేఅవస్థ. నాలుగుదేహాలు నాలుగుఅవస్థలులేవు. గురు మూలంగా దృష్టాంతంవలె తేలుకుంటె అప్పుడే జాగ్రత అంతపర్యంతం లేక భ్రిమకు మూలంవక్కటే అయ్యె రెండోదియేమిలేదు అదియేదిఅంటె మూలంలేని యీ గుర్రెరిగే దేహ అయ్యె.

మూలంలేని యీగుర్రెరిగేశరీరం వున్నంత శేపూ కాశేపూ అయోని సంభవుల గుర్రెరుగుచుంది. వెంటనే మూలంలేని అయోని సంభవులుతోచి మెరుకవుండంగానే యేమిలేదు యోనిసంభవులు ఆలాగే గర్భిణి వద్దినుంచి తోచి నేను గుర్రెరుగంగానే యేమీలేదు కలతోటే అయోని సంభవులు తోచిరి కలతోటే యోని సంభవులుతోచిరి వారు యేమిలేదు వీరు యేమి లేదు. నాకు తనకు తానే దృఢంవున్నది.

శిష్యు॥ గాని నావర్తమానం కల్లగావున్నది.
గురు॥ అదే.

శిష్యు॥ నేను యోనిసంభవున్ను అయోనిసంభవున్ను కాశ్శేపు వారు వస్తె వారివలెనేవున్న వీరిని చూస్తె వీరివలెనే వున్న.

గురు॥ అట్టెవిచారిస్తె ఆదేహాలకు మూలం యేమీలేదు. యీ దేహాలకు మూలంయేమీలేదు. రెండూసమానము. అవ్వి శాశ్వతమయిన యీ బట్టబయలుకావు యివ్వి శాశ్వితమైన యీ బట్టబయలు కావు. అవ్వి మొదలుకోన వున్నవే యివ్వి మొదలుకోన వున్నవే.

వాటికిరాకడ పోకడకద్దు. వీటికి రాకడపోకడకద్దులని నాకుతోస్తు వుంది. మంది అనుకోంగావించున్న.

గు॥ యదార్థంగా విచారిస్తే తోచడం మాత్రమేకాని ఆదేహా లకు మూలం యేమీలేదు. యీ దేహాలకు మూలం యేమీలేదు. రెండు సమానమే ప్రవేశించేటందుకు స్థానంయేమీలేదు. మూలంలేని యీ గుణ్తేరిగే శరీరం నేనుఅని అనుకున్నంతసేపు యీ ప్రకారానతోస్తుంది. మూలంలేని యీ గుత్తరిగే శరీరం యెపుడు యేమీలేకపోతే అప్పుడే యేమీతోచదు.

శిష్యు॥ తోచకుంటె.

గురు॥ సుఖం యేమీలేదు. దుఃఖం యేమీలేదు.

శిష్యు॥ అట్లైతే సర్వశూన్యమా.

గురు॥ అట్లైతే శరీరంలో కొంతవుంచుకొన్నా వుంచుకోవలె.

శిష్యు॥ వుంచుకుంటె.

గురు॥ శరీరంయావత్తు వుంచుంది.

శిష్యు॥ వుంటెయేమి. చల్లలో వెన్నవుంటె బాధయేమి.

గురు॥ అదియేమి. పెరుగుతరిస్తె పెరుగులోనే పుట్టింది.

శిష్యు॥ చైతన్యం దేహంవలన పుట్టింది. అనినేను యెన్నడువిన లేదు.

గురు॥ పెరుగు కవ్వంచాత తరిస్తే వెన్నపుట్టింది అని అందరికి యెరుక. దేహంలోవున్నది గుత్తరిగే జ్ఞానం దేహంవలన పుట్టుచుంది. త్రిగుణాత్మకం దేహాది పదార్థాలను గుత్తరిగేభావం సత్వగుణంవలన పుడుచుంది.

శ్లో॥ పదార్థవాచజ్ఞానస్య సత్వకార్యత్వాత్
శ్లో॥ సత్వాత్సం జాయతే జ్ఞానం మితిశ్రుతేః
శ్లో॥ జాగ్రదవస్థాయాంచ జ్ఞానాధిక్యాత్ ॥
శ్లో॥ చిజ్జడం నామయోర్ద్రష్టాః సొచ్చుతః॥
అని శ్రుతివున్నది. నాశరహితత్వైంది అచ్చుతుడు అనివున్నది.

శిష్యు॥ అట్లైతే.

శ్లో॥ జాతస్య హిధ్రువోమృత్యుః
అని వున్నదిగనుక శరీరంతోకూడా యేమీలేదు.

గురు॥ అబ్బా యిదిఅందరూ అనుకుంచూవున్నారు.

శిష్యు॥ గాఢనిద్రలో మూలంలేని యీగుత్తేరిగే శరీరం యేమిలేదు అనిలేస్న ప్రసిద్ధికదు.

గురు॥ శరీరం వున్నంతశేపే.

శిష్యు॥ శరీరం లేకుంటె.

గురు॥ యేగినాదు.

శిష్యు॥ అట్లైతే సర్వశూన్యనా.

గురు॥ తనతానే నేమీలేదు. నన్నేమంచావు.

శిష్యు॥ శరీరానకు మూలం నేమీలేకుంటె దానిబ్రతుకుయేమి.

గురు॥ యిపుడునాకే ఆ జానిసంభవాలు కలలో అనేకశరీరాలు తోచినావి. గుఱ్ఱేంరిగేజ్ఞానంతోకూడ తోచీనవి. వెంటనే. వెంటనే యేమి లేమ మన ఆశచాత శరీరాన్ని కొంతకట్టివేసుకుంటె వుండదలచిందేయేమి.

శిష్యు॥ కాదు అట్లైతే జ్ఞానందొడ్డని అనిప్రసిద్ధి యెందుకువున్నది.

గురు॥ లోకంలో పాపాత్ములు ధర్మంచేస్తే మహావొడ్డవాడు అని ప్రసిద్ధివలె కొంచం సగుణంవుంటే ప్రసిద్ధికద్దు.

శిష్యు॥ అబద్ధానకు జీవనం ప్రసిద్దే.

గురు॥ రాళ్లు దేవతలని ప్రసిద్ధిలేదా పూజలుచెయ్యరా దాంబేమి పంచకంతాగరా, పెండతినరా, యీలాగే లోకవాడికే

శిష్యు॥ యీ బట్టబయలు పారిపోచుందా యేమి.

గురు॥ మూలంలేని యీ గుత్తేంరిగే శరీరంవున్నా యేమిలేదు. శాశ్వతమయినదానికి యేమిలేని యీగుత్తేంరిగే శరీరానకు యేమిపాటి యేమిలేని యీ గుత్తేంరిగే శరీరంలో కొంతనిబద్ధి కొంతఅబద్ధం అని కుక్కలవలె మొరెగిందాకాయేమి. దాడిదవలె కూసిందాకాయేమి నక్కలవలె వర్లిందాకాయేమి.

శిష్యు॥ పశువులకు నోరులేదా యేమి.

గురు॥ మనుష్యులు మూలంలేని యీ గుత్తేంరిగే శరీరాలలో

కొంతనిబద్ధి కొంతఅబద్ధమని అనుకోంగావిని ఛీ వారివలె మనము మాటలు ఆడవద్దుఅని వూరికే వుంచున్నది మనుష్యులు యెంతభ్రాంతులు అని అనుకొనుమాటె అబద్ధమని నోరుమూసుకొని మొదలుకొనలేని దానిలో పడ కుంచావి. అవిపుట్టని చావని దానియందే వున్నావి. దాన్ని యెరుగవు. మూలంలేని యీ గుత్తెారిగే శరీరం యేమిలేదు అని దృఢంగా యెరుగు.

శిష్యు॥ వున్నప్పుడు మనుష్యులతో సర్వసమానం.

గురు॥ సమానమేకాని అబద్ధాలుఆడవు. మూలంలేని యీగుత్తెారిగే శరీరములో కొంతనిబద్ధి అనేది యెందుకు అనుకున్నావు.

శిష్యు॥ వాదించేటందుకు.

గురు॥ వాదనకు మూలంలేని యీ గుత్తెారిగే శరీరమే మూలం. మూలంలేని యీ గుత్తెారిగే శరీరం యేమిలేదని మేలుకుంటె వాదం యేమి,

శిష్యు॥ వాదం యేమిలేదు.

గురు॥ వున్నపరిపూర్ణం వాదించదుగదా.

శిష్యు॥ వాదించనే వాదించదు.

గురు॥ దానికి యెరుకఅనే జ్ఞానమేలేదు. కర్మాలు యెలాగుపుడు చావి,

శిష్యు॥ జ్ఞానకర్మరహితమైంది పరమతత్వం.

గురు॥ యిదితత్వం వంటిదికాదు లక్ష్యంలేనిబాట.

శిష్యు॥ లక్ష్యంవుంటె.

గురు॥ అన్ని లక్షణాలె లక్ష్యభ్రాంతిచేతనే అన్ని లక్షణాలు తోస్తు వున్నవి. లక్ష్యంలేని యీ బట్టబయలుకు యేమిలక్షణభ్రాంతి వున్నది. లక్ష్యం భ్రాంతికి మూలం.

శిష్యు॥ లక్ష్యంలేకుంటే.

గురు॥ లక్షణాలు అనే స్వరూపానకు మహాకోపం అందుకే లోకంలో గురియనివ్వదు. లక్ష్యంవుండెనా లక్ష్యం తనకుసూటిగా లక్షణంను కల్పింస్తుంది.

శిష్యు॥ లక్ష్యంఅంటె.

గురు॥ స్వరూపం.

శిష్యు॥ లక్షణమంటే.

గురు॥ స్వరూపాన్ని కల్పించేది లక్ష్యంవున్నంతసేపు అనేకలక్షణాలు అనేకస్వరూపాలు తోస్తాయి. అందుకే లక్ష్యంలక్షణాలు వక్కటే కార్య కారణాలకు భేదంలేదు. గనుక భ్రాంతికిమూలం అన్యోన్యం లక్షణమనే స్వరూపంలేకుంటె లక్ష్యంశూన్యమే, లక్ష్యంజ్ఞానం లక్షణంచేసేది కర్మలు జ్ఞానకర్మలు, మోక్షసాధనాలు అని ప్రసిద్ధికద్దు. లక్ష్యాలక్షణ రహిత మయినది పరిపూర్ణం లక్షణంక్షేత్రం లక్ష్యంక్షేత్రజ్ఞస్వరూపం లక్షణ జన్యం లక్ష్యం.

శ్రు॥ సత్వాత్సంజాయతేజ్ఞానం.

అనివున్నదిగనుక,

శ్రు॥ లక్షణాపేక్షయాలక్ష్యం.

విషయంవుంటెనే విషయి దేహంవుంటేనేదేహిదృశ్యం వుంటెనే దృక్కు పోని ఆముచ్చటయేమి మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నంత సేపు వ్యవహారం. యిప్పుడు యీమూలంలేని గుర్తెరిగే శరీరం యేమిలేదు, అని సరిపుచ్చుకుంటె అప్పుడే పరిపూర్ణం తనకుతానే స్వతసిద్ధమైయున్నది.

ఇతి శ్రీశివరామదీక్షిత ప్రబావవేదాంత విచారణే
ఆత్మబ్రహ్మాపాది ద్వయదోషరహిత ప్రకరణము
త్రయోదశోధ్యాయః.

---

శ్రీగురుభ్యోనమః

# ౧౪॥ జీవేశ్వర ద్వయదోషరహిత ప్రకరణము.

---

శ్లో॥ రూపవస్తోమనోనాశో । యొమయొక్తోరఘుద్వహ
విదేహముక్తోవాసా । విద్యతేనిష్కళాత్మకః॥

మూలంలేని యీగుర్తెరిగేశరీరంయేమిలేదు అని రాద్ధాంతమేసహస్ర

సిద్ధాంతము.

మూలంలేని యీ గుర్తెరిగేశరీరం జీవుడు.

మూలంలేని యీ గుర్తెరిగేశరీరం యీశ్వరుడు.

మూలంలేని యీ గుర్తెరిగేశరీరమే ఆత్మబ్రహ్మ.

మూలంలేని యీ గుర్తెరిగేశరీరం యేమిలేకుంటె యేమిలేని పరిపూర్ణం తనకుతానే స్వతసిద్ధమైయున్నది.

అదియెటువంటిదియంటె యేమిలేనిపరిపూర్ణం తనకుతానే స్వతసిద్ధమయియున్నది

జ్ఞానకర్మ శూన్యమయింది.

పుటని చావనిది.

రాకడ పోకడలేనిది.

సార్వకాలం వక్కటీరుగానే వున్నది.

మూలంలేని యీ గుర్తెరిగేశరీరం వున్నదని భ్రాంతి వున్నంతశేపు అనేక శరీరాలు తోస్తువుంచావి.

పరిపూర్ణానకు శరీరంలేదు గనుక యేమితోచదు.

కలతోచినా తనకుతానే యేమిలేదు అనిధృడంవున్నట్టు ధృడం మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు అని దృడం సంపాదించి వాటివలె అత్యంత శూన్యంగా మూలంలేని యీశరీరాన్ని తాత్పర్యం చేసుకోవాలె

శిష్యు॥ చేసుకుంటె,

గురు॥ కలతోచినది యేమిఅనుకోక యేలాగు సర్వశూన్యమయిపోయనో ఆలాగే మూలంలేని యీ గుర్తెరిగే శరీరాన్ని సరిపుచ్చుకోవలె.

తానుయేమిలేకపోవలె.

అదికఠినంకాదు.

మూలంయేమిలేదు.

కలతోచినది మేలుకుంటె యేలాగో ఆలాగేశరీరాన్ని సరిపుచ్చుకోవలె.

శిష్యు॥ సరిపుచ్చుకుంటె.

గురు॥ భ్రాంతియేమిలేదు యీశరీరం కొంచంవుంచుకున్నా అంతా మెప్పటివలనే పరిపూర్ణం యన్నటికి జాడరాదు.

యీశరీరంవున్నట్టు వున్నది యదేబట్ట తెరవలెవున్నది దీనికివున్నదని భ్రాంతిదీనికే.

తనకుభ్రాంతి వున్నదనె భ్రాంతి యెన్నటికిలేదు.

శరీరంలోనిది.

పరిపూర్ణంగనుక గ్రహణం పట్టె విడిచె అన్నారు.

పట్టాలేదు విడువాలేదు.

సార్వకాలం వకటితీరుగా వున్నది

వున్నదిమరువకుంటే యీశరీరం యేమిలేదు.

యీశరీరం యేమిలేకుంటె వున్నది అదే.

వున్నదాన్ని సార్వకాలం మరువకవుంటావా యీశరీరం యేమీ లేదని సరిపుచ్చుకుంచావా.

శిష్యు॥ నాకు యేమితెలియదు.

గురు॥ యేమిలేని యీశరీరంతోటి సాధ్యంకాదు అదిస్వతసిద్ధమై యున్నది.

శిష్యు॥ గనుక దీనికి యాలాగుయుక్తి.

గురు॥ కలదోచిన శరీరాలుయేమి ఆయె.

శిష్యు॥ యేమిలేదు.

గురు॥ అలాగె మూలంలేని యీగుతేఃరిగేశరీరం యేమిలేదు.

శిష్యు॥ యీలాగుఅనుకోనా.

గురు॥ అనుకొంచూవుంటె యీశరీరంవున్నట్టా లేటా.

శిష్యు॥ అనుకొంచువుంటె వున్నట్టె.

గురు॥ కలతోచినశరీరాలు మేలుకుంటే యేమయినా వున్నావి.

యేమిలేదు.

గురు॥ యేమీలేకుంటె యీశరీరాలు యేమనుకుంచావి.

శిష్యు॥ యేమిఅనుకోవు.

గురు॥ యీశరీరం యేమిలేకుంటె యేమిఅనుకోంది అనుభవించుంది
శిష్యు॥ యేమిలేదు.
గురు॥ యిఘుఅడగకు నాకువ్యాసటవస్తుంది.
శిష్యు॥ సరేకాని నాకు మహాశ్రమతోస్తుంది.
గురు॥ తోస్తె నీవుయెట్టివాడవు.
శిష్యు॥ నేను యేమిమూలంలేని యీ గుర్తెరిగే శరీరం కలతోచిన శరీరంవలెనే సూచనచేస్తిరి.

అలాగే శరీరం వెంటనే యేమీలేదు.

గురు॥ కులం దేనికి, గోత్రం దేనికి అపుడుయేదివున్నది.

శిష్యు॥ అట్లె తేసరే మరీసులభం వున్నది.

గురు॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం పుట్టకమునుపు కల తోచలేదు. యీభూమితోచలేదు, తోచేటందుకుమూలం, మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే గనుక యీశరీరాలకు శరీరాలే మూలం కనకా వకవేళలేకుంటె తనకుతానే స్వతసిద్ధాలు కల్తోచినట్టు వీటికి హా తీరు మర్యాదలేదు. యీజగత్తు అవాంతరం సార్వకాలం తనకుతానే స్వతసిద్ధమై వున్నది. పరిపూర్ణం చెల్లించక వున్నది. దానికీ యీశరీరాలకు కొంచమైన సంభంధంలేదు. తనకుతానేవచ్చేది తనకుతానే వుండేది, వెంటనే యేమి లేదు. మొట్టమొదలు బట్టబయలువున్నదని ధృడంచేసుకొని మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదని తాత్పర్యంచేసుకుంటె కలతోచదు. యీభూమి మొదలైనదితోచదు సార్వకాలం మొదలుకొనలేని యీ బట్ట బయలు వుంచుంది.

శిష్యు॥ యిదిసరే మరీచులకన.

గురు॥ కలతోచినది యేమిలేదు అనితోచినావున్నది. వున్నట్టే తోస్తువుంది, కలతోచేటందుకు మూలం యీశరీరమే కనక యీశరీరం మొదలు యేమిలేదు అని మేలుకుంటెచాలు.

శిష్యు॥ సరేకాని యిన్ని మాకుయెందుకు, మీకుయేమాగణించాత భ్రాంతిలేకపోయిందో అదేమాకు సూచన చెయ్యండి మీవలెనె మాకు

భ్రాంతిలేకుంటె సరి.

గురు॥ నావలెనిూకునమ్మికవుండవలెగదా.

శిష్యు॥ నిమ్మికగలిగెలాగ సూచనచెయ్యండి.

గురు॥ అల్లైతె మూలంలేని యీా గుత్తెరిగే శరీరం యేమిలేదు.

శిష్యు॥ యేమిలేకుంటె యేమిలేదు. సర్వశూన్యమా.

గురు॥ ఆహా మూలంలేని యీా గుర్తెరిగే శరీరం యేమిాలేకుంటే యాలాగో ఆలాగే యేమిలేదు.

శిష్యు॥ అదేజాడ. యిదివొక్కటైన భ్రాంతికి మూలంలేని రాజమార్గం యిటువంటివారుశ్రవణం చెయ్యరు, ధ్యానంచెయ్యరు, మననం చెయ్యరు.

గురు॥ అదె.

శిష్యు॥ అంటేవున్నది, వున్నట్టెవున్నది, లేనిదిలేకనేపొయ, యిక యేమిచేసెటందుకు మూలంయేమివున్నదని భ్రమపడ.

గురు॥ యిదేపెద్దలయొక్క విచారం యింతకంటే దొడ్డమార్గం లేదు. అని అనేకమంది శాంతిపొందినారు అందరివలెనే వుంటారు వారి జాడవారిఅంతవారికేగాని మరివకరికి తెలియదూ.

యేసిద్ధాంతమునమ్మినా మూలంలేని యీా గుర్తెరిగే శరరమే చేసింది కనక అనేకకోట్లలోపలవిచారిస్తె మూలంలేని యీా గుత్తెరిగే శరీరం విచారించకు తనకుతానే స్వతసిద్ధమయి చెలించకవున్నది. యన్నటికి లేకపోదు. యీా శరీరములేకమునుపు తనకుతానే స్వతశిద్ధమై వున్నది వొక్కటైన వికారములేదు పరిపూర్ణమైన యీాశ్వరునకు చలనం యన్నటికి లేదు యన్నటికి పుట్టుకచావదు.

అనేక బ్రహ్మాండాలు వచ్చెవుండె వెంటనే యేమిలేదు. యీా మాయవున్నది అంటెయేమిలేదు. లేదుఅంటేసర్వం మూలంలేని యీా గుత్తెరిగే శరీరాలు అయ్యిలోస్తుంది. భాగ్యవిశేషంచేత తనకుతానే శరీరంలేని గురుసాంప్రదాయందొరికెనా ధనార్జనంకొరకు శిద్ధిక్రియవేరు త్రవ్వబోయితె ఆచెట్టుక్రిందనే అనేకకోట్ల మొహరీలు భావిదొరికినట్టు.

మొదలుకొనలేనిది, రాకడపోకడలేనిది, పుట్టనిచావనిది, తనకుతానే స్వతసిద్ధమై చలించకవున్నది. సకలదేశాలయందు సార్వకాలలాయందు సమస్తమైన వస్తువులయందు లోపటబైట అనక రెండోది అయినశరీరాన్ని యెరుగక స్మరించక యెందులో ప్రవేశించక వెళ్లిపోక యీలాగువున్నదో ఆలాగే శాశ్వితంగ వున్నది.

మూలంలేని యీ గుత్తేరిగే శరీరమే నేను అనిసార్వకాలంయేత్వాలు పీత్వాలు చేస్తువుండేవారికి యెన్నటికిదొరకక మాలవాండ్లవలె మెమే యెక్కువ మాదిగవాండ్లవలె మెమేతక్కువఅనినమ్మకొని మాదిగవాండ్లవలె చచ్చినగొడ్లదియింతబిక్షంఅడుగుకొని వండితినుకొంచు మాలదాన్ని మాదిగ వాడు అంటుకుంచూ మాదిగదాన్ని మాలవాడు అంటుకొంచు యీకల తోటే కాలంగడిపినవారికి యేదిగతో అదేగతిగాని

యీపుట్టనిచావనిదాని జాడదొరకక ఆలాగే దేహమేనేను అని నమ్మివున్నవారివలె వుండక, శీఘ్రంగా శరీరంలేని గురుసాంప్రదాయం గల వారినిచూచి యీ శరీరానకు మూలంయేమి అనిఅడిగి పుట్టనిచావనిజాడ యదార్థంగా కని దేహభ్రాంతి కొంచమైనలేకుండ దృష్టాంతంచాత సూటి బడచూచుకొని సార్వకాలం శరీరంలేక పరిపూర్ణంవున్నది వున్నట్టుపడితె విచారణకు ఫలం సూటిపడకపాయనా అందరివంటివాడే అయికాలంగడిపినా అందరుయెక్కడికి పోచారో అక్కడికిపోచాడు.

శిష్యు॥ మీశరీరానకు మూలంయేమిలేదని మీరుఅంటిరి కొనకు ప్రవేసించేటందుకు స్థానంయేమీలేదు అంటిరి వున్నప్పుడు వున్నదితెమెమొ అని అందరు అనుకుంటె మూలంలేని యీ గుత్తేరిగే శరీరం యేమిలేదు అని మీరేశ్రవణంచేస్తిరి. యీలాగునిర్ణయం అయినవారికి యేమి భయం.

గురు॥ అట్లైతే యీలాగు నీకుధృడమేనా.

శిష్యు॥ వున్నదివున్నట్టెపడె.

గురు॥ యీలాగుధృడంవుంటెనరి యెవ్వరికి యీలాగుధృడంవుంటె

అందరికి పుట్టనిచావనిది తనకుతానె స్వతసిద్ధమై చెలించక వుండనే వున్నది యిందుకు అనుమానంలేదు.

గురుసాంప్రదాయం పుట్టనిచావనిది మొదలుకొనలేనిది రాకడపోకడ లేనిది సార్వకాలం తనకుతానే స్వతసిద్ధమై చెలించకవున్నది సార్వకాలాల యందు సమస్తమైన వస్తువులయందు సకలదేశాలయందు ప్రవేశించంది వెళ్లిపోంది, శరీరాలుకానిది, శరీరాలుపుట్టించంది, శరీరాలు గుర్తెరుగనిది, శరీరాలకు ఆధారముకానిది, శరీరాలు స్పృశించంది, జగత్తు వున్నదని తోచంది, సార్వకాలంవకటీరుగా వున్నదాన్ని వుండను ప్రత్యక్షంగా చూచి నట్లు లెస్నవుండజూచి యీశరీరానకు మూలం యేమిలేదు. అని చెప్పినా యేలాగో దృష్టాంతంఅని అడిగి దృష్టాంతంలెస్నవిని ఆదృష్టాంతంచొప్పున సమాధానంచేసుకొని శాంతి అయ్యేది.

గురుసాంప్రదాయం యింతేకాని మూలంలేని యీ గుర్తెరిగే శరీరంచాత సాధనజేసి సాధింతామంటే కోటిశరీరాలచేతనైనగాని సాధ్యం కాదు.

యీ శరీరం మూలంలేనిది.
కొనకు ప్రవేశించేటందుకు స్థానంయేమిలేనిది.
వున్నపుడు వున్నట్టేవుండి వెంటనే యేమీలేనిది.
అనిచూచే ప్రజలకు అందరికి నిశ్చయముకద్దు.
తనకు వున్నంతసేపేకాని కొనకుయేమీలేదు.
నిశ్చయంతనకు లెనేలేదు.

గురుకృపచేత మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నంతసేపు అనేక శరీరాలు తనకుతానే తోచేది. స్వభావం కలతోచినట్టే మేలక వున్నంతసేపు తోస్తాయి. కలతోచేటందుకు మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు అని తాత్పర్యం ఆయనా యేమితోచదు. తోచేటందుకు మూలం యేమిలేదు గనుక తనకుతానే స్వతసిద్ధమై వున్నది.

వున్నది వున్నట్టుబడితేసరి.
వున్నదివున్నట్టుబడితే వొక్కటయినా యిచ్ఛవుండదు.

వున్నది వున్నట్టుపడ్డందుకు యిదెచూచుకోవలె.

యిచ్ఛకు మూలంలేని యీలాగు క్తరిగే శరీరమేకాని తనకుతానె స్వతసిద్ధమైనా పరిపూర్ణముకు యిచ్ఛయెన్నటికీలేదు. మీరువిచారించకండి.

శిష్యు॥ యీబట్టబయలుకు యేమియిచ్ఛవున్నది. గురు॥ యీ బట్టబయలుకు యెరుకలేదు. గనుక యిచ్ఛలేదు. యిచ్ఛలేదు గనుక సంసారమనే రతికర్మలేదు. రతికర్మలేదు. గనుకతానుపుట్టలేదు. రెండోదాన్ని పుట్టించాపుట్టించదు.

శిష్యు॥ తానుపుట్టకపాయె, రెండోదాన్ని పుట్టించకపాయె, యీ శరీరం యెక్కడినుంచివచ్చె.

గురు॥ యీబట్టబయలును అడుగుచావ నన్ను అడుగుచావా.

శిష్యు॥ యీబట్టబయలుకు శరీరంలేదుగనుక దాన్నియేలాగు అడుగ అదియేలాగు చెపుచుంది. దానికీవ్యవహారమేలేదు.

గురు॥ సరిగదా యవరిని అడుగుచావు.

శిష్యు॥ నిన్ను.

గురు॥ నేనుయేమి.

శిష్యు॥ నీవుయేమో, మాకు చూచేటందుకు శరీరంవున్నట్టు వున్నది.

గురు॥ వున్నదినాకో నీకు శరీరంవున్నట్టువున్నది.

శిష్యు॥ మీకశరీరం యేమీలేదు యని సూచనచేస్తు యున్నారు గనుక శరీరంలేకపోవుటం యేలాగో అనిమాకు ఆశ్చర్యంఅవుచుంది. యిది యేమి అసలనిపిస్తుంది.

గురు॥ శరీరంవున్నది అని మీరెకాదు. నన్ను యెదురుచూచేవారి అందరికి శరీరంవున్నది. అనియెరుక చూచినవారికల్లా శరీరపు వర్తమానం శరీరంలేనివారి వర్తమానం తెలిస్తె మూఢులుయేరి, అజ్ఞానులుయేరి, మూర్ఖులుయేరి ప్రత్యక్షప్రమాణమని వాదించేచార్వాకులుయేరి.

శిష్యు॥ అట్లయితే మేముమూఢులమా.

గురు॥ దేహాలకు మూలంయేదో అదిమీకు యధార్థంగ తెలిసినా సరె మీతాతగార్కి తెలిసినాసరే మీముత్తాతగారికి తెలిసినాసరే మీకు

యవరైనా గురువులువుంటె వారికి తెలిసినాసరే యిపుడుమీరు విచారించి చెప్పినాసరే శరీరంపలానిదిఅని తాత్పర్యంచేసుకుంటె నేనుమీరు అందరము మూఢులమే, అందరముజ్ఞానులమే, అజ్ఞానులమే, అందరము సమానులమే, యిది వున్నట్టు తెలయకుంటె చాకలచదువు కోటివిద్యలు కూటికొరకె అని చాకలవాడు అంచువున్నాడు. మళ్లిఅందరికి దాసుడై వున్నాడు అందరికి సేవకుడు, గనుక నిత్యులవలెను యెక్కువనుకోడు. మిత్రులవలె మేము తక్కువ అనుకోడు అందుకె.

బ్రహ్మ కమ్మరివాడు.

విష్ణు సాలెవాడు.

మహేశ్వరుడు చదువుకొన్నవానికంటె యెక్కువవాడు.

అందరుసమానమే యెవరికులధర్మంవారు విడువక స్వధర్మాలచేత వున్నారుగనుక అందుకె శరీరంవున్నది అనిదృష్టం వున్నది.

అనుమానమూవున్నది.

యెపుడుపోవుచుందో అనిఅందరికి ధైర్యంకద్దు. యీ గుతేరిగె శరీరాలు యేలాగంటె ఆలాగేవిని వున్నంతసేపు భ్రాంతులతోటెవుండి కొనకు సకలశరీరాలు యేమిలేవు.

యెక్కడనుంచి వచ్చె యెక్కడికిపాయె అనియెవ్వరికి విచారం పుట్టదు.

పుట్టెనా అనేకదొంగతోవలె, కాని రాజమార్గం వొకటైనా కాదు.

శిష్యు॥ మాకుయిన్ని యెందుకు యీశరీరం యెందుచాతపుడుచుంది. లోకంలో అనేకమాటలు అనుకుంచారు మీరుమాకు వున్నది వున్నట్టు సూచన వెయ్యంటి.

గురు॥ చేస్తాను, మీతల్లితండ్రి నీకుమూలము. నాకు ఆలాగేవారి స్వరూపం మనము యెంతో అంత్తే.

శిష్యు॥ అట్లైతె వారు యక్కడినుంచివచ్చిరి.

గురు॥ యీలాగు వారికివారు వారికిమనము.

శిష్యు॥ అట్లైతే సార్వకాలం యీ ప్రకారానవుండె.

గురు॥ వుంటే యేమి.

శిష్యు॥ యెన్నడు లేకపోయింది.

గురు॥ సార్వకాలం నీశరీరం నాశరీరంవున్నంతసేపు సర్వంవున్నట్టై తోస్తుంది మూలంలేని యీ గుత్తేరిగే శరీరం భోంచేస్తె.

అన్నరసం శుక్లం అవుతుంది.

నీళ్లుతాగితే యీశరీరంలో ప్రవేశించి రక్తంపుడుచుంది.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరమునకు యిచ్చపుడుతె రతికర్మ చేస్తుంది.

పాలుకాచి తోడుపెట్టితె పెరుగువలె గట్టిపడటుపడి శరీరాకారమై పుట్టి కొంతసేపు యీ మూలంలేని గుత్తేరిగే శరీరం యెరకచేతవున్నంత సేపుకల వెంటనే యేమిలేదు.

యెరుకవున్నంతసేపు అనేక చిత్రవిచిత్రాలు అయోనిసంభవుల గుర్తెరుగువాడు. తనవంటియోనిసంభవుల గుత్తేరుగుచాడు. శాశ్విత మయింది యేదిఅనియ్యెవ్వరిని అడుగడు యీదేహాలకు దేహాలెమూలము స్వామి నిర్మాణము చేస్తాడా.

శిష్యు॥ అయ్యా యీశరీరం వున్నట్టైవుండి వెంటనే అడ్డంపడుచుంది చాలాసేపు యేమీలేదు అపుడు యీ శరీరం యెక్కడికిపోచుంది,

గురు॥ యీశరీరానకు రాంగానే అయోనిసంభవులు వచ్చినట్టు అవుచుంది. అందులోనే అనేకయేనుగలు గుర్రాలు రథాలు అనేకమంది స్త్రీలు వచ్చిన్నట్టే వుంటారు నాకు యెరుకవుండగానే యేమీలేదు.

అందులోనే అయోని సంభవులు గుత్తేరుగుతారు యీలాగు కొంత్తశేపు వుండగానే వెంటనే యీ గుత్తేరిగే శరీరం యేమితేదు.

యీ శరీరంతోడ పుటెకల యీశరీరం లేకుంటె మంది సుషుప్తి అన్నారు.

లేకుంటెమరణం అని అన్నరు.

యింతేకాని.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరానకు మూలం యెరుగ.

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం ఫలాని దానియందు ప్రవేసిస్తుందని యెవ్వరు యెరుగరు.

యిషువంటి మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నంతసేపు నానా కూతలు మనము కూస్తాము.

మనతోకూడవచ్చినవారు కూస్తారు.

దీనికి దరియెవ్వరు యెరుగరు.

శిష్యు॥ యెక్కడ వున్నాడో.

గురు॥ అంత అమావాస్య చీకటిలోనే వున్నారు. కాని వొకశరీరం నిర్ణయంఅవుతె అన్ని నిర్ణయాలు అవుతయి.

శిష్యు॥ యేలాగుచెప్పండి.

గురు॥ యీబట్టబయలు శరీరంపుట్టకపునుపు వున్నవి.

శిష్యు॥ శరీరంపుట్టగమునుపు శరీరంయెక్కడ వున్నది.

గురు॥ యెక్కడలేదు. యెక్కడనుంచివచ్చె.

శిష్యు॥ యెమో అందరు తల్లిదండ్రి అంటారు కాని నాకు సమాధానంకాదు. వారుపుట్టకమునుపు యెక్కడవుండిరి అనితోస్తుంది. యిది మహాచిక్కువలెవున్నది. యీచిక్కులు అతిసులభంగ తెలుపవలె.

గురు॥ యిది తెలుస్తెకాని మబ్బువిడవదు మరివక ప్రకారంగ సూచనచేస్తావిను.

శిష్యు॥ అయ్యా చెయ్యండి.

గురు॥ యీశరీరం పుట్టకమునుపు యీబట్టబయలు మాత్రమె వున్నది. యీశరీరం యేమిలేదు.

శిష్యు॥ యిదిసరె.

గు॥ శరీరం పుట్టినతర్వాతవున్నట్టేవుండి సమస్తమైన వ్యవహారాలు చేసి వెంటనే నిద్రపేరుచెప్పి యేమిలేక పోచుంది. యీమూడునాల్గు ఘడియలు వొకవేళ రెండుర్ఘాములు మూలంలేని యీగుర్తెరిగేశరీరం యేమిలేదు ప్రతిదినమందు యీశరీరం యెప్పొడుమేలుకుంటె అప్పడు కల కొన్నాళ్లు యీలాగు ప్రతిదినమందు సుషుప్తి యేమిలేకపోయినట్టు యేమిలేదు అది మరణంఅన్నారు యీశరీరం పుట్టకమునుపు యేమీలేదు.

కొనకు యేమిలేదు.

శిష్యు॥ యీదేలెస్స యీ బట్టబయలు వుండనె వున్నది.

గురు॥ వున్నప్పుడు యేలాగు యీ రెండు విధాలు నీకు సమాధానమా.

శిష్యు॥ పుట్టకమునుపు శరీరం యేమీలేదు వున్నట్టు తోచినపుడు యేమిలేదు యీ రెండువిధాలు అందరికి దృఢమే.

గురు॥ శరీరం యావత్తు యేమీలేదా కొంచము వున్నదా.

శిష్యు॥ కొంత అంత యేమిలేదు.

గురు॥ పుట్టకమునుపు యేమీ వున్నది.

శిష్యు॥ యీ బట్టబయలు వున్నది. యీ బట్టబయలు తప్పవిడిచి శరీరం యేమీలేదు. మూలంలేని యీగుర్తెరిగే శరీరం పుట్టకమునుపు యేలాగు యేమీలేదో వచ్చినతర్వాత యేలాగు యేమీలేదో ఆలాగే వున్నప్పటికిన్ని మూలంలేని యీగుర్తెరిగేశరీరం యేమిలేదు అని కల తోచిన యీ శరీరాలు యెరుక వుండంగానె యేమీలేదు అని తనకుతానె దృఢం ఆయయిక చాలుచాలు.

ఇతి శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంతవిచారణే
జీవేశ్వర ద్వయదోషరహిత ప్రకరణము
చ తు ర్థ శో ధ్యా యః

---

శ్రీగురుభ్యోనమః

# ౧౫॥ క్షరాక్షరోపాది ద్వయదోషరహిత ప్రకరణము.

---

శ్లో॥ ద్వితై వ్రతత్వం దృశేచిత్తం । తదేవాజ్ఞాన ముచ్యతే ।
యేతయోల్లో లయోదృష్ట్వా । తజ్ఞానం సాపరాగతిః॥

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు అనే సిద్ధాంతమె సిద్ధాంతము కాని యితర సిద్ధాంతములు కలలోవార్తలు మూలంలేని యీ గుర్తెరిగే శరీరంవొచ్చి శరీరం నేను వున్నాను అనే అనంగానె.

గురు॥ చచ్చిన తరువాత శరీరం లేదని తనకుతానే ధృఢమా యేమయిన అనుమానమా.

శిష్యు॥ ఏమిాలేదు తనకుతానే యీా శరీరం మొదలు యేమిలేదు కొనకు యీా శరీరం యేమిాలేదని ధృఢమె వున్నప్పుడు వున్నదని ఆశకద్దు.

గురు॥ సరే మూలంలేని యీా గుత్తెరిగే శరీరం యెరుకచాత వుండంగానే యేమిాలేదు అనేకమంది రధాలు, యేనుగలు, గుఱ్ఱాలు, లోట పిట్టలు కలలో వచ్చినట్టు వున్నట్టు ప్రసంగాలు చేసినట్టు వుంచుందిగాని యెరుక వుండగానే యేమిాలేదు. యిది తనకుతానే దృఢంకదా.

శిష్యు॥ యిది దృఢమే.

గురు॥ ఆలాగే వున్నప్పటికిన్ని మూలంలేని యీా గుత్తెరిగే శరీరం యేమిాలేదు అని సరిపుచ్చుకుంటె వున్నది తనకుతానే వున్నది. యింత కంటె అధికమైన మార్గంలేదు యిదే భ్రాంతిలేని మార్గం భ్రాంతికి మూలం యేమిాలేదు. ఈలాగు కనుక్కొన యేమిాలేకుంటె దేంచాత కనుక్కుంచావు.

శిష్యు॥ సరే మిాదయ.

గురు॥ యింకా నీకు ఏమైన సంశయంవుంటె అడుగు.

శిష్యు॥ అడుగుమన్న దానికి యెరుకే లేదుగనుక సంశయంలేదు.

గురు॥ మూలంలేని యీా గుత్తెరిగే శరీరం యేమిాలేనిది గనుక యేమిాలేదు. ఏది వున్నదో అదేవున్నది. అదే అంతా అంతా అదే వున్న దానిచాత నిర్ణయంలేదు. గనుక సార్వకాలం వకటేతీరే.

యిందుకు విద్యారణ్య స్వాములవారు నిర్ణయం చేసినారు ఈ శరీరం పుట్టకమునుపు నిర్ణయం యేమిలేదు. ఈ శరీరం చచ్చిన తరువాత నిర్ణయం యేమిాలేదు వున్నప్పుడు ఈలాగే అన్నాడు అది అంటె

శ్లో॥ నవ్యక్తః పూర్వమస్త్యేవ నపశ్చాచ్చవినాశతః అథావంత్యేదిమూలంనాస్తి వర్తమానోపి తత్తదా॥

అని సిద్ధాంతం చేశినారు.

యిదే భ్రాంతికి మూలంలేని మార్గం అన్నారు.

యిదే బంధభ్రాంతి మోక్షభ్రాంతిలేని మార్గం.
భ్రాంతికి మూలంలేదు.
బంధం యెవ్వరికి.
పుట్టని చావనిది చెలించక తనకుతానే స్వతసిద్ధమైయున్నది.
పుట్టేది చచ్చేది వున్నదానికి యెరుకలేదు.

శిష్యు॥ వున్నదని భ్రాంతి వచ్చివుండె.

గురు॥ ఆభ్రాంతి యెవరికి దేనికి వచ్చివుండె.

శిష్యు॥ అది యేమిలేదు.

గురు॥ యిక భ్రాంతి యెవ్వరికి

శిష్యు॥ వక శరీరం వంటివే అన్ని శరీరాలు,

గురు॥ వక శరీరంతోటి అన్ని శరీరాలు వున్నవి అని తోచినవి వక శరీరం యేమిలేకుంటె యేమిలేకుంటె యేమిలేదు.

భూమిని యెవడు యెరుగు.
నీళ్లు వున్నది యెవడు యెరుగు.
నిప్పువున్నది యెవడుయెరుగు.
యిది మహారహస్యం.
మహాగుహ్యం.
పరమగుహ్యం.
వున్నట్టు విచారమయితె తనకుతానే సరిపుచ్చుకోవలె.
మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు.

సార్వకాలం వకటీరే అని తాత్పర్యమయితె ప్రసంగానికి మూలం యేమిలేదు.

వున్నది అనేది యేమిలేదు.

శిష్యు॥ అనేది యేమి వున్నదిమాటే ఆడదు లేనిది యేమిలేదు. నిర్ణయానికి మూలం యేమిలేదు. సార్వకాలం వకటీరె.

గురు॥ యీమాచ్చట రెండోవానితో అనరాదు.

విచారించనివారే ద్విపాదపశువులు మూలంలేని యీ గుర్తెరిగే

శరీరంతో శివశివ అని అనుకునేవారు. మూలంలేని యీ గుతెఃరిగే శరీరం తోటి యేమి అనుకున్నా వుపాసనే.

గాయత్రిమంత్రం వుపాసన కాదా.

పంచాక్షరి మంత్రం వుపాసన కాదా.

అష్టాక్షరి మంత్రం వుపాసన కాదా.

పాలు తాగినా వుపాసనే.

పంచితం త్రాగినా వుపాసనే.

అన్నంతిన్నా వుపాసనే.

పెండతిన్నా వుపాసనే.

శాస్త్రం పాలు తాగమని చెప్పింది.

సురా తాగమని చెప్పిరి.

మూత్రం తాగమని చెప్పింది.

అన్ని తిప్పలకు మూలం మూలంలేని యీ గుతెఃరిగే శరీరం.

యీ శరీరమే అన్ని చెప్పింది.

అన్ని తిప్పలు బడుచుంది.

మూలంలేని యీ గుతెఃరిగే శరీరం నేను అని భ్రాంతి వున్నంత శేపు తీశివేసినాకొద్ది మొలచినట్టు అనేకాలు పోఛావి. అనేకాలు పుడుతావి. చేతులు వున్నంత శేవు శరీరం వున్నంతసేపు యిదే ప్రయోజనం. అందుకే శీఘ్రంగా పుట్టని చావని పరిపూర్ణం మరువక వుంటే చాలు. రెండోదాని జోలేవద్దు వున్నదానికి యెరుకలేదు. కర్మాలను యెరుగనే యెరుగడు.

శిష్యు॥ అది యెట్లువంటిదో నాకు సూచన చెయ్యండి.

గురు॥ అది మహాగుహ్యం మహారహస్యం అనేకకోట్లలో వొక్కరు వున్నరో లేదో యీవ్యాళ్ల దాకా. చెప్పినమార్గం అనేక మంది సాదించి శాంతిచేత వున్నారు. యిపుడు యీ ప్రకారంలో ఆ ప్రకారం సూచన చెయ్యకూడదు. అది ప్రత్యేకం బాటవున్నది. మరీ అతిసూక్ష్మం అది దీన్ని మించిన మార్గం యీశాస్త్రాల వంటిదికాదు. తల్లకిందు మార్గం లేనిదే వున్నది. అని లేనిదానికే తోచింది. కనుక ఆనిర్ణయం తీసివేసేకొరకు ప్రక

అనేకమైన భ్రిమలచాత కాళ్లకు బేడీలు వేసుకొని కాళ్లుఆడక ప్రసూతి అయితే చిన్నపిల్లకు చంటిమీద ఆశవున్నది అని తల్లికి ఆశవుండే మాత్రిమే.

మహా వుపద్రవమవస్తె యెవ్వరికి ఆస ముందరపడదు. తల్లికితల్లే పిల్లకుపిల్లే యెవరిచన్నయిస్తె పిల్లకు వారిమీదఆసే తగులుచుంది. యీలాగే కానీ యేమిలేని దానికి మర్యాద యేమీలేదు.

పుట్టని చావని పరిపూర్ణంను యేమిభ్రాంతిలేదు.

అందుకే దొంగగురువు కాకుండా మాయవేషాలు కాకుండా శరీరం లేని గురుసాంప్రదాయంవిచారించి శరీరంలేని పరిపూర్ణం వున్నది. వున్నట్టే ఆయనా వక్కడైన భ్రాంతిపుట్టదు.

భ్రిమలకు మూలం మూలంలేని యీ గుత్తేరిగే శరీరమే గనుక అందుకే ఆశరీరం పుట్టకమునుపు శరీరం యేమిలేదు. చచ్చిన తరువాత శరీరం యేమీలేదు అని తనకుతానే దృఢంవున్నట్టు వున్నప్పటికిన్ని మూలంలేని యీ గుత్తేరిగే శరీరం యేమిలేదు అని తనకుతానే దృఢం వుండెనా వాడే భ్రాంతిలేనివాడు.

అంతకంటె అధికమైన మార్గంలేదు.

యిది అందరికి సమాధానమే స్త్రీలకు పురుషులకు యిదే భ్రాంతి లేని రాజమార్గం.

వున్నది తనకుతానే స్వతసిద్ధమై చలించకవున్నది గనుక వున్నట్టు పడకుండా ప్రయత్నమే విఘ్నం.

మూలంలేని యీ గుత్తేరిగే శరీరంచాత ప్రియత్నం యేమిచేశినా వున్నట్టు పడకుండా యిదేవిఘ్నం.

మూర్ఖులు నమ్మకపోయిరా భ్రాంతి తొలగదు.

అందరవలెనే ఆశచేత క్లేశపడుతారు.

మూలంలేనియీ గుత్తేరిగే శరీరం లేదులేదు అన్నా సాధనే.

మూలంలేని యీ గుత్తేరిగేశరీరం యిదినిబద్ధి యీ శరీరం అబద్ధం అన్నా సాధనే.

మూలంలేని యీ గుత్తేరిగే శరీరం అంతా అన్నా సాధనే.
సాధనచాత సాధ్యం యెన్నటికిరాదు.

మూలంలేని యీ గుత్తేరిగే శరీరానకు మూలం యేమిలేదు గనుక కొనకు ప్రవేసించేటందుకు మూలం యేమిలేదు మధ్య తనకుతానే వున్నాను అని భ్రాంతిచాత వున్నది గనుక ఆచార్య కటాక్షంచాత మూలంలేని యీ గుత్తేరిగే శరీరమనే తెరదీసి వైకుంటాన్ని అరచేతిలో చూపినట్లు చూపె గనుక సార్వకాలం సంతతం చెలించక మొదలు కొన లేక రాకడ పోకడలేక తనకుతానే స్వతసిద్ధమై యితరలోకాంతర స్మరణలేక వైకుంఠం మాత్రమేవుండె.

వైకుంఠం దొరకక శివుడు స్వస్వరూపమనే భ్రాంతిచేత మూలంలేని యీ గుత్తేరిగే శరీరమనె దేహభ్రాంతిచాత సమాధిచేస్తూ యిప్పటికి వున్నాడట.

ఆచార్య కటాక్షంకలిగి మూలంలేని యీ గుత్తేరిగే సచ్చిదానందమనే దేహభ్రాంతి తీసివేశి వైకుంఠం అరచేతిలో వున్నట్లు యెవ్వరైన సూచన చేశేరా అని చింతచాత కైలాసమనే లోకాంతర భ్రాంతిచాత వున్నాడు.

యితర లోకాలవారికి వైకుంఠం యొక్క అపేక్షకద్దు.

వైకుంఠం వున్నది వున్నట్లుజాడ సూచన అయితే యీయిచ్చ యన్నటికి పుట్టదు.

వైకుంఠం పుట్టనిచావనిది గనుక దానికి బదులులేదు.
దానికి అంతా యింతా అని ప్రమాణంలేదు.
యితర స్థానాలు యెక్కడవుంటె అక్కడనే.
సర్వత్రా తేవు.
యీవైకుంఠం అయితే సకలదేశాలయందు వున్నది.
సార్వ కాలాలయందు వున్నది.
సమస్తమైన వస్తువులకు వైకుంఠం స్థానమే.
యితర స్మరణలేదు.

మూలంలేని యీ గుత్తేరిగే శరీరం యేమీలేకుండా సూచన ఆయగనుక వైకుంఠం మాత్రమే వుండె.

శృ॥ ఆయం వయికుంఠః॥

శ్లో॥ అచ్ఛేద్యోఽ యమదాహ్యోఽయ । మక్లేద్యోఽశోష్యఏవచ
నిత్య సర్వగతస్థాణుః । రచలోఽయంసనాతనః॥

అని శ్రీకృష్ణభగవానులు వైకుంఠం యిషువంటిది అని యిది అని చాతచూపి పోయినాడు. యిష్టవంటిది యేలోకముకాదు అందరికి గురు కటాక్షంచాత సూచనఅయితె వైకుంఠం మాత్రిమేవుండె.

గురుకటాక్షంలేక గుత్తేరిగే శరీరమనె తెరఅయ్యి వున్నారు గనుక అన్ని శరీరాలు వైకుంఠమందే నివశించివున్నది.

వైకుంఠం యెరుగరు వైకుంఠంజాడ సూచనకాకపోంటె అన్ని శరీరాలు సమానమే.

అన్ని శరీరాలు మూలంలేని యీగుత్తేరిగే శరీరాలేగనుక అందరు గుత్తేరిగే జ్ఞానస్వరూపులే.

వైకుంఠంలోవున్నా విశేషంచాత అందుకే.

శ్లో॥ పుల్కాహస్తో యధాకశ్చి । ద్రవ్యమాలోక్యతాం త్యజేత్ ।
జ్ఞానేనజ్ఞేయమాలోక్య । పశ్చాత్ జ్ఞానంపరిత్యజేత్ ॥

జ్ఞానానికి ప్రియోజనం వైకుంఠాన్ని చూచి గుత్తేరిగే జ్ఞానాన్ని పరిత్యజించవలెనని సిద్ధాంతం.

శృ॥ "పశ్చాద్జ్ఞానం పరిత్యజేత్"॥ అని ఉత్తరగీతలయందు భగవానులే అన్నారు.

క్షేత్రిజ్ఞుడు భగవానులు గనుక అందరు భగవానులే.

పుట్టని చావనిది భగవానులు కారు.

ఆత్మయిన మాయ ఆత్మఅనే పేరుగల మాయచేతను భ్రాంతి రహితంకాక అద్వైతమనే భ్రాంతిచాత అక్షరోపాధి అనే పరబ్రహ్మ భ్రాంతితగిలి బ్రహ్మఅనే దోషస్వరూపంచాత వుండెనా సార్వకాలం దోష స్వరూపుడే.

మూలంలేని యీ గుర్తెరిగే దోషస్వరూపం అందరిలో కానుపించే శరీరం యాలాగు అందరిలోలేదో ఆలాగే మూలంలేని యీ గుర్తెరిగేశరీరం అందరివలెనే స్వచ్ఛంగావున్న నేత్రాలయందుచూస్తె కానుపించే మాత్రమే కాని శరీరం వున్నదని యెరుగదు.

శ్లో॥ "షరాక్షరోపాది ద్వయదోషేణా స్పృష్టః"॥ అని శంకరాచార్యులవారు అన్నారు.

అందుకే రామానుజాచార్యులవారు సమ్మతపడి అద్వైతం ఖండించి విశిష్టాద్వైతమని యుక్తిచేశినారు.

తనకుతానే స్వతసిద్ధమై వున్నది. పుట్టని చావనిదిగనుక వ్యవహారము లేనిది.

వ్యవహారం కల్పించింది యిదిగనుక చదువుకున్ననే పాండిత్యం అని నేను చదువుకున్నాను గనుక విశిష్టాద్వైతం వున్నదని వారిమీద నాకు తోచింది పండితులజాడ పండితులకే తెలియవలెనని మాచేతనయినంత కల్పించినాను దానిది వున్నంతసేవూ మావిశిష్టం తప్పదు జగత్కారణం చైతన్యమయితే విశిష్టం యాలాగు పుడుచుంది కార్యకారణాలకు భేదం లేదని అందరికీయెరుకే "మృత్తేఘటం ఘటమేమృత్తు"॥

గుర్తెరిగే చైతన్యమే సమస్తవస్తువులు.

చైతన్యంవలన తోస్తువున్నవిగనుక చైతన్యమే యీ గుర్తెరిగే జ్ఞానము.

యీ గుర్తెరిగే చైతన్యముకు జగత్తుకు వేరులేదు.

శీలవంటెది,

శరీరంవలన గుర్తెరిగేజ్ఞానము పుట్టింది,

గుర్తెరిగే చైతన్యంవలన శరీరం పుట్టింది.

తనకుతానే స్వతసిద్ధమైవున్నది పుట్టని చావనిదిగనుక అది శరీరం యెన్నటికీ కాదు.

విచారించని యెక్కువకులం మాలవాండ్లకు శరీరం వున్నదని భ్రాంతికద్దు.

గురుమూలంగా విచారించని తక్కువకులం అనే మాదిగవాండ్లకు వున్నది అనే నిశ్చయం వున్నది.

శరీరం యెవరివలన పుట్టింది అంటె మూడు లోకాలవారు యెరుగరు.

శంకరాచార్యులవారు వున్నది అన్నాడు లేదు అన్నాడు.

రామానుజా చార్యులు "ప్రివాహరూపేణా" సార్వకాలం వున్నదే అన్నాడు.

శ్రీకృష్ణ భగవానులు.

శ్లో॥ కదాచిత్ నజాయతే నంమ్రియతే॥ అన్నాడు.

పుట్టని చావనిది యెరుగడు,

అచలం అదే.

గుణాలు లేనిది.

శరీరాకారము గానిది.

అదే జ్ఞానకర్మ రహితమైనది.

అదే క్రియాశూన్యమైనది.

అదే సార్వకాలం వక్కతీరుగా వున్నది.

అదే చెయ్యనిది చేయించనిది.

అది సత్యమని గ్రిహించదు.

అది అసత్యమని విడువదు.

పుట్టని చావనిది గనుక దానికి తోచనే తోచదు.

యేమితోచినా గ్రంధాలు యెవ్వరు చేశినారో వారికే అన్నితోస్తావి.

శిష్యు॥ స్వామీ.

శ్లో॥ నవద్వారే పురేదేహె నైవకుర్వన్న కారయేత్॥

అని అన్నాడు ఆచార్య స్వాములవారు.

శ్లో॥ నాస్త్యాత్మనః కర్తృత్వం కారయితృత్వం.

లేనిది క్షేత్రక్షేత్రజ్ఞ స్వరూపం అంటె యెవ్వరికి సమాధానం కాదు.

గురు॥ పుట్టని చావనిది యేదో అది సూచనచేస్తే దానికి సరి పోయ్యేగాని యీ క్షేత్రజ్ఞుడు అభోక్తఅంటె యెవరికి సమాధానం కాదు.

శిష్యు॥ అట్లైతే క్షేత్రజ్ఞుడు లేనప్పటి కర్తృత్వం లేదు కారయితృత్వం లేదు.

గు॥ యీ క్షేత్రిం ప్రపంచంతసేపు లేకపోదు యీ కలలో క్షేత్రి క్షేత్రజ్ఞుడు లేనిది వచ్చిందిజా.

శిష్యు॥ రెండూకూడా వచ్చినవి.

గురు॥ అలాగే క్షేత్రి క్షేత్రజ్ఞులతోకూడా లేకుండా సూచనచేసే గురుసాంప్రదాయం ఆయెనా యెన్నటికి భ్రాంతిపుట్టదు శూన్యంకాదు జగజ్జీవులు లేనిది తనకుతానే స్వతసిద్ధమైవున్నది. సార్వకాలం వొక్కటేరే వున్నదానిలో స్త్రీ ఆకారం తోచదు పురుషాకారం తోచదు. శరీరం సార్వకాలం వున్నదానిలో లేనట్టేతోస్తుంది యేమయినా మూలంలేని యీ వ్యాపారంచేత శంకలుతోస్తావి వున్నదానికి నిశ్చయంలేదు. సంశయం లేదు యీశరీరం లేదుగనుక సార్వకాలం శరీరంలేకనే వున్నది. గనుక వొక్కటైన వ్యవహారములేదు అందుకే వికారంలేదు ఆత్మానాత్మల వ్యవహారంలేదు.

శ్లో॥ క్వచద్వైతం క్వచాద్వైతం । స్త్వేమహం స్తితితస్యమే ।
కృపారబ్దాన కర్మాణి॥

యీ శరీరమే లేదుగనుక వ్యవహారమేలేదు. పుట్టనిది చావనిది వున్నదో లేదోఅని కలతోచిన శరీరాలకు సంశయంకద్దు మేలుకుంటే వున్నదేవున్నది. శరీరం మందికితోచిన తనకుతెలసినలేదు. సార్వకాలం శరీరం లేక వున్నవాడు భ్రాంతిలేకవున్నాడు. కోట్లకొద్ది కలలోవచ్చినా శాశ్వితంగ వుండనే వుండను అలాగే సమస్తమైన వస్తువులు క్షేత్ర క్షేత్రజ్ఞులకేగాని తనకుతానే స్వసిద్ధమై చెలించక వున్నదానికి యేఅవస్తా లేదు సార్వకాలం శరీరంలేకవున్నది యెరుగదు లేనిది యెరుగదు శరీరంలేనిదే తనకుతానే తోచిన తనకుతానే యేమిలేదు.

యీ గురుసాంప్రదాయం అలాగుకాదు శరీరంలేని గురుసాంప్ర దాయం మహాగుహ్యాం వేదశాస్త్రాలయొక్క నిర్ణయంచెయ్యంది అదే.

అంటే కలతోచకమునుపు వ్యవహారంలేదు.
కలతోచంగానే వారుపుస్తకాలు తెచ్చినారు.
వీరూ పుస్తకాలు తెచ్చినారు.
వారువీరు ప్రసంగాలు చేసినారు.
వేదం స్వస్తి చెప్పినారు.
అనేక దేవాలయాలు చూచినారు.
అనేకమంది అయ్యవార్లు.
అనేకమంది లింగధార్లు.
అనేకమంది స్త్రీలు.
అనేకమంది దిగంబరులు.
అనేకమంది విభూతి పూసుకున్నవారు.
అనేకమంది శ్రీతిరుమణి శ్రీచూర్ణం పెట్టుకున్నవార్లు.
అనేకమంది తురకలు.
అనేకమంది బేగరవాండ్లు.
అనేక గుఱ్ఱాలు.
అనేక యేనుగలు.
అనేక వ్యభిచార్లు.
అనేక బోడివాండ్లు.
అనేక ఫకీర్లు.
అనేక సన్యాసులు.
అనేక సముద్రాల్ఫిలు.
అనేక వుపాసకులు.
అనేక అహితాజ్ఞులు.
అనేక చుట్టలు త్రాగేవారు.
అనేకమంది భారిదొంగలు.
అనేకమంది త్రాగేవాండ్లు.
అనేకమంది సూద్రులు.
అనేక కోమట్లు.

అనేక గొల్లవాండ్లు.
అనేక రాజులు.
అనేక కుక్కలు.
అనేక పందులు.
అనేక గొడ్లు.
అనేక చదువుకున్న మనుష్యులు.
అనేక గోవులు.
అనేక బర్లు.
అనేక దుకాణాలు.

అనేక మాదిగవాండ్లు వీరు అందరు పుస్తకములు ముందర వేసుకొని యీ శరీరం యేలాగుపుట్టింది అని విచారించు చున్నారు.

అందులో మహాచదువుకున్న చిందువాడు యిదిఅంత ఆడదాని మీద మొగవాడు యెక్కితే అన్ని పుడుచావి అని అనె.

అట్లైతే దేవుడు పుట్టిస్తాడు అని అనుకుంటారు.
దేవుడనేది మరుగుమాట.
దేవుడు తింటాడు యేలాగో ఆలాగే అబద్దం.
తినేవాడు ఆయనే.
పుట్టించేవాడు ఆయనే.
పుట్టించేవాడు దేవుడు.
దేవునికి యేమితిన్న తప్పులేదు.
దేవుడు సంసారం చేసేవాడు.
మరి అన్ని రూపాలు దేవుడే పుట్టించే.
గాడిద దేవుడు.
ఆడగాడిద దేవత.
నపుంసక గాడిద పరబ్రహ్మ.

పితాళ్లు యీలాగే పితృదేవతలు గనుక యీలాగు వుండగా అన్ని దేవతా స్వరూపాలె అన్ని పుట్టిస్తునే వున్నవి. అన్ని బతికిస్తునే వున్న తినేది పుట్టించేది దేవతాస్వరూపం యింతకంటె వేరే యేమిలేదు.

నమ్మికవుంటె వాండ్లకు దేవునికి వేరు యెన్నటికి లేదు సార్వకాలం తింటారు శరీరాకారమై శరీరాలతోటే దేవతా ప్రయోజనాలు చేస్తారు సార్వకాలం యిదే ప్రయోజనం.

పుట్టని చావనిది వున్నదో లేదో.
సార్వకాలం పుట్టేది చచ్చేది వున్నది.
సర్వం శ్రీ నారాయణ స్వరూపమే.
శరీరానకు శ్రీమన్నారాయణునకు వేరు లేదు యెన్నటికి.
వుంటే ఆరగించేవారు యెవ్వరు.
దేవతాకర్మలు చేశేవారు యెవ్వరు.
శరీరాలకు శ్రీమన్నారాయణునకు వేరు యెన్నటికి లేదు.
శ్రీమన్నారాయణుడు శరీరంకలిసే వున్నది.
అద్వైతంవలె దేహం అబద్ధం దేహినిబద్ధి అన్నట్టూకాదు.
సార్వకాలం దేహానకు దేహికి వేరే యెన్నటికి కాదు.
యీ దేహంలేదు అనేవారు అఘాయిత్యాలు.

దేహం యెవ్వరివలన పుట్టిందో వారిని విచారించి వారి బ్రతుకుగని అప్పుడు వున్నట్టు పడవలె యింతేగాని దేహంలేదు అనేది దేహమే. వున్నది అనేది దేహమే. యేమిలేదు అనేదిదేహమే. దేహంలేకుంటె వ్యవహారమునకు మూలంయేమి అని నిర్ణయం చాయ సార్వకాలం యేక ప్రకారమే అవుచుంది.

శరీరం యెవరివలన పుట్టిందో అని నిర్ణయం. మొదలు కలతలేకుండా విచారించవలె.

విచారిస్తే శరీరానకు మూలంయేమి లేకపోయెనా పుట్టని చావనిది తనకుతానే స్వతసిద్ధమై చెలించక సార్వకాలం వక్కటీరుగానే వున్నది.

వున్నదానికి వున్నదని తోచదు.
లేదు అని తోచదు.
యేమి తోచిన శరీరం వున్నదనే భ్రాంతులకే.
శరీరం లేకుంటె యేమి తోచదు.

చదువు కున్న యెక్కువ కులమైనా మాలవాండ్లకు చదువుకోని తక్కువ కులమైనా మాదిగవాండ్లకు అయినా అనుమానం లేదు.

అందుకే శరీరం సార్వకాలం తీసివేసె గురువు దుర్లభము.

అంతా వున్నట్టె వుండవలె సార్వకాలం క్షేత్ర క్షేత్రజ్ఞులు లేకపోవలె అది గురువు సాంప్రదాయం.

చూస్తె అందరివలెనే వుంటాడు గనుక అనేక కోటిబ్రహ్మాండాలు అరిచేతులోనే వున్నవి.

తనయందు పుట్టుక లేదు చావు లేదు.

సార్వకాలం పుట్టని చావని తానేతాను.

శృ॥ క్షరాక్షరోపాది ద్వయదోషేణ స్పృష్టః॥
శృ॥ క్షేత్రక్షేత్రజ్ఞ స్వరూపదోషద్వయః॥
శృ॥ క్షరాక్షరాభ్యాం విలక్షణః॥
శృ॥ క్షరాక్షరాభ్యాం అన్యః॥
శృ॥ ఉత్తమ పురుష స్తన్యః॥
శృ॥ యస్మాత్క్షర మతీతోహం అక్షరాద పిచోత్తమః॥
శృ॥ పంచవింశతి ఆత్మాభవతీతిశ్రుతేః॥
శృ॥ షడ్వింశః "పురుషోత్తమః" "ఉత్తమః"॥
శృ॥ పురుషఏవ పురుషోత్తమః॥
శృ॥ క్షేత్రక్షేత్రజ్ఞ రహితః॥
శృ॥ క్షరాక్షరోపాది ద్వయదోషరహితః॥
శృ॥ పరాప్రకృతి ద్వయదోషరహితః॥
శృ॥ జీవేశ్వర ద్వయదోషరహితః॥
శృ॥ ఆత్మానాత్మ ద్వయదోషరహితః॥
శృ॥ జీవబ్రహ్మోపాది ద్వయదోషరహితః॥
శృ॥ సదసద్రూప ద్వయదోషరహితః॥
శృ॥ జ్ఞానాజ్ఞానోపాది ద్వయదోషరహితః॥
శృ॥ విద్యావిద్యోపాధి ద్వయదోషరహితః॥

శ్లో॥ దృగ్దృశ్యోపాధి ద్వయదోషరహితః॥
శ్లో॥ ప్రకృతిపురుషోపాధి ద్వయదోషరహితః॥
శ్లో॥ శివశక్త్యోపాధి ద్వయదోషరహితః॥
శ్లో॥ దేహిదేహోపాధి ద్వయదోషరహితః॥

లేనివాటికే నిషేధము.

వున్నది గ్రహించదు.

నిషేధించదు.

లేనిక్షేత్రజ్ఞ స్వరూపమే.

వున్నది అంచుంది.

వున్నదానికి వ్యవహారమే లేదు.

శరీరం లేదుగనుక వున్నది శరీరం లేదు అని యెరుగదు.

క్షేత్రంలేని గురుసాంప్రదాయం గనుక క్షేత్రజ్ఞులకు చోటులేదు.

వున్నది పుట్టని చావనిది గనుక క్షేత్రజ్ఞస్వరూపము కాదు.

సార్వకాలం క్షేత్రంలేనిది గనుక యే నిర్ణయం చాయదు.

పుట్టని చావనిదానికి ఆకారం లేదు గనుక.

చూడదు.

వినదు.

గుర్తెరుగదు.

చెయ్యదు.

చేయించదు.

తినదు.

లిప్తంగాదు.

యిటువంటి దాన్ని మూలంలేని యీ శరీరం తోచినప్పుడే కనుక్కోవలె.

శ్లో॥ అయంజీ వాఖ్యోపాధి విలయేసతి కేవలోభవతి॥

క్షేత్రం లేకుంటె క్షేత్రజ్ఞుడు లేనేలేడుగనుక గురుకటాక్షం యెప్పుడు అయితె.

శ్లో॥ క్షరాక్షరోపాధి ద్వయదోషరహితః॥

శ్లో॥ "అసృష్టి యితి కేచిత్ తదసత్" సృష్టిలేదు అంటె వున్నట్టే వుంచుంది వున్న దేవున్నది వున్నదానియందు వున్నదికాదు. యెపుడు యాలాగువున్నదో ఆలాగే వున్నది. విచారించని గాడ్దులవంటి మనుష్యులకు సంకరంగా వుంచుంది భ్రాంతివిస్తారం అవుచుందిగనుక యింతేగాని యేసిద్ధాంతం తనకుతోచదు.

గురుమూలంగా విచారించినవారికి భ్రాంతి యెన్నటికీ లేదు.

విచారించని మూర్ఖులు బురదనీళ్లవలె వుంటారు.

కుక్కలు చచ్చినట్టు చస్తారు.

యింతేకాని మనిషికి, కుక్కలకు, గాడిదెలకు, పందులకు విచారించక పోయితె యెక్కువ తక్కువ లేదు.

పుట్టుక భ్రాంతి సమానమేగనుక చదువుకుంటే యేనుగకు ప్రసిద్ధి వున్నట్టు ప్రసిద్ధిమాత్రమే కోనకు రెండూ వకటే యెత్తు.

యెక్కువ విచారించినవాడు సింహమువంటివాడు.

యేనుగలు పర్వాలేవు.

నేను స్వప్నంలోవస్తె యేనుగలుచచ్చె.

నన్ను చూస్తె యేమిబ్రతికిని.

విచారించినవారితో సమానుడు యెవడూ లేడు.

విచారించినవారి ముందర మాట్లాడితె తప్పు.

యీదేహం వుండగానే దేహంలేకున్నవారు ధీరులు.

శుద్ధం యీదేహమందు వున్నది అని గురుసాంప్రదాయం వున్నది.

సార్వకాలం దేహం వెతికి చూచినా లేదు.

దేహం పుట్టకమునుపు యాలాగువున్నదో ఆలాగేవున్నది.

దేహంలేకుంటె యేబాధ లేదు.

వున్నదానికి సార్వకాలం వకటే తీరే.

దానియందు క్షేత్రమే లేదు.

గనుక క్షేత్రజ్ఞుడు యెకడవున్నాడు.

అందుకే వున్నదానికి వకటైనా వికారంలేదు.

శ్లో॥ నాస్తి కేవలాత్మః
కర్తృత్వం కారయితృత్వం రెండుఆత్మలు.
శ్లో॥ క్షేత్రజ్ఞాఖ్యజీవాత్మ । కేవలాత్మాచా । తత్రసుషుప్తా
వయం జీవాఖ్యోపాది విలయేసతి । కేవలోభవతి॥
క్షేత్రంలేకుంటె క్షేత్రజ్ఞుడు లేడుగనుక సార్వకాలం కేవలాత్మే వున్నది అందుకే.

శ్లో॥ "నవద్వారేపురేదేహే నైవకుర్వన్న కారయేత్" అని భగవానులు అన్నారు అందరికి సమాధానమేకాని చేసెవారు చేయించేవారు యెవ్వారుఅంటే చెప్పలేరు.

గురుసాంప్రదాయ రహితుడు క్షేత్రక్షేత్రజ్ఞులు అంటాడు.
క్షేత్రం వున్నదని చెప్పెగురువు సాంప్రదాయకుడు కాడు.
వున్నదానియందు క్షేత్రం మందికి తోస్తుంది.
తనకు తోచనేతోచదు.

కల్తలేనిగురువు ఆయెనా క్షేత్రం లేకుంటా సూచనచేస్తాడు.
శిష్యు॥ క్షేత్రంలేకుండాచేస్తె క్షేత్రజ్ఞుడు యెక్కడవుంటాడు.
గురు॥ గురువు క్షేత్రంలేకుండా సూచనచేసినవాడు కాదుగనుక యీదోషం గురువులదేకాని శిష్యులది యెన్నటికికాదు.

సకలసిద్ధాంతులు విచారించిన తర్వాత యీమూలంలేని గుర్తెరిగే శరీరం యేమిలేదు అని సూచనచేస్తె ప్రపంచభ్రాంతి యెన్నటికి పుట్టదు.

సార్వకాలం శరీరంలేక వున్నది గనుక వికారంలేదు. శరీరంలేక వున్నవారు వున్నదని నిర్ణయించాయరు లేదని నిర్ణయించాయరు యీలాగువున్నదో ఆలాగే వుండక వుంటారు. మందికి శరీరంవున్నది అని తోస్తుంది తనకు శరీరంలేదుగనుక యేమితోచదు మొదలు చక్కనైతే కొనవేళ్లు చక్కనే సకలకల్తలు గురువులకేగాని శిష్యులకుముందు యేమి కల్తలేదు.

గురువులమని.
నామరూపాలు లేనివానికి.

ఆత్మ అని.

బ్రహ్మ అని.

జ్ఞప్తి అని.

కలతసూచన చేసినారు.

పుట్టనిశరీరాన్ని పుట్టిందిఅని అనుకున్నాడు.

వున్నది పుట్టదు పుట్టించదు సార్వకాలం వకటీరుగానే వున్నది వుండి చెయ్యదు చేయించదు సార్వకాలం వకటీరే.

శ్లో॥ "నకరోతి నలిప్యతె । నైవకుర్వన్న కారయేత్"॥ అని భగవానులు అన్నారు.

క్షరమనే అక్షరోపాధి అక్షరమనే క్షేత్రజ్ఞస్వరూపం అక్షరోపాధి యీ శరీరంమందువున్న కేవలాత్మను క్షరాక్షరోపాధి ద్వయదోష స్వరూపము స్పృసించదు అన్నాడు.

అందరికీ యీ శరీరమందు శుద్ధంవున్నది.

యీ శరీరమే క్షరాక్షరోపాధి ద్వయదోష స్వరూపమని అన్నారు

శరీరమందు చెయ్యనిది.

చేయించనిది వున్నది అన్నారు.

యీ శరీరమందె పుట్టనిది పుట్టించనిది వున్నది అన్నారు.

ఆత్మా బ్రహ్మ అనే గుర్తెరిగే చైతన్యాన్ని యెరుగనిది యీ శ మందే శరీరంలేక వున్నది అన్నారు.

యీ అనుభవము ప్రజ్ఞలేనివారు యితేకాని తాత్పర్యంకాక కావలెను.

యీ శరీరమందు శరీరంలేక వున్నవారికి వికారం యెన్నటికీ పుట్టదు.

యీ సాంప్రదాయం సులభం కఠినం.

శరీరంలేకుంటె శరీరంలేనిది యేలాగువున్నదో అలాగే వున్నది.

వారికి యెన్నటికి వ్యవహారంలేదు.

వారికి శరీరం యెన్నటికి తోచనేతోచదు.

క్షేత్రక్షేత్రజ్ఞ రహితులుగనుక మహారహస్యం.

అది శిష్యులకు చెప్పరు.

సార్వకాలం వక్కతీరుగావుండక చెలించేమూర్తులకు సూచన చెయ్యరు.

చేస్తె జగద్భ్రాంతి వుండదు జీవభ్రాంతి వుండదు.

అందుకే జ్ఞానోపదేశమనే కౌతుకంచేత వున్నది.

అనేక ధృడంచేసి సూచనచేస్తె బహుచులకన.

యిందుకే గురుకులవాసం సార్వకాలం వుండవలె.

వుండకపాయెనా యావత్తుమర్మం తెలియదు.

తెలియకపాయెనా జగత్తు తోస్తునేవుంచుంది.

వున్నదానికి తోచదుగనుక.

యేమితోచినా శరీరానికే.

శరీరంజడం కాదు.

అన్నిశరీరాలు గుత్తెరిగే ప్రవర్తిస్తావి.

గుత్తెరిగే శరీరం లేదుగనుక లేనిది యీ శరీరమందే వున్నది.

వున్నది వున్నట్టు మహా ఆస్తికులకయితే మహాసూక్ష్మము.

శిష్య॥ అదే.

గురు॥ వారికి తపస్సు సార్వకాలం శరీరంలేకనే చేస్తారు.

శిష్య॥ గుర్తెరిగే శరీరం.

గురు॥ దానితోకే పోతుంది పుట్టకమునుపు శరీరం లేదుగనుక యెరుకలేదు.

సార్వకాలం వక్కతీరే.

ఆత్మనాత్మవివేకం ఆచార్య స్వాములవారు అద్వైతం కల్పించేటందుకు యుక్తిచేసినారు.

గుర్తెరిగేచైతన్యం బ్రహ్మస్వరూపమని అన్నాడు.

రెండు గుర్తెరుగుటలేవు.

అందుకే యీ గుత్తెరిగే క్షేత్రజ్ఞస్వరూపమనే ఆత్మబ్రహ్మను అని పలికింది.

వేదంచొప్పున వారిసిద్ధాంతం కల్పించినారు.

అద్వైతమంటె తనకుతానే స్వతసిద్ధమయి చెలించక వున్నదాని యందు యేదిలేనిదో అదే అద్వయితం అని భావార్థం వున్నది.

యీ గుర్తెరిగే కారణం వున్నది అన్నారు.

శిష్యు॥ వారు యిషువంటివారో.

గురు॥ యేదివున్నదో అదేవారు.

శిష్యు॥ అంటే.

గురు॥ క్షేత్రంవారు

శిష్యు॥ అంటె క్షేత్రింవారు అనుకోనా.

గురు॥ యీ రెండులేనివారు అయితె వ్యవహారమేలేదు.

యీ రెంటికి మూలంలేదు.

పుట్టనిచావనిది యీశరీరమందే వున్నదికాని యీ శరీరంలేదు.

యీక్షేత్రజ్ఞుడు లేడు.

యీ రెండులేకనే చెలింపకవున్నది.

అందుకే శరీరమందు క్షేత్రిజ్ఞరహితమయింది బ్రతికివున్నపుడు యేలాగువున్నదో ఆలాగే చచ్చినప్పుడు వున్నది.

సర్వకాలం పరిపూర్ణంగనుక చలించకవున్నది.

పుట్టుకలేదు చావులేదు.

శరీరం వున్నదనే గురుసాంప్రిదాయం భ్రాంతి పుట్టకుండా చెయ్యుదు.

అందుకే యీ దేహము వుండగానే భ్రాంతిలేకుండా సూచన చెయ్యవలె.

శిష్యు॥ చేస్తె.

గురు॥ సార్వకాలం శరీరంలేకనే వ్యవహారంచేస్తాడు.

శిష్యు॥ వారి వ్యవహారం మందికి మహాబాధ.

గురు॥ వారుచెయ్యరు చేయించరుగనుక వారికి వకటైన బాధలేదు.

పుట్టనిచావనిదిగనుక అత్యంతనిర్మలం అత్యంతస్వచ్ఛం వకటైన రూపంలేదు సార్వకాలం అద్దంవలె స్వచ్ఛంగా వున్నది.

అందులో కానుపించే మాత్రమేకాని.

అందులో చొ్రర లేదు.

వెళ్లిపోలేదు.

చూస్తే కానుపించేది స్వభావము.

చూచే శరీరములేకుంటె చూడనిదే వున్నది.

చూడనిదానికి తోచనే తోచదు.

యెక్కడ సకలముతోచిందో అక్కడనే సర్వము లేకపోవలెను.

అందుకే అతీతంగనుక పరబ్రహ్మ స్వరూపం అని అనరాదు.

శృ॥ "పంచవింశత్యాత్మా భవతి"॥ అనే శృతివున్నది.

గుతేఃరిగే క్షేత్రజ్ఞస్వరూపము ఆత్మగనుక.

ఆత్మకంటె వేరేపర్రబహ్మ లేదు.

శిష్యు॥ "అయమాత్మబ్రహ్మ" అనేశృతి అబద్ధమాడించింది.

గురు॥ ఛీ ఛీ ఆలాగు అనరాదు వేదవాక్యము మహా ప్రమాణమయినది.

యీా గుతేఃరిగే క్షేత్రస్వరూపమనే పరాప్రకృతి అధిష్టానంగనుక.

యీా గుతేఃరిగే చైతన్యమనే చిత్ప్రకృతిసాక్షిణీ మాయకంటె వేరే.

పుట్టని చావనిది తనకుతానే స్వతసిద్ధమై చలించక సార్వకాలం శరీరం లేక వున్నది.

గురువు అనే సాందీపుడు శిష్యుడు అయిన కృష్ణస్వామికి యేప్రకారం వుపదేశం చేసినాడో అప్రకారం శ్రీధరస్వామికేగాని మరివకరికి యీా రహస్యం తెలియదు.

భగవద్గీతల గుహ్యమయితె జ్ఞానేశ్వరులవారికే తెలుసును.

శ్రీభాగవతముయొక్క రహస్యం శ్రీధరస్వాముల వారికి తెలుసును.

పృధివియందు శ్రీకృష్ణస్వామియొక్క నిజస్వరూపము శ్రీధరస్వామికే గాని మరవకరు యెరుగుదు అనేటందుకు తోచదు.

అందరికీ శంకరాచార్యులు చేసిన అద్వైతమందు ఆశకద్దు.

అద్వైతమే గుత్తేదారిగేసాక్షిణి వ్యాసమునిని యెంతవారికీ సూచన గాదు.

ఆచార్య స్వాములవారిజాడ రామానుజాచార్యులకేగాని మరి యెవరికీ తెలియదు.

మహేంద జాతియొక్క ఛాయ యిందజాలికి తెలియవలయును గాని రెండవవారికి బేధించదు.

మహా ఆశ కద్దు.
అందరికీ ఆశమాత్రమేకాని.
వున్నది వున్నట్టు పడదు.
అద్వైతం వాదంకొరకేగాని భ్రాంతిరహితంకాదు.
శ్రీధరస్వామి సాందీపునియొక్క భావార్ధము యెరుగు.
భగవానుల యొక్క భావార్ధము యెరుగు.
శ్రీశుకులవారి భావార్ధము యెరుగదు.
శంకరాచార్యుల భావార్ధము యెరుగు.
వ్యాసులవారి భావార్ధము యెరుగు.
రామానుజా చార్యుల భావార్ధము యెరుగు.

అందరి భావార్ధము యెరిగినవారు శ్రీ ధరస్వాముల వారేగాని మరి వకరు వున్నారని తోచదు.

సార్వకాలం వక్కతీరుగా శ్రీధరస్వామికేగాని మరివకరికితోచదు.

శ్రీ ధరస్వామివంటివాడు శ్రీకృష్ణ భగవానులేకాని మరివకరికి తోచదు.

శ్రీకృష్ణస్వామికి తగ్గగురువు సాందీపుడేగాని మరివకరు లేరు.
సాందీపునకు వశిష్టునకు చాలా యెక్కువ తక్కువ వున్నది.
గురుభావం శ్రీకృష్ణస్వామి అయిన శిష్యుడు యెరుగు
శిష్యునియొక్క ప్రభావం సాందీపుడే ౧౦౦౦ మార్లు యెరుగు.
యిద్దరియొక్క ప్రభావం శ్రీధరస్వామి యెరుగు.

యీ ముగ్గురియొక్క ప్రభావం యీ పుస్తకం వ్రాశినవారు యెరుగు ౧౦౦౦ మార్లు.

యీ పుస్తకంచూచి చదువుకొన్నవారికి యీ నలుగురి ప్రభావం ౧౦౦౦౦ మార్లు తెలుస్తుంది.

శీఘ్రింగా భ్రాంతిలేనివారు ఆయివుంటారు.

యీ అభిప్రాయం గురుముఖంగా విచారించినవారికి యేసిద్ధాంతం రుచివుండదు.

జ్ఞానకర్మలయొక్క భ్రాంతిపుట్టదు.

౧౦౦౦౦౦ మార్లు విచారించిన యింతకంటె యెక్కువవున్నదని ఆశ పుట్టదు.

యీ శరీరమందు ౧౦౦౦ మార్లు శరీరంలేనిది సూచన ఆయెనా సర్వం శరీరంతోటేపాయె.

వున్నదానికి యెరుకలేదు.

సార్వకాలం వకతీరే.

శరీరంలేనిది సకలదేశాలయందు సార్వకాలాలయందు సమస్తమైన వస్తువులయందు వకటైనా వికారంలేక గుణాలులేక వకతీరుగానే వున్నది.

ఆత్మఅన్నా బ్రిహ్మఅన్నా యిరువై అయిదోవానికి సంజ్ఞ.

గుర్తరిగేది వకటేగనుక.

ఆత్మఅనే ఆశ.

బ్రహ్మఅనే ఆశ.

రెండు వకటేగనుక.

పుట్టనిచావని దానిజాడ తెలియదు.

జ్ఞానంలేదు.

అందుకే కర్మలులేవు.

శరీరం లేకుంటె యేబాధలేదు.

యీ శరీరమందు వెతికినా శరీరంలేనిది వున్నది.

శరీరం లేకుంటె యెరుకలేదు.

కర్మాలు లేవు.

సార్వకాలం చెయ్యక చేయించక ఆత్మ బ్రహ్మలనే వ్యవహారం లేక వున్నది.

సకల సంశయాలు యెక్కడ తోచినవో అక్కడనే లేకపోవలె.

శిష్యు॥ యీ శరీరమందే నిరాకారం, నిర్గుణం వున్నది, అని సూచన చేశినారు. లోకదిక్కున శాస్త్రార్థం నిర్ణయమైతే సర్వత్రా రాద్ధాంతమని కద్దు.

గురు॥ జ్ఞానంకంటే వేరే వున్నదని సూచనచేసే గురువు కదా చిత్॥ కద్దు.

ఆత్మ బ్రహ్మలకంటె వేరేలంటే యెవరికి అనుమానంలేదు. గనుక లోక సమనాధానముకాని వున్నది వున్నట్టుగాదు.

లోకులకు లోకంలోవున్న వేదాంత వాక్యాలలో వున్న చొప్పున చూపవలె.

పలుకవలె.

యీ మాయకు సమాధానం కావలె.

కాకుంటే మళ్ళీ పుడుచుంది.

అందుకే కృష్ణస్వామి యీ ఆత్మను యెరుగడు.

బ్రహ్మను యెరుగడు.

యీ ఆత్మ బ్రహ్మకూటస్థులకంటె మునుపే స్వతసిద్ధమై వున్నాడు.

మొదలు కొనలేక చలించక వున్నాడు.

యీ ప్రజలను క్లేశపెట్టే కొరకు దేహములేని తాను దేహము నందు వున్నాడని చెప్పుట,

ఆలాగు కాదు గురుసాంప్రదాయం.

గురుసాంప్రదాయం మహాగుహ్యం.

మహారహస్యం.

మహాగూఢం.

ఆత్మ బ్రహ్మలు లేకుండా.

శరీరాలు లేకుండా సూచన.

మూఢులకు.

మూర్ఖులకు.

శ్రద్ధ లేనివానికి.

జ్ఞానభ్రాంతి కర్మభ్రాంతి వున్నవారికి సూచనచేస్తే ముందరపడదు. గనుక శీఘ్రంగా సూచన చెయ్యరు.

సార్వకాలం దేహమునకు మూలం వున్నదనే భ్రాంతిచాత యీ గుణ్త్రైరిగే క్షేత్రజ్ఞ స్వరూపమయిన ఆత్మచాత బ్రహ్మభ్రాంతి అయినా కర్మభ్రాంతి అయినా ఘట్టిగా నమ్ముకొని యీ దేహము వున్నది. చచ్చిన దాకా తప్పదు. అనుకుంచూ భ్రాంతిచాత వుంటారుకాని.

సార్వకాలం శరీరం లేనే లేదు.

పుట్టని శరీరం యేలాగు వున్నదని అనుకొందు. అని బిడియంలేక యీ గుణ్త్రైరిగే క్షేత్రజ్ఞ స్వరూపమనే ఆత్మ భ్రాంతిచేత బ్రహ్మ భ్రాంతి చాత సంపాదించుకొని కలతో సమానముగా చూచుకోనేరక గుణ్త్రైరిగే సాక్షిణిమాయ. నేను వకటే అనుకొని యీ గుణ్త్రైరిగే సాక్షిణిమాయ శహవాసము విడువలేక యీ కలతోవుండి గురువాక్యంచాత మేలుకోక సర్వకాలం మొగడు విడిచిన ఆడు దానివలె యథేచ్ఛంగా వుంచుంది.

మొగుణ్ణి విడిచిన ఆడది కాదు.

మొగడు విడిచిపెట్టిన ఆడదికాదు.

అవాంతర పిశాచం.

శిష్యు॥ అంటె,

గురు॥ యీ గుణ్త్రైరిగే సాక్షిణి మాయఅనే ఆత్మ.

బ్రహ్మ స్వరూపము గనుక యీ గుణ్త్రైరిగే చైతన్యంచాత సర్వత్ర చైతన్యం వున్నదని నమ్మి యీ జ్ఞానం యేలాగువున్నదో అలాగే జ్ఞానాతీతం వున్నదని నమ్మి.

యిది జ్ఞానంవలన పుట్టింది.

యీ దేహంలేకుంటే జ్ఞానం లేనే లేదు.

యీ దుఃఖం యేమిఅని.

సర్వకాలం దేహంలేని యుక్తిచాత అచలమయి వుండెనా సార్వ కాలం పుట్టని చావనివాడే.

నానా విధాలయే యుక్తిచాత క్షేత్రక్షేత్రజ్ఞులు లేరు. అనే ఆ యుక్తిసాడది. అని నమ్మనవారెకి.

సర్వకాలం జాగ్రతలేదు.

స్వప్నంలేదు.

సుషుప్తిలేదు.

తుర్యం అనే ఆత్మలేదు.

బ్రహ్మలేదు.

యేలాగు వున్నదో ఆలాగే వుంటాడు.

వున్నచాంట్లో మునుపు శరీరం పుట్టదు.

వుండదు.

చావదు.

శరీరం వున్నదనే భ్రాంతులకు గురుమూలంగా శరీరంలేదని నిశ్చ యమయి సర్వకాలం శరీరం లేదని ధృఢంవుండెనో శరీరమేలేదు.

శరీరం లేదుగనుక కన్నులు లేవు.

కన్నులు లేవుగనుక.

కంటిలో పాపగు త్తెరిగే ఆత్మలేదు.

ఆత్మలేకుంటే పరబ్రహ్మ స్వరూపంలేదు.

పరబ్రహ్మ స్వరూపం లేకుంటే బ్రహ్మానుభవంలేదు.

బ్రహ్మానుభవం లేకుంటే యేఅనుభవంలేదు.

యేఅనుభవం లేకుంటే వక్కటైనా వికారంలేదు.

వికారం లేకుంటే గుణాలులేవు.

గుణాలు లేకుంటే శరీరంలేదు.

శరీరం లేకుంటే గుత్తెరిగే జ్ఞానంలేదు.

గుత్తెరిగే చైతన్యమునకు సత్వగుణము కారణము.

శ్లో॥ సత్వాత్సం జాయతేజ్ఞానం.

అని భగవానులే గుర్తెరిగే జ్ఞానానికి సత్వగుణము కారణమన్నారు
గుణాలు లేకుంటే గుర్తెరిగే జ్ఞానంలేదు.

శరీరంలేదు.
యప్పటి ప్రపంచం లేనిదే.
యప్పటి జగత్తు లేనిదే.
యప్పటి విశ్వము లేనిదే.
సమస్తమైన వ్యవహారములు శరీరంతో పోయాయి.

శ్లో॥ యథాస్వప్నముహూర్తేషు । సంవత్సర శతభ్రమః
తదామాయా విలాసోయం । జాయతే జాగ్రతిభ్రమః

ఇతి శ్రీశివరామదీక్షిత ప్రభావె వేదాంత విచారణే
పరాప్రకృతి ద్వయదోషరహిత ప్రకరణం
షోడషాధ్యాయః.

సంపూర్ణం.



శ్రీ దత్తా ప్రెస్ రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్.